ఓం పరమాత్మనే నమః.

స్కాందపురాణాంతర్గత

# గురుగీతాసారము.

ఇది

శ్రీ రామబ్రహ్మ గురు శిష్యుఁడగు

భముపాటి - నారపామాత్య ప్రణీత

పద్యకావ్యము

ఆరణిగ్రామనివాసులగు

బ్రహ్మనిష్ఠ - రాజయోగి, బూ. నా. మునుస్వామయ్యగారి

స్వానుభవానుగుణంబుగ

రాజయోగి, పృథివి. మునుస్వామయ్యగారి

ప్రోత్సాహముచేత

బ్రహ్మశ్రీ - క. సుబ్రహ్మణ్య యోగీశ్వరులచే

రచియింపఁబడిన

ఆంధ్ర తాత్పర్య విశేషార్థసహితము.

చెన్నపట్టణము

ప్రాతచాకలపేటయందుండు

రాజయోగి

పమ్మి * త్యాగరాయసెట్టిగారి

శ్రీ రాజరాజేశ్వరీనికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడినది.

కాపీరైట్.] 1931 [వెల రూ. 3.

# గ్రంథముల ప్రకటన.

శ్రీగురుభక్తవిజయము. ఇది సర్వులు సదా పఠింపఁదగినది. రూ. 6-0-0

శ్రీమదాఞ్జనేయసహస్రనామస్తోత్రమ్. నామావళిసహితమ్. గ్లేజుప్రతి. 0-3-0

శ్రీకృష్ణసహస్రనామస్తోత్రమ్. నామావళిసహితమ్. గ్లేజు ప్రతి. 0-3-0

శ్రీవేంకటేశసహస్రనామస్తోత్రమ్. నామావళిసహితమ్. గ్లేజు ప్రతి. 0-3-0

శ్రీదుర్గాసహస్రనామస్తోత్రమ్. నామావళిసహితమ్. గ్లేజు ప్రతి. 0-5-0

శ్రీగణపతిసహస్రనామస్తోత్రమ్. నామావళిసహితమ్. గ్లేజు ప్రతి. 0-3-0

శ్రీశివసహస్రనామస్తోత్రమ్. నామావళిసహితమ్. గ్లేజు ప్రతి. 0-3-0

శ్రీసుబ్రహ్మణ్యసహస్రనామస్తోత్రమ్. నామావళిసహితమ్. గ్లేజు ప్రతి. 0-3-0

శ్రీరామసహస్రనామస్తోత్రమ్. నామావళిసహితమ్. గ్లేజు ప్రతి. 0-4-0

శ్రీవిష్ణుసహస్రనామకదమ్బమ్. గ్లేజు ప్రతి. 0-6-0

శ్రీమదధ్యాత్మ రామాయణము - వచనకావ్యము. గ్లేజు ప్రతి 2-8-0

డిటో రఫ్ ప్రతి 1-8-0

జాతకఫలచింతామణి ఆంధ్రతాత్పర్య సహితము.—ఇందు ఆయా దశలలో ఆయాభుక్తులకుతగినఫలములను దృష్టాంత పూర్వకముగ తేట తెనుగు మాటలతో ముద్రించినవి. కాలికోబైండు. 2-0-0

జాతకఫలచింతామణి, రెండవభాగము—ఇందు ఆయాగ్రహచారములకు తగిన శాంతులు. శ్లోకతాత్పర్యసహితమున్ను, మరియు ఆయాదశలకు నవగ్రహములకు అంతర్దశలు, విదశలు, సూక్ష్మదశలు ప్రాణదశలు బహువిమర్శగా లెక్కవేయకనే గ్రంథమును చూచి చెప్పునట్లు ముద్రింపం బడియున్నవి. 2-0-0

దైవజ్ఞశిఖామణి అను జ్యోతిష గ్రంథరత్నము.—ఇది పరమేశ్వరునిచే పార్వతీదేవి కుపదేశింపంబడినది. సకల జ్యోతిష విషయములు సులువుగా దెలుసుకొనందగిన గ్రంథము. శ్లో॥ తా. 1-8-0

బృహజ్జాతకము సాధారణప్రతి. 1.8 0 గ్లేజు ప్రతి. 2-0-0

---

పమ్మి - త్యాగరాయసెట్టి అండుసన్సు, చాకలపేట మద్రాసు.

తా. భూలోకంబునందు సకలప్రాణులను సృష్టిచేయు నిమిత్తమై బ్రహ్మదేవుఁడును, సమస్త జంతువులను రక్షించుటకై విష్ణుమూర్తియును, సకల జీవులను సంహరించుటకై రుద్రమూర్తియునై వెలయు త్రిమూర్తిస్వరూపుఁడగు పరాత్పరునకు నమస్కరించెదను.

## పర దేవతా స్తుతి.

చ॥ సరసిజగర్భువక్త్రమునఁ జక్కఁగఁ దా నివసించి వాణియై ।
హరి హృదయంబున న్నిలిచి యంగజుఁ గన్న రమాలలామయై।
మరియును శంభుమేన సగమందున నుండియు గౌరియయ్యెనా ।
సరణిని మూర్తియొక్కటగు శక్తికి మ్రొక్కెదఁ గార్యసిద్ధికై ॥3

తా. చతుర్ముఖ బ్రహ్మదేవుని ముఖ కమలమునందు సరస్వతీ స్వరూపముతోను, శ్రీమహావిష్ణువు వక్షఃస్థలమునందు లక్ష్మీ స్వరూపముతోను, పరమేశ్వరుని యర్ధశరీరంబునందు గౌరీస్వరూపముతోను వసించియుండు శక్తిస్వరూపురాలగు పరదేవతకు నమస్కారము కావించెదను.

## వినాయక స్తవము.

క॥ కరివక్త్రుని లంబోదరు ।
గిరిజాసుతు శూర్పకర్ణుఁ గేవలమఘుభు। .
గ్వరదాత యైనవిఘ్నే ।
శ్వరుఁ గీర్తించెదను విఘ్న చర్యలుబాపన్ ॥

తా. ఏనుఁగు మొగంబుగలవానికిని, పెద్దకడుపుగలవానికిని, పార్వతీదేవి కుమారునకును, శూర్పకర్ణునకును, దేవేంద్రునకు వరమిచ్చినవానికిని, విఘ్నములను బోఁగొ[illegible]నికిని సర్వవిఘ్న నివారణముకొఱకు నమస్కృతు లొనర్చు[illegible]ఁడను

## కవి స్తుతి.

ఆ॥ వ్యాస కాళిదాస వాల్మీకి శుకమయూ ।
రాదికవులనెల్ల నాత్మఁ దలఁచి ।
యదయతనులఁ గొలిచి యార్యవర్యులపాద ।
పద్మములకు మ్రొక్కి ప్రస్తుతింతు ॥

1. దేహాత్మభ్రమ.— దేహముకానట్టి తన్ను దేహంబని తలంచుట.

2. తరుపాషాణాదిభ్రమ — దేవుఁడుగాని తరుపాషాణాది విగ్రహములను దేవుఁడని తలంచుట.

3. మిథ్యాత్మభ్రమ.— ఆత్మకాని శరీరాదులను ఆత్మ (పరమాత్మ) యని తలంచుట.

4. దేవతాభ్రమ.— మోక్షస్వరూపుఁడును మోక్ష ప్రదుఁడును పరబ్రహ్మమని యెఱుంగక దేహేంద్రియాదులతోఁ గూడిన బ్రహ్మాదులను మోక్షకర్తలని తలంచుట.

5. కర్మభ్రమ.— బ్రహ్మాభిన్నస్వరూప ప్రత్యగాత్మ తానై యుండుటను తెలిసికొనక, తనకు మోక్షము కావలయునని తలంచి జపతపవ్రతాదుల ననుష్ఠించుట.

పారమార్థికుఁడు.— ఉత్తమస్థానమును గోరియుండువాఁడు అనఁగా-సత్తామాత్రుల శరీరములయందు వసించియుండు పరమాత్మ.

ప్రావీణ్యుఁడు.— నైపుణ్యముగలవాఁడు. నేర్పరి అనఁగా-దేని దేని యెట్లట్లు చేయవలయునో అట్లట్లు చేయువాఁడు.

చిన్మయుఁడు—సచ్చిదానంద స్వరూపుఁడగు పరబ్రహ్మము.

## స్వ గు రు న మ స్కా ర ము.

క॥ బాలత్వంబున నాకును।
శీలత్వపు రాజయోగ చిహ్నములవెసఁ।
మేలిమితోడను దెలుపు కృ।
పాళుని మద్గురుని రామభద్రునిఁ దలఁతుఁ॥

తా. బాల్యంబునందు రాజమార్గంబును నాకు ఉపదేశించిన యట్టి మద్గురుమూర్తియగు రామభద్రుని దలంచుచున్నాఁడను.

## అం కి త ము.

వ॥ అని యిష్టదేవతా ప్రార్థనంబును సుకవిజనకీర్తనంబును నఖండాత్మ స్తోత్రంబునుం జేసి ముముక్షుజనహితంబుగా నొక్క ప్రబంధంబు గావింపంబూని యాప్రబంధంబునకు మద్గురు నాథునిం గృతినాథునింగా నిరూపించి సంతసిల్లి బుధజనసంతో

శ్లో॥ సిద్ధే శ్చిత్త సమాధాన మసాధారణ కారణం ।
యత స్తతో ముముక్షూణాం భవితవ్యం సదామునా॥

తా. మోక్షము నొందుటకు చిత్తస్థైర్యము ముఖ్యకారణము గాన,ఎల్లప్పుడును చిత్తమును స్థిరముగానుంచికొని యుండవలయును.

**IV'** ముముక్షుత్వము.—బుద్ధియందు మోక్షమును బొందవలయు ననెడి దృఢనిశ్చయము కలిగియుండుట.

శ్లో॥ బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానా ద్యద్విద్వా న్మోక్తు మిచ్ఛతి ।
సంసారపాశబంధంత న్ముముక్షుత్వం నిగద్యతే ॥

తా. జీవాత్మకును పరమాత్మకును భేదము లేదు అనెడి జ్ఞానమువలన సంసార మను పాశబంధమును విడువఁ గోరుటయే ముముక్షుత్వ మనఁబడును.

ఇవి సాధన చతుష్టయ సంపత్తి యనఁబడును. వీనిని సంపాదించుకొన్న తర్వాత ఆచార్యునియొద్ద వేదాంత శ్రవణాదులను జేయవలయును. ఇట్లుచేయుటకు సాధ్యము కానియెడల, ఆచార్యుని ఆశ్రయించిన తర్వాతనైనను వీనిని అభ్యాసము చేయవలయునని యెఱుంగునది.

ఇచ్చట జగమేలు దత్తాత్రేయుఁ డనుటచే, భూమియందలి సకల జనులను యోగాభ్యాస నిరతులను గావించిగాని, లేక ఆ యోగులను ప్రజలను శిష్యులం గావించిగాని, నీతిమంతులుగా జేసిన మీఁద లోకములో నేవిధమైన అక్రమమును జరుగదు. అప్పుడు లోకము తనంతట పరిపాలింపఁ బడుచుండును. ఈ యభిప్రాయము చేతనే కవి దత్తయోగీంద్రుని జగంబేలువాఁడని కీర్తించినాఁడని భిప్రాయము.

## పరమగురుధ్యానము.

మ॥ అరయంగా గురురాజ వర్యుఁడగు దత్తాత్రేయయోగీంద్రుచేఁ।
బరతత్త్వార్థము లెస్సగాఁ దెలిసి తాఁ బ్రజ్ఞాప్తిచే నాత్మునిఁ ।
నిరతంబుం గని భక్తులౌ జనులకు న్నేర్పొప్ప బోధించు నా ।
పరమానంద మునీంద్రుపాదములు నే భావింతు నెల్లప్పుడుఁ॥

తా. దత్తయోగివర్యుని పదముల నాశ్రయించి పరమతత్త్వరహస్యమును జక్కఁగా నెఱింగి పరమాత్మను దర్శించుచుండువాఁడును, భక్తులకు అనఁగా తన్నాశ్రయించిన శిష్యులకు వేదాంతవిద్యను బోధించుచుండునట్టి వాఁడును అగు పరమానందమునీంద్రుని పదకమలములను నిరంతరమును ధ్యానించుచుందును.

మ॥ అవనిన్ బ్రహ్మవిదుండునై పరమయోగానందుచే ముక్తుఁడై ।
శివయోగీంద్రులు పొందు నాత్మపదముం జేరంగలేనట్టి మా ।
నవకోటిం బురుషార్థముంజొనిపియానందంబొందఁగాఁజేయు ధే ।
నుపుకొండాన్వయ తిమ్మయోగి పదముల్ నిత్యంబులో నాత్మకున్॥

తా. మీఁదఁ జెప్పిన లక్షణములతోఁ గూడిన పరమయోగానందుని ఆశ్రయించి బ్రహ్మమును దెలిసికొన్నవాఁడును, సకల జనులకును శివయోగీంద్రులు అనఁగా రాజయోగులు పొందునట్టి పరమాత్మస్థానమును (పరమపదమును) జేరఁగలేక, జననమరణప్రవాహరూపమైన సంసారసాగరమునుండి తరింపలేని వారలకు మోక్షమార్గమునుబోధించి వారికానందము నొందఁజేసినవాఁడును, అగు ధేనుపుకొండ తిమ్మ యోగీంద్రుండను గురువర్యుని పాదారవిందములు నామనస్సునందు శాశ్వతమై యుండునుగాత.

మ॥ ఇలలో ధేనుపుకొండతిమ్మగురుచే నిష్టార్థసంసిద్ధుఁడై ।
చలనంబొందక రాజయోగపదవీ సామ్రాజ్యముం బొంది యీ ।
యిలసద్భక్తుల నేలి చిన్మయము తామీయంగ నేపారు చిం ।
తలలింగాన్వయుఁడైనయోగిపదముల్ ధ్యానింతునశ్రాంతమున్॥

తా. భూమియందు ధేనుపుకొండ తిమ్మయోగీంద్రుని యాశ్రయించి ఇష్టార్థములంబడసి నిశ్చలంబయిన రాజయోగ సామ్రాజ్యమును బొందినవాఁడును, సద్భక్తులను అనఁగా తన్నాశ్రయించిన సచ్ఛిష్యులను ఆత్మవిద్యావంతులనుగాఁ జేసి రక్షించినవాఁడును, అగు చింతల లింగనార్యుని పదకమలములను ఎల్లపుడును నేను ధ్యానించుచుందును.

సీ॥ శౌర చింతలలింగనార్యపాదాబ్జము
లేసవించి భక్తిని శిష్టుఁడగుచు ।

సద్వయ మవ్యక్త మప్రకాశాతీత
మైనబ్రహ్మంబును నాత్మఁగాంచి।
త్స్వాచక్రమున నరుల్ జన్మపరంపర
లెత్తుటచూచి సర్వోత్తముండు।
కరుణించి ముక్తులుగాఁజేయఁ దలపోసి
నిరుపమానందాత్ము నెలవుచూపి॥

తే॥ పుట్టువులఁబాపి దుష్కృతి పొందు లుడిపి।
నిర్మలుండగు పరమాత్మ నిజము మరపి।
నట్టి యోగావధూతాంఘ్రు లాత్మ నిలిపి।
మ్రొక్కిసేవింతు వినుతింతు ముక్తిఁ గాంతు॥ 14

తా. చింతల లింగనార్యుని పాదంబుల నాశ్రయించిన వాఁడును, గురుభక్తికలవాఁడును, శిష్టాచార సంపన్నుఁడును, రెండవది లేనిదియును, రూపము లేనిదియును, చర్మచక్షుస్సులకు గోచరింపనిదియును, అగు పరమాత్మయే తన హృదయకమల సమీపమునందుండు జీవాత్మయని తెలిసికొన్నవాఁడును, భూమియందు మానవులు పుట్టుచుగిట్టుచు నిట్లు పలుమరు భ్రమించుచుండుటను జూచి (వారల దుఃఖమునుజూచి సహింపక) కృపచేత నట్టివారినిముక్తులంజేయనెంచి వారికి పరమాత్మస్థానమును దెలియఁబఱచి జన్మదుఃఖములను బోఁగొట్టి, జన్మములెత్తుటచేఁ గల్గు పాప ఫలంబుల ననుభవించుట యను దుష్కృతములగు నరకానుభవములను బోనడంచి, నిర్మలుఁడగు పరమాత్మఁ డిట్టి లక్షణములలోఁ గూడినవాఁడనెడి నిశ్చయ జ్ఞానమునందు బుద్ధినిఁ బ్రవేశింపఁ జేయువాఁడును, అగు యోగావధూతస్వామి పాదారవిందములయందు ముక్తినొందుటకొఱకు నాబుద్ధిని స్థిరముగా నిల్పి నమస్కరించి సేవించి స్తోత్రము చేయుదును.

శా॥ యోగానందుని పాదపద్మయుగ మేనూహించి సేవించుచు౯।
రాగద్వేషములందుఁ జిత్తము సదా రంజిల్లకే యాత్మఁ దా।
నుంగాఁ గన్గొని మానవావళికిఁ జిన్మూర్తిత్వముం దెల్పి వా।
క్ఛ్రీగాంభీర్యుఁడు నైన తిమ్మగురునే సేవింతు నశ్రాంతమున్. 15

తా. చింతల లింగనార్యుండను పూర్వాశ్రమ నామము నొందిన యోగావధూతస్వామి పాదారవిందములను హృదయంబునం దిడికొని సేవించువాఁడును, రాగద్వేషములు మనస్సునందుఁ బ్రవేశింపనీక చేయువాఁడును, పరమాత్మ తనయందే వసించుచున్నాఁడని యెఱింగినవాఁడును, లోకులకు పరమాత్మ స్వరూపమును దెలియఁజేసినవాఁడును, మంచి వక్తృత్వము గలవాఁడును అనఁగా శిష్యులకు సకల రహస్యములను స్పష్టముగా బోధించుటయందు మహాసమర్థుఁడును, అగు ధేనుకొండ తిమ్మగురుని నిరంతరమును సేవించుచుందును.

వి. రాగమనఁగా —ప్రపంచ సుఖానుభవములయందు అభిలాష కలిగియుండుట.

ద్వేషమనఁగా.— తనకు ఏదుఃఖమును కలుగకూడదని యుండుట. అనఁగా దుఃఖహేతువులగు వానియందు తిరస్కారము కలిగియుండుట.

చ॥ కుటిలుఁడుగాక తిమ్మగురుఁ గోరిభజించి యఖండవిద్య దా।
బటువుగనేర్చి యీజగతిఁ బట్టుగ శిష్యులనెల్లఁ బ్రోచి తా।
ఘుటికులఁజేసి నేత్రమునఁ గల్గు చిదాత్మునిఁగాంచి మించి ది।
క్తటములవెల్గు రామగురుఁ దల్చి మనంబుననిల్పి మ్రొక్కెదన్॥

తా. తిమ్మ గురువర్యుని సేవించి అతనివలన అఖండవిద్య అనఁగా వేదాంతవిద్య నేర్చి జగతియందుఁ గల శిష్యులకెల్ల బోధించి వారిని సమర్థుల నొనర్చినవాఁడును, కుటిలుఁడు గాని వాఁడును, నేత్రగోళమునందు వెలుంగు పరమాత్ముని దర్శించిన వాఁడును, అగు రామగురువర్యుని మనంబునందు నిల్పి సేవించెదను.

వి. కుటిలుఁడు గానివాఁడు.— వక్రబుద్ధి (విపరీతబుద్ధి) లేనివాఁడు.

క॥ ఆరామగురుని మహిమల।
నీరేడు జగంబులందు నెన్నఁగఁ దరమా।
ధీరత్వమునను నాత్మ వి।
చారమునను రామగురుని సాటియుఁ గలరే॥

తా. ఆ రామగురువర్యుఁడు మహాధీరుఁడును, ఆత్మవిచార దక్షుఁడును గావున, అతనితో సాటి ఎవ్వరును రారు. కావున, అతని మహత్త్వమును పదునాలుగు లోకములలో నుండువారును పొగడలేరు.

వి. ధీరుఁడు=బుద్ధిగలవాఁడును, ధైర్యము (బలము) గల వాఁడును, అని యర్థము.

ఉ॥ కోరికలందు నెమ్మనసుఁ గొల్పనివాఁడు ప్రపంచవాసనల్ ।
చేరనివాఁడు దైవగతిఁ జేరఁగవచ్చిన లబ్ధవస్తు వి।
స్తారములే దటంచనక సంతస మొందెడివాఁడు నాత్మలోఁ।
జేరు విచింతలన్మఱచి శిష్యులఁ బ్రోచెడువాఁడు నిమ్మహిన్॥ 18

తా. భూమియందు ఆరామగురువర్యుఁడు ఏకోర్కెయు లేని వాఁడును, ప్రపంచవాసనలను త్యజించినవాఁడును, దైవగతిగా లభించిన వస్తువులు సైతము అధికముగా లేదని తలంపక సంతసించు వాఁడును, మనస్సునం దేదేని చింత కలిగినప్పటికిని వానినంతయు మఱచి యుండువాఁడును, శిష్యులను రక్షించువాఁడును, నై యుండెను.

ఆ॥ అమ్మహాత్ముపదము లాత్మలో నిలిపిన ।
వానికేల నితరవాంఛజోలి ।
తృప్తభోజనునకుఁ దుదిఁ బంచ భక్ష్యాన్న ।
మబ్బెనేని యేలమనసు పొరలు॥ 19

తా. ఆమహాత్ముఁడగు రామ గురువర్యుని పాదపద్మములను హృదయంబునందు నిలిపినట్టివానికి వేఱేతలంపు కలుగదు. కడుపు నిండుగా భుజించియున్న వారికి పంచభక్ష్య పరమాన్నములందు మనస్సుపోవునా ? అనఁగా పోదనుట.

మ॥ అనుచున్ శ్రీగురు పాదపద్మముల నత్యాసక్తిఁ బూజించి యీ।
ఘనచారిత్రము చెప్పఁబూనితిని నేఁ గావ్యాది సద్గ్రంథముల్ ।
దినముం బాఠమొనర్చి శబ్దముల విస్తీర్ణ ప్రభావంబుతోఁ।
గని నేఁ జెప్పఁగ లేను సద్గురుకటాక్షప్రాప్త వాగ్వైఖరిన్॥ 20

తా. ఇట్లని మద్గురుండగు రామ గురువర్యునిఁ బ్రేమంబుగా నుతించి గురు కటాక్షంబుచేఁ గల్గిన వాగ్వైఖరిచేత ఈ పార్వతీ పరమేశ్వరసంవాద రూపమైన చరిత్రమును (యోగశాస్త్రమును) రచియింపఁ బూనినాఁడను అంతియకాని, నేను కావ్యాది సద్గ్రంథ ములను, శబ్ద శాస్త్రములను (వ్యాకరణశాస్త్రమును) జదివి రచి యింపలేదు.

క॥ పలికెద శ్రీగురుగీతలు।
పలికించెడివాఁడు రామభద్రుఁడు నాలో।
పలనిలిచి యేవిధంబునఁ।
బలికించునొ యావిధంబు పలికెదఁ జుమ్మీ॥ 21

తా. నేను గురుగీతలను జెప్పుచున్నాఁడను. ఈ గీతలను నా హృదయంబునందుండి చెప్పునట్లు చేయువాఁడు శ్రీరామభద్రుఁడు గాన, వాఁడెట్లు పలికించుచున్నాఁడో నే నాప్రకారంబుగ పలుకు చున్నాఁడను.

క॥ ప్రాసములు యతులు గణములు।
భాసురముగ లేదటంచుఁ బలికెద రేమో।
దేశిక గురువర చరణో।
పాసకులకు నేల యిట్టి భ్రాంతులు పొందన్॥ 22

తా. ప్రాసములు, యతులు, గణములు, అనునివి క్రమముగా లేదని చెప్పుదురు. అయినను గురువర్యుని పాదములను ఉపాసించు వారలకు ఇవి వలయు ననెడి భ్రమయేల? అనఁగా అక్కఱలేదని భావము.

తే॥ ప్రాసములునెంచ గురుపద ప్రాప్తి సుమ్మి।
యతులు గురుపాదసేవను మతినిలుపుట।
గణము సద్భక్తజనముల గలసియుంట।
చెలఁగి యీభావమునఁ గూర్చి చెప్పువాఁడ॥ 23

తా. ప్రాసము లనఁగా గురుపదములను బొందియుండుట యనియు, యతు లనఁగా గురుపదములను మనస్సునందు నిల్పి యుండుట యనియు, గణ మనఁగా సద్భక్తులగు వారితోఁ గూడి

యుండుట యనియు, నిట్టి భావముతోనే నేనీగ్రంథమును జెప్పు చున్నాఁడననియు తాత్పర్యము. అనఁగా ఛందోవ్యాకరణాది శాస్త్రములయందు మనంబును నిలుపలేదని యభిప్రాయము.

క॥ స్వల్పపు గ్రంథం బిదియని।
యల్పులు వినఁ బూనరేమొ యదియుఁగాక విను డీ।
తెల్పెద నద్దములోపల।
వేల్పులదొర గజములిమిడి వెలయవె జగతిన్॥ 24

తా. అల్పులైనవారు ఈగ్రంథము చిన్నదియని తలంచి విన కుందురు. అయినప్పటికిని అద్దమునందు దేవేంద్రుని ఏనుఁగులు కంటికి కనఁబడుచున్నవి గదా. అట్లని భావము.

వ॥ అని విచారించి॥ 25

తా. ఇట్లని వితర్కించి.

క॥ క్రమమున సద్గురుముఖమున।
నమలినతర మైన బ్రహ్మ మరయుటవలనన్।
భమపాటి నారపన ధర।
సుమతులచే నెన్నఁబడితి శోభితమహిమన్॥ 26

తా. సద్గురు వాక్యమువలన పరమ శ్రేష్ఠమైన పరమాత్మను విచారించుటంబట్టి, నేను భమపాటి నారప యని బుద్ధిమంతుల వలన మిగుల ప్రసిద్ధి నొందినవాఁడ నైతిని.

క॥ గురుపాద కమలసేవయు।
గురుపద సేవార్చకులను గూడిమనుటయుఁగా।
గురుమూర్తికంటె నెక్కువ।
ధర లేదని యాత్మలోనఁ దలఁచిన వాఁడన్॥ 27

తా. గురువర్యుని పదకమలములను సేవించుటకంటెను, గురుపదభక్తులతోఁ గూడి జీవించుటకంటెను, గురువుకంటెను, శ్రేష్ఠమైన దేదియును లేదని నేను హృదయమునఁ దలంచినట్టి వాఁడను.

"శ్లో॥ నగురోరధికః కశ్చిత్ త్రిషులోకేషు విద్యతే॥"

తా. గురువుకంటెను శ్రేష్ఠమైనవాఁడు మూఁడులోకముల యందును లేఁడని తెలియఁదగినది.

క॥ శ్రీరామగురుని కరుణను।
తారక యోగానుభవ వితరణము మదివే।
సారక భావించుటచే।
నీరీతిని నాంధ్రభాష నేరచియింతున్॥ 28

తా. గురుకటాక్షముచేతను, తారక యోగాను సంధానమును నిరంతరము భావించుటచేతను నేను ఈప్రకారముగా (పార్వతీ పరమేశ్వర సంవాదరూపమైన) యీ గ్రంథమును తెనుఁగు బాస యందు రచించుచున్నాఁడను.

వ॥ అది సూతప్రణీతంబును శివపార్వతి సంవాదంబును నగుటంజేసి యిదియు నొక్క మహాత్మానుగ్రహ కారణంబున విరచించెద॥ 29

తా. సులభము.

## షష్ఠ్యంతములు.

క॥ శ్రీకరునకు నిజభక్తవ।
శీకరునకు సర్వలోకచింతామణికిన్।
రాకేందు పూర్ణముఖునకు।
లోకారాధ్యునకు భక్తలోకేశునకున్॥ 30

తా. ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థముల నొసంగువానికిని, భక్తులను వశీకృతలనుగా జేసికొనువానికిని, పదు నాలుగు లోకముల యందలివారికిని వారివారి కోర్కుల నొసంగు వానికిని, సంపూర్ణ చంద్రముఖునకును, లోకారాధ్యునకును, భక్త జనులకు నాయకునకును;

క॥ ధీరునకును నింద్రియపరి।
హారునకు సమస్త దుష్కృతారాతికి నా।
దారునకు నాత్మవిద్యా।
సారునకును రామయోగి జనవర్యునకున్. 31

ధీరునకును, ఇంద్రియములను నిగ్రహించినవానికిని, సకల పాపములను బోఁగొట్టుకొన్నవానికిని, ఉదారునకును, వేదాంత

విద్య నెఱింగినవానికిని, రామయోగివర్యునకును ;

క॥ సుగుణునకు వేదవేద్యున ।
కగణితునకు భుక్తిముక్తి కాధారునకున్ ।
సగుణుండై నిర్గుణమున ।
జగతీస్థలి వెలుఁగు నిత్యసత్యాత్మునకున్॥　　32

సద్గుణములు గలవానికిని, వేదములచే నెఱుంగఁబడిన వానికిని, ఎన్నఁదరము గానివానికిని, భుక్తిముక్తులకు ఆధారమైనవానికిని, సగుణనిర్గుణములు గలవానికిని, ప్రపంచమందు తేజరిల్లు నిత్యసత్యవస్తువునకును ;

క॥ శ్రీరామబ్రహ్మమునకుఁ ।
గారణకార్యునకు నిత్యకల్యాణునకున్ ।
సారామలగుణగణున క ।
పారక్రియ సత్యమణికిఁ బ్రజ్ఞోన్నతికిన్॥　　33

శ్రీరామ బ్రహ్మమునకును, కార్యకారణ స్వరూపునకును, నిత్యమంగళ స్వరూపునకును, నిర్మల గుణగణములచే నొప్పువానికిని, అపార కార్యపరునకును, సత్యస్వరూపునకును, ప్రజ్ఞావంతునకును ; నేనీ గ్రంథమును అంకితం బొనర్చెదను.

వ॥ సమర్పితంబుగా నాయొనర్పంబూనిన గురుగీతాసారంబను వేదాంత గ్రంథంబునకు కథా క్రమం బెట్టిదన, నైమిశారణ్యవాసులయిన శౌనకాదిమునీశ్వరు లొకనాఁడు ప్రాతఃకాలంబున నిత్య కృత్యానుష్ఠానంబులం దీర్చికొని శ్రీగురుగీతాశ్రవణ కుతూహలాయత్తచిత్తులై॥　　34

తా. సులభము.

## కథా ప్రారంభము.

క॥ శ్రీరమ్యమైన గురుగీ ।
తారంభము శౌనకాదు లడుగఁగ సూతుం ।
జేరి కొనియాడి మాకిపు ।
డారయబరిపూర్ణ విద్య నానతియీవే ॥　　35

తా. శౌనకాది మునీంద్రులు సూత పౌరాణికునిం జూచి శ్రీకరంబైన పరబ్రహ్మ విద్యను బోధించు గురుగీతాసారమును మాకు బోధింపు మని యడిగిరి.

క॥ అని మునులాడినపల్కులు।
వినిసూతుఁడు సంతసించి వేడుకతోడన్।
వినిపించెద మీరడిగిన।
ఘనప్రశ్నకు నుత్తరంబు క్రమముగ వినుఁడీ॥ 36

తా. ఇట్లు శౌనకాదులు సూతమునీంద్రుని నడుగఁగా నతండు సంతుష్టాంతరంగుండై మీరడిగిన దాని నెఱింగించెదను వినుం డని యిట్లనియె.

క॥ శ్రీకైలాసనగంబున।
శ్రీకంఠుఁడు ప్రమథభక్త సేవితుఁ డగుచున్।
లోకారాధ్యత నుండగ।
నాకాలంబునను నగజ యభవుని కనియెన్॥ 37

తా. శ్రీకరంబైన కైలాసపర్వతంబున పరమశివుండు పార్వతీదేవితోఁగూడ పేరోలగంబునందుండి ప్రమథగణంబులు గొల్చుచుండఁగా లోకంబుల నేలుచున్న సమయంబునందు పార్వతీదేవి యిట్లనియె॥

మ॥ గిరిరాజేంద్రకుమారి భర్గుకొఱకై కేల్మోడ్చియో।
దేవ భాస్కర గ్లౌ పావకనేత్ర యక్షయకృపా కల్యాణ నాగేంద్రభూ, సురచర్మాంబర భక్తవత్సల నమో సుజ్ఞాన దీపాంకురా।
గురుదీక్షా క్రమమేప్రకార మగు నాకుం దెల్పవే సత్కృపన్॥

తా. పార్వతీదేవి బద్ధాంజలియై దేవా! సూర్యచంద్రాగ్నులను నేత్రముగాఁ గలవాఁడా! (త్రిలోచనుఁడా!) నాశములేని దయగలవాఁడా! మంగళప్రదుఁడా! గజచర్మాంబరధరా! భక్తవత్సలా! సుజ్ఞాన దీపాంకురా! నీకు నమస్కారము కావించెదను నాకు గురుదీక్షాక్రమమును దయచేసి చక్కఁగా నెఱింగింపుము.

క॥ ఏమార్గంబున నోహర।
యీమహిజను లాత్మభావ మెఱుఁగుదు రదియొ।

ట్లామహిమ యంతయున్విన౯।
గామించితిఁ దెలియఁబల్కు గజదైత్యహరా॥ 39

తా. ఓశివా! ఈ భూలోకమందలి జనులు ఏప్రకారంబుగా పరమాత్మ భావంబు నెఱుంగుదురో దానిని తెలిసి కొనుట కిచ్ఛయించి వేఁడుచున్నాను.

వ॥ అనిన పార్వతి కీశ్వరుం డిట్లనియె॥ 40

తా. సులభము.

శా॥ గౌరీ వింటివె పూర్వమం దెవరు నీకల్యాణసంప్రశ్నముల్ ।
సారోక్తి న్వినిపింపు మంచడుగరే సద్భక్తు లీధాత్రిలో ।
గా రంజిల్లెడు మోక్షయుక్తమగు వాక్చాతుర్య గాంభీర్య మౌ
దారత్వంబులఁ బ్రజ్వరిల్లెడి మహత్త్వంబెల్ల నేఁ బల్కెదన్॥ 41

తా. ఓ పార్వతీ! నీవడిగిన యట్టి మంగళప్రదమైన యీ మంచిప్రశ్నమును పూర్వమునందు నన్నెవ్వరు నడుగలేదు సద్భక్తులగు వారు మోక్షమార్గమును బొందుటకుం దగినవిషయమును ఇపుడు నేను వాక్ప్రౌఢిమ మెఱయ నీకుఁ జెప్పెదను.

## శ్రీ గు రు మ హి మా భి వ ర్ణ న ము.

తే॥ గురువుకన్నను బ్రహ్మంబు ధరణిలేదు।
అరయ సత్యంబు సత్యమోయబ్జవదన।
మూఁడులోకములందు నద్భుతముగాను।
నాద్య మెఱిఁగింతు నీకొఱ కవధరింపు॥ 42

తా. ఓ పార్వతీ! మూఁడులోకములయందును గురువుకంటె బ్రహ్మ మనువస్తువు వేఱేలేదు. ఇదియే సత్యము, సత్యము. కావున నీకు ఆద్యంబైన (శ్రుతిసమ్మతమైన) దానిని తెలియఁజేసెదను వినుము.

వి. సత్యము, సత్యము. అని రెండుమాఱులు ఉచ్చరించుట "ఆదరాద్విరుక్తిః" అను న్యాయ్యము చొప్పున ఆదరాతిశయంబని యెఱుంగవలయును.

సీ॥ వేదశాస్త్రపురాణ వివిధాగమాదియం
త్రోచ్చాటనాది విద్యోన్నతములు।

మతము లద్వైత వామము విశిష్టాద్వైత
ద్వైత శాక్తిక గాణపత్యములును।
దానంబు యజ్ఞంబు తపహోమజపతీర్థ
మాదియౌ నిత్యకృత్యాదివిధులు।
గురుతత్త్వవాక్య విస్ఫురణఁ దెల్పఁగలేవు
మూఢులకివి మనోముఖ్యసూత్ర।
తే॥ ములుగఁ దోఁచును జిత్తంబు చలనపడుచు।
సర్వజీవుల నీరీతి సమయఁజేయుఁ।
గాన గురుసేవకుడు మదిగలుగువాఁడు।
అన్యములుమాని గురుకృప నరయవలయు॥ 43

తా. ఋక్, యజస్సు, సామము, అథర్వము, అను చతుర్వేదములును, (తర్క- వ్యాకరణాది శాస్త్రములును) పాద్మము, భాగవతము మొదలగు పదునెనిమిది పురాణములును, పాంచ రాత్రాది ఆగమములును, మఱియు కామికాద్యాగమములును, వివిధ యంత్రములును, ఉచ్చాటన, మారణ, విద్వేషణ, ఆకర్షణ, స్తంభన, మోహనాది విద్యావినోదములును, అద్వైతము, వామమార్గము, విశిష్టాద్వైతము, ద్వైతము, శాక్తేయము, గాణాపత్యము మొదలగు మతములును, దానము, యజ్ఞము, తపము, హోమము, జపము, తీర్థాటనము మొదలగు నిత్యకృత్యవిధులును, అనునివి యన్నియును గురువు బోధించిన తత్త్వరహస్యంబును దెలుపనేరదు. మూఢులగు వారికి పైనఁ జెప్పినవియెల్లను ముఖ్యములని తోఁచును. వారి చిత్తము చంచలపడుచును. ఇందువలన సకలజీవులును జననమరణ రూప సంసారసాగరమునందు దిరుగుచుండునట్లు కావించి నాశము చేయును. కావున, గురుసేవ చేయనెంచినవాఁడు, ఇతరములును మాని, గురుకృపనొంది గురుసేవ చేయవలయును.

శ్లో॥ ఆచార్య ఏవసంసార మోచక ప్రదఉచ్యతే।
ఆచారో౽ నామవేదాంత విచారే ణాత్తవేదినః ।

తా. సంసారమనెడి జనన మరణ దుఃఖమునుండి విడిపించు వాఁడు గురువే యగును. గురువు ఎట్టివాఁడనఁగా, వేదాంత విచా

రముచేసి, అందువలన పొందిన ఆత్మజ్ఞానము గలవాఁడే గురువని చెప్పఁబడి యున్నది.

క॥ గురుతత్త్వముకన్నను బర।
మరయఁగ లేదనుట సత్యమాయాత్మను నీ।
వెఱుగుటకొఱకై యత్నతఁ।
బొరయుట కర్తవ్యమందు రార్యులు తరుణీ॥ 44

తా. ఓగౌరీ! గురుతత్త్వముకంటె శ్రేష్ఠమైన దేదియును లేదనునది సత్యము. అనఁగా నిశ్చయము. నీవు ఆయాత్మను ప్రయత్నించి తెలిసికొనుటయే కర్తవ్యంబని పెద్దలు చెప్పుదురు.

తే॥ గోప్యమై విద్య జగముల జనములకును।
గానరాకుండు నా యాత్మఁ గనుటకేమి।
కారణంబన్న గురువచఃక్రమముచేతఁ।
దెలియవచ్చును బరమాత్మ దివ్యసరణి॥ 45

తా. ఓ పార్వతీ! పరబ్రహ్మవిద్య మహా రహస్యమై లోకమందలి జనులకుఁ దెలియరాకుండును. అట్టి పరమాత్మ విద్యను దెలిసికొనుటకు కారణం బేదియనఁగా, గురుబోధముచేతనే ఆరహస్యము తెలియనగును.

గురువాక్య సముద్భూత స్వానుభూ త్యాతిశుద్ధయా
యస్యాభ్యాసేనతే నాత్మా సతతం చావలోక్యతే॥

తా. గురువాక్యముచేఁ గల్గిన, అతి పరిశుద్ధమైన స్వానుభవముచేతను, తనయొక్క అభ్యాసముచేతను తనయందుండు ఆత్మను ఎల్లప్పుడును జూచుచున్నాఁడు.

క॥ ఎటువలె భక్తియుఁ జేసిన।
నటువలెఁ బ్రజ్ఞావిశేష మబ్బగఁజేయున్।
ఘటకుని కారుణ్యంబున।
మటుమాయలు దొలఁగి ముక్తిమార్గము గలుగున్॥ 46

తా. పార్వతీ! వినుము. గురువును శిష్యుఁడు ఏప్రకారము సేవించుచున్నాఁడో, ఆప్రకారమే గురువుయొక్క దయావిశేషము

చేత శిష్యునకుజ్ఞానము కల్గును. మఱియు శిష్యునికిఁ గల అజ్ఞాన మును భ్రమలును నివర్తియై కైవల్యమార్గము సిద్ధించును.

వ॥ అది యెట్లంటేని॥ 47

తా. సులభము.

శా॥ పూర్ణంబై జగమంతదాత్మమయమై పొల్పార నిత్యాత్మయై।
వర్ణావర్ణము లెంచిచూడక లసద్వర్ణాత్ముఁడై విశ్వసం।
కీర్ణానందుఁడునై యఖండమయుఁడై కీర్త్యాత్ముఁడై వెల్గు సం।
పూర్ణుం దానుగఁ గన్న సద్గురు పదస్ఫూర్తి న్విలోకింపుమీ॥48

తా. పూర్ణంబైనదియును, జగమునం దెల్లయెడల అంత రాత్మయై యుండునదియును, శాశ్వతమైనదియును, జాతిభేదము లెంచక యెల్లవారి హృదయములందును ప్రకాశమానమై యుండు నదియును, ప్రపంచం బంతట కలిసి ఆనందస్వరూపుఁడై యుండు వాఁడును, అఖండ స్వరూపుండును, యశఃకాయుండును, సంపూ ర్ణుఁడును అగు పరమాత్మను దర్శించిన యట్టి సద్గురువర్యుని వాక్య స్ఫూర్తిని కనుంగొనుము. (గురువాక్యమును దెలిసికొనుము. లేక గురుపదంబులను కనుంగొనుము. అనియుఁ జెప్పవచ్చును)

వి. పూర్ణము, అఖండము, వర్ణావర్ణములనెంచి చూడని వాఁడు, అను నీ మొదలగు పరమాత్మ విశేషములకెల్ల నిట ఉప నిషత్ప్రమాణములు చెప్పఁబడుచున్నవి

శ్లో॥ పూర్ణమద్వయ మఖండ చేతనం విశ్వభేదకలనాదివర్జితం।
అద్వితీయ పర సంవిదంశకం తత్సదాహమితి మౌనమాశ్రయ॥

తా. పూర్ణము=సంపూర్ణమైనది. అద్వయము=రెండవది లేనిది. అఖండచేతనము=తెంపులేనిది. విశ్వభేదకలనాదివర్జితము=విశ్వభేద కలన శూన్యమైనది. అనఁగా ప్రపంచము తానే యైనది అద్వితీయ పరసంవిదంశకము=భేదములేని పరమజ్ఞానస్వరూపమైనది.

శ్లో॥ జన్మమృత్యు సుఖదుఃఖవర్జితం జాతినీతి కులగోత్రదూరగం।
చిద్వివర్త జగతోస్వకారణం తత్సదాహమితి మౌనమాశ్రయ॥

తా. జన్మమృత్యు సుఖదుఃఖవర్జితం = జననము, మరణము, సుఖము, దుఃఖము మొదలగునవి లేనిది. జాతి నీతి కులగోత్ర

దూరగం=జాతి, నీతి, కులము, గోత్రము, అనునివిలేనిది. చిత్=స్వయంప్రకాశమైనది. ఆ పరబ్రహ్మమును నేనని ఆశ్రయింపుము.

సీ॥ మనసు వాక్కాయ కర్మములందు నిరతంబు
గురునిదైవంబుగా నెఱుఁగవలయు।
గురుశబ్దసరణి వివరణము నెఱుఁగుము
ప్రథమవర్ణము సిద్ధిపొదలఁజేయు।
భవలతాదులనెల్ల భంజించి తొలఁగించు
రెండవవర్ణ మఖండవృత్తి।
కావునమోక్షాధికారులౌ శిష్యులు
గురుని బ్రహ్మంబని గొలువవలయు।

తే॥ పలుకుభావంబు నిరతంబు ప్రబలఁజేసి।
యితరవాంఛలు మనసున నెంచబోక।
గురుపదాబ్జములను మనసరయఁబూని।
సచ్చిదానందపదమును చనఁగవలయు॥ 49

తా. మనస్సు, వాక్కు, కాయము, అను త్రికరణముల యొక్క కర్మములయందును (త్రికరణములయొక్క కృత్యముల యందును) గురువును దైవ మని తెలియవలయును. గురువనఁగా రెండు అక్షరములు. మొదటివర్ణము గు, రెండవ అక్షరము రు, ఈ రెండువర్ణములును జేరి గురు వను పదంబయ్యెను. గు అను ప్రథమ వర్ణము సకల పాపములను, లేక సకలజన్మములను బోఁగొట్టి మోక్షసిద్ధిని కలుగఁజేయును. రెండవవర్ణమైన రు అఖండాకార మైనది. కాఁబట్టి మోక్షాధికారులగు (ముక్తినిఁ బొందఁగోరువారగు) శిష్యులు గురువును పరమాత్మయని యెఱింగి సేవింపవలయును. గురువాక్యముయొక్క యభిప్రాయమును వెలయఁజేసి యితరము లైన కోర్కులనంతయు మనస్సునందు తలంపక గురువర్యుని పాద

పద్మములను మనస్సునందు విచారించి సచ్చిదానంద పదంబైన ముక్తినిఁ జెందవలయును.

వి. "శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః॥"

తా. గురువేబ్రహ్మ, గురువేవిష్ణు, గురువేమహేశ్వరుఁడు, అని చెప్పఁబడియున్నది.

శ్లో॥ గుశబ్దస్త్వంధకారస్స్యాత్ రుశబ్దస్తన్నిరోధకః।
అంధకార నిరోధత్వాత్ గురు రిత్యభిధీయతే॥

తా. గురు వనుశబ్దమునందలి, గు అనుఅక్షరము అంధకారము. అనఁగా చీకటి యనెడి అజ్ఞానము. రు అను అక్షరము దానిని (ఆయజ్ఞానమును) బోఁగొట్టునట్టిది. అని తెలియవలయును.

క॥ గురువును వర్ణింపఁగవలె।
స్థిరమతి గీర్వాణమంజు సూక్తులగానీ।
ధరఁగల భాషలఁగానీ।
నిరతంబు భజించి యాత్మ నెలవెఱుఁగవలెన్॥ 50

తా. సంస్కృత భాషతోఁగాని, లేక లోకములందు వ్యవహరింపఁబడు ప్రాకృతాది (తెనుఁగు, అఱవము, మహారాష్ట్రము, కన్నడము, హిందుస్థాని మొదలగు) భాషలతోఁగాని గురువును స్థిరబుద్ధిగలవాఁడై స్తోత్రము చేయవలయును.

వి. "శ్లో॥ నచవ్యాధి సమశ్శత్రు ర్నచపూజ్యో గురోఃపరః।
నాస్తి మాతృ సమోబంధు ర్నచమిత్రం పితుఃపరం॥"

తా. వ్యాధితోఁ సమానమైన శత్రువులేదు. గురువుకంటె పూజింపఁదగిన శ్రేష్ఠమైనవాఁడు వేఱొక్కఁడునులేఁడు. తల్లితోఁ సమానమైన బంధువులేదు. తండ్రికి సమానమైన మిత్రుఁడునులేఁడు.

శ్లో॥ దివ్యజ్ఞానోపదేష్టారం దేశికం పరమేశ్వరం।
పూజయే త్పరయాభక్త్యా తస్య జ్ఞానఫలం లభేత్॥

తా. దివ్యజ్ఞానమును ఉపదేశించినవాఁడును, పరమేశ్వరుఁడును అగు గురువును మిగుల భక్తితో పూజింపవలయును. ఇట్లు పూజించువానికి జ్ఞానము సిద్ధించును. అని చెప్పఁబడి యుండుటను దెలిసికొన వలయును.

గీ॥ గురువులంచును బెక్కండ్రు తిరిగి ధాత్రి।
శిష్యవిత్తాపహారులై చేరియుండ్రు।
శిష్యులకు జన్మసంప్రాప్త చేష్టలుడిపి।
ముక్తిఁబొందించు గురువులు ముదిత యరుదు॥ 51

తా. ఓ పార్వతీ! అనేకగురువులు భూమియందుగలరు; గాని, వారు శిష్యులయొక్క ధనమును హరించుగురువులేగాని శిష్యులయొక్క జన్మమును బోఁగొట్టి మోక్షమును బొందునట్లు చేయునట్టి గురువులుగారు. అట్టిగురువులు మిగుల నరుదుగా నుందురని యెఱుంగుము.

వి. "శ్లో॥ గురవో బహవస్సంతి శిష్యవిత్తాపహారకః॥"

తా. అనఁగా గురువులు చాలమందిగలరు. వారందఱును శిష్యులు సంపాదించిన ధనమును మాత్రము గైకొందురు. అంతియగాని శిష్యహృత్తాపహారకులు కారు. కావున పునర్జన్మమును బోఁగొట్టి మోక్షసామ్రాజ్యమును బొందునట్లు చేయువారే సద్గురువు లనఁబడుదురు.

సీ॥ కులము నాచారంబు బలముగాఁ దెల్పుచు
దిరిగెడుగురువులు ధరణిగలరు।
బలమైనశీలంబు కులమునాచారంబుఁ దొలఁగించి
పరమాత్మ నెలవుచూప।
గురువు గల్గుట జన్మ పరిపాకమునఁగాని
కలుఁగఁడు నిత్యాత్ముఁ గనఁగరాదు।
ఆచారమును శీల మదిలేక పరమ త
త్త్వ హస్యార్థ మబ్బు నటంచుఁ దెలుపు।

తే॥ వజ్రసూచీ యుపనిషత్తు వాక్యమందు ।
జననమును దేహమును జీవజాతికర్మ ।
మన్ని జాతుల యనుభవ మరయనొకటి ।
గానఁ గులశీలముల నాత్మఁ గనఁగరాదు॥ 52

తా. ఓపార్వతీ! భూమియందు కులము, ఆచారము, అను వీనిని బోధించుగురువులు పెక్కండ్రు గలరు. నడవడికలను, కులమును, ఆచారమును బోఁగొట్టి పరమాత్మస్థితినిఁ దెలియఁజేయునట్టి గురువు పూర్వపుణ్యావశముచేత లభ్యమగునుగాని సామాన్యముగా లభింపఁడు. జాత్యాదులచేత పరమాత్మునెఱుంగుటకు సాధ్యము కాదు. వజ్రసూచి అను ఉపనిషత్తునందు సకలమైన వారిజన్మమును దేహములును కర్మమును ఒక్కటేయనియును, ఇవి యనుభవము వలనఁ దెలియుచున్నదనియును, కాఁబట్టి ఆచారమును శీలమును లేకయే పరమ రహస్యార్థమైన పరబ్రహ్మమును పొందవచ్చునని దెలియఁ జేయఁబడి యున్నది.

తే॥ స్వప్న జాగ్రత్తు నిద్రలన్ సమయములను ।
గలుగు నుచ్ఛ్వాస నిశ్వాసములనడంచి ।
మఱపుజెందక యాత్మలో మఱఁగియున్న ।
వాఁడె పరమార్థవిదుఁడండ్రు వారిజాక్షి॥ 53

తా. పార్వతీ! జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, అను నీ అవస్థలయందు, అనఁగా సమయములయందు, జీవుఁడు శ్వాసమును విడుచుట, లోఁగొనుట, అనెడి ఉచ్ఛ్వాస, నిశ్వాసములను అణఁచి, అనఁగా క్రమము నతిక్రమింపక జేసి, మఱపుచెందనివాఁడై, తనలో మఱఁగి వెలుఁగుచుండు పరమాత్మయందే చిత్తమునుంచి యుండు వాఁడే పరమాత్మను (పరబ్రహ్మమును) దెలిసికొన్నవాఁడని వేదాంతము నెఱింగినవారు చెప్పుదురు.

# అవస్థావివరణచక్రము.

| అవస్థలు | అభిమానిదేవత | శక్తి | గుణము | స్థానము | శరీరము | భోగము | ఆత్మ | ప్రణవాక్షరము | జీవుఁడు | తత్త్వములు. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జాగ్రత్త | విశ్వుఁడు | క్రియాశక్తి | రజస్సు | నేత్రము | స్థూలశరీరము | యుక్తభోగము | జీవాత్మ | అకారము | వ్యావహారికజీవుఁడు | జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, శబ్దాదివిషయములు 5, ప్రాణాదివాయువులు 5, అంతఃకరణములు 4, ఈ ౨౪ తత్త్వములు. |
| స్వప్నము | తైజసుఁడు | ఇచ్ఛాశక్తి | సత్త్వము | కంఠము | సూక్ష్మశరీరము | స్వేచ్ఛాభోగము | అంతరాత్మ | ఉకారము | ప్రాతిభాసికజీవుఁడు | జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, ప్రాణాదివాయువులు 5, మనస్సు బుద్ధి, ఇవి 2 ఈ 17 తత్త్వములు. |
| సుషుప్తి | ప్రాజ్ఞుఁడు | ద్రవ్యశక్తి | తమస్సు | హృదయము | కారణశరీరము | ఆనందభోగము | పరమాత్మ | మకారము | పారమార్థికజీవుఁడు | స్థూలసూక్ష్మశరీరములు రెండింటితోఁ గూడిన అవ్యాకృతము. |

క॥ దేహములోపలి బ్రహ్మము।
సోహం బని కన్నవాఁడు సురుచిరమతియై।
యూహాపోహలఁ జెందక।
ద్రోహంబులఁబాసి యాత్మఁ దొలఁగక పొందున్॥ 54

తా. పార్వతీ! శరీరములోపల వసించునట్టి పరమాత్మను సోహం బని తెలిసికొన్నవాఁడు వ్యర్థమైన చింతలంబొందక సుజ్ఞానవంతుఁడై విపరీతజ్ఞానంబులనెడి ద్రోహంబులను త్యజించి, ఆ పరమాత్మను నిరంతరమును పొందును అనఁగా తాను పరమాత్మతోఁ గూడి నైక్యమై వెలయుచుండును. మఱియు పరమాత్మయందే మనస్సునుంచి యితరంబు నెఱుంగక యుండు నని భావము.

వి. "సోహం" అనఁగా హృదయకమలమున వసించు జీవాత్మ (హంస)యే నేను అని భావించుటయే సోహం అను శబ్దమునకు అర్థము. దీనిని సీతారామాంజనేయ సంవాదమునందు.—

"ఆ॥ సర్వభూతహృదయ జలజాతములయందు।
సమతఁ బవనమానసములతోడ।
హంస యనుచుఁ బలుకునతఁడె నే ననుకీలుఁ।
దెలిసి తలఁప నదియు బొలియునంత॥"

అనఁగా, సకలప్రాణుల హృదయకమలముల నాశ్రయించి సంచరించునట్టి హంసయనువాఁడే నేను. నాకును ఆపరమాత్మకును భేదములేదు. అనురహస్యమును దెలిసికొని ధ్యానము చేయవలయును. ఇట్లు ధ్యానించినయెడల తానువేఱు, పరమాత్మ వేఱు, అనెడి భేదము నశించి, ఆపరమాత్మయందే లయమొందును. అనఁగా ఆపరబ్రహ్మము సుషుమ్నానాడి నడుమ తేజరిల్లు చున్నాఁడనెడి భేదము నశించును.

"సోహం" ఆ పరబ్రహ్మమే నేను. ఇట్లు ధ్యానించుటయే అజపామంత్రము. ఇదే ఆత్మమంత్రము. ఈ ఆత్మమంత్రమును సూర్యోదయము మొదలు మఱునాఁడు సూర్యోదమగువఱకును **21600** మాఱులు జపింపవలయును. అనఁగా అజప గాన జపింపక జపింపవలయును. ఎట్లన,

శ్లో॥ షట్ఛతంతు గణేశాయ షట్సహస్రంతు వేధసే ।
షట్సహస్రం గదాపాణే షట్సహస్రం పినాకినే ।
ఆత్మనేచ సహస్రంతు గురువేచ సహస్రకం ।
జీవసంఖ్యా విజానీయాత్ సహస్రం పరమాత్మనే ॥

హంస యనఁగా ఉచ్ఛ్వాసనిశ్వాసములు. ఇవియే ప్రాణమనఁబడును. ఇందలి హకారము శివబీజము, సకారము, శక్తిబీజము, శివశక్తులను రెంటిని ఐక్యముచేయు అభేదసంబంధమే అనుస్వారము.

| హకారము. | సకారము. | బిందువు. |
|---|---|---|
| సూర్యనాడి అను పింగళానాడి కుడిముక్కున వాయువును పీల్చును. శుక్లము. నిర్విషయజ్ఞానము. శివబీజము. | చంద్రనాడి అను ఇడానాడి ఎడమ ముక్కున వాయువును పీల్చును. రక్తము. ప్రపంచ విషయజ్ఞానము శక్తిబీజము. | తేజోనాడి అను సుషుమ్నా నాడి వాయువును స్థిరముగా నిల్పును. |

మూలాధార చక్రమునందుండు గణపతికి—600.
స్వాధిష్ఠాన చక్రమునందుండు బ్రహ్మకు—6000.
మణిపూరక చక్రమునందుండు విష్ణువునకు—6000.
అనాహత చక్రమునందుండు రుద్రునకు—6000.
విశుద్ధ చక్రమునందుండు ఈశ్వరునకు—1000.
ఆజ్ఞేయ చక్రమునందుండు సదాశివునకు—1000.
సహస్రార చక్రమునందుండు పరమాత్మునకు—1000

ప్రాణవాయువు హృదయస్థానమునందుండి ఉచ్ఛ్వాస నిశ్వాసరూపములతో విశిష్టుఁ డధిదేవతయై 21600 పర్యాయ

ములు నాసారంధ్రముల మూలముగా సంచరించును ఇది నోటియం దుండి ఉచ్చారణను, నాభియందుండి శబ్దమును, ముక్కునందుండి శ్వాసములను పూరించుట రేచించుటలను, హృదయమునుండి దగ్గు మొదలగు వ్యాధులను కలుగఁజేయుటను జేయుచునుండును.

ఎవ్వఁడు హంప్రభావము నెఱింగి నిరంతరమును అన్యచింతలుమాని సూర్యోదయము మొదలు మఱునాఁడు సూర్యోదయము వఱకును అను రహస్యముచేత సదాకాలము అనెడి గుట్టును దెలిసికొని పరమాత్మయందే బుద్ధిని నిల్పి మఱపుచెందక యుండునో వాఁడాపరమాత్మను బొందును. అనఁగా మోక్షమును బొందును.

సీ॥ అరయసద్గురునిపా దాబ్జాభిషేచన
జలము సంతోషియై తలధరింప ;
సకలతీర్థంబుల స్నానంబు చేసిన
ఫలము లభించి యింపలరఁజేయుఁ ।
పాదతీర్థకణంబు పానంబుచేసిన
భవవార్ధినిదాఁటి పరము జేర్చుఁ ।
పాప పంకంబును బరఁగంగనెట్టించు
నజ్ఞానమను తమస్సంతబాపు ।
తే॥ జ్ఞాన వైరాగ్య సంసిద్ధిఁ గలుగఁజేయు
జన్మకర్మాదిభ్రాంతులు సంహరించు ।
మరియు సుజ్ఞానమునుజెంద మఱపులేని
తెలివి గలిగించు గురుపాదతీర్థమహిమ ॥ 55

తా. ఓపార్వతీ ! వినుము. సద్గురువర్యుని పాదపద్మములకు అభిషేకము చేసిన జలమును సంతోషములో శిరస్సునందు ధరించువాఁడు గంగాది సకల నదులయందు స్నానముచేసిన ఫలమొంది సంతృప్తినిఁ బొందును. గురుపాదోదకమును లేశమాత్రము పానముచేసిన వానిని, జన్మము లనెడి దుఃఖసముద్రమును దాఁటించి పరమపదమును జేర్చును. మహిమగల గురుపాదోదకమనెడి తీర్థము పాప మనెడి కలుషములనంతయు పోఁగొట్టి, అజ్ఞానమను

చీకటినంతయు నశింపఁజేయును. జ్ఞానమును, వైరాగ్యమును లెస్సఁగాఁ గలుగునట్లు కావించును. జననమరణములు కలుగుననెడి భ్రమను నశింపఁజేయును. మఱియు (బ్రహ్మజ్ఞానమును) పొందునట్టి మఱపులేని తెలివిని కలుగఁజేయును.

గురుపాద తీర్థమహిమను ఈ దిగువ శ్లోకములచే నెఱుంగఁ దగును.

వి. "శ్లో॥ గురుపాదో దకస్నానం గురూచ్ఛిష్టంతు సేవయేత్ ।
గురుమూర్తిం సదాధ్యాయేత్ గురునామ సదాజపేత్ ।
గురుభుక్తం సదాకాల మాముష్మిక ఫలప్రదం ।
గురుపాదోదకంనిత్యం సేవేత గురుపూజకః ।
గురూచ్ఛిష్ట పురోడాశం భుంజీయా ద్భక్తినమ్రధీః॥"

అని స్మృతులయందును పురాణములయందును జెప్పఁబడి యున్నవి.

క॥ గురుపాదతీర్థపానము ।
గురుసుతీ రాన్నభుక్తి గురుధ్యానంబున్ ।
గురువర్యుని సన్నుతితో ।
ధరనెన్నఁగ సాటిలేదు తామరసాక్షీ ॥ 56

తా. ఓపార్వతీ ! గురుపాదతీర్థమును పానముచేయుటతోను గురూచ్ఛిష్టమును భుజించుటతోను, గురుధ్యానమును చేయుటతోను, గురుని స్తుతించుటతోను సమానమైన దేదియును లేదు.

వి. "శ్లో॥ గురుపాదోదకం పీత్వా గురోరుచ్ఛిష్ట భోజనం ।
గురుమూర్తిం సదాధ్యాయేత్ గురుస్తోత్రం సదాజపేత్॥"

వ॥ అనియిట్లు పలుకంబడిన భావమును గ్రహించి మోక్షంబును జెందవలయును ॥ 57

సీ॥ వారణాసిపురంబు చేరియుండెడిగంగ
సాటియా గురుపాద జలము మహిమ ।
విశ్వేశ్వరునితోడ వెలయ సమానమా
గురుమూర్తిరూప విస్ఫురణమహిమ

వరగంగ యక్షయ వటముతోఁ దుల్యమా
శిరమునందంఘ్రులఁ జేర్చుమహిమ ।
పానంబుపట్ల ప్రయాగ తీర్థముఁబోలుఁ
గరుణాపరత్వ సద్గురుని మహిమ ।

తే॥ ఎన్ని విధముల గురు బల మెచ్చుగాన ।
నిరత మాత్మలో నెంచి సంస్మరణచేసి ।
కోరి నిరుపమ సత్త్వాత్ముఁ జేరుకొఱకు ।
వ్యాప్తి నడఁగించి యోన్నమో యని నుతింతు ॥ 58

తా. ఓ గౌరీదేవీ ! గురుపాదోదకము కాశియందుండు గంగతో సమత్వముగను, గురువు శ్రీ కాశివిశ్వేశ్వరునితో సమముగను నుండును. గురువర్యుని పాదములను శిరమునందు ధరించినయెడల అక్షయవటమును గంగను శిరస్సునందు ధరియించినట్టి మాహాత్మ్యము గలదిగ నుండును. కరుణాకరుండగునట్టి గురుపాదోదకమును పానము చేసినయెడల ప్రయాగతీర్థముతో సమానము గలదిగా నుండును. ఎన్ని విధములఁ జూచినప్పటికిని సద్గురువుయొక్క బలమే హెచ్చుగానుండును కావున గురువును మనంబునందుంచి కొని ధ్యానించి నిత్యసత్యవస్తువైన పరమాత్మునిఁ జేరుటకొఱకు నేను కోరి స్తోత్రము చేయుదును

వి. శ్లో॥ యథాజాత్యన్ధలోకస్య రూపజ్ఞానం నవిద్యతే ।
తథా గురూపదేశేన వినాతత్త్వం నజాయతే ॥

తా. ఏప్రకారము గ్రుడ్డివానికి ఇది అది అనెడి రూపభేదము తెలియదో, అట్లు గురూపదేశములేక తత్త్వజ్ఞానము కలుగదు. కాఁబట్టి తత్త్వజ్ఞానము కలుగుటకొఱకు గురువును ఆశ్రయించి వారివలన వేదాంతోపదేశమును బొందవలయును. తక్కిన విశేషార్థములు ఇది వఱకు మీఁద వ్రాయంబడి యున్నందున ఇచ్చట వ్రాయలేదు.

చ॥ గురుముఖమందు బ్రహ్మము నకుంఠితలీల వసించియుండఁగా।
ధరణి నరోత్తములు్సగుణ తత్పరులై గురుపాదపద్మముల్‌।

అరమర లేక యుండి నిగమార్థరహస్యము వారు దెల్పఁగా ।
గరితపురాకృతంబయిన కర్మఫలంబది యాత్మఁగాంచుటల్ ॥ 59

తా. ఓ పార్వతీ! భూమియందు సద్గురువర్యుని ముఖంబునందు బ్రహ్మము (పరమాత్మ) వసించియుండును. కాఁబట్టి సుజనులైనవారు మంచి బుద్ధిగలవారై సద్గురుపాదములనుభక్తితో సేవించి వారు చెప్పెడి వేదాంతరహస్యములను దెలిసికొని ప్రకృత మనుభవించునట్టి కర్మములనంతయు పూర్వజన్మకృతంబులని తెలిసి వర్తింపవలయును.

క॥ గురుసేవాపరుఁడగు నర ।
వరుఁడెప్పుఁడు నడువఁదగిన వర్తన వినుమా ।
తరుణి పరపురుషుఁదగిలిన ।
గుతిరీతిని నడువవలయుఁ గుంజరగమనా ॥ 60

తా. ఓపార్వతీ! గురుసేవయందు మగ్నమైయున్న మనస్సుగల ఉత్తమపురుషుఁడు ఎట్లు వర్తింపవలయునో చెప్పెదనువినుము. ఒకానొకస్త్రీ తనభర్తతోఁ గాపురము చేయుచునుండియు పరపురుషునియం దిచ్ఛగలిగి యుండునపుడు అది యేప్రకారము వర్తించుచుండునో ఆప్రకారముగా వర్తించుచుండవలయును. అనఁగా సంసారమునం దుండువాఁడైనను చిత్తమునంతయు ఆచార్యునియందే యుంచి యుండవలయునని భావము.

వి. "శ్లో॥ పరవ్యసనినీ నారీ వ్యగ్రాపి గృహకర్మణి ।
తదేవా స్వాదయత్యంతః పరసంగ రసాయనం॥"

తా. పరపురుషునియందు ఇచ్ఛగలస్త్రీ గృహవిషయక కార్యములను జేయుచు నుండినప్పటికిని, పరపురుషుని వలనఁ గల్గు సుఖవిశేషమునే సర్వదా చింతించుచుండును. అని వేదాంత పంచదశి యందు చెప్పఁబడియున్నది.

మ॥ కులశీలాశ్రమకీర్తినర్థనములం గోర్కెల్సదా మాని ని ।
ర్మలుఁడై యన్యవిచార సంపదల చేరంబూనకఁ సత్యమో ।

కులసద్వారమునందు బ్రహ్మము నమోఘజ్యోతిగాఁగన్న పు।
ణ్యులపాదంబులు పూజసేయఁగను నేర్పొప్పంగ మేల్పట్టగున్॥61

తా. పార్వతీ! కులము, ఆచారము, కీర్తి, వృద్ధి, అను వీని యందు అభిలాషనుమాని, దోషములేనివాఁడై ఇతర విషయము లందు వాంఛనుంపక, శాశ్వతమైన పరమాత్మ స్థానమునందుండు పరబ్రహ్మస్వరూపమును మిక్కిలియు ప్రకాశమానమైనట్లు దర్శించి నట్టి పుణ్యాత్ములయొక్క పదకమలంబులను పూజ సేయునట్టి తెలివియే శ్రేష్ఠమైనదగును.

ఉ॥ శ్రీగురువక్త్రమందెపుడు చేరిమెలంగెడు నాత్మవస్తువుఁ ।
బాగుగఁజేరువాఁ డమలభక్త్యమనస్కుఁడునై స్తుతింపఁగా।
నాగురుమూర్తి వాని కమరాధిపవర్యుల కందరాని స।
ర్వాగమసార వస్తు విభవార్థము లందగఁజేయు శాంభవీ॥ 62

తా. ఓపార్వతీ! గురుముఖమునందు సదా వసించుచుండు పరమాత్మవస్తువును లెస్సఁగాఁ బొందునట్టివాఁడు గురువును నిర్మల చిత్తుఁడై స్తుతించినయెడల, ఆగురువర్యుఁడు అట్టి శిష్యునకు దేవేంద్రాదులు పొందలేని యట్టిదియును, సకలాగమముల యందు ప్రతిపాదింపఁబడి యుండెడి సారమైనట్టిదియును అగు పరమాత్మను పొందునట్లు చేయును.

క॥ ఎన్నివిధంబులనైనను।
గన్నులలోనున్న యాత్మఁ గనుఁగొనితగనా।
పన్నతనాహాహాహూహూల్ ।
మున్నుగొలిచి ధాత్రియందు ముఖ్యులుగారే॥ 63

తా. ఓపార్వతీ! ఈలోకమునందు పూర్వము ఏయే ప్రకారములచేతనైనప్పటికిని నేత్రములయందు ప్రకాశించునట్టి పరమాత్మను హాహా, హూహూ, అను పేర్లచే వ్యవహరింపఁబడు గంధర్వులు ఆపన్నులై దర్శించిన సేవించియే ప్రసిద్ధినొందిరి.

వ॥ అని యివ్విధంబునఁ బల్కి యాత్మానాత్మ వివేక సంపన్న ప్రభావులగు గురువర్యుని మహత్త్వం బెట్లన్న గురు వనుద్వివర్ణంబునకు వివరణము వినుము; ప్రథమంబైన గుకారంబు

మాయాశ్రితంబై యుండు, రెండవదియైన రుకారంబు మాయా భ్రాన్తివిమోచనంబు సేయుచుండుఁ, బర్యాయంబున నాదివర్ణం బన్ధకారంబున కాధారంబై యుండు, ద్వితీయ వర్ణంబు తేజ స్వరూపంబై యుండుఁ, గావున, సాక్షాత్పరబ్రహ్మంబైన గురు మూర్తితో సమానం బెందును లేకయుండు॥　64

తా. సులభము. 49-వ పద్యముయొక్క విశేషార్థమును జూచిన స్పష్టమగును.

క॥ గురువే వాక్యవివరణము ।
పరికించినరీతిఁ దెలిసి భావములోనన్ ।
మరువక తలఁచుచు నుండుము ।
పురుషార్థంబైనయాత్మఁ బొందుటకు శివా॥　65

తా. పార్వతీ! గురువర్యుఁడు ఏప్రకారము బోధించెనో ఆప్రకారము ఆ యుపదేశ వివరణమును తెలిసికొని, పురుషార్థం బైన యట్టి పరమాత్మను పొందుటకై ఎల్లప్పుడును స్మరించు చుండుము.

ఆ॥ ధరణి నేపదార్థతతియైన గురువరు ।
తోడి సాటిగాదు తోయజాక్షి ।
పరుసవేదిఁ గల్పతరువును శ్రీగురు ।
సమముగాను బోల్పఁజాలకుండు॥　66

తా. ఓ శాంభవీ! ప్రపంచమునందు ఎట్టి వస్తువును గురువు నకు సమముకాదు. అనఁగా ఇనుమును బంగారు చేయు పరుస వేదియు, కోరినదంతయు నొసంగు కల్పవృక్షమును గురువునకు సాటికానేరదని భావము.

ఆ॥ కల్పవృక్షమైనఁ గల్పితవస్తువుల్ ।
వెలయనిచ్చునంద్రు విశ్వమందు ।
నంతెకాని యొకరి కరయఁదానిచ్చుచోఁ ।
జాలనియ్యదంద్రు చంద్రవదన॥　67

తా. తామరసాక్షియగు పార్వతీ! ప్రపంచమునందు కల్ప వృక్షము, చింతామణి, కామధేనువు మొదలుగాఁగల కల్పిత వస్తు

వులు విస్తారముగ నిచ్చునని చెప్పుదురు. అంతియగాని, అవి ఒకరి కిచ్చునపుడు చాల నియ్యవని చెప్పుదురు.

ఆ॥ పరుసవేది యినుముపై సోఁకినంతనే।
కనకమయమునగుచుఁ గానిపింపఁ।
జేయుఁగాని యినుము చెలువొప్పఁ బరుసంబు।
గాను జేయదంద్రు కమలనేత్రి॥ 68

తా. ఓ చంద్రముఖి! పార్వతీ! స్పర్శవేదియను వస్తువు ఇనుముపై సోఁకినయెడల దానిని బంగారమగునట్లు చేయును గాని, ఆయినుము పరుసమును జేయదు.

సీ॥ అటుగానగురునకు నమరభూజస్పర్శ
వేదులు సరిగావు విద్రుమోష్ఠి।
చెలువొప్ప గురుఁడైన జీవశంకయుఁ గల
శిష్యుని భవబంధ చేష్టలుడిపి।
తన రూపుగాఁ జేసి యొనరంగఁ జిద్రూపు
కనుగంటఁజూపి దుష్కరమునైన।
మఱపెల్లఁ దొలఁగించి పరమాత్మపదవిని
బొందించి నిర్మలానందుఁజేయుఁ॥
తే॥ గాన గురుతోటిసాటి యేమైనఁగలదె।
పూని జగమున గురుమూర్తి పూజ్యుఁడెపుడు।
హరి హర బ్రహ్మ సురవరవరులకైన।
గురుఁడు లేకున్న ముక్తి చేకూడదార్య॥ 69

తా. కమలములవంటి నేత్రములును పగడమువంటి పెదవులును గల ఓ శాంభవీ! కాఁబట్టి స్పర్శవేదియును, కల్పవృక్షమును గురువుతో సాటి కానేరదు. గురువు తాను కేవలము జీవుఁడనెడి భ్రాంతిగలిగినయట్టి శిష్యునియొక్క జన్మబంధము లను వ్యాపారములను (పుట్టుచు గిట్టుచు నుండుటలను) మాన్పి తలవంటి పరమాత్మ స్వరూపునిగా నొనర్చి, నేత్రములందు చిద్రూపుండగు పరమాత్మయొక్క దర్శనము కలుగునట్లు కావించి, అజ్ఞానమను మఱపును తొలఁగించి, పరబ్రహ్మమును బొందునట్లు చేసి నిర్మలా

నందునిగాఁ జేయును. కావున, గురుమూర్తితో సమానము ఏదియు లేదు. ఈ ప్రపంచమునందు గురుమూర్తియే పూజింపఁదగినవాఁడు. బ్రహ్మ విష్ణు రుద్రులకును, దేవేంద్రుఁడు మొదలగువారి కైనప్పటి కిని గురువు లేకున్నయెడల మోక్షము కలుగదు.

వి. శ్లో॥ గురు రాలోకమాత్రేణ స్పర్శాత్సంభాషణాదపి।
సద్యస్సంజాయతేయస్య సర్వపాపా ద్విముచ్యతే॥

తా. ఎవనిని గురువు కటాక్షించునో, స్పర్శించునో, ఎవనితో సంభాషించునో అప్పుడు వాఁడు సకల పాపములనుండి విముక్తుఁ డగుచున్నాఁడు ; అని వేదాంతములందుఁ జెప్పఁబడి యున్నది. కాఁబట్టి గురువుతో సమానమైన వస్తు వేదియును లేదని యభిప్రాయము.

వ॥ అట్లు గావున॥ 70

తా. సులభము.

గు రు సే వా క్ర మ ము.

సీ॥ గురుసేవకన్న నెక్కువ తత్త్వ మిలలేదు
సకల జీవులు భక్తి సలుపవలయు।
శయన వాహన వస్త్రచయ భూషణాదులు
ప్రియమున గురున కర్పింపవలయు।
నారాధనార్థమై యర్థముఁ జీవంబు
నంతయు గురునకర్పింపవలయు।
వాఃకర్మమానస వైభవంబుల గురు
శ్రీకరంబుగను భజింపవలయు॥
తే॥ సురను కరములు బాదము ల్శిరము నుదురు।
నిలను మోపుచు సాష్టాంగ మలవరించు।
వేళ లజ్జాభీమానముల్ విడిచి ముక్తి।
సాధకుని జేరు టీలాగెచంద్రవదన॥ 71

తా. ఓ ఇందువదనయగు పార్వతీ ! ఈ ప్రపంచమునందు గురువర్యుని సేవించుటకంటె శ్రేష్ఠమైనదియు లేదు ఆదియే తత్త్వమని

దెలియుము. సకల ప్రాణులును గురుభక్తి చేయవలయును శయ్య, వాహనము. వస్త్రము, భూషణము మొదలగు వస్తువులను ప్రేమతో సమర్పింప వలయును. గురువుయొక్క ఆరాధనము కొఱకు ధనమును, ప్రాణమును, గురువద్యన కొసంగవలయును. మనస్సు, వాక్కు, కాయము, లను త్రికరణములయందును సద్గురుని శుభకరంబుగ స్తోత్రము చేయవలయును. ఱొమ్ము, చేతులు, పాదములు, శిరస్సు, నెత్తి, అను వీనిని దండాకారముగా భూమియందు మోపి మనస్సుతో గురువును ధ్యానించుచు సాష్టాంగ నమస్కారము చేయవలయును. గురువునకు నమస్కారము చేయునపుడు సిగ్గు, అభిమానము, అను నీరెంటిని విడిచి నమస్కరింపవలయును. ఈ ప్రకారము తన్ను మోక్షమును బొందుటకు అర్హునిగాఁ జేయునట్టి సాధకాచార్యుని ఆశ్రయించువాఁడు చేయవలయును.

వి. శ్లో॥ దీర్ఘదండ నమస్కారో నిర్లజ్జో గురుసన్నిధౌ।
శరీరమర్థం ప్రాణంచ సద్గురుభ్యో నివేదయేత్॥

తా. గురువునకు సాష్టాంగ దండ ప్రణామము చేయవలయును. శరీరమును, ధనమును, ప్రాణమును, సద్గురువునకు సమర్పింప వలయును.

వ॥ అదియునుంగాక ॥ 72

తా. సులభము.

క॥ ధనమును బ్రాణము జీవము।
మనసిచ్చినభార్యనైన మంగళతర వి।
ద్యనునిచ్చిన సద్గురునకు।
ననుమానింపకను నిత్తు రంబుజనేత్రీ। 73

తా. ఓపార్వతీ! కమలనేత్రీ! ధనము, ప్రాణము, జీవము, పత్ని, అను వీనిని పరమార్థము నుపదేశముచేసినట్టి సద్గురువునకు ఎంతమాత్రము సంశయింపక సమర్పింతురు.

వి. "శ్లో॥ కర్మణా మనసా వాచా గురూణాం భక్తివత్సలాః।
శరీర మర్థం ప్రాణంచ సద్గురుభ్యో నివేదయేత్ ॥"

తా. గురువునందు భక్తిగల శిష్యుఁడు కర్మచేతను, వాక్కుచేతను, శరీరమును, ప్రాణమును, ధనమును, ఆచార్యునకు, సమర్పింపవలయును.

క॥ క్రిమికీటకాదిదుర్గం।
ధములన్ మలమూత్ర శోణితములన్ శ్లేష్మం।
బమరి మెలంగెడి గర్భ।
శ్రమలన్ బోనడఁప గురుని శరణొందుశివా॥　74

తా. ఓ గౌరీ! జీవుఁడు క్రిమికీటాది జంతువులకు నెలవైనదియును, మలము, మూత్రము, రక్తము, శ్లేష్మము, అను వీనితోఁ గూడినదియు నగు తల్లిగర్భమునందు బుట్టి శ్రమలొందనీక చేయవలయునని సద్గురువర్యుని శరణు పొందుము.

వి. ఈ విషయమును అనఁగా గర్భదుఃఖమును గూర్చియు జననమైనపిమ్మట జీవుఁ డనుభవించు దుఃఖమునుగూర్చియు గర్భోపనిషత్తునందు విస్తారముగాఁ జెప్పఁబడియున్నది. ఇచ్చట సంగ్రహముగాఁ జెప్పఁబడుచున్నది.

శ్లో॥ నానాయోని సహస్రాణి దృష్ట్వాచైవ తతోమయా।
ఆహారావివిధాభుక్తాః ప్రీతాశ్చ వివిధా స్తనాః।
జన్మభూమిర్హి సర్వాభూః శ్మశాన మపి మేప్యరా!
చతురాశీతిలక్షేషు యోనిర్భేదేషుచాభవం।
జాతశ్చాస్మి మృతశ్చాస్మి సంసార్యాస్మిపునఃపునః॥

తా. నేను అనేకవేల యోనులను జూచియున్నాను. అనేక విధములైన ఆహారములను భుజించియున్నాను. అనేక విధములగు స్తన్యములను పానము చేసియున్నాను. మున్ను నాకు సకల భూమండలమును జననభూమిగను శ్మశానముగను నుండెను. ఎనుబదినాలుగువేల లక్షల యోనులయందు పుట్టితిని మాటిమాటికిని పుట్టువాఁడుగను, మాటిమాటికిని గిట్టువాఁడుగను, మరల మరల సంసారిగను నైతిని.

శ్లో॥ జన్మమృత్యూ పునర్జన్మ పునర్మృత్యుః పునర్జనిః।
గర్భవాసో మహాదుఃఖం మోహోదుఃఖంచ జన్మసు।

బాల్యే దుఃఖం తథాశోకః పారవశ్యంచ మూఢతా।
హితకారణ మ్యాలస్య మహితాచరణం తథా।
యౌవనే విషయాస క్తి స్తాపత్రయ నిపీడితః।
చింతారోగస్యవార్ధక్యే మరణేతు మహద్భయం॥

తా. (జీవునకు) పుట్టుటయు, గిట్టుటయు, మరల పుట్టుటయు నిట్లు గర్భవాసదుఃఖమును, పుట్టుటయందు మోహమును, బాల్యమునందు దుఃఖమును, మఱియు వ్యసనమును, పరులకు లోఁబడియుండుటయును, మూఢత్వమును, తనకు వలసినదానిని చేసికొనుటకు సాధ్యము కాకపోవుటయును, సోమరితనమును, అనిష్టమును చేసికొనుటయును, యౌవనమునందు విషయేచ్ఛయును, ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికములను తాపత్రయముచే పీడింపఁబడియును, వార్ధకముచే చింతనొందియును, వ్యాధిచేతను మరణముచేతను మహాభయమును కలుగుచున్నవి.

శ్లో॥ గర్భవాసా త్ప్రముచ్యేయం యదివిష్ణుం భజే హ్యృది॥

తా. (కాఁబట్టి నేను ఈ) గర్భవాసమునుండి బయలువడుదు నేని హృదయమునందు విష్ణువును సర్వ వ్యాపకుఁడైన దేవుని భజింతును. అను నిత్యాది ప్రమాణములవలన గర్భవాసదుఃఖము అతికష్టమనియును, జనన మొందినతర్వాత మఱియు ననేక విధములగు దుఃఖములు సంభవించుననియును, ఈదుఃఖములను బోఁగొట్టుకొనుటకై సద్గురువును ఆశ్రయించువాఁడు ఎవఁడో యొకఁడనియును తెలియఁదగినది.

శ్రుతి॥ తదా సద్గురుమాశ్రిత్య చిరకాలసేవయా,
బంధాన్మోక్షం కశ్చిత్ప్రయాతి॥

తా. అనఁగా అపుడు (జన్మించిన తర్వాత) ఎవఁడో ఒకఁడు సద్గురువును ఆశ్రయించి అనేకకాలము శుశ్రూష యొనర్చుటచేత బంధమునుండి విడివడుచున్నాఁడు. అనఁగా మోక్షమును బొందుచున్నాఁడు. అని పైంగలోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది.

క॥ మోహం బనియెడు విటపా।
రోహణులై నరకవార్ధిలోఁబడు నరులక్ ।

మోహమును మాన్పి ముక్త్యు ।
త్సాహముఁ బొందించుగురుని శరణము చొత్తున్ ।    75

తా. ఓపార్వతీ! మోహమనెడి వృక్షమునెక్కి రౌరవాది నరక సముద్రములోఁ బడునట్టి మానవులయొక్క మోహంబును బోఁగొట్టి ముక్తి నొసంగు సద్గురువర్యుని శరణము చెందెదను.

వి. మోహమనఁగా అరిషడ్వర్గములలో నొకటి. అరిషడ్వర్గములు; అనఁగా ఆఱుగురు శత్రువులు ఎట్లన,

1. కామము.—ప్రాప్తవస్తువును అనుభవింప వలయుననెడి యిచ్ఛ.

2. క్రోధము.—ద్వేషము.

3. లోభము.—లభింపనివస్తువు లభియింప వలయు ననెడి యిచ్ఛ.

4. మోహము.—ఆత్మ, అనాత్మ, అను వీనియొక్కయు; లేక, శుభకార్యములయొక్కయు, అశుభకార్యములయొక్కయు, అవివేకము.

5. మదము.—గర్వము, అనఁగా అహంకారము.

6. మాత్సర్యము—ఇతరులయొక్క మేలును జూచి ఓర్వలేక యుండుట. ఆత్మ యిట్టిదనియు, అనాత్మ యిట్టిదనియు నెఱుంగుటకు సాధ్యముకానట్టిదగు అజ్ఞానమనెడి వృక్షమే మోహవృక్షమని తెలియునది.

క॥ గురుఁడే బ్రహ్మయు విష్ణువు ।
గురుఁడే రుద్రుండునాత్మ గురుఁడేయనుచుఁ ।
గుఱిఁజేరి నమ్మియుండెడి ।
పరిపూర్ణుల పాదములకుఁ బ్రణమిల్లెదనే॥    76

తా. ఓపార్వతీ! గురువే బ్రహ్మయు, విష్ణువు, శివుఁడును, పరమాత్మయు నని తెలిసికొని, ఆగురువును ఆశ్రయించి యుండెడివారి (అనఁగా సచ్ఛిష్యులగువారి) పాదపద్మములకు నమస్కారము చేయుచున్నాఁడను.

వి. శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవ స్సదాశివః।
గురుస్సాక్షా త్పరబ్రహ్మ తస్మైశ్రీ గురువేనమః॥

తా. గురువు త్రిమూర్తి స్వరూపంబనియును, అతఁడే పరమాత్ముఁడనియుఁ దెలియునది.

క॥ అజ్ఞానాంధతమంబును।
సుజ్ఞానాంజనకలాప శోభితమా సం।
విజ్ఞప్తిఁగన్నులందిడి।
ప్రజ్ఞను నెఱిఁగించుగురునిఁ బ్రార్థింతుఁజుమీ॥ 77

తా. పార్వతీ! అది, ఇది, అనఁగా ఆత్మ ఇట్టిదనియు, ప్రపంచ మిట్టిదనియు నెఱుంగుటకు శక్తి లేకుండ చేయునట్టి అజ్ఞానంబనెడి అంధకారమును బోఁగొట్టుటకు సుజ్ఞానంబను అంజన కలాప విజ్ఞప్తిని నేత్రములయందుంచి ప్రజ్ఞను నిజతత్త్వమును దెలియఁజేయు సద్గురువర్యుని స్తుతియింతును.

వి. శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా!
చక్షురున్మీలితంయేన తస్మైశ్రీ గురవేనమః॥

తా. అజ్ఞానమను చీఁకటిగ నుండు కన్నులకు జ్ఞానాంజనము నుంచి నేత్రములను దెఱుచున ట్లొనర్చిన సద్గురువునకు నమస్కారమొనర్చెదను. ఇత్యాది ప్రమాణముల నిట అనుసంధించునది.

ఉ॥ ఈ సచరాచరంబులకు హేతువునై బహుదుఃఖవారికిన్।
భాసుర సేతువై నిగమ ప్రజ్ఞలకెల్లను దానె యాదియై।
భూ సలిలాగ్ని వాయు నభ పుంజము వర్ధిలఁజేయు నాత్మ హృ
ద్వాసునిఁగాఁ దలంచి కృతవాసనబాయుట కేను మ్రొక్కెదన్॥

తా. స్థావర జంగమాదులకు కారణమును, దుఃఖ సాగరంబునకు సేతువును, వేదములకెల్ల మూలమై, పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, అను పంచభూతములను రక్షించునదియును, అగు పరమాత్మ తన హృదయకమలమందు వసించుచున్నాఁడని తలంచి, ప్రకృత దుఃఖమును ఇదివఱకును కావింపఁబడియుండు వాసన నశించుటకు నేను నమస్కారము చేసెదను. అనఁగా పరబ్రహ్మమునకు నమస్కరించెదను.

క॥ రక్షింపను హరి కర్తగు ।
శిక్షోద్భవములను దాను చేయం గలండే ।
యీక్షితిఁ గారణగురువరు ।
నక్షీణతరాత్మఁజేర్చ నఘములబాపున్॥ 79

తా. ఓ పార్వతీవినుము జీవునిరక్షించుటకు మహావిష్ణువు కర్తయగును. జీవుని శిక్షించుటకును పుట్టించుటకును హరి కర్త కాఁడు. ఈ భూమియందు కారణగురువైన యామహానుభావుని హృదయంబునందు నిల్పి ధ్యానించినయెడల, సకలపాపములను బోఁగొట్టును. అనఁగా, బ్రహ్మ రుద్రులు చేయుకృత్యముల వలనఁ గలుగు పుట్టకగాని గిట్టుటగాని ప్రాణికిఁ గలుగదనిభావము. జన్మ సార్థకమైనతర్వాత జనన మరణములు సంభవింపవుకదా యని భావము.

శా॥ ఆనందాకరమై యఖండమయమై యజ్ఞాన విచ్ఛేదమై ।
జ్ఞానోల్లాస విశేష భాసురమునై జ్ఞాతవ్య సంవేద్యమై ।
నానాయోగి హృదంతరాళగతమై నాలోపలఁ వెల్గు ని ।
త్యానందాత్ముని పాదపద్మములునే ధ్యానింతు నెల్లప్పుడున్॥ 80

తా. ఆనందమునకు స్థానమైనదియును, అఖండమయమైనదియును, అజ్ఞానమును పోఁగొట్టునదియును, జ్ఞానమును ప్రకాశింపఁజేయు నదియును, వివేకజ్ఞులకుఁ దెలియునదియును, మంత్ర లయ హఠ రాజయోగులహృదయ కమలములం దుండునదియును, నా హృదయంబునందును ప్రకాశించుచుండు నదియును, నిత్యానందమై యుండునదియును, అగు పరమాత్మయొక్క పద కమలములను నేను ఎల్లప్పుడును ధ్యానము చేయుదును.

వి. ఇందలి విశేషణములను విమర్శింపఁగా నిర్గుణ పరబ్రహ్మమని యేర్పడుచున్నది. అయినను ఇట్టి లక్షణములుగల సచ్చిదానందమూర్తి పదకమలములను ధ్యానించెద ననుటచే హరిహరులగు సగుణ బ్రహ్మమును స్తుతించినట్లు స్ఫురించును. ఆ పరమాత్మ సగుణ నిర్గుణరూపుఁడై యున్నాఁడనుట శాస్త్రసమ్మతమని దెలియఁదగును. ఎట్లన,

"శ్లో॥ నారాయణః శివోవిష్ణు శంకరః పురుషోత్తమః।
ఏతేషు నామభిర్బ్రహ్మ పరంప్రోక్తం సనాతనం॥"

తా. నారాయణుఁడు, శివుఁడు, విష్ణువు, శంకరుఁడు, పురుషోత్తముఁడు, అను పేర్లచేత వ్యవహరింపఁబడువాఁడు శాశ్వతమైన పరబ్రహ్మమే అని వరాహ పురాణమునందును;

"శ్లో॥ ఆకాశం వ్యాపకం యద్వదిదం బ్రహ్మ తథాస్మృతం॥"

తా. ఆకాశ మెట్లు సర్వత్ర వ్యాపించియున్నదో, అట్లు ఈ బ్రహ్మము సర్వత్ర వ్యాపించియున్నది. అని శివపురాణమునందును;

"శ్లో॥ ఏతత్సర్వ మిదంవిశ్వం జగదేతచ్చరాచరం।
పరబ్రహ్మ స్వరూపస్య విష్ణోశ్శక్తి సమన్వితం॥"

తా. చరాచరములణఁగిన ఈ ప్రపంచము, పరబ్రహ్మమైన విష్ణువుయొక్క శక్తితో (అనఁగా విష్ణుమాయతోఁ) గూడియున్నది. అని విష్ణుపురాణమునందును;

"శ్రుతి॥ అపాణి పాదోజవనో గృహీతా।
పశ్యత్యచక్షు స్సశ్రుణోత్యకర్ణః।
సవేత్తివేద్యం నచతస్యాస్తి వేత్తా।
తమాహురగ్ర్యం పురుషం మహాంతం॥"

తా. ఆబ్రహ్మము చేతులులేక గ్రహించుచున్నది. కాళ్లులేక నడుచుచున్నది. కన్నులులేక చూచుచున్నది. చెవులులేక వినుచున్నది. అది సర్వమును తెలిసికొనుచున్నది. దానిని (ఆబ్రహ్మమును) తెలిసికొనుట కష్టము. దానికి వేఱేలక్షణము చెప్పుటకు సాధ్యముకాదు గాన ఆదిపురుషుఁడని చెపుచునారు. అని శ్వేతాశ్వతరోపనిషత్తునందును;

"శ్లో॥ ఏకఏవ త్రిధారూపం గృహ్ణాసి కుహనాన్వితః॥"

తా. నీవు ఒక్కఁడవుగా నుండినప్పటికిని ప్రకృతితోఁ (ఈశ్వరుఁడగు ఆ పరమాత్మ, మాయతోఁ) గూడి మూఁడువిధములైన (బ్రహ్మ, విష్ణు, శివ) స్వరూపములను గ్రహించుచున్నావు. అని శివపురాణమునందు జెప్పఁబడియున్నది.

తే॥ మద్గురుఁడె ధాత్రిగురుఁడగు మధురవాణి ।
సాధువర్యుఁడె యీజగన్నాథుడతివ ।
నాదులోనాత్మ భూతాత్మ నళినసేత్రి ।
వినవె యాయాత్మ కే మ్రొక్కి వినుతిసేతు॥ 81

తా. ఓ కాత్యాయనీ! కమలనేత్రీ, వినుము నాగురుఁడైన పరమాత్మయే ప్రపంచమున కంతటికిని గురుండగును. ఆ పరమాత్ముండగు సాధువర్యుఁడె ఈజగంబునకు నాథుండగును. నాహృదయంబునందు వసించు పరమాత్మయే సకల ప్రాణులయందుండు పరతత్త్వవస్తువు. ఇట్టి పరమాత్మకు నేను నమస్కరించి స్తోత్రము చేసెదను.

వి. శ్లో॥ మన్నాథ శ్రీజగన్నాథో మద్గురు శ్రీజగద్గురుః ।
మమాత్మా సర్వభూతాత్మా తస్మైశ్రీ గురవేనమః॥

అను ప్రమాణమును గ్రహించునది

మఱియు ఈ పద్యమునందు పరమేశ్వరుఁడు తనయొక్క గురువే లోకగురువని చెప్పియున్నాఁడు. ఏలయన, శివుఁడు తారక మంత్రోపాసకుఁడని ఉపనిషత్తులందుఁ జెప్పఁబడియున్నది ఇది యునుంగాక, పరమశివుఁడు సర్వ స్వతంత్రుఁడై పరబ్రహ్మమై యుండియు తనకు నొక్కగురువును దైవము నున్నాఁడనుటకుఁ గారణమే మనఁగా.—

"శ్లో॥ యద్యదా చరతిశ్రేష్ఠ స్తత్తదే వేతరోజనః ।
సయత్ప్రమాణంకురుతే లోక స్త దనువర్తతే॥"

తా. శ్రేష్ఠుండగు పురుషుఁడు ఏయేకార్యములను చేయుచున్నాఁడో, ఇతరుఁడును ఆయాకార్యములను అనుష్ఠించును. ఏపురుషుఁడు దేనిని శాస్త్రసమ్మతమని చేయునో, దానిని లోకమంతయుఁ జేయును. కాఁబట్టి పరమశివుఁ డాచరించునట్లే ఇతరులును ఆచరించి ముక్తినొందవలయును. అను భగవద్గీతాభిప్రాయమును పరమశివుఁడు భావించి లోకుల నిమిత్తమై తాను సద్గురువు నాశ్రయించి పరమాత్మధ్యానము చేయుచున్నాఁడని యెఱుంగునది

ఉ॥ శ్రీగురు పాదపద్మముల చింత మెలంగెడి ముక్తికాంత, స।
ద్భాగవతార్థవేత్తల సభాస్థలియందును సంచరించు ది।
వ్యాగమ శాస్త్రపాఠకుల వక్త్రములోఁ బురుషార్థతత్త్వ వి।
ద్యాగరిమంబునన్ మెలఁగు, ధన్యకు మ్రొక్కినుతింతు వేడుకన్॥

తా. శ్రీగురుమూర్తి పదకమలములయొద్ద మెలఁగుచుండు నట్టిదియును, భగవంతునియొక్క దివ్యచరిత్రములను బోధించునట్టి పురాణరత్నమైన రహస్యమును దెల్సిన మహామహులు పేరోలగం బుండుచోట సంచరించునట్టిదియును, వేదశాస్త్రములను పఠించునట్టి వారి వక్త్రములయందు మెఁలఁగునదియును, వేదాంతశాస్త్రముచే నెఱుంగంబడినదియును, పరమస్థానము నొసంగు పరమాత్మ తత్త్వమును శ్రేష్ఠమునైనదియును ధన్యాత్మయును అగు మోక్షలక్ష్మికి ప్రేమతో నమస్కారమొనర్చి స్తుతిచేయుదును.

వి. చిత్కళయే ముక్తికాంతయని యెఱుంగునది.

క॥ ఎక్కడ గురువరుఁడుండిన।
నక్కడనే కాశి గురుపదాంబుజ జలముల్।
చక్కని గంగానది యగుఁ।
దక్కిన కార్యముల మనసు తగులఁగనేలా॥ 83

తా. పార్వతీ! ఎచ్చట ఆచార్యుఁడుండునో అచ్చటనే కాశీపురియుండును. గురువర్యుని పాదప్రక్షాళన జలమే దివ్యమైన గంగానదియగును. ఇతరములయందు అనఁగా తక్కిన క్షేత్రతీర్థముల యందు మనస్సును ప్రవేశింపఁజేయనేల? యని భావము (అనఁగా ప్రవేశింపఁ జేయకూడదు.)

వి. శ్లో॥ అప్సుదేవో మనుష్యాణాం దివిదేవో మనీషిణాం।
కాష్ఠలోష్ఠేషు మూఢానాం యుక్తస్యాత్మని దేవతా॥

తా. సాధారణమైన మనుష్యులకు గంగాది పుణ్యతీర్థములు దైవములగును. కొంచెము తెలివిగలవారలకు స్వర్గమునందుండు యింద్రాది దేవతలు దైవములగును. మూఢులకు కట్టెలయందును లోహములయందును దైవముండును.

ఇట్లు చెప్పఁబడుటచేత సమస్తమునకంటె గురువే శ్రేష్ఠమనియును, యోగికి తన ఆత్మయే దైవమనియును భావము. ఇట్లు శాతాతపస్మృతియందుఁ జెప్పఁబడియున్నది. కావున అట్టి ఆత్మను దెలిసికొన్న యోగియగు గురువుకంటె శ్రేష్ఠమైన దేదియును లేదని భావము.

క॥ ఘనుఁడైన గురువు నెఱిఁగిన।
మనుజునకును నితరమైనమాటలు నేలా।
ఘనదేవమయుఁడు గురుఁడని।
యనవరతము గొలుచుకంటె నధికముగలదే॥ 84

తా. ఓగౌరీ! చిద్ఘన పరమాత్మస్వరూపుఁడగు గురువును దెలిసికొన్న మనుజునకు ఇతరమైన మాట లెందులకు? (సమస్తమును గురు డెఱిఁగించునని యర్థము) పరమ పురుషుఁడు గురుమూర్తియే యని తెలిసికొని ధ్యానించుటకంటె శ్రేష్ఠమైన దేదియును లేదు.

వి. శ్లో॥ గురురేవ పరోధర్మో గురురేవ పరాగతిః ॥

తా. గురువు ఒక్కఁడే శ్రేష్ఠమైనధర్మము. గురువు ఒక్కఁడే శ్రేష్ఠమైన (ఉత్తమమైన పదవి) అని శాట్యాయనీయోపనిషత్తునందు చెప్పఁబడి యున్నది.

క॥ వ్యాపితమై సర్వాంత।
స్థాపితమై సకలలోక సచరాచర చి।
ద్రూపమునై వెలిఁగెడి గురు।
రూపునకుఁ మ్రొక్కి యాత్మలోఁ బ్రార్థింతున్॥ 85

తా. సకల బాహ్య ప్రదేశములయందును సకలాంతర స్థలములయందును వ్యాపించి యుండునదియును చరాచరమైన ప్రపంచమునందు చిద్రూపమై ప్రకాశించునదియును అగు సద్గురు రూపుఁడగు పరమాత్మకు నమస్కరించి మనంబునందు ధ్యానించెదను.

క॥ చేతనమై శాశ్వతమై
భూతాంతర్యామియై నభోతీతమునే।

ఖ్యాతిగను నాద బిందు క ।
ళాతీతమునై వెలుంగు నాత్మ నుతింతున్। 86

తా. ఓపార్వతీ! చేతనమైనదియును, నిత్యమైనదియును, సకల భూతాంతర్యామియైనదియును, ఆకాశమున కతీతమైనది యును, నాదబిందు కళాతీతమైనదియును, నై ప్రకాశించు పరమాత్మను (పరబ్రహ్మను) స్తుతించెదను.

వి. పరమాత్మ చేతనమైనది. అనఁగా చైతన్యము, చిన్మాత్రము, జ్ఞానస్వరూపము, పరబ్రహ్మము. యోగవాసిష్ఠమునందు.—

"శ్లో॥ ఆత్మావిశుద్ధచైతన్య స్వరూపశ్శాశ్వతోవిభుః ।
నిర్వికారస్స్వయంజ్యోతిః స్వభావోఽర్క ప్రకాశవత్ ॥"

తా. పరిశుద్ధమైన జ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడును, భూత భవిష్య ద్వర్తమానములను త్రికాలములయందును (శాశ్వతమై) నాశము లేక యుండువాఁడును, సకల వస్తువులయందును(సర్వ భూతాంతర్యామియై) యుండువాఁడును, రూపభేదము నొందక యుండువాఁడును, ఇతరములచే ప్రకాశ మొందక తనకుఁ దానే ప్రకాశించువాఁడును, అనఁగా అన్నిటిని ప్రకాశింపఁజేయువాఁడును, సూర్య తేజస్సువలె ప్రకాశమానుఁడునై యుండువాఁడును, పరమాత్మయని తెలియఁదగును.

ఆకాశమునకంటె అతీతమైనది. అనఁగా, వాసిష్ఠమునందు.—

"శ్లో॥ ఆకాశాదపివిస్తీర్ణ శ్శుద్ధస్సూక్ష్మోవ్యయశ్శివః ॥
యఆత్మానకథంరామ జాయతే మ్రియతేఽథవా॥"

తా. ఓరామా! పరబ్రహ్మము ఆకాశమునకంటె వ్యాపించి యుండునది. పరిశుద్ధమైనది, సూక్ష్మమైనది, శాశ్వతమైనది, మంగళ ప్రదమైనది, అదియెట్లుపుట్టును? ఎట్లునశించును? అనఁగా జనన మరణాదులును నాశమును లేని నిత్యవస్తువని యభిప్రాయము.

నాద బిందు కళాతీతమనఁగా,

1. నాదము=ఓంకారము. లేక శబ్దగుణము. అదియే పరా, పశ్యంతి, మధ్యమ అను వాక్కు. అనఁగా నాడులయందు వాయువు సంచరించునపుడు కల్గునట్టి ధ్వని. అదే ప్రణవమందు పుట్టిన ధ్వని.

రేచక పూరక కుంభ కాదులవలనఁ బుట్టిన వాయువు లయమగు పర్యంతము ఆనాదముండును. నాదము నిరాలంబమైన బ్రహ్మమందు లయమగును. రేచక పూరక కుంభ కాదులవలనఁ బుట్టిన వాయువు మనస్సుతో సంబంధించి యున్నది. మనస్సును వృత్తిరహితముగాఁ జేసినచో (చిత్తైకాగ్రత చేసినచో) ఆ వాయువు వెంటనే లయ మగును.

2. బిందువు=ఓంకారముయొక్క అలక్ష్యార్థరూపమైన తురీయ పదము. అనఁగా మనస్సునకు అగ్రమునం దుండునదియే బుద్ధి. అదే బిందు వనఁబడును. ఇదియే జాగ్రదవస్థయందు బుద్ధియనియు, సుషుప్త్యవస్థయందు సర్వేంద్రియ లయస్థానమైన అజ్ఞానమనియును వ్యవహరింపఁబడును.

3. కళ=(ప్రాణమునకు అగ్రముగ నుండునదియే కళ.) ఓంకారముయొక్క అకారాది మాత్రయగు పరా అను వాక్కుయొక్క అంశము. ఇది శబ్దముయొక్క అవయవము. అనఁగా బుద్ధియందు ప్రకాశించునట్టి పరబ్రహ్మప్రతిబింబము కళ యనఁబడును. అదియే చిత్కళ.

"శ్లో॥ మనోऽగ్రే వసతేబిందుః ప్రాణాగ్రే వసతే కళా ।
ఉభయోర్లీయ తే నాదం లయ ఇత్యుచ్యతే బుధైః॥"

తా. మనస్సున కగ్రముగానుండునది బిందువు అనఁబడు బుద్ధి. ప్రాణమున కగ్రముగా నుండునది కళ. ఈ బిందువును కళ యును లీనమైనప్పుడే నాదము లయ మగును. ఇట్టి నిష్కళయే పర మాత్మ స్వరూపము. అని తెలియునది.

మ॥ గురుకారుణ్యలసత్ప్రతాపమహిమన్ గోర్కెల్సదామాని శ్రీ ।
హరిరూప ప్రతిమప్రభావయుతులై యతీణమా నాత్మ స ।
త్కరమై సర్వమునంటివెల్గునని యేధన్యాత్ము లాసింతురా ।
పురుషారాధ్యుని పాదపద్మముల నేఁ బూజింతునిష్టార్థమై॥ 87

తా. ఓపార్వతీ! ఏసద్గురువుయొక్క కరుణాకటాక్ష మహిమ చేత, (జ్ఞానోపదేశ విశేషము చేత) కోర్కులను మాని (మోక్షేచ్ఛ తప్ప తక్కిన కోర్కులను మాని సద్గురూపదేశమహిమచేత) విష్ణు

స్వరూప సమానమైన ప్రభావముతోఁ గూడినవారై శాశ్వతమై నట్టి ఆ పరమాత్మ సర్వత్ర వ్యాపించియుండునని యేపుణ్యాత్ములు (తెలిసికొని) ఆశ్రయింపఁ గోరుదురో, యట్టి పురుష శ్రేష్ఠుఁడైన సద్గురువర్యుని పాదపద్మములను ఇష్టార్థసిద్ధికొఱకు నేను పూజించు వాఁడను.

వి. "శ్లో॥ గురుదేవో మహాదేవో గురుదేవ స్సదాశివః ।
గురుదేవా త్పరంనాస్తి తస్మైశ్రీ గురవేనమః॥"

తా. గురువే మహాదేవుఁడును సదాశివుఁడునై యున్నాఁడు. గురువుకంటె దేవుఁడు వేఱేలేఁడు. కాఁబట్టి అట్టిగురువునకునమస్కరించెదను. అని ఆగమమునందుఁ జెప్పఁబడి యుండుటను ఇచ్చట అనుసంధించునది.

క॥ గురుఁడే తల్లియుఁ దండ్రియు ।
గురుఁడే బాంధవుఁడు హితుఁడు గురుఁడే హరుఁడుౘ ।
గురుమూర్తి కన్న నెక్కువ ।
పరిపూర్ణుఁడు లేఁడటంచుఁ బ్రార్థన సేతున్॥ 88

తా. పార్వతీ! సద్గురువర్యుఁడే తల్లియును, తండ్రియును, బాంధవుఁడును, హితుఁడును, మిత్త్రుఁడును, శివుఁడును నై యున్నాఁడు; కావున గురువుకంటె శ్రేష్ఠుఁడైన పరిపూర్ణుఁడు లేఁడని యెంచి ప్రార్థించెదను.

వి. శ్లో॥ గురుఃపితా గురుర్మాతా గురుర్బాంధవ ఏవచ ।
గురుర్దేవాత్పరంనాస్తి తస్మైశ్రీ గురవేనమః॥

తా. గురువే తండ్రియు, తల్లియు, బాంధవుఁడును, నై యున్నాఁడు. కావున గురువుకంటె శ్రేష్ఠమైన దేదియును లేదు. అట్టి గురునకు నమస్కరించెదను.

క॥ నాశనరహితుఁ డనంతుఁడు ।
నైశిష్యకృతాపహరుఁడగుచుౘ దత్త్వో ।
ల్లాసియయి భక్తియోగము ।
గాసిల్లక బోధచేయు ఘనుని నుతింతున్॥ 89

తా. నాశమొందనివాఁడును (శాశ్వతుఁడును), అనంతుఁడును, (అంతములేనివాఁడును), శిష్యు లొనర్చు పాపములను పరిహరించువాఁడు, తత్త్వమందు క్రీడించువాఁడును, భక్తియోగమును బోధించువాఁడును అగు చిద్ఘనుఁడగు శ్రీ గురుమూర్తిని స్తోత్రము చేయుదును.

తే॥ ఖండమును గాక మండలాకారమగుచు।
నరసి సచరాచరంబుల నావరించి।
యున్న పరమాత్ముఁ గనుఁగొన్న యోగమూర్తి।
పాదములకేను మ్రొక్కెదఁ బంకజాక్షి॥ 90

తా. గౌరీ! ఖండము గానిదియును, మండలాకారమైనదియును, చరాచరంబులం దావరించి యున్నదియును అగు పరమాత్మను దర్శించిన యోగమూర్తియగు సద్గురువర్యుని పాదకమలములకు పూజనేయువాఁడను.

వి. శ్లో॥ అఖండంసచ్చిదానంద మవాఙ్మానసగోచరం।
ఆత్మానమఖిలాధార మాశ్రయేఽభీష్టసిద్ధయే॥"

తా. పరిపూర్ణుఁడును, సత్తు (స్థితి) చిత్తు (జ్ఞానము) ఆనందము అను నివియే స్వరూపముగాఁ గలవాఁడును, వాక్కునకును మనస్సునకును గోచరింపనివాఁడును, సమస్తమునకు ఆధారమైనవాఁడును, అగు పరమాత్మను ఇష్టసిద్ధికొఱకు ఆశ్రయించు చున్నాఁడను. అనియిట్లు పరమాత్మను స్తుతించిన విశేషణములచేతనే స్వగురువును స్తుతించి యున్నాఁడని తెలియవలయును.

క॥ హరి నేనును బ్రహ్మాదులు।
పరికింపఁగ గురులటంచు భావించియు నే।
మరకితరము మఱచినయా।
పురుషుని పదపద్మములను బూజింతుఁ జుమీ॥ 91

తా. విష్ణుమూర్తియును, నేనును (శివుఁడును) బ్రహ్మ మొదలగు దేవతలును, విచారించి గురువులని యెంచి విస్మృతినొందక ఇతరమును మఱచియున్నట్టి పురుషుని, అనఁగా గురువును, లేక

త్రిమూర్తులను ఏకరూపమైన పరబ్రహ్మమే యని భావించి యుండు నట్టి పుణ్యమూర్తి పాదపద్మములను పూజింతును.

వి. శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవ స్సదాశివః।
నగురోరధికఃకశ్చిత్ త్రిషులోకేషువిద్యతే।
దివ్యజ్ఞానోపదేష్టారం దేశికం పరమేశ్వరం।
పూజయేత్పరయాభక్త్యా తస్యజ్ఞాన ఫలంలభేత్ ॥

తా. గురువే బ్రహ్మయును, విష్ణువును, సదాశివుఁడును నై యున్నాఁడు. మూఁడులోకములయందును గురువుకంటెను శ్రేష్ఠమైన వాఁడెవఁడును లేఁడు. దివ్యజ్ఞానమును ఉపదేశించువాఁడును, పరమేశ్వరుఁడును అగు గురువును అతిభక్తితో పూజింపవలయును. ఇట్టి యోగశిఖోపనిషద్వాక్యమును ఇట అనుసంధించునది.

తే॥ శ్రుతిశిరోరత్నభూషణాన్వితము నగుచు।
నీరదాభ్రము పోలిక నిండివెలుఁగు।
చుండు వేదాంతకమల సూర్యుండునైన।
గురునకే మ్రొక్కి వినుతింతుఁ గుందరదన ॥ 92

తా. ఓపార్వతీ! వేదాంతములకు రత్నభూషణప్రాయమైన వాఁడును, మేఘాకాశమునందుండు వేదాంతకమలమునకు సూర్యుండైనవాఁడును అగు పరమాత్ముండైన గురువర్యునకు నేను నమస్కరించి స్తుతించెదను.

వి. శ్లో॥ గురురేవపరంతత్త్వం ప్రకాశయతి దేహినాం।
కోవాసూర్యం వినాలోకే తమసో వినివర్తకః ॥

తా. గురువే శ్రేష్ఠమైన తత్త్వము; సూర్యుఁడు లేనిచో చీకటి యెట్లు నివర్తికాదో, అట్లు గురువులేనిచో జీవులు ప్రకాశింపనేరరు. అనుప్రమాణము నిచ్చట అనుసంధించునది.

క॥ జ్ఞానమనుశక్తి నెక్కియు।
నానాతత్త్వార్థ భూషణము లెసఁగఁగ ని।
త్యానందపదవిఁ జేర్చెడు।
వానిపదాబ్జముల భక్తి వదలక తలఁతున్ ॥ 93

తా. పార్వతీ! జ్ఞానమనెడి శక్తిని అధిరోహించి, వివిధములైన తత్త్వములనెడి భూషణములు ప్రకాశింపఁగా శాశ్వత బ్రహ్మానందస్థానమును జేర్చునట్టి సద్గురువర్యుని పదకమలములను మిక్కిలి భక్తితో తలంచెదను.

వి. శ్లో॥ విజ్ఞాననావం పరిగృహ్యకశ్చిత్ ।
తరేద్యదజ్ఞానమయం భవాంబుధిం ।
జ్ఞానాసినా యోహి విచ్ఛిద్యతృష్ణాం ।
పరంపదం యాతి సఏవ ధన్యః ॥

తా. ఎవఁడు విజ్ఞానమనెడి ఓడనెక్కి, అజ్ఞానమయమైన సంసార సాగరమును దాఁటుచున్నాఁడో, ఎవఁడు జ్ఞానమనెడి ఖడ్గముచేత ఆశను ఛేదించి శ్రేష్ఠమైన పదమును (మోక్షమును) బొందునో, వాఁడే ధన్యుఁడు. అను శంకరాచార్య స్వాములవారి వాక్యమును ఇట అనుసంధించునది.

తే॥ గరిత నిర్మల నిత్య ప్రకాశుఁడగుచు ।
జగములోపల వెలిలోన సంచరించు ।
నాత్మఁ గనుగొన్న పూర్ణ పదాబ్జములకు ।
ఓన్నమో యంచు మ్రొక్కెదు నొనరనెపుడు॥ 94

తా. ఓపార్వతీ! నిర్మలుఁడును, శాశ్వత ప్రకాశమానుఁడును, ప్రపంచము లోపలను వెలుపలను సంచరించువాఁడును అగు పరమాత్మను దర్శించిన సంపూర్ణుండును అగు సద్గురుస్వామికి ఓన్నమో (సకలదేవతలకు స్థానమైన బ్రహ్మస్వరూపుఁడా! నీకు మ్రొక్కెదను.) అని నిరంతరమును నమస్కరించెదను.

వి. ఇచ్చట గురువర్యుని మహిమను మరల విస్తరించి తెలియఁజేసి స్తుతించియున్నాఁడు.

శ్లో॥ సర్వాకారం సర్వమసర్వం సర్వనిషేధావధిభూతం ।
యత్తత్సత్యం శాశ్వతమేకమనంతంశుద్ధంబుద్ధంతత్త్వమసిత్వం॥

తా. (గురువు శిష్యునింజూచి) ఏది సర్వరూపమును, ఏది సర్వముగానిదియును, నేతినేతి యని సమస్తమును నిషేధింపఁగా మిగిలి యుండునదియును, సత్యమైనదియును, శాశ్వతమైనదియును,

ఏకమై యుండునదియును, అంతము లేనిదియును, నిర్మలమైనది యును, బోధరూపమైనదియును, అగు తత్త్వస్వరూపము (పర బ్రహ్మము) నీవైయున్నావు. అను నిట్టి గురువాక్యప్రకారము, శిష్యుఁడును అట్టి గురుస్వరూపుఁడై యున్నాఁడు. ఈ యభిప్రాయమును శిష్యుఁడు మనంబున నుంచికొని సద్గురువునకు నమస్కరించినాఁడని యెఱుంగునది.

క॥ ఏమార్గంబునను గురు।
స్వామికి సరిరా దదెట్టిజాడయొ యన్నన్ ।
శ్రీమత్కర సుజ్ఞానము ।
చే మదితగు లాత్మకన్న చెలువము గలదే ॥ 95

తా. ఏప్రకారముగఁ జూచినప్పటికిని గురువర్యునకు సమత్వమైనవారు ఎవ్వరును లేదు. సంపత్కరమైన సుజ్ఞానముచేత మనస్సునందు పరమాత్మాభిలాష కల్గినతర్వాత, అంతకంటె విశేషమైన సంపద వేఱేమి యున్నది? అనఁగా ఏదియు లేదనుట.

వి. శ్లో॥ గురురేవ పరంబ్రహ్మ గురురేవ పరంధనం।
గురురేవ పరావిద్యా గురురేవ పరాయణం।
గురురేవ పరః కామో గురురేవ పరాగతిః।
యస్మాత్తదుపదేష్టాసౌ తస్మాద్గురుతరో గురుః।
అర్చనీయశ్చ వంద్యశ్చ కీర్తనీయశ్చ సర్వదా ॥

తా. ఓగౌరీ! గురువే పరబ్రహ్మము, గురువే మహాధనము, గురువే శ్రేష్ఠమైనవిద్య, గురువే మహాప్రయోజనము, గురువే పొందఁదగినవాఁడు, గురువే పూజింపఁదగినవాఁడు, గురువే నమస్కరింపఁ దగినవాఁడు, గురువే పొగడఁదగినవాఁడు, గురువే ఉపదేశింపఁదగినవాఁడు, అన్నిటికంటెను గురువే శ్రేష్ఠమైనవాఁడని భావింపఁ దగినవాఁడు.

ఆ॥ గురువుకంటె నిహము పర మరయంగ లే।
దంచు శ్రుతులయందు నెంచఁబడును।
గానఁ ద్రికరణముల కడువడి సద్గురు।
పదములను దలంతు పంకజాక్షి ॥ 96

తా. ఓ పార్వతీ! విచారింపఁగా, గురువుకంటె నిహమును పరమును వేఱేలేదు. ఇది శ్రుతిసమ్మతము కావున. త్రికరణశుద్ధిగా (మనోవాక్కాయములయందు నిర్మలుండనై) ముక్తిప్రదాతయగు గురువర్యుని పాదపద్మములను నేను తలంతును

వి. శ్లో॥ దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్త్వదర్శనం।
దుర్లభాసహజావస్థా సద్గురోః కరుణాంవినా॥

తా. సద్గురువర్యుని కరుణలేనియెడల విషయత్యాగమును పరమాత్మ దర్శనము, బ్రహ్మనిష్ఠయును, దుర్లభములగును. ఇవి యన్నియు సద్గురుకృపచే కల్గును.

మఱియును,

శ్లో॥ గురోశ్చ గురవస్సర్వే పూజనీయావిశేషతః।
గురుదారసుతాదౌచ గురువద్వృత్తి మాచరేత్॥

తా. తన గురువునకు గురువైనయట్టి ఆచార్యులయందును, తనఆచార్యుని పుత్రపౌత్రాదులయందును స్వాచార్యునియందు వలె (భక్తితో) వర్తింపవలయును. (నడుచుకొనవలయును).

చ॥ అనవిని నెవ్వరైన గురునాత్మనునిల్పి భజించినంతనే।
ప్రవిమలజ్ఞానమే తనకుఁ బ్రాప్తమునా శివ కేశవాదులన్।
దవిలి భజించిరేని పరతత్త్వరహస్యమునొంది ముక్తివై।
భవముననోలలాడుదురు భవ్యుఁడనై నుతియింతువారలన్॥ 97

తా. పార్వతీ! వినుము. పైనచెప్పినయట్లు తెలిసికొని ఎవ్వరైనను సద్గురువును మనస్సునందు నిలిపి ధ్యానించినయెడల తత్త్వజ్ఞానము కలుగును (గురువును ధ్యానించునట్లే) పరమశివుని గాని, మహావిష్ణువునుగాని, ఇంకను ఇతరములగు గణేశ సుబ్రహ్మణ్యాది మూర్తులనుగాని ధ్యానించినచో పరమాత్మతత్త్వమునొంది మోక్షవైభవమున నోలలాడుదురు. (కావున నేను ఇట్టి భగవద్భక్తులకు) మక్కిలి ప్రియముగలవాఁడనై వారలను స్తోత్రము చేయుదును.

వి. శ్లో॥ యస్యదేవే పరాభక్తి ర్యథాదేవే తథాగురౌ।
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥

తా. ఏపురుషునకు పరమాత్మయందు భక్తియును, ఆ పరమాత్మయందలి భక్తివలెనే, సద్గురువర్యునియందు భక్తియును కలదో, అట్టి మహాత్మునికి పరమరహస్యములు బుద్ధియందు ప్రకాశించుచున్నవి.

క॥ బహుజని పూజాఫలమున।
మహిసుజ్ఞానాగ్ని ప్రబలి మంగళకరమై।
దహియించుఁ గర్మబంధము।
లహరహమాగురుని పదము లర్చించెదనే॥ 98

తా. ఓగౌరీ! భూమిలో అనేక జన్మములయొక్క గురుపూజాఫలముచే సుజ్ఞానమను అగ్ని ప్రజ్వలించి కర్మబంధములను మంగళప్రదముగా దహించును. కావున నేను ఎల్లపుడును గురుచరణ కమలమును పూజించెదను.

వి. శ్లో॥ అనంత జన్మసంప్రాప్త కర్మేంధనవిదాహినే।
జ్ఞానానల ప్రభావేన తస్మైశ్రీ గురవేనమః॥

తా. జ్ఞానాగ్ని ప్రభావముచేత అనేక జన్మములనుండి సంపాదింపఁబడినట్టి కర్మములనెడి కట్టెలను దహించువాఁడైనట్టి శ్రీగురుమూర్తికి నమస్కారము చేయుచున్నాఁడను. అను ప్రమాణము నిట అనుసంధించునది.

శ్లో॥ జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతేర్జున।
అను భగవద్గీతాభిప్రాయమును గ్రహించునది.

తే॥ గురువుకంటెను నధికుఁ డిద్ధరను లేఁడు।
పరఁగ గురుభక్తికంటెను పరము లేదు।
అవని గురుమూర్తికంటె ధ్యానంబు లేదు।
నాస్తి తత్త్వం గురోః పర మనఁగ వినవె॥ 99

తా. ఓపార్వతీ! వినుము. గురువుకంటె శ్రేష్ఠుఁడు లేఁడు గురుభక్తికంటె మోక్షము లేదు, గురుమూర్తికంటె ధ్యానము లేదు, గురువుకంటె పరమార్థము లేదు.

శ్లో॥ దత్త్వాతుదక్షిణాంతస్మై యథాశక్తి యథావిధి।
తమర్చయే ద్యథాకాలం హితంచాస్య సమాచరేత్॥

తా. శిష్యుఁడు ఆచార్యునకు శక్తికిఁ దగినట్లు శాస్త్రోక్త ప్రకారముగా దక్షిణనొసంగి తగిన కాలములయందు ఆరాధింప (పూజింప) వలయును. గురువునకు హితమైన కృత్యములను (శుశ్రూష మొదలగువానిని) చేయవలయును.

శ్లో॥ నగురోరధికంసాధ్యం నగురోరధికంతపః ।
నగురోరధికం ధ్యానం నాస్తితత్త్వం గురోఃపరమ్॥

తా. అనుప్రమాణము నిట అనుసధింప వలయును.

వ॥ అని పలుకుచున్న భావంబు గ్రహించి కృతార్థుండు గావలయు॥

తా. సులభము.

సీ॥ ఏస్థలంబునగురు నెలమిదర్శించినఁ
గామాది షడ్వర్గ గర్వమణఁగు ।
నేదిక్కునను గురుపాదము ల్సేవింప
సర్వదుఃఖాదులు సమసిపోవు ।
నెచ్చటగురునకు నచ్చుగామ్రొక్కిన
భవబంధములనెల్లఁ బాఱఁద్రోలు ।
నెప్పుడు గురువరుఁ డెలమిబోధించినఁ
బరిపూర్ణనిత్యాత్మ ప్రబలివెల్గు॥
తే॥ ముక్తిసిద్ధించు సన్మార్గ యుక్తిగల్గు ।
నాత్మ తానని యితరంబు లన్నిమఱచు ।
నేర్పు గలిగించు భ్రమలను నిగ్రహింపఁ ।
జేయు సద్గురుపాదరాజీవ మహిమ॥ 101

తా. ఓపార్వతీ! ఏచోట గురువర్యుని దర్శించినప్పటికిని కామ క్రోధ లోభ మోహ మదమత్సరములనెడి శత్రువర్గము లాఱును నశించును. ఏదిక్కునందు సద్గురు పాద కమలంబులను సేవించినప్పటికిని సకలమైన దుఃఖములును నశించును. ఎచ్చట గురువునకు నమస్కరించినను భవబంధములు (జననదుఃఖములు) తొలఁగిపోవును. గురూత్తముఁడు బోధించినమాత్రమున పరబ్రహ్మము చక్కఁగా ప్రకాశించును ఇదియునుంగాక మోక్షము కల్గును సన్మార్గమునందుఁ బ్రవర్తింపఁజేయును. అహం బ్రహ్మాస్మి

యను బోధము కల్గును. ప్రపంచ వాసనలన్నియు మఱచిపోవును. మంచి తెలివిని కల్గించును. భ్రమలన్నియు నివర్తియగును. ఇట్టి మహోత్కృష్ట పదవులన్నియును సద్గురువర్యుని పదకమల సేవ వలనఁ గల్గును.

వి. భ్రమలు అయిదు విధములు.

1. భేదభ్రమము.— ప్రపంచము వేఱు, ఈశ్వరుఁడు వేఱు, అను నిత్యాదిభేదములు తోఁచుట.

2. కర్తృత్వభ్రమము —అంతఃకరణధర్మములైన కర్తృత్వ భోక్తృత్వములు ఆత్మయందు ప్రతీతియగుట.

3. సంగభ్రమము.—దేహాదులయందు నేను అనుటయును, గృహాదులు నాదియనుటయును, అనఁగా సజాతీయ విజాతీయ స్వగత వస్తువులయందుండు బంధ ప్రతీతిగల్గి యుండుట.

4. వికారభ్రమము.—పాలువికారమే మజ్జిగ; అనునట్లు పరమాత్మ వికారమే ప్రపంచమని తలంచియుండుట.

5 సత్యత్వభ్రమము.—బ్రహ్మమునకంటె భిన్నముగాని జగత్తును, బ్రహ్మ భిన్నముగా తలంచుట.

శ్లో॥ విచారణీయా వేదాంతా వందనీయో గురుఃసదా।
గురూణాం వచనం పథ్యం దర్శనం సేవనం నృణాం॥

తా. వేదాంతము విచారింపఁదగినది. గురువు ఎప్పుడును పొగడఁదగినవాఁడు. గురువుయొక్క వాక్యమును, గురు దర్శనమును, గురుసేవనమును, మనుజునకు ఎల్లప్పుడును పథ్యమైనది. అనఁగా హితమైనది.

శ్లో॥ గురుర్బ్రహ్మ స్వయంసాక్షాత్ సేవ్యాబంధోముముక్షుభిః।
నోద్వేజనీయ ఏవాయం కృతజ్ఞేన వివేకినా॥

తా. గురువు సాక్షాత్ బ్రహ్మస్వరూపమును ముముక్షువులచే సేవింపఁ దగినవాఁడును నై యున్నాఁడు. కృతజ్ఞుఁడైన (సచ్ఛిష్యుఁడైన) వివేకవంతునిచేత ఇతఁడు త్యజింపఁదగినవాఁడు కాఁడు అనఁగా నిరంతరమును గురుభక్తి చేయవలయునని భావము.

క॥ హరి హర పద్మభవాదులు।
పరిపూర్ణాద్వైత బ్రహ్మభావం బెల్లన్
గురుమూర్తి మహిమ యని మది।
యఱలేకయె తలఁచువారి యడుగులఁ దలఁతున్॥　102

తా. ఓపార్వతీ! బ్రహ్మ విష్ణు మహేశ్వరు లాదిగాఁగలవారు అఖండమైన పరమాత్మ తామై యున్నామని తెలిసికొని యుండు నట్టి ప్రభావంబంతయును గురువర్యుని యనుగ్రహంబని యెంచి యున్నారు. కావున, నేను అట్టి శివ కేశవ పితామహాదుల పదంబులకు నమస్కారము చేయుచున్నాఁడను.

తే॥ గురుని మహిమంబు లిట్లని సరవిఁదేట।
పడఁగఁ బల్కితి నిఁక మీఁదఁ బరమగురుని।
సేవసేయంగ యత్నసంసిద్ధిమార్గ।
మరయఁదెల్పెద నాత్మలో నవధరింపు॥　103

తా. ఓపార్వతీ! గురువుయొక్క ప్రభావంబంతయును నీకు వివరణముగాఁ దెలియఁ జేసితిని. ఇఁక సద్గురు సేవసేయు క్రమమును నీకుఁ దెల్పెదను. నీవు లెస్సగా మనంబునం దవధరింపుము.

సీ॥ గురుసేవఁజేయంగఁ గోరికగలవాఁడు
　　బలువైన భవబంధ భ్రాంతిరోసి।
చాలు నీసంసారజోలినిబడియున్న
　　మేలు లేదెందు నీ మేనుసతము।
గాదు గావున నాత్మక్రమమంత లెస్సగాఁ
　　గన్న మహాత్ములఁ గలసిమెలసి।
తలయెత్తఁగాఁ జేయు దైవ మీధాత్రిని
　　నాపాలఁగలఁడో యెన్నఁగలేడో॥
తే॥ యెటులఁ దొలికృత్యమున్నదో యెఱుఁగ లేద।
టంచు వేదనఁ జెంది కూహకపుసంగ।
మాదులనుగూడకను ముక్తి వాంఛనెపుడు।
చిత్తమునఁజేర్చి గురుసేవ సేయవలయు॥　104

తా. ఓపార్వతీ ! ఆలకింపుము. గురుసేవ సేయవలయునను కోరిక గలవాఁడు భవబంధముయొక్క భ్రమనుమాని, ఈ సంసారమునం దుండునంతదాఁక మేలుగలుగదనియును, ఈశరీరము శాశ్వతము గాదనియును కావున, ఆత్మజ్ఞాన మెఱింగినవారితోఁ గూడి యుండి, నన్ను ఉద్ధరించు మహాత్ముఁడగు సద్గురువు (దైవము) ఈ భూమండలమునం దున్నాఁడో లేఁడో యనియును విచారించి నా పూర్వజన్మకృత్య మెట్టిదో నే నెఱుఁగలేకున్నాఁడనని చింతించి, కపట సంగమములందు జేరక నిరంతరమును మోక్షము కలుగవలయుననెడి తలంపుగలవాఁడై సద్గురుసేవ సేయవలయును.

వి. శ్లో॥ సంసారోద్విగ్నమనసా తాపత్రితయభీరుణా ।
విరక్తేనేహచాముత్ర ఫలేగమ్యోగురుర్మహాన్ ॥

తా. సంసారమునందు మిగుల భయమొందిన మనస్సు గలవాఁడును, తాపత్రయమునకు భయపడినవాఁడును. ఇహపరములయందుఁ గలుగు ప్రయోజనములయందు విరక్తినొందిన వాఁడును, మహాత్ముఁడైన గురువును సేవింపవలయును.

తే॥ యౌవనము నందు సువిదలయందుఁ బ్రేమ।
మునను బురుషుండు క్షుత్పిపాసలను మాని।
వాంఛఁజేయుచుఁ బాపాన వరలుమాడ్కి ।
భక్తిసేయంగ వలెఁజుమీ పద్మనేత్రి ॥ 105

తా. ఓగౌరీ ! పద్మదళనేత్రీ ! పురుషుఁడు యౌవన కాలమునందు స్త్రీలయందలి ప్రేమచేత ఆఁకలి దప్పులనుమాని నిరంతరమును వారినే కోరుచు పాపములందు మెలఁగుచుండునట్లు గురువునందు భక్తికల్గి సేవ చేయుచుండవలయును. అనఁగా స్త్రీలయందు భక్తికల్గి వారికి సేవచేయుచు పాపమును వృద్ధి బొందించునట్లేగురువునందు భక్తికల్గి మోక్షమును బొందవలయునని భావము.

వి. శ్లో॥ ఆచార్యవాన్ పురుషోహి వేదే త్యేవం శ్రుతిర్జగౌ ।
అనాదావిహసంసారే బోధకోగురురేవహి ॥

తా. ఆచార్యుఁడు కల పురుషుఁడే (ఎవనికి ఆచార్యుఁడు గలఁడో వాఁడు) సత్తామాత్రమైన పరమాత్మను ఎఱుంగును. అని

(ఛాందోగ్య) శ్రుతియందుఁ జెప్పఁబడియున్నది. అనాదియైన ఈ సంసారమునందు (ఆత్మానాత్మల భేదమును) తెలియఁజేయువాడు గురువే. ఈ విషము ప్రసిద్ధముగాన విస్తరించి వ్రాయ లేదు.

క॥ మనుజుఁ డగువాఁడు తనుదాఁ।
గనుఁగొన్న మహాత్ముఁజేరి క్రమమొప్పఁగఁదా।
ననువొంద నాల్గు విధముల।
ఘనశుశ్రూషలను జేసి కడతేఱవలెఁ॥ 106

తా. ఓపార్వతీ! మానవుఁడు తన్నుదా నెఱింగిన యట్టి మహాత్ముఁడగు సద్గురువును ఆశ్రయించి, (అతనికి) క్రమముగా చతుర్విధ శుశ్రూషలను జేసి కడతేఱవలయును. (వీనిని విస్తరముగా నిఁకఁ జెప్పఁబడును.)

తే॥ గురువుకోరిన ద్రవ్యము క్రోధముడిగి।
యొసఁగనాత్మ శుశ్రూషగా నొనరుచుండు।
నంగశుశ్రూషణంబగు నార్యదేహ।
మునకు స్నానాదు లొనరింపఁ దనరు తరుణి॥ 107

తా. ఓపార్వతీ! ఆచార్యుఁడు కోరిన ద్రవ్యమును క్రోధముహాని యొసంగుటయే ఆత్మశుశ్రూష యనఁబడును. గురువుయొక్క శరీరమునకు స్నానము మొదలగునవి చేయుట అంగశుశ్రూష యనఁబడును.

తే॥ తత్త్వవిదుఁడున్న యాశ్రమస్థలవనంబు।
లరసి యేలఁగ స్థాన సేవయిచెలంగు।
దలఁప దల్లియుఁ దండ్రియు దాతధనము।
రూఢి గురుఁడన్న భావశుశ్రూష యయ్యె॥ 108

తా. ఓ గౌరీ గురువు వసించెడి ఆశ్రమము, స్థలము, వనము, వీనిని రక్షించుట స్థానశుశ్రూష యనఁబడును. గురుఁడే తల్లియును, తండ్రియును, దాతయును, ధనమును, నై యున్నాఁడని తలంచుట భావశుశ్రూష యనఁబడును. దీనికిం బ్రమాణముగా,

సీ॥ చెప్పినపనులెల్లఁ జేయుటయనునది
యాత్మశుశ్రూషయై యలరుచుండు।

అభ్యంగనాది దేహాదిశుశ్రూష లి
యమ్మవి యంగశుశ్రూష యనఁగనొప్పు।
తలితండ్రిదైవంబు తగగురుఁడనుటయు
భావశుశ్రూషయై పరఁగుచుండు।
పరగగృహ క్షేత్ర భవనోపవనములు
రక్షించుటదిస్థాన మనఁగదనరు।
ఇట్టిశుశ్రూష లొగినాల్గు నెఱిఁగిబుధులు।
సద్గురుస్వామి నెడపక సాధ్వసముగఁ।
గొల్వమోక్షంబు సిద్ధించు కొఱఁతలేక।
సత్త్వగుణధుర్య శమదమోపేతవర్య॥

అను పద్యమును పఠించుకొనునది.

క॥ సేవయిటు సేయు శిష్యుని।
భావముఁగని గురువరుండు పరమార్థ రహ।
స్యావిధము తెల్పి యాత్మవు।
నీవే యని కనుమటంచు నిజమొందించుఙ్ ॥ 109

తా. ఓపార్వతీ! ఇవ్విధంబుగా సద్గురువుయొక్క సేవచేయు సచ్ఛిష్యుని హృదయంబు నెఱింగిన గురుమూర్తి పరమతత్త్వ మిట్టి దనియును, నీవు పరమాత్మ స్వరూపుఁడవనియును బోధచేసి, యా పరబ్రహ్మమును ప్రత్యక్షంబుగా దర్శించున ట్లొనర్చి సత్యమును బొందునట్లు కృపచేయఁగలఁడు.

వి. శ్లో॥ యంమాతాపిత క్లేశం సహేతే సంభవేనృణాం।
నతస్య నిష్కృతిశ్శక్యా కర్తుం వర్షశతైరపి।
తయోర్నిత్యం ప్రియంకుర్యా దాచార్యస్య చ సర్వదా॥

తా. తలితండ్రులు వీని ఉత్పత్తి విషయమునందు మిగుల క్లేశమునొందిరి. కావున వారికి ప్రత్యుపకారము చేయుటకు నూఱు జన్మము లెత్తినప్పటికిని శక్యముకాదు. తల్లిదండ్రులకు ప్రతిదినమును ప్రియము కలుగునట్లు నడుచుకొనవలయును. ఆచార్యుని విషయమునందును సదా ప్రియము కలుగునట్లు నడుచుకొనవలయును. ఇట్లు మనుస్మృతియందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ ఆచార్య ఏవసంసార మోచకప్రద ఉచ్యతే॥

తా. సంసారమనెడి జనన మరణ దుఃఖమునుండి విడిపించువాఁడు గురువే యగును. అని మహాభారతము ఆరణ్య పర్వమునందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ ఆచార్యస్యప్రసాదేన మమసర్వ మభీప్సితమ్ ।
ప్రాప్స్యతా మితివిశ్వాసో యస్యాస్తి ససుఖీభవేత్॥

తా. ఆచార్యునియొక్క అనుగ్రహముచేత నేను సమస్త కోర్కులను పొందఁగల ననెడి విశ్వాసము ఎవనికిఁ గలదో వాఁడు సుఖమును (మోక్షమును) పొందును.

తే॥ ఆత్మతత్త్వంబు తానుగా నరయుకొఱకు ।
జ్ఞానమను నంజనము కండ్లఁ దానుజిల్కి ।
కరతలామలకముఁ గాంచు కరణిఁ దత్త్వ ।
రవినిధానముఁ జూపి నిర్మలునిఁజేయు॥ 110

తా. ఓపార్వతీ! ఆత్మతత్త్వము తానని తెలియుటకై జ్ఞానమనెడి అంజనమును కన్నులయందిడి కరతలామలకమువలె ప్రత్యక్షముగా తత్త్వమనెడి పరమాత్మయను సూర్యుని దర్శించునట్లొనర్చి నిర్మలాత్మునిగా నొనర్చును. ఇట్లు సద్గురువు చేయఁగలఁడని భావము.

వి. ఇచ్చట "అజ్ఞానతిమిరాంధస్య" అను 77-వ పద్యమునందలి విశేషార్థమును అనుసంధించునది.

తే॥ భవము నెడఁబాపి శివయోగపటిమజూపి ।
ము క్తిఁబొందించి వేదాంత మూలమిట్టి ।
దనుచుఁ దెల్పిన గురుపాద వనజసేవ ।
సలుపఁగాలేని మనుజుని జన్మమేల॥ 111

తా. పార్వతీ! జన్మమును నశింపఁజేయునట్టియు, రాజయోగపద్ధతిని తెలియఁజేయునట్టియు, మోక్షమును బొందునట్లొనరించునట్టియు, వేదాంతమునకు ఆదికారణ మిట్టిదని తెలియఁజేయునట్టియు, సద్గురువర్యుని పదకమల సేవ సేయనట్టి వాని జన్మము నిరర్థకము. అనఁగా గురుసేవ సేయునట్టి వానిజన్మమే సార్థకమైనదని భావము.

సీ॥ గురుకథా శ్రవణవిస్ఫురహీన కర్ణము
లద్రికంధరంబులౌ గిరితనూజ।
ఘనగురురూపంబు కనలేని నేత్రము
లబర్హి పింఛాక్షులౌ పద్మనేత్రి।
గురుపాదములమీఁది విరితావు లెఱుఁగని
ముక్కు వరాహంబు ముక్కుతన్వి।
చెలువొప్ప గురుపూజ సేయనిహస్తము
లుక్కణపకరంబులౌఁ గుందరదన॥
తే॥ సద్గురుచరిత్ర చదవని చదువులెల్ల।
మండుకంబుల చదువులౌ మధురవాణి
పరమగురుగానఁబోనట్టి పాదములును
బాదపంబులఁబోలు నో పద్మగంధి॥ 112

తా. ఓపార్వతీ! పద్మనేత్రి! వినుము. సద్గురువర్యుని దివ్య కథలను వినని యట్టి చెవులు కొండబిలములగును. సద్గురుని దర్శింప లేని వానికన్నులు నెమలిపింఛములందలి కన్నులేయగును. గురు పాదములం దర్పింపఁబడిన పుష్పముల పరిమళమును ఆఘ్రాణింపని వానియొక్క ముక్కు పందిముక్కగును. గురువునకు పూజసేయని వాని హస్తములు జీవములేని పీనుఁగు హస్తములగును. సదాచా ర్యుని మహిమలను దెలియఁజేయునట్టి చదువులన్నియును కప్పల కూఁతలగును. సద్గురుని దర్శించుటకుఁ బోని యట్టి పాదములు ద్రుమములతో సమానమగును.

చ॥ గురునకొసంగలేనిసిరి కుంభినిలో గహనాంతరంబునన్।
వెరవుగఁ గాయు వెన్నెలవిలాసమునౌ గురుపాదపద్మముల్।
మరిగని మ్రొక్కలేని నరు మస్తకమందుఁ గిరీటమూరయన్।
ధరణినిఁ గాష్ఠభారమును దాల్చినవాని తెఱంగుశైలజా॥ 113

తా. ఓగౌరీ! గురువున కొసంగని యట్టి సంపద భూమి యందు అడవినిగాఁచిన వెన్నెలతో సమానమగును. గురుపాద పద్మములకు నమస్కరింపని యట్టివాని కిరీటము కట్టెలమోపును తలలో మోచికొని యుండుటతో సమానమగును.

వి. శ్లో॥ శరీరం వసువిజ్ఞానం వాసఃకర్మ గుణానసూన్ ।
గుర్వర్థం ధారయేద్యస్తు సశిష్యో నేతరస్స్మృతః ॥

తా. తనశరీరమును, ధనమును, శాస్త్రజ్ఞానమును, వస్త్రములను కృత్యములను (శుశ్రూషలను), సద్గుణములను, ఆచార్యుని ఉపయోగము కొఱకు ఎవఁడు సమర్పించునో, వాఁడే శిష్యుఁడగును. ఇతరుఁడు కానేరఁడు.

క॥ వినుగురుని మనుజునిగఁ దలఁ ।
చిన జనుఁడు నిజాభిమతము సిద్ధింపక భూ ।
మిని హీనదశను బొంది తు ।
దను యమపురముననుగష్టదశఁబొరయుశివా ॥ 114

తా ఓపార్వతీ ! గురువును మనుజునిగఁ దలఁచునతఁడు, తాను కోరియున్న పురుషార్థమును (మోక్షమును) బడయక కష్టము నొంది అంత్యమున యమపురంబునందు (నరకమునందు) కష్టదశను బొందును.

వి. శ్లో॥ దేవతాః ప్రతిమాకారే లోహభావం కరోతియః ।
యోగురౌమానుషంభావ ముభౌ నరకపాతినౌ ॥

తా. దేవతలను (విగ్రహ స్వరూపములుగానుండు శివ విష్ణు వినాయక సుబ్రహ్మణ్య లక్ష్మీ సరస్వతీ పార్వతి మొదలగు ప్రతిమలను) లోహములే కదాయనియును, గురువును సాధారణ మనుష్యుఁడేయనియును. ఎవఁడు తలంచునో వాఁడు నరకమును బొందుదురు.

సీ॥ సద్గురు పాద కంజాతము ల్సేవించి
వారిచే నుపదేశవర్తి యగుచుఁ ।
త్రివిధదీక్షలఁబొంది భవము లన్నిటఁగుంది
త్రివిధ లక్ష్యార్థము ల్దెలియఁజూచి ।
త్రివిధవర్ణంబుల వివరమంతయుఁగని
త్రివిధక్రియలమదిఁ ద్రిప్పనీక ।
త్రివిధప్రసాదముల్ స్థిరమతిభుజియించి
త్రివిధసూత్రాచార మవిరళముగ ॥

తే॥ దెలియకున్నను నద్వైత దివ్యసుఖము।
గలుగనేరదు నిత్యాత్మ్మఁ గనగరాదు।
అనుచుఁ దెల్పిన గురుగుణం బెంచకతక।
రించు మానవునకువచ్చు నిడుమ వినుము॥ 115

తా. ఓపార్వతీ! సద్గురువుయొక్క పాదపద్మములను ఆశ్రయించి వారిచే నుపదేశమొంది, త్రివిధ దీక్షలనుబొంది తాను ఇదివఱ కెత్తిన జన్మములకుఁ గాని, లేక తానొనర్చిన పాపములకుఁగాని వ్యసనమొంది, త్రివిధ లక్ష్యార్థములనెఱింగి, త్రివిధ వర్ణముల వివరణంబంతయుఁ దెలిసికొని, త్రివిధ క్రియలందు బుద్ధిని స్థిరముగా నిల్పి, త్రివిధ ప్రసాదములను భుజియించి, త్రివిధ సూత్రార్థములను దెలియవలయును. ఇట్లు తెలియనియెడల అద్వైత బ్రహ్మానందసుఖము కలుగదు మఱియును పరబ్రహ్మమును దెలిసికొనుటకు సాధ్యముకాదు. ఇవ్విధముగాఁ దెల్పినట్టి సద్గురువర్యుని మహిమ నెఱింగి ఆగురువర్యుని అంతఃకరించు (ధిఃకరించు) మనుజునకుఁ గల్గునట్టి కష్టమును దెల్పెదనువినుము అని పరమశివుఁడు పార్వతితోఁ జెప్పెను.

వి. శ్లో॥ ఏకాక్షర ప్రదాతార మాచార్యం యోవమన్యతే।
శ్వానయోని శతంప్రాప్య చండాలేష్వపి జాయతే॥

తా. ప్రణవమునుగాని, లేక ఒక్క యక్షరమునుగాని ఉపదేశించిన ఆచార్యుని ఎవఁడు అవమానముచేయునో వాఁడు నూఱు జన్మములు కుక్కజన్మము లెత్తి పిదప చండాల జన్మములను పొందును.

ఆచార్యభక్తి అవశ్యానుష్ఠేయమని శ్రుతియందును జెప్పఁబడియున్నది.

శ్లో॥ యావదాయుస్త్వయావంద్యో వేదాంతే గురురీశ్వరః।
మనసా కర్మణావాచా శ్రుతిరేవైష్యనిశ్చయః॥

తా. ఆయుః పర్యంతము వేదాంతమును (ఉపనిషత్తును), గురువును, ఈశ్వరుని, మనస్సుచేతను, కర్మముచేతను, వాక్కు

చేతను పొగడఁబడగును. అని శ్రుతియందు నిశ్చయింపఁ బడి యున్నది.

త్రివిధదీక్షలు.—

1. దృగ్దీక్ష —మత్స్యము గ్రుడ్డులను బెట్టి; తాను ఆగ్రుడ్డులను తిరిగి చూచినచో పిల్లలగును. ఆప్రకారము గురువు శిష్యునికి ఉపదేశించి వీఁడు బ్రహ్మసాక్షాత్కారభావము నొందును గాక యని తలంచి శిష్యుని వీక్షించుట.

2. వాగ్దీక్ష.—భ్రమరము మట్టిలోనుండు పురుగులను కొనిపోయి దాని చెవియందు కూసికూసి తన రూపమువలె చేసికొనును. ఇట్లు గురువు శిష్యునికి ఉపదేశించి తనవలెఁ గావించుకొనుట.

3. స్పర్శదీక్ష.—పక్షులు గ్రుడ్డులను బెట్టి వానిని తన రెక్కలచే కప్పియుంచినచో పిల్లలగును. అట్లు గురువు తన్నాశ్రయించిన శిష్యుని తన హస్తముచే స్పృశించి తనవలె నగునట్లు చేయుటకు ప్రయత్నించుట.

త్రివిధ లక్ష్యార్థములు.—

1. అంతర్లక్ష్యము.—కన్నులను సంపూర్ణముగ మూసికొని మనస్సును, చూపును, నాద బిందు కళలయందుంచుట. అనఁగా, తాను ఆలక్ష్యమునందే యుంచి చూచుచున్నట్లు భావించుట. ఇట్లు లోచూపుచేత మనస్సును ప్రాణవాయువును నిశ్చలమగునట్లొనరించుట. ఇదియే శాంభవీముద్ర యనఁబడును.

2. బహిర్లక్ష్యము — కనులచూపును నిశ్చలము (చలింపనీక) చేసి బాహ్యమందున్న వస్తువులలో నేదియో యొక్కదానిని (ముఖ్యముగా నాసికాగ్రమును) రెప్పవేయక చూచుచు, మనస్సును కూడ అచ్చటనే నిలుపుట. ఇది వెలిచూపు అనఁబడును. ఇదియును శాంభవీముద్రయే యగును. ఇందును మనస్సును ప్రాణమును నిశ్చలమై యుండవలయును.

3. మధ్యలక్ష్యము.—చెవులను కన్నులను ముక్కులను మూసి (అనఁగా రెండు చూపుడు వ్రేళ్లతో కనులను, రెండు పెద్ద

వేళ్లతో చెవులను, రెండు నడిమివ్రేళ్లతో ముక్కుపుటములను, మూసి) దృష్టిని మనస్సుతోఁగూడ భ్రూమధ్యమునందు నిల్పి నాద బిందుకళలను అనుభవించు చుండుట. ఇది షణ్ముఖీముద్ర యనఁ బడును

త్రివిధవర్ణములు —

(అ - ఉ - మ.)

1. అకారము —సృష్టి, పురుషబీజము, నాదము, విష్ణువు అధిదేవత, నేత్రస్థానమున. విశ్వుఁడు, జాగ్రదవస్థ.

2. ఉకారము.—స్థితి, ప్రకృతిబీజము, బిందు, బ్రహ్మ అధిదేవత, కంఠస్థానము, తైజసుఁడు, స్వప్నావస్థ.

3. మకారము —లయము, జీవుఁడు, కళ, రుద్రుఁడు అధిదేవత, హృదయస్థానము, ప్రాజ్ఞుఁడు, సుషుప్త్యవస్థ.

ఈ మూఁడక్షరములునుఁ జేరి ఓంకార మగును. ఇదే ప్రణవము. తక్కిన విషయములను 53-వ పద్యమునకు తర్వాత నుండు అవస్థావివరణ చక్రమును జూచిన స్పష్టమగును.

త్రివిధక్రియలు.—

1. తపము.—శాస్త్రములందుఁ జెప్పఁబడిన వ్రతముల ననుష్ఠించుట.

2. స్వాధ్యాయము. — ప్రణవపూర్వకమైన మంత్రానుష్ఠానము నవలంబించుట.

3 ఈశ్వరప్రణిధానము.—ఆదిగురువును ఓంకార వాచ్యుండునగు భగవంతుని ఉపాసించుట.

ఆదిగురువు భగవంతుండని శ్వేతాశ్వతరోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది. త్రివిధక్రియలను గూర్చి పాతంజల యోగ శాస్త్రము రెండవపాదమునందు ప్రథమసూత్రమున వివరింపఁబడి యున్నది. ఇదియే క్రియాయోగమనఁబడును.

త్రివిధప్రసాదములు.—

1. శుద్ధము.—గురుభుక్తశేషము. అనఁగా గురువు భుజింపఁగా మిగిలినయన్నము.

2. సిద్ధము.—ఈశ్వరభుక్తశేషము. అనఁగా భగవంతునికి నివేదనము చేసిన యన్నము

3. ప్రసిద్ధము—భగవద్భక్తులు భుజించిన తర్వాత మిగిలి యుండు శేషము. అనఁగా భగవద్భక్తులు భుజించిన పిదప భుజింప వలయునని కొందఱందురు.

త్రివిధసూత్రములు.—

1. జైమినిసూత్రము.—ఇది కర్మకాండ. దీనికి పూర్వ మీమాంస యనిపేరు.

2. బ్రహ్మసూత్రము.—ఇదే వ్యాససూత్రములు. దీనికి ఉత్తర మీమాంస యనిపేరు.

3. మతసూత్రములు.—ఇది ఆయామతస్థులు ఆచరింప వలసిన విధులను దెల్పునట్టిది. దీనిని ఆపస్తంబ, ఆశ్వలాయన, కాత్యాయనాదులు రచియించిరి.

గురువును తిరస్కరించువాని దుర్గతి.

తే॥ కాననములోన నిర్జల స్థానమందు ।
బ్రహ్మరాక్షసుఁడై పుట్టి బహువిధముల ।
దుఃఖములజెంది పరమొందఁ ద్రోవలేక ।
తిరుగుచుండును ధాత్రి నానరుఁడు తరుణి ॥ 116

తా. పార్వతీ! వినుము. భూమియందు (గురుని తిరస్కరించినవాఁడు)జలములేని ఆరణ్యమునందు బ్రహ్మరాక్షసుఁడై జన్మించి అనేకములగు కష్టములనుబొంది, ముక్తినొందుటకు మార్గములేక సంచరించుచుండును.

వి. శ్లో॥ ఇమంలోకం మాతృభక్త్యా పితృభక్త్యాతు మధ్యమం ।
గురుశుశ్రూషయాత్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే ।
సర్వేతస్యాదృతాధర్మా యస్యైతే త్రయఆదృతాః।
అనాదృతాస్తుయస్యైతే సర్వాస్తస్యాఫలాఃక్రియాః॥

తా. మాతృభక్తిచే భూలోకసుఖమును పితృభక్తిచే స్వర్గ లోక సుఖమును గురుభక్తిచే బ్రహ్మలోక (పరమపద) సుఖమును, బొందుచున్నాఁడు ఎవ్వనిచే నీముగ్గురును ఆదరింపఁ (పూజింపఁ)

బడియుందురో, వానికి సకలధర్మముల ఫలములును గలుగును. తలిదండ్రి గురుఁడు అను నీ మూవురను ఎవనిచే ఆదరింపఁబడరో అట్టివానిధర్మములు ఫలములేనివగును. అట్టి మనుస్మృతియందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ గురుభక్తివిహీనస్తు భవతి బ్రహ్మరాక్షసః ।
సంచరంతి మహాఘోరే గహనే కాలమక్షయం॥

తా. గురుభక్తిలేనివాఁడు మహాఘోరమైన అడవియందు చాలకాలముదాఁక బ్రహ్మరాక్షసుఁడై సంచరించును. ఇట్లు ఆగమశాస్త్రమునందు వక్కాణింపఁబడి యున్నది

కావున గురువును నిందింపరాదు మఱియు గురువును నిందించుటయును వినఁగూడదు. ఎట్లన,

శ్లో॥ గురోర్యత్రపరీవాదో నిందావాపి ప్రవర్తతే ।
కర్ణౌతత్రాపిధాతవ్యౌ గంతవ్యం వా తతోన్యతః॥

తా. ఎచ్చట ఆచార్యుని అపవాదముగాని, నిందగాని ప్రస్తాపింపఁబడుచున్నదో అచ్చట చెవులను మూసికొనవలయును. అచ్చోట నిలువక ఆతావును వదలిపోవలయును

క॥ గురుసేవ సేయ బూనను ।
గురుఋణమును దీర్ప నాత్మ గుఱిగని నడువన్ ।
హరిధాతాదుల కైనను ।
వెరవిదియని పలుకరాదు విమలేందుముఖీ॥ 117

తా. ఓ పూర్ణచంద్రముఖియగు పార్వతీ! గురుసేవ సేయుటకును, గురు ఋణమును దీర్చుటకును, పరమాత్మయొక్క స్థితినిఁ దెలిసికొని వర్తించుటకును, విష్ణుదేవునకును బ్రహ్మదేవునకును ఉపాయమిట్టిదని వచించుటకు సాధ్యము కాదు.

తే॥ అనుచు నగజాతతో శివుఁ డన్నయట్లు ।
సూతుఁ డాడంగ మును లెల్లఁ జోద్యమొంది ।
అవలశంభుండు గిరిజ కేమానతిచ్చెఁ ।
దెలియఁబల్కుము సన్ముని కులవరేణ్య॥ 118

తా. ఇవ్విధముగా పరమేశ్వరుఁడు పార్వతీదేవితోఁ జెప్పె నని, సూతమునీంద్రుండు శౌనకాది మునులకు జెప్పఁగా నమ్మునులు ఆశ్చర్య మొందినవారై సూతమునిని జూచి అనంతరము, పరమ శివుఁడు పార్వతీదేవితో నేమి చెప్పెను? మాకుం జెప్పుము అని యడిగిరి.

తే॥ అట్లు మునులన్న పల్కుల కాత్మయందు।
సంతసంబంది యటమీఁద శాంభవికిని।
విమల వైరాగ్య ప్రకరణ క్రమము దెల్పె।
నదియు వివరింతు నాత్మ మీ రరసి వినుఁడు॥ 119

తా. సూతమునీంద్రుఁడు శౌనకాదులంజూచి యిట్లనియె. ఓమునీంద్రులారా! వినుఁడు పిమ్మట పరమశివుఁడు సంతోషించి పార్వతీదేవికి పరిశుద్ధమైన వైరాగ్య ప్రకరణమును జెప్పెను. నేను ఇప్పుడు మీకు ఆ ప్రకరణము నెఱింగించెద. మీరు దానిని చక్కఁగా మనస్సునందు విచారించి తెలిసికొనుఁడు.

## వై రా గ్య ప్ర క ర ణ ము.

మ॥ వినవేశాంభవి ధాత్రిలోపలినరుల్ విఖ్యాతిమైసత్తుగాఁ।
గనుగొంచుఁ మఱిమీఁదనయ్యెడుమహత్కర్మానుసారంబులఁ।
దినముఁ దేహముచాలబ్రోతురు మనోదృష్టిఁ విలోకించి చూ।
చిన రక్తాస్థులమేధ్యమాంసములచేఁ జెన్నొందు దాక్షాయణీ॥

తా. ఓపార్వతీ! వినుము. ఈ భూమియందు మనుష్యులు దేహమును శాశ్వతమని యెంచినవారై, తర్వాత సంభవించెడు అధికమైన యట్టి కర్మపరంపరలను దెలిసికొనక శరీరమును రక్షింతురు. దీనిని చక్కఁగా పరిశీలించి చూచితిమేని, ఇది రక్తము, మాంసము, ఎముకలు, అమేధ్యము అను వీనితోఁ గూడినదై యుండును.

వి. శ్లో॥ పంచాత్మకో జడో దేహ స్త్వఙ్మాంస రుధిరాస్థిమాన్।
కాలకర్మ గుణోత్పన్నః సోప్యాస్తేఽద్యాపి తేపురః॥

తా. దేహము పృథివ్యాది పంచభూతముల స్వరూపమైనది, జడమైనది, చర్మము, మాంసము, నెత్తురు, ఎముకలు వీనితోఁ గూడినది. కాలము, కర్మము, గుణము, అను వీనితోఁగూడినది.

ఇట్లు అధ్యాత్మరామాయణము, కిష్కింధాకాండమున ద్వితీయసర్గ 14-వ శ్లోకమునందుఁ జెప్పఁబడియున్నది.

సీ॥ తనువు నిత్యంబు గావనుదినంబును నెంచ
జలము బుగ్గలకన్న జులకనగుట ।
చీము నెత్తురులచే జివుకుచునుండుట ।
మలమూత్రములు రెండు మలసియుంట ।
విషయవాంఛలసదా విఱ్ఱవీగుచునుంట
జోకైన నరముల జుట్టియుంట ।
పాతకహేతువౌ భ్రాంతిని బొందుట
జాతసూతకములచే తగులుట ॥

తే॥ అంతమందున యమబాధ నమరియుంట ।
యముఁడు నియమించునట్టిభవము లెనయుట ।
యమితరోగంబులను గూడినట్టి వట్టి ।
బూటకంబైన దేహజంజాటమేల ॥ 121

తా. ఓపార్వతీ! ఈశరీరము నిత్యముకాదు. అని యిట్లు ప్రతిదినమును తలంచి చూచినయెడల శరీరము నీటిబుగ్గకంటెను చులకనయని తెలియును. చీము, నెత్తురు వీనిచే చివుకుచునుండును. మలమూత్రములు రెంటిచే నొప్పారుచుండును. విషయవాంఛల యందు దవిలి సదా విఱ్ఱవీగుచునుండును. ఇది నరములచే కట్టఁబడి యుండును. పాతకములకుఁ గారణమైన భ్రమలను జెందియుండును. జాతాశౌచములకు లోఁబడియుండును. అంత్యకాలము (మరణ కాలము) నందు యమబాధనొంది యముఁడు నియమించునట్టి జన్మములను బొందును. ఈశరీరము అనేకరోగముతోఁగూడియుండును. ఇది వట్టి బూటకమైన శరీరము. అట్టి శరీరమునకై జంజాటమేల? అనఁగా జంజాటము కూడదని భావము.

వి. శ్లో॥ అస్థిస్థూణాం స్నాయుబద్ధం మాంసశోణితలేపితం।
చర్మావబద్ధం దుర్గంధం పూర్ణం మూత్ర పురీషయోః।
జరశోక సమానిష్టం రోగయాతనమాతురం।
రజస్వలమనిత్యశ్చ భూతావాసమిమంత్యజేత్ ।
మాంసాసృక్పూయవిణ్మూత్ర స్నాయుమజ్జాస్థిసంహతే।
దేహే చేత్ప్రీతిమాన్మూఢో భవితా నరకేపి సః॥

తా. ఎముకలు కంబములుగను, నరములచేఁ గట్టఁబడినదిగను, మాంసము నెత్తురు వీనిచే పూయఁబడినదిగను, చర్మముచే కప్పఁబడినదిగను, దుర్గంధముగలదిగను, మలమూత్రములచే నిండినదిగను, ముసలితనము దుఃఖము అనువీనిచే నావరింపఁ బడినదిగను, రోగమునకు స్థానమైనదిగను, రోగముకలదిగను, నశించునట్టిదిగను, ఆకాశాది పంచభూతములకు ఆవాసమైనదిగను నుండు ఈ శరీరమునందు అభిమానము నుంపరాదు. మాంసము, నెత్తురు, చీము, మలమూత్రములు, నరములు, క్రొవ్వు, వీనితోఁ గూడిన శరీరమునందు ప్రీతినుంచు మూఢుఁడు నరకమునందు ప్రీతి నుంచును. అనఁగా ఈ శరీరమునందు అభిమానము నుంచువాఁడు నరకమును బొంది మిక్కిలి కష్టపడునని భావము. ఇట్లని నారద పరివ్రాజకోపనిషత్తునందు చెప్పఁబడియున్నది.

ఉ॥ ఈతనువందు నాస బహు హెచ్చుగఁజేసిన పూటిమాటికిన్ ।
రోఁతయెకాని మీఁదటను రూఢము లేదని చాలరోసియున్ ।
బ్రీతమనస్కుఁడై పరముబొందఁగ నాత్మను నిచ్ఛయుంచినన్ ।
దాతయు మాతయున్ సుతులు తక్కిన బాంధవకోటి యేటికిన్॥

తా. ఓపార్వతీ ! ఈ శరీరముపై మిక్కిలిగా నభిలాష ముంచినయెడల అప్పటికప్పుడు (కురుపులు వ్రణములు మొదలగు వానిచే) అసహ్యమేకాని వేఱుకాదు. అనంతరము ఇది శాశ్వతము కాదని తెలిసి మిగుల వేసటనొంది పరమాత్మను బొందవలయునని ఆసక్తి నొందినమీఁద దాతయు, మాతయు, బిడ్డలును, తక్కిన చుట్టములు మొదలగువారును ఏల ? అనఁగా, వీరందఱితోఁ బనిలే

దనియును పరబ్రహ్మమును బొందుటయే ప్రయోజనమనియును అభి ప్రాయము.

వి శ్లో॥ కాతేకాంతాక స్తేపుత్ర స్సంసారోయమతీవవిచిత్రః।
కస్యత్వం వాకుతఆయాత స్తత్త్వం చింతయతదిహభ్రాంతః॥

తా. (ఓ మనుష్యుఁడా! ఈ భూమిలో) నీకు భార్యఎవరు? బిడ్డలుఎవరు ? ఇట్టి సంసారము మిగుల విచిత్రమైయున్నది ? నీవు ఎవరికి పుత్త్రుఁడవు ? ఎచ్చటనుండి వచ్చినాఁడవు ? నిశ్చయమును ఆలోచించిచూడుము ? చూచినచో ఈ సంసారము మొదలగునవి భ్రమయనియే తోఁచును. అని భజగోవింద స్తోత్రమునందు శ్రీ శంకరాచార్యులు వ్రాసియున్నారు.

“శ్లో॥ కావాకస్యప్రియాపుత్రో బంధుః కోవా భవార్ణవే।”

తా. ఈ సంసార సాగరమునందు ఒకనికి భార్యయెవరు? బిడ్డలుఎవరు ? అని బ్రహ్మవైవర్త పురాణమునందుఁ జెప్పఁబడి యున్నది.

శా॥అన్నల్దమ్ములు నత్తమామలు ప్రియంబౌ భార్యయున్నుండియున్।
నెన్నన్ దేహము వీడువేళ మఱివెంటెవ్వారలున్ రారుగా।
కున్నన్ నక్కటతో శ్మశానమునకున్ గొంపోయిదావాగ్నిలో।
దన్నర్పించియు మళ్లిచూడరుభువిన్ తథ్యంబుగా శాంభవీ॥ 123

తా. ఓ పార్వతీ ! ఈ భూమియందు అన్నలు, తమ్ములు, అత్త, మామ, భార్య, అను వీరందఱును ఉండినప్పటికిని, శరీరము పతనమైనమీఁద ఎవ్వరును వెంటరారు. అయినను, అక్కటతో శ్మశానముదాఁక తీసికొనిపోయి గొప్ప మంటయందుంచి తిరిగి చూడరు. ఇది సత్యము. అనఁగా ఆ తర్వాత ఎవరును వెంటరారు. వల్లకాటిదాఁక వత్తురని భావము.

వి. శ్లో॥ ఏకఃప్రజాయతేజంతు రేకఏవ ప్రలీయతే।
ఏకోసుభుం క్తేషుకృత మేకఏవచ దుష్కృతం।
మృతంశరీర ముత్సృజ్య కాష్ఠలోష్ఠ సమంక్షితౌ।
విముఖా బాంధవాయాంతి ధర్మ స్త మనుగచ్ఛతి॥

తా. ఒక్కొక ప్రాణియును తానొక్కఁడుగానే పుట్టు చున్నాఁడు. ఒక్కఁడుగానే మృతినొందుచున్నాఁడు. ఒక్కఁడుగానే తా నొనర్చిన పుణ్యపాపకర్మములను అనుభవించు చున్నాఁడు. వీఁడు గతించినమీఁద కట్టెలను మంటిగడ్డలను పాఱవేయునట్లు (మృత) శరీరమును భూమియందు పాఱవేసి బంధువులందఱును మరలి పోవుచున్నారు. వీఁడు చేసిన పుణ్యకర్మఫలమును పాపకర్మ ఫలమును వీనివెంట పోవుచున్నది.

ఇట్లు మనుధర్మ శాస్త్రమునందు చెప్పఁబడియున్నది.

ఉ॥ కూఁడగనేల కోరికె లకుంఠితులై మదిబూననేల యే।
జాడల లోకవాంఛలను జాలఁగరోసిన ముక్తియంచువే।
వేడ నఖండమార్గ పదవిం దనుజేరఁగవచ్చుగాననో।
చేడియ యిందుకొక్కకథ జెప్పెద లెస్సఁగ బుద్ధినూనుమా॥124

తా. ఓ పార్వతీ! సంగము (సాధుసంగము) ఎందులకు? ఎంతమాత్రమును వంకరలేని బుద్ధిగలవారై మనస్సునందు (ముక్తి కలదు అని) నిశ్చయింపనేల? లోకవాంఛలను బొందనియెడల మోక్షము గల్గునని యెంచి (ముక్తిని) కోరనేల? అఖండమైన మోక్షసామ్రాజ్యము తనవెంటనే కల్గును; కాఁబట్టి ఈ విషయమై నేనొక కథచెప్పెదను. బుద్ధియందుంచి వినుము. అని పార్వతీదేవికి, ఈదిగువచెప్పఁబోవు ప్రకారముగా నొక కథను జెప్పెను.

సీ॥ కాననంబున నొక్కఘనుఁడు మార్గముతప్పి
శ్రమచేతసంచారక్రమము లుడిగి।
తరుమూలముననిద్ర మఱచెందియుండఁగా
బులివచ్చి యతని గొంపోవువేళ।
నిద్రావిరహితుఁడై నెరిలేచి యటమీఁద
నయ్యెడు హేతువు నరయలేక।
పుత్రమిత్రకళత్ర భ్రాతాదులఁ దలంప
వారువచ్చియు మృత్యువదలజేసి॥

తే॥ నిలుపలేరైరి గాన వీరలనుగూడ।
నేమి ఫలమని నిత్యత్వ మెన్నవలయు।

నప్పు డిప్పుడో యెప్పుడో చెప్పరాదు।
తనువు వీడుట యొకదినమనుచు నెంచి॥ 125

తా. అడవియందొక గొప్పవాఁడు దారితప్పి అడవియెల్ల తిరిగి మిక్కిలి శ్రమనొంది నడుచుటకు శక్తిలేనివాఁడై యొక చెట్టు క్రిందఁ బడి నిద్రించుచుండెను ఆ సమయంబునం దొకపులి వచ్చి యతనిని కొనిపోవుటకు సిద్ధముగా నుండెను అపుడు వాఁడు మేల్కాంచి లేచి, ఇక కాబోవు విషయమును తెలిసికొనినవాఁడై పుత్రులు, మిత్రులు, భార్య, తోఁబుట్టువులు మొదలగువారిని స్మరించినాఁడు. ఎవ్వరును ఆసమయమునందు వచ్చి వాని ప్రాణాపాయమును నివర్తిచేయకపోయిరి. అంత వాఁడు వీరలనుగూడి యుండుటచే నేమియు ప్రయోజనము లేదని నిశ్చయించినవాఁడాయెను. ఇట్లు ఎఱింగి నిత్యత్వము (శాశ్వతమైన మోక్షమును)ఎఱింగినవాఁడై ఈ శరీరము అప్పుడో, ఇప్పుడో, ఎప్పుడో, ఒకదినము పోవుట నిజమని యెంచినవాఁడై యిట్లని వితర్కించెను.

సీ॥ శతవత్సరంబులు సతమనియెంచెనా
సగమేండ్లునిద్రచే సమసిపోయె।
బాలత్వకౌమార పౌగండవయసుల
ఘనతనిర్వదినాల్గు గడచి చనియె।
నిఁకమీద మిగిలిన యిరువదియాఱేండ్లు
రాజసగుణములఁ దేజరిల్లి।
చెప్పిచూపఁగరాని చేష్టలఁబెనఁగొని
కామాంధుఁడై స్త్రీలఁగాంక్షజేసి॥

తే॥ కామితార్థంబులనుగోరి కష్టమైన।
నియమకర్మాదులనుబొంది నెరిసినిట్లు।
జరుగు నూఱేండ్లు పురుషున కనుచుఁ దెలిసి।
పరము జేరంగ వాంఛించు సురుచిరాంగి॥ 126

తా. ఓ పార్వతీ! వినుము. పురుషునకు ఆయువు నూఱేండ్లు అని యెంచరాదు. అందు సగముకాలము నిద్రవలన తగ్గిపోయెను. మఱియు బాల్యము, కౌమారము, పౌగండము, అను వయస్సు

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అను నీ పంచభూతముల గుణములగు శబ్ద స్పర్శ రూప రస గంధములను తన్మాత్రలైదును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదియును, మనస్సును జేరి పదునాఱును షోడశ వికారము లనఁబడును. కొన్ని గ్రంథములయందు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును, పంచభూతములును, మనస్సును జేరి షోడశవికారము లని చెప్పఁబడియున్నది.

వి. శ్లో॥ సత్త్వాంశైః పంచభి స్తేషాం క్రమాద్ధీంద్రియపంచకం ।
శ్రోత్ర త్వగక్షి రసన ఘ్రాణాఖ్య ముపజాయతే ॥

తా. ఆకాశాది సూక్ష్మభూతములయొక్క సత్త్వగుణభాగములచేత శ్రోత్రము=చెవులు, త్వక్=చర్మము, అక్షి=నేత్రములు, రసన=నాలుక, ఘ్రాణము = ముక్కు, అను జ్ఞానేంద్రియ పంచకము కలిగెను.

శ్లో॥ రజోంశైః పంచభి స్తేషాం క్రమాత్కర్మేంద్రియాణితు ।
వాక్పాణిపాదపాయూపస్థా భిధానాభిజజ్ఞిరే॥

తా. ఆకాశాది సూక్ష్మభూతములయొక్క రజోగుణ భాగములచే వాక్కు=నోరు, పాణి=చేతులు, పాదము=కాళ్లు, పాయువు=గుదము, ఉపస్థ = మర్మస్థానము అను కర్మేంద్రియ పంచకము కలిగెను.

శ్లో॥ బుద్ధికర్మేంద్రియప్రాణ పంచకర్మసాధియా ।
శరీరం సప్తదశభి స్సూక్ష్మం తల్లింగముచ్యతే॥

తా. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును, ప్రాణము, అపానము, సమానము, వ్యానము, ఉదానము అను పంచవాయువులును, బుద్ధియును, మనస్సును, అను నివి పదునేడును జేరి సూక్ష్మశరీరమనియు, లింగశరీరమనియు, కారణ శరీరమనియుఁ జెప్పఁబడును. వీనిలో బుద్ధిని జేర్పనిచో నిదియు షోడశ వికారము లనఁబడును. మఱికొందఱు వేఱువిధముగాఁ జెప్పియున్నారు; ఎట్లన,

సీ॥ కర్ణచర్మేక్షణ గంధవహారసనం
బులను జ్ఞానేంద్రియములునైదు ।

వాక్పాయపదగుదోపస్థంబులనెడి క
ర్మేంద్రియంబులనెంచ నెలమినైదు।
తారాపథాశుగ దహనోర్విభువనంబు
లనెడిభూతంబులు నరయనైదు।
రూఢిగామనమును గూడషోడశవికా
రంబులునగు సువిరాజితముగ॥
నెఱిఁగి మెలఁగెడివారు తమ్మెఱుగుచుండ్రు।
భక్తపటలాంహ వైరిహృద్భయదరంహ।
నాథచిద్బ్రహ్మ శ్రీలక్ష్మి నారసింహ।
మునిజనస్తోమ నిత్యసన్మోక్షకామ।
సాధుజనప్రేమ నిరుపమ సార్వభౌమ॥

తా. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, పంచభూతములు, అను నీ పదునైదును మనస్సును జేరి పదునాఱును షోడశ వికారము లనఁబడును.

సీ॥ జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు
వివరింపప్రాణవాయువులునైదు।
చిత్తంబుతోఁగూడ చెలువొందపదునాఱు
రమణషోడశవికారంబులనఁగఁ।
బరఁగుపృథివ్యాధి పంచభూతంబులు
హృదయంబు బుద్ధ్యహంకృతులుగూడ।
ఎనిమిదిక్రమముతో నేపారనష్టప్ర
కృతులనఁబరఁగు విశ్రుతముగాఁగ॥
ఇన్నిటికినిదె కారణం బెంచిచూడ।
పరమమైయుందురానంద భరితమగుచు।
చిరశుభాకార మోక్షలక్ష్మీవిహార।
సాంద్ర రుచిధుర్యదత్తయోగీంద్రవర్య॥

ఇట్లు కొన్ని గ్రంథములయందు కానంబడుచున్నది.

చ॥ ఇది పరమాత్మ కావరణ వృత్తులు గావది యెట్టులంటివా।
భవములఁబాసి యాక్రియలఁ బట్టుగఁజూచుచు నున్నవస్తువే।

యవిరళమైన యాత్మ యని యార్యులు నెన్నుదు రట్లునీవుపుర్ణా।
వివరణచేసి నేత్రమున వెల్గుగదాయని నమ్ము మానినీ ॥ 130

తా. ఓపార్వతీ! ఈచెప్పఁబడిన షోడశవికారములును పరబ్రహ్మమునకు ఆవరణవృత్తులు కావు. అనఁగా మఱిగించుకొని యుండునవి కావు. ఎట్లనఁగా, జన్మములను తొలఁగద్రోసి, ఈ జన్మములకు కారణమును జక్కఁగా విమర్శించి చూచినయెడల, ఆకారణవస్తువు పరబ్రహ్మమే యని వివేకవంతులు తెలిసికొందురు. నీవును ఆవస్తువును వివరణచేసి ఆ పరమాత్మ వస్తువు నేత్రమునందు వెలుఁగుచున్నదని నమ్ముము.

వి. ఆవరణము=పరమాత్మను మఱఁగించుకొని యుండునది.

షడూర్మలనిర్ణయము.

క॥ ఇఁకను షడూర్మల గుణములు।
నకలంకతవినుము దుఃఖ హర్ష ద్వయమున్।
శుకవాణి చిత్తగుణ మని।
ప్రకటంబుగ నెఱింగి యాత్మభావన గనుమీ॥ 131

తా. ఓగౌరీ! వినుము. దుఃఖమును, సుఖమును, అను నీ రెండును చిత్తగుణమని యెఱింగి, ఆత్మభావనను దెలిసికొనుము.

తే॥ పరగ నాకలి దప్పియుఁ బ్రాణగుణము।
లండ్రు జననము మరణము నరసిచూడ।
దేహగుణములునయ్యె నిందీవరాక్షీ।
యివి షడూర్మలుగా నెంచి భవమునుడుగు॥ 132

తా. ఆఁకలియు, దప్పియు, అను నీరెండును ప్రాణగుణములగును, జననము, మరణము, అనునీరెండును దేహగుణములగును. మీఁదఁజెప్పిన చిత్తగుణములు రెండును, ఇవి యాఱును షడూర్మలని యెఱింగి జన్మమును బాపికొనుము. అనఁగా ఇఁక పుట్టుకలేనియట్లు కావించుకొనుము.

క॥ సుజను లవియాత్మ కావని।
నిజముగవిని యన్ని యెఱుఁగు నెఱుకాత్మను చున్।

భజియించి నిరతమును ధరఁ।
గుజనులఁజేరంగబోరు కుముదాప్తముఖీ ॥ 133

తా. పార్వతీ! సుజనులు (జ్ఞానులు) ఇవి యాఱును ఆత్మ కావని యెఱింగి, వీనినిఁ దెలిసికొనునట్టి తెలివియే అనఁగా ఎఱుకయే ఆత్మయని (పరబ్రహ్మము) అని తెలిసి ఎల్లప్పుడును స్తుతించుచుందురు. ఇట్టి వివేకవంతులు కుజనులతో (అవివేకులతో, అజ్ఞానులతో) జేరుటకై పోనేరరు.

వి. 1. జననము, 2. మరణము, 3. ఆఁకలి, 4. దప్పి, 5. హర్షము, 6. శోకము, అను నివి యాఱును సంసార సాగరము యొక్క "లహరి" అనఁగా అలయని పేరొందును. కావుననే ఇవి "ఊర్మి" అనఁబడెను.

శ్లో॥ ఆనందమవ్యయం శాంతం షడూర్మి రహితంశివం।
నిర్మలంతం విజానీయాత్ యస్సత్యం తదుపాస్యతామ్॥

తా. ఆనందమును, అవ్యయమును, శాంతమును, షడూర్ములు లేనిదియును, నిర్మలమైనదియును, సత్యమైనదియును, అగు ఆ పరబ్రహ్మమును ఉపాసింపవలయును.

శమ దమ దాంతి త్రయ వివరణము.

క॥ శమదమదాంతి త్రయమును।
విమర్శచేసెదనునవల విను వేడుకతో।
శమ మంతరింద్రియంబుల।
సమరసమున నోర్వఁబడుటె సారసనేత్రీ ॥ 134

తా. ఓపార్వతీ! వినుము. శమమనఁగా అంతరింద్రియముల నోర్చియుండుట యగును. అనఁగా అంతరింద్రియములైన కామాదులను నిగ్రహించి యుండుట.

క॥ దమము బహి రింద్రియంబుల।
భ్రమలను బొందకను నిలుపఁబడియుండుట య।
క్రముడగు నపకారునకును।
సుమహితముగ మేలుసేతసూ దాంతి యగున్ ॥ 135

తా. ఓగౌరీ! దమమనఁగా బహిరింద్రియముల భ్రమలను బొందక యుండుటయగును. అనఁగా బాహ్యేంద్రియములను విషయములయందు ప్రవేశింపనీయక అడ్డగించియుండుట. దాంతి యనఁగా, తన కెవ్వరేని యెట్టి యపకార మొనర్చినను ప్రత్యప కారము చేయక ఉపకారము చేయుట యగును దాంతియే తితీక్ష యనఁబడును. కొందఱు దీనినే శాంతి, యనియును చెప్పుదురు.

వ॥ ఇదియునుంగాక గుణత్రయ వివరణం బెట్లం టేని॥　　136

తా. సులభము.

గు ణ త్ర య వి వ ర ణ ము.

చ॥ కలిమియు గల్గియుండి యొక కాలమునందును లేమివచ్చినన్ ।
గలఁగకనుండుట ల్గురుని గన్గొని సేవనిరంతరంబు దాఁ ।
దొలఁగకచేసి కోరికలు దూరమునన్ విడిపించి కోపమున్ ।
బలిమి నడంప సత్త్వగుణ ప్రాభవమై విలసిల్లుఁ బార్వతీ॥　　137

తా. ఓపార్వతీ! ఒకప్పుడు సంపద కల్గియుండి, ఒకప్పుడు లేమి సంభవించినయెడల మనస్సునందు కలఁతజెందక యుండవల యును, ఎట్టికష్టమునందును తన గురువుయొక్క సేవను ఎల్లప్పుడును, చేయుచుండవలయును. కోరికలను దొలగించుకొని యుండవల యును. కోపమును అడగించుకొనవలయును ఇట్టిగుణము సత్త్వ గుణ విశేషమని చెప్పఁబడును.

శా॥ కామంబున్ బలు క్రోధమున్నతి ధనాకాంక్షల్ ప్రలాపంబులుం ।
బ్రేమన్భోగము రాగరోషములచేఁ బీడించుటల్ తాపమున్ ।
వేమారున్ బ్రబలంబుసేయుట మదోద్వృత్తిన్ సదాపొందుటల్ ।
భూమిన్ రాజస వర్తనల్ తెలియుమీ భోగీశవేణీ శివా ॥ 138

తా. ఓపార్వతీ! కామము (కోరిక,) మిక్కిలి కోపము, ధనాశ, విలపించుట, భోగము, రాగము, రోషము, అను వీనిచే ఇతరులను పీడించుట, తాపము, అనువీనిని వృద్ధిచేయుచుండుట, మదమును పెంపుసేయుట, ఇవి రాజసగుణము లనఁబడును.

మ॥ అతిమోహంబును నిర్దయత్వమును జాడ్యత్వంబును న్నిద్రయున్ ।
మితిలేనట్టుల నోదనంబు దినుటల్ మిథ్యానులాపంబులున్ ।

మతిచాంచల్యము ప్రల్లదంబులు తమోమార్గానుసారంబుగా।
సతతం బెంచి యఖండయోగపదవిన్ శర్వాణి చేరన్ వలెన్॥

తా. ఓశాంభవీ! అధికమైనమోహము, నిర్దయ, బుద్ధిమాంద్యము, నిద్ర, అమితభోజనము, అబద్ధములు పల్కుచుండుట, చిత్తచాంచల్యము, కటువుగా మాటలాడుట, ఇవి తమోగుణ లక్షణములగును. ఇది పనికిరానిదని యెంచి అఖండయోగపదవిని బొందవలయును.

వి. శ్లో॥ వైరాగ్యంక్షాంతిరౌదార్య మిత్యాద్యాస్సత్త్వసంభవాః॥

తా. వైరాగ్యము, ఓర్పు, ఉదారత్వము, ఇవిమొదలగు సుగుణములన్నియును సత్త్వగుణమువలనఁ గల్గినవి యగును.

శ్లో॥ కామక్రోధాలోభయత్నా విత్యాద్యారజసోత్థితాః॥

తా. ఇచ్ఛ, కోపము, లుబ్ధత్వము, విషయసుఖాదులయందు అభిలాష ఈ మొదలగు గుణములన్నియును రజోగుణమువలనఁ బుట్టినవియగును.

శ్లో॥ ఆలస్యభ్రాంతితంద్రాద్యా వికారాస్తమసోత్థితాః॥

తా. సోమరితనము, భ్రమ, నిద్రించుట, ఈ వికారములు తామసగుణమువలనఁ బుట్టినవి యగును.

శ్లో॥ సాత్త్వికైః పుణ్యనిష్పత్తిః పాపోత్పత్తిశ్చరాజసైః॥

తా. సాత్త్వికగుణములచేత పుణ్యమును, రాజసగుణములచేత పాపమును గల్గును.

శ్లో॥ తామసైర్నోభయంకింతు వృథా యఃక్షపణంభవేత్॥

తా. పుణ్యకార్యమునుగాని, పాపకార్యమునుగాని చేయక యుండుట తామసగుణ లక్షణమని తెలియవలయును.

ఇంకను ఈ విషయమును భగవద్గీత పదునాల్గవ అధ్యాయమునందును గనందగును.

తే॥ తరుణిరో విను మీ గుణత్రయము నాత్మ।
కాదు నిరతంబు నిన్నింటి గాంచుచున్న।
యెఱుక పరమాత్మయని లోన మఱువకెప్పు।
డన్యములుమాని ఘనయోగ మందుఁబొందు॥ 140

తా. ఓ పార్వతీ ! ఈ చెప్పఁబడిన సత్త్వరజస్తమములనెడి గుణత్రయమును పరబ్రహ్మము కాదనియును, ఎల్లప్పుడును వీని నంతయు జూచుచుండు ఎఱుకయే పరమాత్మయనియును దెలిసి నిరంతరమును దీనియందే (ఎఱుకయందే) చిత్తమునుంచి యితర ములనుమాని రాజయోగమును బొందుము.

వి. అనఁగా పరమాత్మ గుణరహితమైనది అనఁగా నిర్గుణ మని యర్థము.

శ్లో॥ కైవల్యం కేవలంశాంతం శుద్ధమత్యంతనిర్మలం ।
నిర్గుణం పరమంజ్యోతి రప్రమేయ మనుత్తమం ॥

తా. కైవల్యం, కేవలము, శాంతము, శుద్ధము, మలరహితము, నిర్గుణము, (సత్త్వరజస్తమోగుణములు లేనివి), పరమము, జ్యోతిస్సు, అప్రమేయము, అనుత్తమము, (అనఁగా ఉత్తమము కంటె ఉత్తమము,) ఇట్టి లక్షణములుగలది పరమాత్మ.

అని ఉపనిషత్తులందుఁ జెప్పఁబడి యున్నవి.

చ॥ అనవినిపార్వతిట్లనియె నక్షరరూప మహానుభావ నీ ।
ఘన మృదువాక్య జాలములు కర్ణబిలంబుల సోఁకినంతనే ।
తనివి జనింపదయ్యెభువిఁ దత్త్వవిదుల్ ప్రకటించి తెల్పు నా ।
ఘనమగు పంచకోశముల గల్గు మహత్త్వ మెఱుంగబల్కవే ॥

తా. ఇట్లు పార్వతీదేవికి పరమేశ్వరుఁడు చెప్పఁగా విని మరల నిట్లనియె. ఓ మహానుభావా ! శాశ్వతస్వరూపుఁడా ! నీ మృదులములైన వాక్యములు నాచెవిని సోఁకినది అయినను నాకు తృప్తి కలుగక యున్నది. భూమిలో పరమతత్త్వము నెఱింగిన సుజ్ఞానులు తెలియఁజేయునట్టి పంచకోశముల మహత్త్వమును నాకు లెస్సఁగా బోధింపుము ; అని యడిగెను.

వ॥ అనినఁ బార్వతికిఁ బరమశివుం డిట్లనియె ॥ 142

తా. సులభము.

పంచకోశప్రవర్తనము.

తే॥ పంచకోశంబులును బ్రాణపంచ ।
వాయువులును నైదును నుపవాయువులును నైదు ।

చెలఁగివర్తించు మార్గసంసిక్తపదవి।
తేటపఱిచెద వినుము నేర్పాటుగాను॥ 143

తా. ఓ పార్వతీ! వినుము. పంచకోశములైదును ప్రాణాది పంచవాయువులు ఐదును, ఉపవాయువులు ఐదును, ఇవి వర్తించు మార్గపద్ధతిని క్రమముగా నీకుఁ దెలియఁజేసెదను.

క॥ వినుము శరీరత్రయముల।
మొనసియు మఱిపంచకోశములు గలవని తా।
నసువుగ నిశ్చయమాత్మను।
గని యూహను దెలియ వలయు గరిరిపుమధ్యా॥ 144

తా. ఓ పార్వతీ! వినుము. స్థూల, సూక్ష్మ, కారణములను నీ శరీర త్రయములయందును పంచకోశములు గలవనియు, ఈ విషయమును బుద్ధిచే నెఱింగి యూహించి తెలిసికొనవలయునని భావము.

వ॥ అదియెట్లనిన, వేదంబునందు నన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయ, మానందమయ, మాత్మయని పల్కుచుండెడు గాన నందు ప్రథమంబైన యన్నమయకోశంబు వివరించెద॥ 145

తా. సులభము.

వి. శ్లో॥ అన్నంప్రాణోమనోబుద్ధి రానందం కోశపంచకం॥
అని దీనికిం బ్రమాణము నెఱుంగునది.

గీ॥ అన్నరసమున రక్త వీర్యములు ప్రబలి।
దాన దేహంబుఁబుట్టె నీతనువునకును।
నన్నమే మను నంతకు నక్కఱయ్యెఁ।
గూడు వదలిన దేహంబు గూడవదలు॥ 146

తా. ఓ పార్వతీ! అన్నరసమువలన రక్తమును వీర్యమును గలిగి అందువలన శరీరంబుఁగలిగెను. ఈ శరీరమునకు అన్నమే బ్రదుకునంతకాలముదాఁక కావలయును. ఎప్పుడు అన్నమును వదలుదుమో అపుడే శరీరమును వదలిపోవును. అనఁగా శరీరము నశించును.

వి. శ్లో॥ వ్యష్టిరేషాస్యవిశ్వస్య భవతి స్థూలవిగ్రహః ।
ఉచ్యతేఽన్నవికారత్వా త్కోశోఽన్నమయఇత్యయమ్ ॥

తా. విశ్వునియొక్క స్థూలశరీరమగు నీదేహము అన్నవికారమైనది గాన అన్నమయకోశమని చెప్పఁబడును.

శ్లో॥ దేహోయంపితృభుక్తాన్న వికారాచ్ఛుక్లశోణితాత్ ।
జాతఃప్రవర్ధతేఽన్నేన తదభావే వినశ్యతి ॥

తా. ఈశరీరము తలిదండ్రులు భుజించిన అన్నముయొక్క వికారమైన శుక్లశోణితములవలనఁ గల్గినది. అన్నముచేతనే వృద్ధినొందుచున్నది. అన్నము లేకున్న నశించుచున్నది.

శ్లో॥ ఆచ్ఛాదకత్వాదేతస్యా ప్యసేఃకోశపదాత్మనః॥

తా. ఇది కత్తికి ఒరవలె, ఆత్మకు కోశముగా నున్నది.

సీ॥ మఱి కానఁ దనువన్నమయకోశమని రార్య
లిది యాత్మ గాదని మదిఁదలంతు ।
రిందులోపలి ప్రాణ గంధవహాదులు
నయిదువర్తించుట యదియువినుము ।
ప్రాణవాయువు ఘ్రాణమూని యుచ్ఛ్వాస ని
శ్వాసముల్ నడపుచు సరవినుండు ।
మఱి యపానము గుదమందు నేమఱకుండి
మలమూత్రముల రెంటి వెలయనంపు ॥

తే॥ వ్యానవాయువు సర్వాంగవ్యాపియగుచు ।
దేహమును నింద్రియాదుల ద్రిప్పుచుండు ।
మఱిసమానుఁడు నాభి సుస్థిరుఁడు నగుచు ।
నిల్చి భుజియించు నన్నంబుఁ నెలమిఁబంచి ॥ 147

సీ॥ వెలయ డెబ్బదిరెండు వేలనాడులుతగ
బలిమైన పుష్టినింపలరఁజేయు ।
క్రమము నుదానుండు కంఠమందుననిల్చి
బహువిధవాక్యముల్ ప్రబలఁజేయు ।

నొనరంగ నీకమీఁద నుపవాయువులునైదు
వర్తించు సరణి నీ వరసి వినుము।
అల నాగవాయువు వెలయంగఁ గ్రక్కించు
గూర్మ్మవాయువు రెప్పఁగూర్చివేయు॥
తే॥ కృకరవాయువుతుమ్మించుఁ గూర్మి దేవ।
దత్తవాయువు దేహంబు తగనునీల్గ।
విరచియించు ధనంజయ మరణదేహ।
మరయఁబాయంగఁజేయును సరసిజాక్షి॥ 148

తా. ఓగౌరీ! వినుము. మఱియును సుజ్ఞానులు ఈ అన్నమయకోశమును ఆత్మకాదని యెంతురు. ఇందు ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము, అను పంచవాయువులు సంచరించుచున్నవి. ప్రాణవాయువు ఘ్రాణమునందునిల్చి ఉచ్ఛ్వాస నిశ్వాసములు చేయుచుండును. అపానవాయువు గుదమందు వసించి మలమూత్రములను విసర్జించుచుండును. వ్యానవాయువు సర్వాంగములయందును వ్యాపించి దేహమును ఇంద్రియములను త్రిప్పుచుండును. సమానవాయువు నాభియందుండి మనుజుఁడు భుజించు ఆహారమును పంచి డెబ్బదిరెండువేల నాడులకును నొసంగి పుష్టిని కలుగఁజేయును. ఉదానవాయువు కంఠమందు నిల్చి పలుతెఱఁగులగు వాక్యములను మాటలాడునట్లు కావించును. ఇదియునుంగాక నాగము, కూర్మ్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము, అను ఉపవాయువులైదును వర్తించు క్రమంబెఱింగించెద వినుము.

నాగవాయువు క్రక్కునట్లు (వమనము) చేయించును. కూర్మ్మవాయువు కనుల రెప్పలను మూయునట్లును తెఱచునట్లును చేయును. కృకరవాయువు తుమ్మించును. దేవదత్తవాయు శరీరమును నీల్గునట్లు ఆవు లింతను కలుగఁజేయును. ధనంజయవాయువు మరణదేహమును పాయునట్లు కావించును.

తే॥ ప్రాణవాయువు లాదిగాఁ బదియుఁగూడ।
ప్రాణమయ కోశమండ్రది పద్మనయన।
యివియుఁ బరమాత్మకారణ వృత్తియయిన।
ఘటముగాదు జడంబని కనవెతరుణి॥ 149

తా. పార్వతీ! వినుము. ప్రాణవాయువులైదును, ఉపవాయువులైదును జేరి ప్రాణమయకోశమని చెప్పఁబడును. ఇవియు పరమాత్మకు కారణంబైన స్థానముగాదనియును, జడమనియును దెలిసికొనుము.

వి. శ్లో॥ ఏతేప్రాణాదయః పంచపంచకర్మేంద్రియైస్సహ।
భవేత్ప్రాణమయఃకోశః స్థూలోయేనైవచేష్టతే॥

తా. ప్రాణవాయువులైదును కర్మేంద్రియములైదును గూడి ప్రాణమయకోశ మనఁబడును.

శ్లో. కోశత్రయంమిళితైవ్వేత ద్వపుస్స్యాత్సూక్ష్మమాత్మనః।

తా. ప్రాణమయ మనోమయ విజ్ఞానమయములను మూఁడు కోశములును జేరి సూక్ష్మశరీర మగుచున్నది.

తే॥ అతివరో ప్రాణమయకోశ మందునెపుడు।
గూడియుండు మనోమయ కోశభావ।
మెఱుకపఱచెద మానసం బెపుడుదుష్కృ।
తంబగునహంకృతియు సతతమనివెనఁగి॥ 150

తా. పార్వతీ! ప్రాణమయకోశముతోఁగూడ మనోమయ కోశము చేరియుండును. ఈ విషయమును దెలియఁజేసెదను. మనస్సు ఎప్పుడును దుష్టకార్యములు చేయుచుండును దీనితోఁ గూడ అహంకారము జేరియుండును.

సీ॥ బహిరింద్రియంబుల విహితుఁడై భోగించి
సుఖదుఃఖములలోనఁ జొచ్చినొచ్చి।
కర్తృత్వభోక్తృత్వవర్తి నేననుచును
దలఁప మనోకోశ మెలమినందు।

రదియు నాత్మాంగంబు ననరాదు జడమౌను
సరవి విజ్ఞానకోశంబు వినుము।
జాగ్రత్త్వమున స్వప్నసమయమందును జేయు
క్రియలన్ని సుప్తిలి లయముచేసి ॥

తే॥ యెఱుక కొంతైన లేకను మఱపుజెంది।
నిదురతీరినవేళను మదవిహారుఁ।
డగుచు జాగ్రదవస్థాదు లందుఁదగిలి।
విషయవృత్తుల నెఱుఁగుచు వెలయుఁజుమ్మి ॥ 151

తా. పార్వతీ ! వినుము. బాహ్యేంద్రియములకుం జిక్కి విషయలోలుఁడై సుఖములను అనుభవించి ఆసుఖానుభవముల వలనఁ గల్గు రోగాదిదుఃఖములకు లోనై బాధనొంది, నేనే కర్తను నేనే భోక్తను, అని తలంచుట మనోమయకోశ మనఁమడును. ఈ మనోమయకోశమును పరమాత్మకు స్థానము కాదు. ఇదియును జడమే యగును.

ఇఁక విజ్ఞానమయకోశ మెట్టిదనఁగా.—

జాగ్రదవస్థయందు స్వప్నావస్థయందును చేయునట్టి కార్యంబుల నన్నిటిని సుషుప్తియందును లయముచేసి జ్ఞాన మెంత మాత్రమును లేకుండ విస్మృతినొంది నిద్రనుండి మేల్కాంచిన మీఁద, మరల నెప్పటివలె జాగ్రత్తనొంది విషయాదులకు లోనై సర్వము నెఱుఁగుచు నుండు స్థితియే విజ్ఞానమయకోశ మని వివేకవంతులు చెప్పుదురు. ఇందున సుషుప్తి లయ మగుచుండునుగాన, నిదియు పరమాత్మకు స్థానముగాదు. ఇదియును జడాత్మకమని తెలిసికొనవలయును.

శ్లో॥ విజ్ఞానమయకోశస్స్యా ద్బుద్ధిర్జ్ఞానేంద్రియైస్సహ ।
విజ్ఞానప్రచురత్వేనా ప్యాచ్ఛాదకతయాత్మనః ।
విజ్ఞానమయకోశోయ మితినిద్వద్భిరుచ్యతే ॥

తా. జ్ఞానేంద్రియములైదును బుద్ధియును జేరి విజ్ఞానమయ కోశమగును. ఇది జ్ఞానప్రాచుర్యముగలదిగావునను, ఆత్మకు నాచ్ఛాదక మగుటచేతను విజ్ఞానమయకోశమని పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ అహంమమేత్యేవ సదాభి మానం।
దేహేంద్రియాదౌ కురుతేగృహాదౌ।
జీవాభిమానః పురుషోఽయమేవ।
కర్తాచ భోక్తాచ సుఖీచ దుఃఖీ॥

తా. ఈ విజ్ఞానమయ కోశాభిమాన పురుషుఁడే దేహేంద్రియములు మొదలగునవి నేనే యనియు, గృహాదులు నావి యనియు అభిమానించుచున్నాఁడు. మఱియు నేను జీవించెద, నేను చేసెద, నేను అనుభవించెద, నేను సుఖించెద, నేను దుఃఖించెద, అనెడి అభిమానము విజ్ఞానమయాత్మునకే యని తెలియవలయును.

శ్లో॥ మనోమనోమయఃకోశో భవేత్ జ్ఞానేంద్రియైస్సహ।
ప్రాచుర్యం మనసోయత్ర దృశ్యతేఽసౌ మనోమయః॥

తా. జ్ఞానేంద్రియములైదును మనస్సును జేరి మనోమయ కోశమగును. విజ్ఞానమయకోశమునందును జ్ఞానేంద్రియములు చేరి యున్నవి. ఇందు మనోధర్మము అధికముగా నున్నదిగాన, యిది మనోమయకోశ మని తెలియునది.

తే॥ కోవిదులు నిట్టివిజ్ఞానకోశ మరయ।
నొనర సుప్తియు లయమగుచుండుఁగాన।
నది శివాంగముగాదు జడాత్మయనుచు।
నిచ్ఛగింతురు మదిలోన హెచ్చుగాను॥ 152

తా. ఓ పార్వతీ! వినుము. జ్ఞానవంతులైనవారు ఈ విజ్ఞానమయ కోశమునందు సుషుప్తి లయమగుచుండును గాన నిదియు పరమాత్మకు స్థానము కాదనియును ఇదియు జడాత్మయనియును తెలిసికొందురు.

చ॥ ముదితరో నిద్రవేళఁదను మోహవశంబునఁజేయు చేష్టలన్ ।
వదలి సమస్తవర్తనల వాంఛలఁ బాసి యఖండవృత్తికిన్ ।
గదలక సుప్తనొందుటయె గట్టిగ నైదవకోశమందురే ।
యది పరమాత్మ కావరణమైన ఘటం బనరాదు శాంకరీ ॥ 158

తా. పార్వతీ ! వినుము. నిద్రాకాలంబునందు మోహవశంబుగాఁ జేయునట్టి కృత్యంబులను మాని, సకలమైన వృత్తులయందలి కోర్కులను తొలఁగించి, అఖండాకార పరబ్రహ్మమునందు లీనమై సుషుప్తి నొందుటయే అయిదవ కోశమనెడి ఆనందమయకోశ మని చెప్పుదురు. ఇదియు పరబ్రహ్మమునకు ఆవరణమైనట్టి స్థానం బని చెప్పరాదు.

వి. శ్లో॥ కారణేసత్త్వమానందమయో మోదాదివృత్తిభిః ।
తత్తత్కోశైస్తు తాదాత్మ్యా దాత్మాతత్తన్మయోభవేత్ ॥

తా. కారణ శరీరమందలి మలినసత్త్వగుణము ప్రియమోద వృత్తులతోఁ గూడినదై ఆనందమయకోశ మగును. ప్రత్యగాత్మ ఆయా కోశములతోఁగూడి ఆయా కోశాభిమానమువలన ఆయా కోశమయుఁ డని వ్యవహరింపఁబడు చున్నాఁడు అనఁగా అన్నమయుఁడు, ప్రాణమయుఁడు, మనోమయుఁడు, విజ్ఞానమయుఁడు, ఆనందమయుఁడు అను పేర్లచే నొప్పుచున్నాఁడు.

శ్లో॥ అస్తి కశ్చి త్స్వయంనిత్య మహం ప్రత్యయలంబనః ।
అవస్థాత్రయ సాక్షీ సన్ పంచకోశ విలక్షణః ॥

తా. జాగ్ర త్స్వప్న సుషుప్త్యవస్థలకు సాక్షీభూతుఁడును (నేను, నాది, నాయొక్క, అనునట్టి) అస్మత్ప్రత్యయ గోచరుఁడును అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయము లనెడి పంచకోశములకు విలక్షణుఁడుగను నుండు ఆత్మస్వరూప మును దెలిసికొనవలయును.




అ న్న మ య కో శ ప క్షి కి

1. అన్నమయకోశము=శిరస్సు.
2. జీవుని దక్షిణభుజము=దక్షిణపక్షము.
3. జీవుని వామభుజము=ఉత్తరపక్షము.
4. దేహమధ్యభాగము=ఆత్మ.
5. నాభిక్రిందిప్రదేశము=పుచ్ఛము.

అన్నమయకోశమనఁగా, ఇది స్థూలశరీరముతోఁ జేరినది.

ప్రా ణ మ య కో శ ప క్షి కి

1. ప్రాణము=శిరస్సు.
2. వ్యానము=దక్షిణపక్షము.
3. అపానము=ఉత్తరపక్షము.
4. సమానము=ఆత్మ. (ఆకాశము.)
5. పృథ్వి=పుచ్ఛము.

ప్రాణమయకోశమనఁగా, కర్మేంద్రియములైదును ప్రాణాదివాయువులైదునుజేరినది.

## 3 మ నో మ య కో శ ము.

మ నో మ య ప క్షి కి

1. యజుర్వేదము=శిరస్సు.
2. ఋగ్వేదము=దక్షిణపక్షము.
3. సామవేదము=ఉత్తరపక్షము.
4. ఆదేశము=(ఉపనిషత్ మొదలగు బ్రాహ్మణభాగము) ఆత్మ.
5. అథర్వాంగిరసము=పుచ్ఛము.

మనోమయ కోశమనఁగా, జ్ఞానేంద్రియములైదును, మనస్సును జేరినది.

## ౪. వి జ్ఞా న మ య కో శ ము.

వి జ్ఞా న మ య కో శ ప క్షి కి

1. శ్రద్ధ=శిరస్సు.
2. ఋతము=(సత్యము వచించుటకు హేతువైన వృత్తి,) దక్షిణపక్షము.
3. సత్యము=(సమదర్శనము) ఉత్తరపక్షము.
4. యోగము=(చిత్తైకాగ్రస్థితి) ఆత్మ.
5. మహత్తత్త్వము=(సమష్టిబుద్ధి) పుచ్ఛము.

విజ్ఞానమయకోశమనఁగా, జ్ఞానేంద్రియములైదును, బుద్ధియును జేరినది, (ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశములు మూఁడును లింగశరీరముతోఁ జేరినది.)

## ౫. ఆ న ం ద మ య కో శ ము.

ఆ న ం ద మ య కో శ ప క్షి కి

1. ప్రియవృత్తి=శిరస్సు.
2, మోదవృత్తి=దక్షిణపక్షము.
3. ప్రమోదవృత్తి=ఉత్తరపక్షము.
4. వృత్తిప్రతిబింబవిషయానందము=ఆత్మ.
5. బింబానందస్వరూపబ్రహ్మము=పుచ్ఛము.

ఆనందమయకోశమనఁగా. తన నైజస్వరూపము లేకుండుట, ఇది కారణశరీరముతోఁ జేరినది.

తే॥ కోమలిరో వినుమీ యైదుకోశములను।
నాత్మగాదని యావల నమరియున్న।
వర హిరణ్మయకోశమే గురిగలాత్మ।
కారణంబని కనుగొంద్రు కమలనేత్రి॥ 154

తా. పార్వతీ! వినుము. ఈ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములను నీ పంచకోశములను ఆత్మకాదని తెలిసి, ఈయైదుకోశములకంటె వేఱుగా నుండునట్టి హిరణ్మయకోశమే పరమాత్మకు కారణంబని అనఁగా స్థానంబని వివేకులు తెలిసికొందురు. అనఁగా ఈ పంచకోశములయందు పరమాత్మ లేదని భావము.

వి. శ్లో॥ పంచకోశపరిత్యాగే సాక్షిబోధావశేషతః।
స్వస్వరూపంసఏవస్యాత్ శూన్యత్వం తస్యదుర్ఘటం॥

తా. పంచకోశములకును అనాత్మభావము (ఆత్మకాదనుట) సిద్ధించుచున్నది. ఆ పంచకోశములకును సాక్షిగానుండు బోధ మేదియో అదియే తనయొక్క నిజరూపమగు పరబ్రహ్మరూపమగును. ఆ సాక్షిబోధమగు పరమాత్మకు శూన్యభావము సంపాదింపఁగూడదు. అనఁగాఆసాక్షిబోధమగు మేదియో అదే స్వస్వరూపమని తెలియవలయును.

క॥ అన్నమయాదులు కావని।
విన్ననువున శ్రుతులుపల్కు వేఱొకచోటన్।
బన్నుగ వీనికిఁబరమై।
యున్నది కోశమని శ్రుతుల నూహింపఁబడున్॥ 155

తా. పార్వతీ! వినుము. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములను నీయైదు కోశములును పరమాత్మకు స్థానములు కావనియును, ఈయైదింటికంటె వేరైనట్టి ఆఱవకోశమైన హిరణ్మయకోశమే పరమాత్మకు స్థానమనియును శ్రుతులు పల్కుచున్నవి. కావున దానిని ఊహించి తెలిసికొనవలయును.

సీ॥ ఆశ్రుతివాక్యంబు నదిహిరణ్మయకోశ
పరమైనదని లెస్స పల్కుచుండు।
నది జడాంగముగాక యాత్మాంగమైయొప్పి
సకలజ్యోతిర్గణ సాక్షియగుచు।
వెలసియాధారమై వెలివొప్పనీకోశ
గర్భంబులోపల గౌరమయిన।
స్ఫటికసంకాశమై ప్రకటించు జ్యోతిలో
వెలుఁగుచుండునునదె వినుముపంచ॥

తే॥ కోశములలోన వ్యాపించి కూర్మితోడఁ।
గలసి వెలిఁగించునదె కోశగతమునైన।
బ్రహ్మమనుచును వేదాంత భావపరులు।
పలుకుచుండెడిమార్గంబు తెలియుతరణి॥ 156

తా. ఓపార్వతీ! వినుము. వేదంబులు ఆపరమాత్మ హిరణ్మయ కోశమునందుండునట్టిదని చెప్పుచుండును. అది జడాంగము కాదు. పరమాత్మకు స్థానమై సకలజ్యోతిస్సులకును సాక్షియై యుండును. ఆహిరణ్మయకోశము నడుమ మిగుల తెల్లనిదియు స్ఫటిక కాంతియునైన జ్యోతియందు ఆ పరమాత్మ తేజరిల్లుచుండును. ఇది పంచకోశములయందును వ్యాపించి వానిని ప్రకాశింపఁజేయుచుండును. కొందఱు వేదాంతులు పంచకోశగతంబైన పరబ్రహ్మము నే తన్మయమని చెప్పుచుందురు "హిరణ్మయేపరేకోశే" అని శ్రుతియందును జెప్పఁబడి యున్నది.

క॥ సరసిజభవు బ్రహ్మంబని।
గుఱిగను శ్రుతిమూలమమరు కోమలిలక్ష్మీ।
కరమై హిరణ్యకోశము।
మఱివెల్గుచునుండునంద్రు మానినివినవే॥ 157

తా. ఓపార్వతీ! వినుము. కొందఱు బ్రహ్మదేవునే పరమాత్మయని చెప్పుదురు. కొందఱు సంపత్కరమైన హిరణ్మయకోశములో ప్రకాశించుచుండు చైతన్యమునే పరమాత్మయని చెప్పుదురు.

వి. శ్లో॥ ఏతత్సమష్ట్యుపహితం చైతన్యంసకలంవిభుః ।
హిరణ్యగర్భసూత్రాత్మా ప్రాణఇత్యపిపండితాః ॥

తా. ఈ లింగశరీరముతోఁ గూడినట్టియు, సర్వమునైనదియు, వ్యాపకమైనదియు, నగు చైతన్యము హిరణ్యగర్భుఁడు, సూత్రాత్మ, ప్రాణము అని పండితులు చెప్పుదురు.

శ్లో॥ హిరణ్మయేబుద్ధిగర్భే ప్రచకాస్తిహిరణ్యవత్ ।
హిరణ్యగర్భఇత్యస్య వ్యపదేశస్తతోమతః॥

తా. ప్రకాశరూపమగు బుద్ధిగర్భమునందు బంగారమువలె లింగశరీరాభిమానియగు హిరణ్యగర్భుఁడు (చైతన్యము) వసించుచున్నాఁడు.

శ్లో॥ చైతన్యంతైజస ఇతి నిగదంతిమనీషిణః ॥

తా. చైతన్యము, తైజసుఁడు, (హిరణ్యగర్భుఁడు) అని ఆ పరబ్రహ్మమును పండితులు చెప్పుచున్నారు. ఇట్లు శంకరాచార్యులవారు సర్వ వేదాంతసిద్ధాంతసంగ్రహమునందుఁ జెప్పియున్నారు.

సీ॥ శ్రీసూక్తమున లెస్స భాసురంబుగబల్కు
హైరణ్యవర్ణియం చతిశయముగ ।
నదిగాక చంద్రా హిరణ్మయమనుచును
నాదప్రబోధ మనంగబల్కు ।
నది నాదబిందు కళాతీత సారంబు
నలదహరాకాశ కలితమగును ।
శ్రీలక్ష్మిరూపమై చెలువొందు నదిగాన
వెల్గు నారాయణ విగ్రహంబు॥
తే॥ స్ఫటిక పరమాత్మ తేజసంపత్కరంబు ।
నాదిమధ్యాంతములనిండి యగణితంబు ।
నై వెలుగొందు నవ్యయానందపదవి ।
దహరమనియెంచి సత్యచిదాత్మఁగాంచు॥ 158

క॥ తస్యాపి దహరమనుచును ।
విశ్వంనారాయణాఖ్య వివరణమనుచుఁ ।

తస్యాశ్శిఖాయయనుచును।
శాశ్వతముగ శ్రుతులలోన జరుగును గౌరీ॥ 159

తా. ఓ గౌరీ! ఆలకింపుము. ఆపరమాత్మను కొందఱు శ్రీసూక్తమునందుఁ జెప్పఁబడినట్లు "హైరణ్యావర్ణి" యని జెప్పుదురు. మఱియు "చంద్రాహిరణ్మయ" మ్మనియును; నాదప్రబోధమనియును; నాదబిందుకళాతీతమనియును, దహరాకాశమునందుండునదియనియును; శ్రీలక్ష్మీస్వరూపమై యుండునదియనియును; నారాయణ స్వరూపంబై యుండునది యనియును; స్ఫటికకాంతి గల్గదై యుండునదియనియును; ఆదిమధ్యాంతములనిండి తేజరిల్లుచుండునదియనియును; దహరాకాశ మధ్యమందుండునది యనియును; కావుననే "తస్యాపిదహర" మ్మని శ్రుతులు పల్కుచుండునని యును; "విశ్వంనారాయణాఖ్య" మ్మని శ్రుతులు చాటుచుండునని యును; "తస్యాశ్శిఖాయామధ్యే" అని శ్రుతులు పల్కుచుండును గాన అచ్చటనే పరమాత్మ యున్నాఁడనియును; శ్రుతులు మొఱపెట్టుచున్నవి యనియును జెప్పుదురు.

క॥ ఈవిధమంతయు మఱవక।
భావంబున నిల్పియాత్మ భావనఁ గనఁగాఁ।
గేవల చిన్మయరూపము।
నీవౌదువటంచు నమ్మి నెగడుము తరుణీ॥ 160

తా. పార్వతీ! వినుము. ఇదివఱకుఁ జెప్పఁబడిన ప్రకారముగా శ్రుతులయందు ఆ పరమాత్మను గూర్చి బోధింపఁబడుచుండును. నీవు ఈ విధమునంతయును మనస్సునందు నిల్పి పరమాత్మ యిట్టిదని తెలిసికొనినప్పుడు కేవల చిన్మయస్వరూపమగు ఆ పరతత్త్వము నీవే యగుదువు. ఇట్లు నమ్మి వర్తింపుము.

వి. శ్రుతి॥ "ఆత్మావా ఇదమేకమేవ" అని ప్రారంభించి సమస్తమునకును ఈశ్వరుఁడే జగత్కారణ కర్తయనియు, అతఁడే పరబ్రహ్మమని తైత్తిరీయశ్రుతియందుఁ గలదు.

శ్రుతి। "సదేవసోమ్యేదమగ్రఆసీత్" ఇత్యాది శ్రుతులందు సృష్టికి పూర్వము సర్వమును బ్రహ్మమయముగా నుండెనని చెప్పఁబడెను. ఇట్లని ఛాందోగ్యోపనిషత్తునందుఁ ~~[illegible]~~. 6-2-1-

శ్రుతి॥ "తదేతత్సత్యం యథాసుదీప్తాత్" అను నిత్యాది శ్రుతులయందు అగ్నిజ్వాలలో నుండి నిప్పు రవలు కల్గునట్లు అక్షర శబ్దవాచ్యుఁడగు బ్రహ్మమునుండి సకల పదార్థములును గలిగెను. అని ముండకోపనిషత్తునందుఁ జెప్పఁబడి యున్నది. - 2-1-1-

శ్రుతి। "తద్ధేదం తర్హ్యవ్యా కృతమాసీత్" ఇత్యాది శ్రుతులు, సృష్టికి పూర్వము, అవ్యాకృతశబ్దముచే వ్యవహరింపఁబడు బ్రహ్మమయముగా నుండెననియును, సర్వమును ఆబ్రహ్మము వలనఁ బుట్టెననియును బృహదారణ్యక శ్రుతియందుఁ జెప్పఁబడి యున్నది.

అయినను సమస్తమును ఈశ్వరసంబంధినియగు మాయాశక్తిచేతనే సృష్టింపఁబడియున్నదని తెలియవలయును. దీనికే శ్రుతి ప్రమాణము ప్రబలతరమై యున్నది.

శ్రుతి॥ "మాయాంతుప్రకృతిం" అనిప్రారంభించి, మాయాశక్తిని ప్రకృతిగాను, మాయోపాధికుఁడగు మహేశ్వరుఁడు సృష్టికర్తయనియును, అతఁడే పరమాత్మయనియును, శ్వేతాశ్వతరోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది. శ్వే[illegible]- 4-10-

శ్రుతి। "శ్లో॥ మహామాయామహాలక్ష్మీ ర్మహాదేవీసరస్వతీ।
ఆధారశక్తిరవ్యక్తా యయావిశ్వంప్రవర్తతే॥

తా. ఈ సకలజగత్తును ఎవరిచే వ్యాపింపఁబడియున్నదో ఆమెయే మహామాయ, ఆమెయే మహాలక్ష్మి, ఆమెయే మహాదేవి, సరస్వతి, సర్వమునకును ఆధారభూతురాలు ఆశక్తియే. అవ్యక్తమును ఆమెయే; అని యోగశిఖోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది.

గీ॥ కుటిలకుంతలి యీపంచకోశభావ।
ప్రకరణంబెల్ల దెలిపితి నీఁకను నవలఁ।
బంచభూతాంశ లీదేహభావమందుః।
గలిసి వర్తించువిధ మంతఁ బలుకుదార్య॥ 161

తా. ఓ పార్వతీ! నేను నీకు పంచకోశ ప్రకరణంబంతయు నెఱింగించితిని. ఇఁకను పంచభూతాంశములు ఈ దేహమునందు ఎట్లు వర్తించుచున్నదో ఆ వివరణంబంతయు నెఱింగించెదను వినుము.

పంచ భూతాంశల నిరూపణము.

నరములు చర్మము మాంసము।
పరికింపఁగ రోమశల్య భావములై దుర్గ।
ధరణిగుణ మనుచుసాధులు।
నిరతంబెఱుఁగుదురు మదిని నీరజనేత్రీ॥ 162

తా. ఓ పార్వతీ! వినుము. నరములు, చర్మము, మాంసము, వెంట్రుకలు, ఎముకలు, ఇవి అయిదును పృథివి అంశములగును.

ఆ॥ మూత్ర శుక్ల రక్తములు జొల్లు చెమటతో।
నైదు జలగుణంబు లంద్రుబుధులు।
క్షుత్పిపాసరతియు సుప్తియు నలతతో।
నైదునిప్పు గుణము లౌ శుభాంగి॥ 163

తా. ఓ పార్వతీ! ఆలకింపుము. శుక్లము, రక్తము, మూత్రము, జొల్లు, చెమ్మట, ఇవి అయిదును జలాంశములగును. ఆఁకలి, దప్పి, రతి, సుషుప్తి, ఆలస్యము, అనునివి అయిదును అగ్న్యంశములగును.

తే॥ పరుగులిడుటలు నీల్గుటల్ వడఁకుటలును।
గంపమొందుట దృష్టించి కాంచుటలును।
వరుస నీయైదువిధములు వాయుగుణము।
లంద్రు సుందరముఖజిత చంద్రబింబ॥ 164

తా. ఓ శాంభవీ! వినుము. పరుగులిడుట, నీల్గుట, వడఁకుట, కంపమొందుట, దృష్టించిచూచుట, అనునివి అయిదును వాయువు అంశములగును.

తే॥ పరగఁగామంబు మోహంబు భయము లజ్జ।
క్రోధమును గూడి నీయైదు భేదములును।

గగనగుణములుగా నార్య లగణితముగఁ।
జెప్పుచుండుదు రొప్పుల కుప్పవినవె॥ 165

తా. ఓ పార్వతీ! ఆలకింపుము. కామము, మోహము, భయము, లజ్జ, క్రోధము, అనునివి అయిదును ఆకాశ గుణము లగును.

వి. "అస్థినాడీరోమమాంసా శ్చేతిపృథివ్యంశాః"
"మూత్రశ్లేష్మ రక్తశుక్ల స్వేదాఆబంశాః"
"క్షుత్తృష్ణాలస్య మోహా మైథునాన్యగ్నేః"
"ప్రచారణవిలేఖనస్థూలాత్యున్మేష నిమేషాదివాయోః"
"కామక్రోధలోభ మోహాభయానాన్యాకాశస్య"

ఇట్లు మీఁదఁ జెప్పిన పంచభూతాంశల యొక్క గుణవిశేషములను గూర్చి "శారీరకోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది."

తే॥ పుండరీకాక్షివిను పంచభూతవర్ణ।
నములభావంబు తెల్పితి నయముగాను।
వాసనాత్రయ ప్రకరణ వైభవంబు।
నమరఁదెల్పెద మది సందియములుమాను॥ 166

తా. ఓ కమలములవంటి కన్నులుగల పార్వతీదేవీ! ఇంతదనుక పంచభూతాంశములయొక్క వర్ణనలను నీకుఁదెలిపితిని. ఇఁక వాసనాత్రయ ప్రకరణము నెఱింగించెదను. సంశయమును మాని తెలిసికొనుము.

## వా స నా త్ర య వి వ ర ణ ము.

క॥ లోకమువారలు నడచిన।
పోకలదానడచికీర్తి బొందెద ననుచున్।
నేకాలంబునను కోరుట।
లోకపు వాసనయటండ్రు లోలాక్షిబుధుల్॥ 167

తా. ఓ గౌరీ! వినుము. లోకమునం దుండువారు పోవునట్టి మార్గమునందు నేను బోవువాఁడ ననుట లోకవాసన యని చెప్పుదురు.

తే॥ శాస్త్రములమర్మ మంతఁదాఁ జదివి చదివి।
వాని కనుకూలముగ గర్మవశ్యుఁడగుచు।
సరవినడువంగ శాస్త్రవాసన యటండ్రు।
భవ్యతరగాత్రి పార్వతీ పద్మనేత్రి॥ 168

తా. ఓ పార్వతీ! సకల ధర్మశాస్త్రముల రహస్యము నంతయుఁ దాను తెలిసికొని దాని కనుగుణముగ వర్తించుట శాస్త్ర వాసన యనఁబడును.

ఉ॥ అంగమునందు రోగమునంటక యుండఁగఁ గోర్కె గౌరి సా।
రంగమృగాక్షి పొందుల నిరంతరముౕ వసియించి కూర్మి శ్రీ।
రంగము కాశి కంచి యమరంగ బ్రయాగములాదిసేవనే।
యంగను దేహవాసననియందురు పెద్దలు భూధరాత్మజా॥ 169

తా. ఓ పార్వతీ! వినుము. శ్రీరంగము, కాశి, కాంచి, ప్రయాగ, మొదలగు తీర్థ క్షేత్రయాత్రలు చేయఁగోరుట దేహ వాసన యనఁబడును.

తే॥ రమణిరో విను వాసనాత్రయము నాత్మ।
కారణంబులు గావిన్ని క్రమముతోడ।
మరువ కేవేళ గాంచెడు నెఱుక యేదో।
నిరతమదినమ్మి పరమాత్మ నెలవుగనుము॥ 170

తా. ఓ పార్వతీ! ఇట్టి లోకవాసన, శాస్త్రవాసన, దేహ వాసన, అను త్రివిధవాసనలును ఆత్మకారణములు, లేక ఆత్మను దెలిసికొనుటకుఁ గారణములు కావనియును, ఎల్లపుడును జూచెడి యెఱుక (జ్ఞానము) ఎదియో దానిని ఎల్లపుడును నమ్మి పరమాత్మ స్థానమును గనుంగొనుము.

వి. సీ॥ అఖిలవిద్యలనెల్ల నభ్యసించితినని
యనుకొన శాస్త్రవాసనయటండ్రు।
తీర్థయాత్రలకునై త్రిమ్మరుచుండుట
దేహవాసనయనఁ దేజరిల్లు।
నవనిలోఁగలయెల్ల యనుభవంబులఁజెంద
నాసనొందుట లోకవాసనయగు।

వసుధనిట్టులనొప్పు వాసనాత్రయమను
వలయందుఁజిక్కిన వారికెట్టు।
లమితసంసారసాగర మమరదాఁటి।
ముక్తిఁబొందంగనేర్తుర మోహముడిగి।
చిరశుభాకారమోక్ష లక్ష్మీవిహార।
సాంద్రరుచిధుర్య దత్తయోగీంద్రవర్య॥

ఇట్లు దత్తయోగి శతకమునందుఁ జెప్పఁబడి యున్నది.

అని వాసనాత్రయ వివరణము నెఱుఁగఁదగును.

ఈ విషయమును గూర్చి ముక్తికోపనిషత్తునం దిట్లు చెప్పఁబడి యున్నది. ఎట్లనఁగా.—

శ్లో॥ లోకవాసనయా జంతో శ్శాస్త్రవాసనయాపిచ।
దేహవాసనయాజ్ఞానం యథావన్నైవజాయతే॥

తా. లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన, అను నీ మూఁడు వాసనలతోఁ గూడియుండు వానికి జ్ఞానము (బ్రహ్మజ్ఞానము) కలుగదు.

శ్లో॥ శుభాఽశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనాసరిత్॥

తా. (పుణ్యపాపరూపములైన) రెండు వాసనలనెడి ఏరు (నది) మార్గములచేతఁ బ్రవహించుచున్నది.

శ్లో॥ వాసనాద్వివిధాప్రోక్తా శుద్ధాచ మలినాతథా।
మలినాజన్మహేతుస్స్యా చ్ఛుద్ధాజన్మ వినాశినీ॥

తా. వాసన, (శుద్ధ) పుణ్యమనియు, (అశుద్ధ) పాపమనియు రెండువిధములు. అశుద్ధవాసన జన్మములను కలుగఁజేయును. శుద్ధ వాసన జన్మాదిదుఃఖములను నశింపఁజేయును. కావున త్రివిధ వాసనలను పరిత్యజింపవలయును.

వ॥ అని యిట్లు శివుండు పార్వతికింజెప్పె ననిన విని సంతోషహృదయులై శౌనకాదిమును లటమీఁది వృత్తాంతంబేమి చెప్పె నెఱుంగింపుఁ డనిన॥ 171

తా. సులభము.

క॥ వేదాంతార్థవినిశ్చిత।
భేద వివర్జితవివేక పురుషార్థగుణా స్లా।
ద మునివేష వినుత వి।
నోదప్రియధుర్యరామ యోగీశార్య॥ 172

మాలిని॥ అగణితగుణసారా యద్వయాత్మావిచారా।
విగతదురితజాలా వేదవిద్యానుపాలా।
ముగురకునాదిమూర్తీ మోక్షసారానువర్తీ।
జగదధికృతభాషా సచ్చిదానందవేషా॥ 173

తా. ఇట్లు గ్రంథకర్త సద్గురువర్యుని స్తుతించినాఁడు తక్కినది సులభము.

గద్య॥ ఇది శ్రీరామబ్రహ్మేంద్ర గురువర ప్రసాదలబ్ధ కవితావిలాస నారపామాత్య ప్రణీతంబైన శ్రీగురుగీతాసారంబునందు గురుమహిమావిధంబును గురుసేవా క్రమంబును వైరాగ్యప్రశంసయు షోడశ వికార సూత్రంబును షడూర్ముల నిర్మితంబును శమదమదాంతి క్రియయును, గుణత్రయ వివరణమును బంచకోశ ప్రవర్తనమును బంచభూతాంశల నిరూపణమును వాసనాత్రయ వివరణంబును నన్నది.

ప్ర థ మా శ్వా స ము.

సంపూర్ణము.

ఓం తత్సత్.





శ్రీ ర స్తు.

శ్రీరామబ్రహ్మ గురవే నమః.

# గు రు గీ తా సా ర ము.



## ద్వి తీ యా శ్వా స ము.

## ఆంధ్రతాత్పర్యవిశేషార్థసహితము.



క॥ శ్రీమద్దత్త కులాంబుధి ।
సోమవివేకాభిరామ సుజనస్వాంత ।
స్థేమ కమనీయ సుందర ।
రామ బ్రహ్మేంద్రనామ రక్తివిరామా॥ 1

వ॥ సకలతత్త్వార్థ స్వరూపుండగు శివుండు పార్వతి కిట్లనియె నట్లు సూతుండు శౌనకాది మహాఋషులం గనుంగొని సర్వ ప్రపంచోత్పత్తి హేతువగు పంచభూతాంశలవలన నైన పంచీకరణ ప్రకారం బెఱింగించెద సావధానులరై యాకర్ణింపుఁడని యిట్లనియె॥ 2

తా. సులభము.

పం చీ క ర ణ ము.

సీ॥ నిగమాంతవేద్యమై నిర్మలానందమై
సగుణనిర్గుణముల సాక్షియగుచు ।

నగణితాకారమై యక్షరరూపమై
ముగురకాధార సమూలమగుచు।
జగధధిష్ఠానమై సంపూర్ణ తేజమై
పగలు రేయొకటిగాఁ బ్రబలమగుచు।
ఖగమృగరూపమై ఘనసంవిదాభ్రమై
భగవద్విలాస సంభరితమగుచు।
తే॥ నవ్యయావ్యక్త మధ్యాత్ముఁ డచలుఁడగుచు।
నిండివెలుగొందు పరమాత్ము నేర్పువలనఁ।
గలిగె జగమని శ్రుతులలోపలనుబల్కు।
నాత్మ నాకాశ సంభూత మనుచునెపుడు॥ 3

తా. ఓపార్వతీ ! వినుము. వేదాంతముల (ఉపనిషత్తుల) వలనఁ దెలియఁబడునదియును, నిర్మలమైనదియును, ఆనందమైనదియును, సగుణమును నిర్గుణమును జూచుచుండునదియును, లెక్కింపనలవికానిదియును, నాశము లేనిదియును బ్రహ్మ విష్ణు రుద్రులకు ఆధారమైనదియును, ప్రపంచమునకు అధిష్ఠానమైనదియును, అఖండమైనదియును, ప్రకాశమైనదియును, రేయింబవలు నేకమైయుండునదియును, మృగపక్షి రూపమైనదియును, (అనఁగా విభజనము లేకయుండునదియును) ఆకాశమై యుండునదియును, భగవల్లీలతోఁ గూడినదియును, అవ్యయము అవ్యక్తము అను వీనిమధ్య ప్రకాశించునట్టివాఁడును, స్థిరముగనుండువాఁడును అగు పరమాత్మవలన జగంబు కలిగెను. ఆత్మచేత ఆకాశంబుకల్గెను. అని వేదములు చాటుచుండును.

వ॥ అది యెట్లంటేని॥ 4

తా. సులభము

గీ॥ ఆత్మవలనను నాకాశ మంబరమున।
వాయు మారుతమున నగ్ని వహ్నివలన।
జలము సలిలము ననుపృథ్వి జాతమయ్యెఁ।
దరుణి యీరీతి బంచభూతములు పుట్టె॥ 5

తా. ఓ పార్వతీ! వినుము. ఆత్మవలన ఆకాశమును, ఆకాశమువలన వాయువును, వాయువువలన అగ్నియును, అగ్నివలన జలమును, జలమువలన భూమియు, అను పంచభూతములు పుట్టెను.

వి. శ్లో॥ తమఃప్రధానప్రకృతి విశిష్టాత్పరమాత్మనః ।
వియత్పవన తేజోంబు భువోభూతానిజజ్ఞిరే ॥
అభూత్సకాశాదాకాశా ఆకాశాద్వాయురుచ్యతే ।
వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ ॥

తా తమస్సే ప్రధానముగాఁగల ప్రకృతితోఁ గూడిన పరమాత్మవలన ఆకాశమును, ఆకాశమువలన వాయువును, వాయువువలన అగ్నియును, అగ్నివలన జలమును, జలమువలన భూమియును అను పంచభూతములు కలిగెను.

శ్రుతి॥ "ఆత్మన ఆకాశస్సంభూతః" అను నిత్యాది శ్రుతులను గనందగును.

తే॥ పంచభూతాంశ లీరీతి బ్రజ్వరిల్లి ।
యొక్కటొక్కటి గలయక నుండఁజూచి ।
యాత్మఁ దూహించి తనదు నిజాంశఁజేర్చి ।
పంచభూతాలవేర్వేఱఁబంచె గౌరి ॥ 6

సీ॥ గగనంబు రెండుగా దగవిభజించిన
సందర్భమును జ్ఞాతమైచెలంగుఁ ।
గడసగమును నాల్గుగా భాగమొనరించి
పవనాగ్ని జలకాశ్యపములగూర్చ ।
మానసమును బుద్ధి మరి చిత్తహంకార
మనఁగను నాల్గునై కనఁగఁబడియె ।
గగనార్థభాగంబు నగును జ్ఞాతృత్వంబు
తగమనోబుద్ధి చిత్తంబు లవల ॥
తే॥ కన దహంకారజ్ఞాతను గలయనైదు ।
ఆప్రపంచకృతంబుదా నరసితెలిసి ।
యిన్నిటికి సాక్షికరుఁడునై యొసఁగుచున్న ।
యాత్మఁగనుఁగొని సవిశేషమందుబొందు ॥ 7

తా. ఓ పార్వతీ ! వినుము. ఆకాశభూతమును రెండుగాఁ జేసినయెడల, అందు సగము జ్ఞాతమై పరగును. తక్కిన సగమును నాలుగుగా విభజించి, దానితోఁగూడ వాయువు, అగ్ని, జలము, భూమి అను నాలుగు భూతములను (భాగప్రకారము) జేర్పఁగా, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అను నాలుగు అంతఃకరణములు కలిగెను. సగభాగమగు జ్ఞాతతోఁగూడ మనోబుద్ధి చిత్తాహంకారములు నాల్గునుజేరి ఈ యైదింటివలననే ఈ ప్రపంచము కలిగినదనియును, ఇన్నిటికిని సాక్షి పరమాత్ముఁడనియును దెలిసికొని ఆయాత్మను బొందుము.

వి. శ్లో॥ ఆకాశాదిగతాః పంచసాత్త్వికాంశాఃపరస్పరం ।
మనోబుద్ధిరహంకారః చిత్తంచేతి తదుచ్యతే ॥

తా. ఆకాశాది భూతములయొక్క సత్త్వాంశమువలన మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అను అంతఃకరణ చతుష్టయము కల్గెను.

సీ॥ వాయువు రెండుగా వలనొప్పఁజేసిన
నర్ధాంశవ్యానమై యలరుచుండు ।
మిగిలినసగమును దగ నాల్గుగను జేసి
యభ్రాగ్నిజలభూమి యందుఁజేర్ప ।
విను సమానముదాన ఘనతప్రాణాపాన
మును నివినాల్గుగా నొనరనయ్యె ।
వాయువర్ధాంశమా వ్యానంబుతోఁగూర్ప
నలసమానవ్యాన మగు నుదాన ॥

తే॥ ప్రాణవాయు వపానముతోన నైదు ।
పవనపంచీకృతంబును బ్రజ్ఞ దెలిసి ।
నిరతమీక్రియ లన్నిటి నెఱయఁగాంచు ।
నాత్మఁ నెఱిఁగియుఁ గైవల్యమందుఁ బొందు ॥ 8

తా. ఓ పార్వతీ ! వినుము. వాయు భూతమును రెండుగా విభజించినయెడల, అందొకభాగము వ్యానమై పరగును. తక్కిన సగమును నాలుగుగా విభజించి అందు ఆకాశము, అగ్ని, జలము,

భూమి, అను వీనిని చేర్చినయెడల సమానము, ఉదానము, ప్రాణము, అపానము అనునివి నాలుగు వాయువు లగును వీనితో వాయువు యొక్క అర్థాంశమైన వ్యానవాయువును జేర్పఁగా పంచప్రాణ వాయువు లగును. ఈ ప్రాణవాయు పంచీకరణమును దెలిసి, వీని క్రియలను చూచునట్టి పరమాత్మునిఁ దెలిసికొని కైవల్యము బొందుము.

వి. శ్లో॥ సమస్తేభ్యోరజోంశేభ్యో వ్యోమాదీనాంక్రియాత్మికా ।
ప్రాణాదయస్సముత్పన్నాః పంచాప్యాంతరవాయవః॥

తా. ఆకాశాదుల రజోంశములవలన ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము, అను పంచ ప్రాణవాయువులు పుట్టెను.

సీ॥ అనలంబు రెండుగా నొనరించియర్థాంశ
మీక్షణమైసదా యొసఁగుచుండు ।
నగ్నితో నర్థాంశమదినాల్గుగను జేసి
జలవాయు బభ్రభూములను గూర్పఁ
ద్వక్కు కర్ణములు జిహ్వ ఘ్రాణములతోడ
నొనరంగనాల్గుగాఁ నుండఁబడియె ।
ననలార్థభాగమా నక్షియందును జేర్పఁ
ద్వక్చక్షు శ్రోత్రజిహ్వాలునునవల॥
తే॥ ఘ్రాణమునుగూర్ప నీయైదు ఘుట్టిగాను ।
నగ్నిపంచకమనుభావ మంతఁగాంచి ।
తెరువుమఱపును లేక సుస్థిరుఁడునైన .
నాత్మ సేవించి పరమార్థ మందుబొందు॥ 9

తా. ఓ పార్వతీ! వినుము. అగ్నిని రెండుభాగములుగాఁ జేసినయెడల ఒక్కభాగము చక్షువై పరఁగుచుండును. మిగిలిన సగమును నాలుగుగా విభజించి ఒక్కొక్కదానితో జలము, వాయువు, ఆకాశము, భూమి, అను నీనాలుగు భాగములను జేర్చిన యెడల త్వక్కు, కర్ణములు, జిహ్వ, ఘ్రాణము, అను ఇంద్రియ ములును, అర్ధభాగమైన చక్షువుతోఁగూడఁ జేరి జ్ఞానేంద్రియ పంచ

కమును గల్గెను. అగ్ని పంచీకరణ లక్షణము నెఱింగి సుస్థిరముగా పరమాత్మను సేవించి పరమార్థమును (మోక్షము) బొందుము.

శ్లో॥ శ్రోత్రంత్వక్చక్షుషీజిహ్వా ఘ్రాణంచేంద్రియపంచకం॥

తా. శ్రోత్రము, త్వక్కు, చక్షుస్సు, జిహ్వా, ఘ్రాణము, అను నివి ఐదును జ్ఞానేంద్రియ పంచకమగును. ఇవి పంచభూతము యొక్క సత్త్వగుణాంశములవలనఁ బుట్టినదని తెలియవలయును.

| పంచభూతములు. | గుణములు. | ఇంద్రియములు. |
|---|---|---|
| 1. ఆకాశము. | సత్త్వగుణము. | శ్రోత్రము. |
| 2. వాయువు. | సత్త్వగుణము. | త్వక్కు. |
| 3. అగ్ని. | సత్త్వగుణము. | చక్షువు. |
| 4. జలము. | సత్త్వగుణము. | జిహ్వా. |
| 5. భూమి. | సత్త్వగుణము. | ఘ్రాణము. |

సీ॥ నీరంబు రెండుగా వేత్వేఱుఁబంచిన
నర్ధాంశరసమునై యమరుచుండు।
జలములో మిగిలిన సగమునాల్గుగ జేసి
నది వి వాయువు వహ్ని యవనిగలప।
శబ్దంబు రూప రస స్పర్శలును గంధ
మును నివియయిదును ముదమునాయె।
నందులోనర్ధాంశ మగురసంబునుగూర్ప
రసముస్పర్శమురూప రసముగంధ॥
తే॥ మొనరనివి యైదుగుణముల నరసియెఱిఁగి।
మనసులోపల నిరతంబు మఱపుజేసి।
చేతనాచేతనములందుఁ జెలఁగివెల్గు।
నక్షరునిగాంచి నిర్వాణ మందుబొందు॥ 10

తా. ఓ పార్వతీ! వినుము. జలమును రెండుగాఁ జేసిన యెడల, ఒకటి రసమగును. తక్కిన సగభాగమగు జలముతో ఆకాశము, వాయువు, అగ్ని, భూమి అను నీ తత్త్వములను జేర్చిన యెడల శబ్దము, రూపము, రసము, స్పర్శము, గంధమును గల్గెను. మొదటి సగమగు రసమును వీనితోఁగూడఁ జేరి శబ్దాదిగుణములు

అయిదాయెను. వీనిని మనస్సునందు దెలిసికొని, ఇవి జలగుణము లనియును, ఈరైదింటికి కారణభూతుఁడైన పరాత్పరునిఁ దెలిసి కొని కైవల్యమును బొందుము.

శ్లో॥ శబ్దస్పర్శౌరూపరసౌ గంధో భూత గుణా ఇమే।
 ఏక ద్వి త్రి చతుః పంచ గుణావ్యోమాదిషుక్రమాత్ ॥

తా. శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, అను నివి ఆకాశాది పంచభూతముల గుణములగును ఎట్లనఁగా,

| పంచభూతములు. | గుణములు. | గుణములసంఖ్య |
|---|---|---|
| 1. ఆకాశము | శబ్దము | ఒకటి |
| 2. వాయువు | శబ్దము, స్పర్శము | రెండు |
| 3. అగ్ని | శబ్దము, స్పర్శము, రూపము | మూఁడు |
| 4. జలము | శబ్దము, స్పర్శము, రూపము, రసము | నాలుగు |
| 5. భూమి | శబ్దము, స్పర్శము, రూపము రసము, గంధము | ఐదు |

సీ॥ అవనిని రెండుగా వివరించిపంచిన
  నందులో నర్థాంశమయ్యె వాయు।
 వామీద నర్థాంశ మదినాల్గుగను జేసి
  నభ వాయు వహ్ని వనములఁ గూర్ప।
 వాక్పాణి పాదయుపస్థలు నరయంగ
  నాల్గునై విలసిల్లు నవల మఱియు।
 నిలలోని యర్థాంశ మల రుపాయువుఁజేర్ప
  వాక్పాణి పదపాయువయును గుహ్య॥
తే॥ మమరనయిదును పృథ్విగుణములు నగుచుఁ।
 బ్రకటమైయుండు దనువున భవ్యముగను।
 నున్న పరమాత్మ సతతంబు తిన్నగాను।
 మనసులోనెంచి యద్వయమందు బొందు॥ 11

తా. పార్వతీ! వినుము. భూమి తత్త్వమును రెండుగా విభ జింపవలయును. అందొకటి పాయువగును. తక్కిన భాగమును

నాలుగుగా విభజించి అం దొక్కొక్కదానితోఁగూడ ఆకాశము, వాయువు, అగ్ని, జలము, అను నాలుగుభూతములను జేర్పఁగా అది వాక్కు, పాణి, పాదము, ఉపస్థలగును. ఈనాల్గుతోఁగూడ మొదటి సగమైన పాయువును జేర్పఁగా అయిదును (పంచ) కర్మేంద్రియములగును ఇవి పృథ్విగుణములనియును, వీనికి సాక్షీయగువాఁడు పరమాత్ముఁడనియును దెలిసికొని మోక్షమును బొందుము.

వి. శ్లో॥ వాక్పాణిపాదపాయూపస్థై రత్మై స్త్రియాజనిః।
ముఖాదిగోళకేష్వాస్తే తత్కర్మేంద్రియపంచకం॥

తా. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ, అను నివి అయిదును ముఖము మొదలగు గోళకములయందు ఉండును.

| పంచభూతములు. | గుణము. | ఇంద్రియములు. |
|---|---|---|
| 1. ఆకాశముయొక్క | రజోగుణము | వాక్కు |
| 2. వాయువుయొక్క | రజోగుణము | పాణి |
| 3. అగ్నియొక్క | రజోగుణము | పాదము |
| 4. జలముయొక్క | రజోగుణము | ఉపస్థ |
| 5. పృథివియొక్క | రజోగుణము | పాయువు |

భగవంతుఁడగు పరమాత్మ పృథివ్యప్తేజోవాయురాకాశములను పంచభూతములను సృష్టించినాఁడు. పిమ్మట,

శ్లో॥ ద్విధావిధాయచైకైకం చతుర్ధాప్రథమంపునః।
స్వస్వేతరద్వితీయాంశై ర్యోజనాత్పంచపంచతే॥

తా. ఒక్కొక భూతమును రెండుగాఁజేసి, అందొక్కదానిని అట్లేయుంచి, తక్కినసగమును నాలుగుగాఁ విభజించి, అందు మొదటి భాగాంశములను జేర్చుటవలన ఆకాశాది సూక్ష్మభూతములైదు కలిగెను.

క॥ పంచీకరణం బిదియని।
పంచాస్యుఁడు గౌరి కరయఁ బల్కిన యవలన్।
జంచల తత్త్వ విశేషము।
లంచితముగ దెల్పువాఁడ నంబుజనేత్రీ॥ 12

తా. ఇవ్విధముగా పంచీకరణ లక్షణమును పరమశివుఁడు పార్వతీ దేవికి తెలియఁబఱచి, అనంతరము పార్వతీదేవినిం గాంచి యిట్లనియె. పద్మదళములవంటి నేత్రములుగల ఓ పార్వతీ! ఇఁక చంచలతత్త్వ ప్రకరణము నెఱింగించెదను. సావధానచిత్తవై వినుమని యిట్లు చెప్పందొడంగెను.

## చంచలతత్త్వ ప్రకరణము.

ఉ॥ జ్ఞాతసమానవాయువును గట్టిగఁగూడియు గర్ణమార్గముల్ ।
బ్రీతిగఁ జేసి శబ్దముల భేద వివాదములన్ గ్రహించి ప్ర।
ఖ్యాతిగ వాక్కుచేవిమల కారణకార్యము లన్నినేయుచున్ ।
జేతనజాలముల్ తిరుగుచేష్టలు నిట్టులనయ్యెఁ బార్వతీ॥ 13

తా. ఓ పార్వతీ! వినుము. జ్ఞాత (పరమాత్మ) సమాన వాయువుతోఁ గూడి కర్ణమార్గముగా శబ్దములయొక్క భేదములను వివాదములను గ్రహించి వాక్కుచే కారణ కార్యములను నేయుచుండును. ఇట్లు సకలచేతనములును (జంతువులును) జేయుచుండును.

మ॥ మనసోదగ్రతవ్యానవాయువును సమ్మానింపుచున్ దేహమం।
దున శీతోష్ణ మృదుత్వ కర్కశగుణస్తోమంబులుం బాణిచే।
తను నిర్వర్తనసేయుచుండునదియే తత్త్వజ్ఞులుం గాంచి పా।
వనమౌ సత్య చిదాత్మఁజూడఁగ సదా వాంఛింతురే శాంభవీ॥

తా. పార్వతీ! వినుము. మనస్సు వ్యానవాయువుతోఁజేరి శీతము, (చల్లదనము), ఉష్ణము, (వేఁడి), మృదుత్వము (మెత్తన), కర్కశము (కఠినము), అను నీ గుణములను హస్తముచేఁ దెలిసికొను చుండును. బ్రహ్మజ్ఞానులు (వీనిని తెలిసికొని) పరబ్రహ్మమును గాంచుటకుఁ బ్రయత్నము సేయుచుందురు.

శా॥ బుద్ధ్యోదానునిగూడి యాక్షణమునం బూర్ణంబుగానిల్పి సా।
రార్థంబు న్సిత నీల పీతహరితల్ రక్తాదిషడ్వర్ణముల్ ।
బాధ్యత్వంబునగాంచి నేత్రములచే భ్రాంతుల్ సదాదీర్చుచున్ ।
మిథ్యల్ గాఁగని విశ్వసింపరిలలో మేధావిధిజ్ఞుల్ శివా॥ 15

తా. ఓ పార్వతీ! వినుము. బుద్ధి ఉదానవాయువుతోఁగూడి తెలుపు, నలుపు, పచ్చ, పసుపు, ఎఱుపు, మొదలగు ఆఱువిధము లగు వర్ణములను తెలిసికొని నేత్రములచే భ్రాంతిని పోఁగొట్టు కొనుచుండును. పరమార్థ మెఱింగినవారు ఇవి యంతయు అబద్ధం బని యెఱింగి (పరమాత్మను) దెలిసికొనవలయు నని ప్రయత్నింతురు.

ఉ॥ చిత్తముప్రాణవాయువును జెల్వగఁగూర్చియుజిహ్వయందుసు।
హత్తి కషాయ తిక్త మధురామ్ల రసాదులదాగ్రహించి య।
త్యుత్తముగా సమస్త మనువొందగ సంగమ మాదికర్మముల్ ।
నిత్యము సేయఁగోవిదులు నెంచరు సత్తుగ భూధరాత్మజా॥ 16

తా. ఓ పార్వతీ! వినుము. చిత్తము ప్రాణవాయువుతోఁ జేర్చి జిహ్వయందు హత్తించి తొగరు, చేదు, తీపు, పులుసు, మొదలగు రసములను గ్రహించి, సంగమాది కర్మములను నిరంతరమును సేయుట కంగీకరింపరు.

గీ॥ ఉవిద గర్వమునం దపానుండుగూడి।
ఘ్రాణమున గంధదుర్గంధ కరణి తెలిసి।
పాయుదానిని నిర్వర్తిసేయుచున్న।
దెఱిఁగి భ్రాంతిని బొంద రిద్ధరణి బుధులు॥ 17

తా. ఓ గౌరీ! వినుము. అహంకారమునందు అపాన వాయువు జేరి, ఘ్రాణమువలన సుగంధ దుర్గంధములను విసర్జించును. కావున జ్ఞానులు వీనికి భ్రమింపరు.

గీ॥ ఇంతటికి సాక్షికరుఁడున్నె యెసగునాత్మ।
జ్ఞాత్రవచ్ఛన్నుఁడయిన విజ్ఞానుఁడంచు
రమణి యూరుపు లంతఃకరణమటంచు
బలుకుచుండుదు రొకటిగాఁ బ్రజ్ఞ మెఱసి॥ 18

తా. ఓ పార్వతీ! వినుము. ఈ చెప్పినట్టి వాని కన్నిటికిని సాక్షియై యుండునట్టి ఆత్మయే జ్ఞాతయై యున్నాఁడనియును, అతఁడే విజ్ఞానుఁడనియును దెలిసికొనుము కొందఱు ఉచ్ఛ్వాస

నిశ్వాసములగు అంతఃకరణమని చెప్పుదురు. (అనఁగా ఇవి కావని యభిప్రాయము.)

తే॥ ఇంతి చంచల తత్త్వము లివియటంచు ।
దెలియఁబల్కితి నీకమీఁద నెలమితోడఁ ।
దను చతుష్టయవిధముల ధర్మమంత ।
వినుముచెప్పెద మదినూని వనజనయన ॥ 19

తా. ఓ పార్వతీ! ఇవి చంచలత్త్వములు. ఇఁక జీవదేహ చతుష్టయ ధర్మమును తెలియఁజేసెదను. లెస్సఁగా. దెలిసి కొనుము.

జీవతను చతుష్టయ లక్షణము

వ॥ అది యెట్లనిన జీవతను చతుష్టయ లక్షణం బెఱింగించెద ॥ 20

తా. సులభము.

సీ॥ పదియింద్రియంబులు పదివిషయంబులు
జ్ఞాతాదులైదు విఖ్యాతముగను ।
నీపంచవింశతి నేపారుచునుగూడి
స్థూలదేహంబు విస్ఫురణనుండు ।
జాగ్రదవస్థయు చక్షుపుస్థానంబు
యుక్తభోగము క్రియాశక్తిరాజ ।
సగుణంబు విశ్వుండు తగనభిమాని జీ
వాత్మయాత్మ యకారమాతృకయును ॥
తే॥ వ్యావహారిక జీవుఁడై కేవలంబు।
నీవిధంబున వర్తించు నిదియెస్థూల ।
మంద్రు భావజ్ఞ లిలలోన నంబుజాక్షి ।
యిఁకను సూక్ష్మాంగవర్తన లెఱుఁగవినవె ॥ 21

తా ఓ పార్వతీ! వినుము. త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము; జిహ్వ, ఘ్రాణము అను జ్ఞానేంద్రియములైదున్నూ వాక్కు, పాణి, పాదము, వాయువు, ఉపస్థ, అను కర్మేం[illegible] దును, జేరి పదియింద్రియములును, మఱియు ; [illegible]
జ్ఞానేంద్రియము లైదింటియొక్క

1. త్వక్కు.—వాయుభూతముయొక్క సత్త్వగుణభాగము, ఇది స్పర్శములు గ్రహించుచున్నది.

2. చక్షుస్సు—అగ్నియొక్క సత్త్వగుణభాగము, ఇది రూపమును గ్రహించుచున్నది.

3. శ్రోత్రము.—ఆకాశముయొక్క సత్త్వగుణభాగము, ఇది శబ్దములు గ్రహించుచున్నది.

4. జిహ్వ—జలముయొక్క సత్త్వగుణభాగము, ఇది రసమును గ్రహించుచున్నది.

5. ఘ్రాణము.—పృథ్వియొక్క సత్త్వగుణభాగము, ఇది ఘ్రాణేంద్రియము గంధమును గ్రహించుచున్నది.

కర్మేంద్రియములైదింటియొక్క విషయములైన,

1. వాక్కు.—ఆకాశముయొక్క రజోగుణభాగము, ఇది వచించునట్టి కర్మమును జేయుచున్నది.

2. పాణి.—వాయువుయొక్క రజోగుణభాగము, ఇది పుచ్చుకొనుట అను కర్మమును జేయుచున్నది.

3. పాదము.—అగ్నియొక్క రజోగుణభాగము, ఇది గమనము అను కర్మమును జేయుచున్నది.

4. పాయువు.—పృథ్వియొక్క రజోగుణభాగము, ఇది మలవిసర్జనము అను కర్మమును చేయుచున్నది.

5. ఉపస్థ.—జలముయొక్క రజోగుణభాగము, ఇది శుక్లశోణితాదిరసములను విసర్జనము అను కర్మమును జేయుచున్నది.

ఈ చెప్పఁబడిన పది విషయములను,

ఈ సర్వేంద్రియ వ్యాపారములను జూచుచుండు పరమాత్మయ్యును, అంతఃకరణ చతుష్టయమును, అనఁగా:—

అంతఃకరణ చతుష్టయమునందు:—మనస్సు.

శ్లో॥ మనోద శేంద్రియాధ్యక్షం హృత్పద్మగోళకస్థితం।
తచ్చాంతః పార్వతీ హ్యా ష్వస్వాతంత్ర్యాద్విన్దేంద్రియైః॥

జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదింటికిని తాను యుండునట్టి అతఁడే విజ్ఞానుఁడనియును హృదయకమల గుహాయందుండును. ఇది

ఇంద్రియములతోఁ జేరనియెడల దీనికి స్వతంత్రశక్తిలేదు. కావున ఇది అంతఃకరణ మనఁబడును.

శ్లో॥ సత్త్వంరజస్తమశ్చాస్య గుణావిక్రియతేహితైః ॥

తా. సత్త్వము, రజస్సు, తమస్సు, అను నీ మూఁడును మనస్సుయొక్క గుణము లగును.

శ్లో॥ మనోవిమర్శరూపంస్యాత్ బుద్ధిస్స్యాన్నిశ్చయాత్మికా॥

1. మనస్సు —విమర్శరూప (సంశయరూపవృత్తి) గలది. అనఁగా సవికల్పవికల్పరూపమైనది.

2. బుద్ధి —నిశ్చయాత్మకరూప (ప్రయత్నస్వరూప) వృత్తి కలది.

3. చిత్తము.—చింతనా (విచార) రూపవృత్తికలది.

4. అహంకారము.—నేను అనెడి అభిమానవృత్తికలది.

జ్ఞాత.—వీని నన్నిటిని దెలిసికొనుసాక్షి.

ఇవి ఇరువదియైదును జేరి స్థూలదేహ మనంబడును.

| | | |
|---|---|---|
| ఈస్థూలదేహముయొక్క. | అవస్థ. | జాగ్రత్తు. |
| ,, | స్థానము | చక్షుస్సు |
| ,, | భోగము | యుక్తము |
| ,, | శక్తి | క్రియాశక్తి |
| ,, | గుణము | రాజసము |
| ,, | అభిమాని | విశ్వుఁడు |
| ,, | మాతృక | అకారము |
| ,, | జీవుఁడు | వ్యావహారికుఁడు |

ఇట్లు స్థూలశరీరమును దెలియఁదగును. ఇఁక సూక్ష్మశరీరము నెఱింగించెదను వినుము.

సీ॥ అయిదు జ్ఞానేంద్రియా లయిదుకర్మేంద్రియాల్
ప్రాణాదిమారుత పంచకంబు।
మనసుబుద్ధియు రెండు పెనఁగొన నివి సప్త
దశ లింగభౌతికత్వంబునయ్యె।

జరలింగదేహమై జగతి వర్తిలును
స్వప్నావస్థయును గంఠమలరనునికి।
స్వేచ్ఛానుభోగంబు నిచ్ఛయాశక్తియు
సాత్త్వికగుణము తైజసుఁడుదీని॥

తే॥ కరయ నభిమాని మాతృక యగు నుకార
మంతరాత్మాత్మ ప్రాభాన్యుఁడైనజీవుఁ
డిట్టిరీతినిసూక్ష్మాంగ మెసఁగుచుండుఁ।
గారణాంగ ప్రవర్తన క్రమమువినవె॥ 22

తా. ఓ పార్వతీ! వినుము. జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, ప్రాణాదివాయువులు అయిదు, మనస్సు, బుద్ధి, అను నివి పదునేడును జేరి లింగ (సూక్ష్మ) శరీరమగును.

| | | |
|---|---|---|
| ఈసూక్ష్మదేహముయొక్క. | అవస్థ. | స్వప్నము. |
| ,, | స్థానము | కంఠము. |
| ,, | భోగము | స్వేచ్ఛ |
| ,, | శక్తి | ఇచ్ఛ |
| ,, | గుణము | సాత్త్వికము |
| ,, | అభిమాని | తైజసుఁడు |
| ,, | మాతృక | ఉకారము |
| ,, | జీవుఁడు | ప్రాతిభాసికుఁడు |

ఇట్లు సూక్ష్మశరీరము ప్రవర్తిల్లుచుండును. ఇఁక కారణ శరీర లక్షణం బెఱింగించెదను వినుము.

తే॥ తరుణిరో విను మీ తనుద్వయమునకును।
గారణంబయ్యు విలసిల్లుఁ గారణాంగ।
క్రమముఁ దెల్పెద సుప్తిని సమసియున్న।
యోర్పుగలిగుండు పవనసంయు క్తమగుచు॥ 23

తా. ఓ పార్వతీ! వినుము ఈ స్థూలసూక్ష్మములనెడి శరీరములు రెంటికిని కారణమైన కారణశరీరక్రమము నెఱింగించెదను. అది సుషుప్తియందు లయమై ఆ పరమాత్మ ప్రాణవాయువుతోఁ జేరి శాంతముతో నుండును.

మ॥ పవనాధారుఁడునై నభంబుప్రబలుం బద్మాక్షి ఖంవాయువుల్ ।
సవిశేషస్థితినుండఁగా ననలముం సంప్రీతితో నీరముం।
భవమైనాలుగునుండగాను భువియుం బ్రఖ్యాతమై యుండఁగా
నవలీలం మఱిపంచభూతములు నిట్లైయుండినం లీనమా॥ 24

తా. ఓ పార్వతీ! వినుము. వాయువు ఆధారముగా ఆకాశము కానంబడును. అట్టి పంచభూతము లెట్లు పుట్టినవో అట్లే ఒకదానితో నొకటి లయమగును. పృధ్వి జలమునందును, జలము అగ్నియందును, అగ్ని వాయువునందును, వాయు ఆకాశము నందును లీనమై పోవును.

సీ॥ వటబీజమునయందు వటమొప్పలిప్తమౌ
గతి కారణాంగ సంగతియు దనరు।
సుషుప్తి యవస్థయు సొరిదినిహృత్స్థా నన
మజ్ఞానభోగంబె నమరద్రవ్య।
శక్తి తమోగుణ స్వాభావికము ప్రాజ్ఞుఁ
డభిమాన మాతృక యౌ నుకార
మండలాత్మయు వ్యాపకాత్మయనం బడుఁ
బారమార్థిక జీవభావుఁడగుచు॥

తే॥ నిట్టిదగు సంజ్ఞలందుండు గట్టిగాను।
గారణాంగం బటంచును ఘనులవలన।
వినఁగఁ బడుచుండు వనజాక్షివినవె యవల।
నమరియుండు మహా కారణాంగవిధము॥ 25

తా. ఓ పార్వతీ! వినుము. వటబీజమునందు (మఱ్ఱివిత్తునందు) మఱ్ఱిచెట్టు అణఁగిపోవునట్లు స్థూలశరీరమును సూక్ష్మశరీరమును కారణశరీరమునందు అణఁగిపోవును.

| | | |
|---|---|---|
| కారణశరీరముయొక్క. | అవస్థ | సుషుప్తి |
| ,, | స్థానము. | హృదయము |
| ,, | భోగము | ఆనందము |
| ,, | శక్తి | ద్రవ్యము |

| | | |
|---|---|---|
| కారణశరీరముయొక్క, | గుణము | తామసము |
| ,, | అభిమాని | ప్రాజ్ఞుఁడు |
| ,, | మాతృక | మకారము |
| ,, | జీవుఁడు | పారమార్థికుఁడు. |

ఇట్లు కారణశరీరము ప్రవర్తిల్లుచుండును. ఇఁక మహాకారణ శరీర లక్షణంబు నెఱిగించెదను వినుము.

సీ॥ వనిత సద్యోజాత వామదేవాఘోర
వత్పురుషేశాన ధన్యులయిన।
పంచబ్రహ్మలకళల్ పంచభూతాంశులై
యరయ మహాకారణాంగ మమరు
దుర్యమావస్థయా యార్య మూర్థిస్థాన
మానింద్రభోగంబు జ్ఞానశక్తి।
శుద్ధసత్త్వగుణంబు సుగుణుఁడా ప్రత్య
గాత్మాభిమానోంకార మరయమాతృ॥

తే॥ కాత్మ నిర్మల మాత్మయై యమరు మూల।
ప్రకృతియై జీవుఁ డేవేళ ప్రతిఫలించు।
గానఁ బడి సంజ్ఞలనుగల్గి ఘనతకెక్కు।
నలిననేత్రి మహాకారణాంగ సరణి॥ 26

తా. ఓ పార్వతీ! వినుము. సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము, అను పంచబ్రహ్మకళలే పంచభూతాంశములై యొప్పును. ఈ మహా కారణశరీరమునకు,

| | |
|---|---|
| అవస్థ | తుర్యము |
| స్థానము | మూర్థము |
| భోగము | దేవేంద్రభోగము |
| శక్తి | జ్ఞానము |
| గుణము | శుద్ధసత్త్వగుణము |
| అభిమాని | ప్రత్యగాత్మ |
| మాతృక | ఓంకారము |
| జీవుఁడు | నిర్మలాత్మయగు మూలప్రకృతి |

ఇట్లు మహా కారణశరీరము తేజరిల్లుచుండును.

తే॥ జీవతనువులు నాల్గింటి భావమెల్ల।
దృశ్యవాచ్యార్థ మనియెడి దృఢము చేసి।
యవల చిద్రూపుఁడున్న చో టరయఁజూచి।
నిర్మలాత్ములునై యుంద్రు నీరజాక్షి॥ 27

తా. ఓ పార్వతీ! వినుము. జీవునియొక్క శరీరములు నాలుగును చెప్పఁబడెను. ఇది దృశ్యమనియు వాచ్యార్థమనియు నెఱింగి పరమాత్ముడుండుస్థానమును దెలిసికొని యోగులు నిర్మలాత్ములై యుందురు.

క॥ శశివదన వినుము మీఁదట।
విశదము గావింతు నాల్గు విశ్వేశుతనుల్।
కుశలముగ నేను దెల్పెద।
రసికులు నగునాత్మ విదులు ప్రకటించు క్రియల్॥ 28

తా. ఓ చంద్రవదనవగు పార్వతీ! ఇంతవఱకు జీవుని శరీర లక్షణములు నాలుగింటిని జెప్పితిని. ఇక వేదాంతము నెఱింగిన జ్ఞానులు వచించునట్టి ఈశ్వరుని శరీరములు నాలుగింటిని జెప్పెదను వినుము.

## ఈ శ్వ ర త ను చ తు ష్ట య ము.

మ॥ అవనిన్ నీరముఁ దేజమున్న నిలమున్నా కాశమీఁయయిదునన్।
రవిచంద్రాత్ములు మూఁడునన్ గలయఁగాఁబ్రత్యక్షమీఁయెన్మిదౌ।
నివియెల్లప్పుడు నష్టమూర్తి మయమై యేపారుచు న్నుండఁగా।
నవలీల న్నివియన్ విరాడ్తనువుకు న్నాధారమై యుండునే॥29

తా. ఓ పార్వతీ! వినుము. పృథ్వి, అప్పు; తేజస్సు; వాయువు, ఆకాశము, సూర్యుఁడు, చంద్రుఁడు, పరమాత్మ, అను నీ యెనిమిదింటితోఁ గూడిన పరమేశ్వరుఁడే విరాట్స్వరూపుఁడు ఇతఁడే అష్టమూర్తియను పరమశివుఁడని యెఱుంగుము.

వి. శ్లో॥ "భూరంభాం స్యనలో౽నిలోం।
బరమహర్నాథో హిమాంశుః పుమా।

నిత్యాభాతి చరాచరాత్మకమిదం।
యస్యైవ మూర్త్యష్టకం॥"

తా. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుఁడు, చంద్రుఁడు, పురుషుఁడు, అను నీ చరాచర రూపమగు మూర్త్యష్టకము ఎవని స్వరూపమైయున్నదో, అని భావము. ఇట్లు శ్రీ శంకరాచార్య విరచితమైన దక్షిణామూర్తి అష్టకమునందుఁ జెప్పఁబడి యున్నది.

సీ॥ విను విరాడ్తనువుకు వృద్ధియవస్థయు
దినకరస్థాన కర్తృత్వభోగ।
మమరఁ గ్రియాశక్తి మఱిరజోహంకార
మజుఁడు మాత్రాభిమాన్యగును కార।
మందాత్మ భూతాత్మ మదిరాక్షి యరయంగ
నిట్టి సంజ్ఞలతోడ నెలమినున్న।
యదివిరాడ్తనువని యార్యులు వల్కుదు
రవల హిరణ్యగర్భాంగ సరణి॥

తే॥ తెలియ వినుపింతు మదిని నిశ్చలముచేసి।
వినుము సంశయములుమాని వనజనేత్రి।
జ్ఞాన కర్మేంద్రియంబులు మానసాది।
కరణములు నాల్గు నీతను కారణములు॥ 30

తా. ఓ పార్వతీ! వినుము.

| | | |
|---|---|---|
| ఆవిరాట్స్వరూపునకు, | అవస్థ | వృద్ధి (జాగ్రత్త) |
| " | స్థానము | సూర్యుఁడు |
| " | భోగము | కర్తృత్వము |
| " | శక్తి | క్రియాశక్తి |
| " | గుణము | రజస్సు (అహంకారము) |
| " | అభిమాని | బ్రహ్మ |
| " | మాతృక | ఉకారము |
| " | జీవుఁడు | భూతాత్మ |

ఇది విరాట్స్వరూపమని యెఱుంగుము.

ఇఁక హిరణ్యగర్భుని శరీరలక్షణం బెఱింగించెదను వినుము.

జ్ఞానేంద్రియములు అయిదును, కర్మేంద్రియములు అయిదును, అంతఃకరణములు నాలుగు;

వ॥ ఇవ్విధంబు వినుము ॥ 31

తా. సులభము.

తే॥ అరయఁ జెవులు దిశల్ త్వక్కు కరువలియును ।
రవియు జంద్రుండు కన్నులు ఘ్రాణ మశ్వి ।
నుండు వాగ్వహ్ని హస్తాధిపుండు జిష్ణు ।
వచ్యుతుఁడు పదములు మృత్యువగు గుదంబు ।
వరుణుడును జిహ్వవశుస తన్మాత్ర లగజ॥ 32

తా. ఓ పార్వతీ! వినుము.

| అధ్యాత్మము. | అదిదైవము. | అదిభూతము. |
|---|---|---|
| 1. శ్రోత్రము | దిక్కు | శబ్దము |
| 2. త్వక్కు | వాయువు | స్పర్శము |
| 3. చక్షుస్సు | సూర్యుఁడు<br>చంద్రుఁడు | రూపము |
| 4. జిహ్వ | వరుణుఁడు | రసము |
| 5. ఘ్రాణము | అశ్వినీకుమారుఁడు | గంధము. |

ఇవి జ్ఞానేంద్రియ త్రిపుటియని తెలిసికొనుము.

త్రిపుటి, అనఁగా.—చూపు, చూచుట, చూడఁబడువస్తువు, అను నీ మూఁటియొక్క కూటమి త్రిపుటి యనఁబడును.

| అధ్యాత్మము. | అదిదైవము. | అదిభూతము. |
|---|---|---|
| 1. వాక్కు | అగ్ని | వచనము |
| 2. హస్తము | ఇంద్రుఁడు | ఇచ్చుట, పుచ్చుకొనుట |
| 3. పాదము | విష్ణువు | గమనము |
| 4. ఉపస్థ | ప్రజాపతి | రతిభోగము |
| 5. గుదము | యముఁడు | మలవిసర్జనము |

ఇవి కర్మేంద్రియ త్రిపుటియని తెలిసికొనుము.

క॥ మానసమునకు జంద్రుఁడు।
శ్రీనాయికబుద్ధిబ్రహ్మ క్షేత్రజ్ఞుఁడు చి।
త్తాన కహంకారమునకు।
మానియు రుద్రుండు సర్వమంగళవినవే॥ 33

తా. ఓ పార్వతీ! వినుము.

| అధ్యాత్మము. | అదిదైవము. | అదిభూతము. |
|---|---|---|
| 1. మనస్సు | చంద్రుఁడు | సంకల్పవికల్పములు |
| 2. బుద్ధి | బ్రహ్మ | నిశ్చయము |
| 3. చిత్తము | క్షేత్రజ్ఞుఁడు | నిశ్చయము |
| 4. అహంకారము | రుద్రుఁడు | నేనుఅనెడిఅభిమానము |

ఇవి నాలుగును అంతఃకరణ చతుష్టయముయొక్క త్రిపుటి యని తెలిసికొనుము.

క॥ ఈపదునాలుగు నొకటిగఁ।
గాపాడి హిరణ్యగర్భ కాయంబయ్యెన్।
రూపింప నిత్యవస్తువు।
ఆపద్ధతిఁ జంద్రసదన మయ్యె శుభాంగీ॥ 34

ఆ॥ కాంత సర్వమునకు కర్తయౌ భోగంబు।
నిచ్ఛశక్తి మాతృకయనుకార।
సత్వగుణము విష్ణు స్వామ్యభిమానియు।
నాత్మసూక్ష్మమైన యాత్మయయ్యె॥ 35

క॥ ఈతొమ్మిది సంజ్ఞలచే।
ఖ్యాతిగనైనది హిరణ్య గర్భశరీరం।
బాతతమతి విని మవ్వల।
భాతిగ నవ్యాకృతాంగ భావంబెల్లన్॥ 36

తా. పార్వతీ! వినుము. ఈ చెప్పఁబడిన పదునాలుగును జేరి హిరణ్యగర్భశరీరంబగును. ఆనిత్యవస్తువునకు స్థానము చంద్రుఁ డగును. అని యభిప్రాయము.

వి. "అపంచీకృత పంచమహాభూతాని, పంచతన్మాత్రాణి, తత్కార్యంచ పంచప్రాణాః, దశేంద్రియాణి, మనోబుద్ధిచేతి,

లింగం, భౌతికం, హిరణ్యగర్భ ఇత్యుచ్యతే. ఏతత్సూక్ష్మ శరీర మాత్మనః. కరణేషూపసంహృతేషు జాగరిత సంస్కారజః ప్రత్యయః సవిషయః స్వప్న ఇత్యుచ్యతే, తదుభయాభిమాన్యాత్మా తైజసః ఏతత్త్రియముకారః"

తా. అపంచీకృత పంచ మహాభూతములును, పంచతన్మాత్రలును; వాని కార్యములును, అనఁగా పంచప్రాణములు, దశేంద్రియములు, మనస్సు, బుద్ధి, అను పదునేడు తత్త్వములైన లింగమును భౌతికమును జేరి "హిరణ్యగర్భము" అని చెప్పఁబడును. ఇది ఆత్మకు "సూక్ష్మశరీరము" అనఁబడును. కరణములు లీనమైనపుడు జాగ్రత్సంస్కారముచే నైన ప్రత్యయము విషయములతోఁగూడి "స్వప్నము" అని చెప్పఁబడును. ఆ రెంటియొక్క అభిమానియగు ఆత్మ తైజసుఁ డనఁబడును. ఈమూడును ఉకారము.

ఇట్లు పంచీకరణమునందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ "హిరణ్యగర్భరూపోఽభూత్సుపి స్స్వప్నో యథాభవేత్ ॥"

తా. సుషుప్తియు స్వప్నము నెట్లో అట్లే పరమాత్మయు హిరణ్యగర్భుఁ డాయెను.

శ్లో॥ "సూత్రాత్మా సూక్ష్మదేహాఖ్య స్సర్వజీవఘనాత్మకః।
సర్వాహంమానధారిత్వా త్క్రియాజ్ఞానాది శక్తిమాన్ ॥"

తా. ఆ హిరణ్యగర్భుఁడు వస్త్రమునందు నూలువలె, జగత్తుతోఁ గూడి యుండుటవలన సూత్రాత్ముడనియు, సూక్ష్మదేహుఁ డనియు, ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తి మంతుఁడనియు, సర్వలింగ శరీరోపాధికులగు జీవులయొక్క సమష్టి స్వరూపుఁడనియుఁ జెప్పఁబడును.

అని వేదాంత పంచదశియందుఁ జెప్పఁబడి యున్నది.

| హిరణ్యగర్భ శరీరంబునకు | (అవస్థ. స్థితి.) |
|---|---|
| కర్తృత్వము | సర్వమునకుకర్త |
| శక్తి | ఇచ్ఛాశక్తి |
| భోగము | సర్వపాలితము |
| మాతృక | ఉకారము |
| గుణము | సత్త్వము (సాత్త్వికాహంకారము) |

| హిరణ్యగర్భ శరీరంబునకు | (అవస్థ. స్థితి.) |
| --- | --- |
| అభిమాని | విష్ణువు |
| ఆత్మ | సూత్రాత్మ |
| స్థానము | చంద్రుఁడు |

ఇది హిరణ్యగర్భుని శరీరంబగును. ఇఁక అవ్యాకృత శరీర లక్షణం బెఱింగించెదను వినుము.

సీ॥ అరయంగనీరెంటి కాధారమయినది
యవ్యాకృతశరీర మంద్రుబుధులు।
ప్రళయంబవస్థయు బరగనగ్నిస్థాన
సర్వసంహారక సాక్షిభోగ।
ద్రవ్యశక్తిత్వంబు తామసహంకార।
మృఁడుఁడభిమాని మాతృకమకార।
మాత్మవిశుద్ధాత్మ రైతొమ్మిదింటిలో
నవ్యాకృతాంగ దేహంబునమరు॥

తే॥ సరసిజాక్షిరొ వీనికి సాక్షియగుచు।
ముదముతోడుత వెలుగొందు మూల ప్రకృతి।
దేహవివరణ దెల్పెదఁ దేటపడఁగ।
గమలదళనేత్రి మది సంశయములుమాను॥ 37

తా. ఓపార్వతీ! వినుము. విరాట్పురుష శరీరమును, హిరణ్యగర్భ శరీరమును జేరి అవ్యాకృత శరీర మనంబడును.

అవ్యాకృతశరీరమునకు,

| | |
| --- | --- |
| అవస్థ | ప్రళయము |
| స్థానము | అగ్ని |
| భోగము | సర్వసంహారకత్వము |
| శక్తి | ద్రవ్యము |
| గుణము | తామసాహంకారము |
| అభిమాని | రుద్రుఁడు |
| మాతృక | మకారము |
| ఆత్మ | విశుద్ధాత్మ |

ఈ ప్రకారంబుగా అవ్యాకృతశరీరంబు తేజరిల్లును. ఇఁక దీనికి సాక్షియగు మూలప్రకృతి శరీరలక్షణం బెఱింగించెదను. ఓ కమలనేత్రివగు పార్వతీ! సంశయములేక వినుము.

క॥ ఎదియ విరాట్టనుచును బుధు।
లదియె యనాహతము నాద మదియే బ్రహ్మం।
బది బంచభూతకారణ।
మదియౌ నని నిరత మార్యులంద్రు భవానీ॥　38

తా. పార్వతీ! వినుము. దేనిని వివేకవంతులు విరాట్టని చెప్పుదురో, దానినే అనాహతధ్వని యనియును, దానినే నాదమని యును, దానినే బ్రహ్మమనియును, దానినే పంచభూతకారణమని యును జెప్పుదురు.

సీ॥ మూలప్రకృతిదేహ మూలమంతయువిను
　　తుర్యంబవస్థయౌ ద్రుహిణస్థాన।
సర్వనిరామయ సాక్షిత్వభోగంబు
　　జ్ఞానశక్తియు శుద్ధసత్త్వగుణము।
శంకరుం డభిమాని యోంకారమాత్రృక
　　యాత్మమహాత్మ్యమై యతిశయిల్లుఁ।
దొమ్మిదిసంజ్ఞలతోఁ గూడివిలసిల్లు
　　మూలప్రకృతిదేహ మూలమిట్లు॥
తే॥ ప్రతిఫలించునటంచును ప్రాజ్ఞు లెలమి।
బలుకుచుందురు సుజ్ఞాన భావులగుచు।
ఇట్టితనువుల వివరంబు నెఱిఁగిదెలిసి।
సచ్చిదాత్ముని సేవించు చంద్రవదన॥　39

తా. ఓ పార్వతీ! మూలప్రకృతి శరీరలక్షణం బెఱింగించె దను వినుము.

| | |
|---|---|
| అవస్థ. | తుర్యము. |
| స్థానము | బ్రహ్మ |
| భోగము | సర్వశూన్యము |
| శక్తి | జ్ఞానశక్తి |

| | |
|---|---|
| అవస్థ. | తుర్యము. |
| గుణము | శుద్ధసత్త్వము |
| అభిమాని | శంకరుఁడు |
| మాతృక | ఓంకారము |
| ఆత్మ | మహాత్మ |

ఈ ప్రకారముగా ఆ మూలప్రకృతిశరీరము ప్రకాశించుచుండును. అనియిట్లు వేదాంతులగువారు చెప్పుదురు. ఈ శరీర లక్షణంబులను నీవు తెలిసికొని పరబ్రహ్మమును భజింపుము.

తే॥ అష్టతనువులమర్మ మాద్యంతములును ।
విమలముగఁ దెల్పి తిఁకమీఁదఁ ౹ గ్రమముగాను ।
సాంఖ్యభావ ప్రకార విచారమంత ।
ప్రకటముగ జేతునదివిను పద్మగంధి॥ 40

తా. ఓ పార్వతీ! నీకు జీవునియొక్కయు, ఈశ్వరునియొక్కయు, ఎనిమిదివిధములైన శరీరలక్షణమును రహస్యములేక (దాఁపక) చెప్పినాఁడను. ఇఁక నీకు క్రమముగా సాంఖ్యభావము నెఱింగించెదను వినుము.

సా ం ఖ్య భా వ ప్ర కా ర ము.

క॥ ఆద్యుం డగణుం డబలుఁ డ ।
భేద్యుఁడు నిర్గుణుఁడు వేద వేద్యుఁడుత్రిగుణా ।
పాద్యుఁడు తర్కసతర్క వి
వాద్యుఁడు చిదచిద్విలాసవర్ధితుఁ డగజా॥ 41

గీ॥ అట్టిపరిపూర్ణతేజుఁడౌ నాత్మునకును ।
గరచరణ ముఖావయవముల్ గలిగియమరి ।
వెల్గుచుండును బరమాత్మ విభవ మిట్లు ।
దనరి యాకృతి మాని నిర్ద్వంద్వుఁడగుచు॥ 42

తా. ఓ పార్వతీ! ఆద్యుఁడు, అగణుఁడు, అబలుఁడు, అభేద్యుఁడు, నిర్గుణుఁడు, వేదవేద్యుఁడు, త్రిగుణాపాద్యుఁడు, తర్కసతర్కవివాద్యుఁడు, చిదచిద్విలాసవర్ధితుఁడు, అను నీ పేరులచే నొప్పు నిర్గుణ పరమాత్మయే కరచరణాదులు కల్గి సగుణ (శబళ)

బ్రహ్మమై స్వరూపుఁడై వైభవముతో నొప్పుచుండును. ఇట్టి పరమాత్మ తన సగుణస్వరూపమును మాని ద్వంద్వరహితుఁడై యుండును.

వి ఆద్యుఁడు = మొదటివాఁడు, అనఁగా ఈశ్వరుఁడు, సకల కారణకర్త.

అగణుఁడు = లెక్కింప సాధ్యము కానివాఁడు.

అబలుఁడు = బలము లేనివాఁడు, అనఁగా ఆ పరమాత్మ బలము ను ఎవరిచేతను తెలిసికొనుటకుఁ గానివాడు.

అభేద్యుఁడు = భేధించుటకు సాధ్యము కానివాఁడు.

నిర్గుణుఁడు = గుణరహితుఁడు.

వేదవేద్యుఁడు = వేదములచేఁ దెలిసికొనఁ దగినవాఁడు.

త్రిగుణాపాద్యుఁడు = సత్త్వ రజస్తమములచే నెఱుంగుటకు సాధ్యము కానివాఁడు.

తర్కసతర్క వివాద్యుఁడు=తర్కముచేఁ దెలిసికొనుటకును సతర్కముచేఁ దెలిసికొనకుండుటకును సాధ్యము కానివాఁడు.

చిదచిద్విలాసవర్ధితుఁడు=చిత్తు అచిత్తు అను వానిచే వృద్ధి నొందువాఁడు.

శ్లో॥ "స్వరూపం ద్వివిధంచైవ సగుణం నిర్గుణాత్మకం ।"
"ఏకో దేవ స్సర్వభూతేషుగూఢః ।
సర్వావ్యాపీ సర్వభూతాంత రాత్మా ।
కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాసః ।
సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ ॥

తా. ఒక్కఁడగు పరమాత్మ నిర్గుణుండయ్యును, అతండు సకల భూతములయందును రహస్యముగా నున్నాఁడు. సర్వత్ర వ్యాపించియున్నాఁడు. సకలకార్యములకు అధిపతి. సకల ప్రాణుల యందు 'నుండువాఁడు. అతఁడే సర్వసాక్షియై యున్నాఁడు. అని గోపాలతాపిన్యుపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది.

వి. "శరీరద్వయకారణ మాత్మజ్ఞానం సాభాస అవ్యాకృత మిత్యుచ్యతే, ఏతత్కారణ శరీరమాత్మనః, తచ్చనతత్, నాసత్, నాపిసదసత్, నభిన్నం, నాభిన్నం, నాపి భిన్నాభిన్నం కుతశ్చిత్, ననిరవయవరం, నసావయవం, నో భయం కింతు కేవల బ్రహ్మాత్మైకత్వ జ్ఞానాపనోద్యమ్॥ "

తా. శరీరములు రెంటికిని కారణమైన ఆత్మజ్ఞానము ఆభాసునితోఁ గూడి అవ్యాకృత మనఁబడును. ఇది ఆత్మకు కారణశరీరము. ఇది సత్తుకాదు, అసత్తుకాదు, సదసత్తుకాదు, భిన్నము కాదు, అభిన్నముకాదు, భిన్నాభిన్నముకాదు, నిరవయముకాదు, సావయవముకాదు, సావయవమును నిరవయవమునుకాదు, అది కేవలము బ్రహ్మాత్మైక్య జ్ఞానముచే నిగ్రహింపఁ దగినది.

ఇట్లని పంచీకరణమునందుఁ జెప్పఁబడియున్నది.

క॥ ఆద్యంత క్షయ వృద్ధుల।
బాధ్యుఁడుగాకుండి యఖిలప్రజ్ఞాన్వితుఁడై ।
విద్యా విద్యల సాక్షై।
సద్విధి పురుషాక్షరత్వ సత్తువ్వండయ్యున్ ॥ 43

తా. ఓ పార్వతీ! వినుము. ఆ పరమాత్మ ఆది, అంతము, క్షయము, వృద్ధి అను వీనికి భాధ్యుఁడుగాక, సర్వమును దెలిసినవాఁడై, విద్యకును, అవిద్యకును సాక్షియై, సత్తయై పురుషుఁడును, నాశములేను సత్తామాత్రుఁడునై యుండును.

క॥ అంగుష్ఠమాత్రఃపురుషో ।
హ్యంగుష్ఠ సమాశ్రితాధుఁడౌనని శ్రుతులక్ ।
బొంక్కుచును బల్కుచుండెడి ।
సంగతి భావంబు తెలియు సరసిజనేత్రీ ॥ 44

తా. ఓ పార్వతీ! వినుము. ఆ పరమాత్మ అంగుష్ఠమాత్ర ప్రమాణము గలవాఁడై హృదయ పుండరీకమునందుండును ఇట్లు వేదములందుఁ జెప్పబడియున్నది. ఈ యభిప్రాయంబును దెలిసికొనుము.

వి. "అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః, తంస్వాచ్ఛరీరాత్ప్రవృహే న్ముంజాదివేషీకాం ధైర్యేణ తం విద్యాచ్ఛుక్రమమృతం తం విద్యాచ్ఛుక్రమమృతమితి." (536-ఫ)

తా. పురుషుఁడు (పరబ్రహ్మము) అంగుష్ఠ ప్రమాణము గలవాఁడు, అగు అంతరాత్మ ఎప్పుడును జనుల హృదయమునం దున్నాఁడు. అట్టి ఆత్మను తన శరీరమునుండి ధైర్యముతో మాంజి యను పేరుగల ఒకజాతి పచ్చికయొక్క నడుమ నుండెడి యీనను ఎత్తునట్లు బయలు పఱచవలయును. శుద్ధమై అమృతమైయుండు ఆ పరమాత్మను ఎఱుఁగవలయును అట్టివానినే (ఆ పరబ్రహ్మ స్వరూపుని) తెలిసికొనవలయును. ఈ పురుషుఁడే (పరమాత్మ) జ్యోతిస్వరూపుఁడని యీ యుపనిషత్తునందే మఱొకచోటఁ జెప్పఁబడి యున్నది ఈ విషయమును కఠోపనిషత్తునందుఁ గనందగును.

తే॥ అతివ యక్షరరూపుఁడైనట్టి యాత్మఁ ।
డరసి కన్నున రక్షుఁడై వెలుంగు ।
ననుచు వేదాంత విదులాడఁగనెదరాత్మ ।
విశ్వయీాక్షిత స్పృజయని వేదమరసి ॥ 45

తా. ఓ పార్వతీ! ఈనాశము లేనివాఁడగు పరమాత్ముఁడు నేత్రమునందు రక్షుఁడై ప్రకాశించును. అని వేదాంతము నెఱింగినవారు చెప్పటయే గాక, ఆయాత్మను దెలిసికొనుచున్నారు. ఆ యాత్మనుగూర్చి శ్రుతియందు—"విశ్వతశ్చక్షురుత,, అని చెప్పఁబడి యున్నది.

వి. "యఏషోఽక్షిణి పురుషోదృశ్యత ఏష ఆత్మేతిహోవాచైతదమృత మభయమేతద్బ్రహ్మేతి తద్యద్యప్యస్మిన్ సర్పిర్వోదకం వా సించంతి వర్త్మనీ ఏవగచ్ఛతి". ఇట్లు ఆఱుమంత్రములు గలవు.

తా. నేత్రమునం దొక్క పురుషుఁడు కనఁబడు చున్నాఁడు కదా. అతఁడే బ్రహ్మము. అతఁడే ఆత్మ, అది అమృతముగను అభయముగను నుండు బ్రహ్మము. ఈపురుషుఁడు కంటిలో నేయి నీళ్లు మొదలగువానిని ఉంచినపుడు అవి యెట్లు నేత్రమునం దంటక పాఱి

పోవుచున్నదో అట్లు ఆపురుషుఁడు నేత్రమునందు అంటక నిర్లే పుఁడై నిరంజనుఁడై యుండును.

రెండవ మంత్రమునందు అతీపురుషుఁడు — "సంయద్వామ" అనఁగా సకల శుభములను సేకరించియుంచువాఁడనియు ;

మూఁడవ మంత్రమునందు అతీపురుషుఁడు — "వామనీ" అనఁగా సకల పుణ్యకర్మ ఫలములను చక్కఁబఱచు చున్నాఁడనియు ;

నాలవ మంత్రమునందు అతీపురుషుఁడు — " భామనీ " అనఁగా సకల లోకములయం దున్నాఁడనియు ;

ఐదవ ఆఱవ మంత్రములందు ఈనేత్ర పురుషుని తెలిసికొన్న వారికి ఆ పరమాత్మ, అంత్యకాలమునందు బ్రహ్మము పొందునట్లు చేయుచున్నాఁడు. అనంతరము జీవునకు జనన మరణములు లేవనియు ;

ఇట్లు ఛాందోగ్యోపనిషత్తునందుఁ నాల్గవ ప్రపాఠకమున పదునైదవ ఖండమునందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ "ఆత్మావా ఇదమగ్రేభూత్ సఈక్షత సృజా ఇతి ॥"

తా. ఈ ప్రపంచము సృష్టికి పూర్వము పరమాత్మగానే యుండెను. ఆపరమాత్మయే నేను ప్రపంచమును సృష్టించెదనని చూచెను. అనఁగా తలంచెను అనెడి ఐతరోపనిషత్తుయొక్క అభిప్రాయమును విద్యారణ్య స్వాములు వేదాంత పంచదశియందు వ్రాయుచ్చియున్నారు.

"విశ్వతశ్చక్షురుత" అను దాని యభిప్రాయమును ఇఁక ముందుఁ జెప్పఁబడును.

గీ॥ అక్షరుఁడు నై వెలుంగు నవ్యక్తమునను ।
నమర వ్యక్తమగు ప్రియు మావహిల్లె ।
వరుసఁ గావించె శబళ బ్రహ్మంబునగుచు ।
బ్రకృతి గర్భస్థుఁడయ్యెబో పద్మనేత్రి ॥ 46

తా. ఓ పార్వతీ! వినుము. నాశములేని పరబ్రహ్మము నుండి అవ్యక్తము కలిగెను ఆ యవ్యక్తమునకు ఇష్టము (ఇచ్ఛ) కలిగెను. ఇచ్ఛచేత (ఆ పరబ్రహ్మము) సగుణబ్రహ్మమై ప్రకృతి యనెడు గర్భమును ధరియించెను. (అనఁగా ఆ బ్రహ్మముయొక్క నడుమనుండి అవ్యక్తమనెడి మూలప్రకృతి కలిగెను.) గర్భము= మధ్యభాగము

గీ॥ పద్మనేత్రిరో ప్రకృతి గర్భంబునందుఁ।
గదియ నవి వాసనాజాల ముదయమయ్యె।
వినుము సమ్మతి గీతల ఘనముగాను।
బల్కు నిదియాదినిర్మల బ్రహ్మమనుచు॥ 47

తా. ఓ పార్వతీ! వినుము. ఆమూలప్రకృతినుండి వాసన లన్నియు కలిగెను. (జీవులయొక్క మలినవాసనలచేతనే వివిధము లైన జన్మములు కలుగుచుండునని భావము) ఈవిషయము భగవ ద్గీతలయందు (పదునాలవ అధ్యాయమునందు) విస్తరముగాఁ జెప్పఁ బడియున్నది. ఇదియే ప్రధానంబైన శుద్ధ పరమాత్మ యని తెలిసి కొనుము.

తే॥ అక్షరాత్ముఁడు నవ్యక్తమందుఁ దగుల।
భూతకారణసృష్టి సమేతుఁడయ్యె।
సాంఖ్యభావుఁడునై జగత్సాక్షియగును।
నవ్విధంబంతనే దెల్పు దార్యవినవె॥ 48

తా. ఓ పార్వతీ! నాశరహితుఁడగు ఆ పరమాత్మ అవ్యక్త మను మూలప్రకృతితోఁ జేరి సకల భూతసృష్టి యొనరించి దానితోఁ గూడియుండువాఁడయ్యెను. ఆ సాంఖ్యభావుఁడగు పర మాత్మ సకల ప్రపంచమునకును (నిర్లేపుఁడైయుండియు) సాక్షియై యున్నాఁడు. ఈ విషయంబంతయుఁ దెల్పెదను వినుము.

వి. భగవద్గీతా ద్వితీయాధ్యాయంబును జూచిన సాంఖ్యుఁ డగు పరమాత్మ విషయము సుబోధముగాఁ గన్పట్టును.

శ్లో॥ స్వయంజ్యోతి ర్భవత్యేష పురోస్మాద్భాసతేఽఖిలాత్।
తమేవ భాంతమన్వేతి తద్భాసా భాస్యతేజగత్॥

తా శరీరమందుండు ప్రత్యగాత్మ స్వయముగా ప్రకాశించుచున్నాఁడు. ఈ ప్రపంచమునకు ముందట (పూర్వమే) ప్రకాశించుచున్నాఁడు. ఆప్రకాశ స్వరూపుఁడగు పరమాత్మను ఆశ్రయించి సర్వ ప్రపంచమును తోఁచుచున్నది.

శ్రుతి॥ "అత్రాయం పురుష స్స్వయంజ్యోతిర్భవతి। అస్మాత్సర్వస్మాత్పరతస్సువిభాతి. తమేవభాంత మనుభాతిసర్వం సత్యభాసా సర్వమిదం విభాతి॥" అని పైని చెప్పఁబడిన విషయము శ్రుతియందును గలదు. ఇట్లే వేదాంత పంచదశియందుఁ జెప్పఁబడియున్నది.

వి. "సచ్ఛబ్ద వాచ్యమవిద్యా శబళం బ్రహ్మ, బ్రహ్మణోఽవ్యక్తః, అవ్యక్తాన్మహత్, మహతోఽహంకారః, అహంకారాత్పంచతన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యః పంచమహాభూతాని, పంచమహాభూతేభ్యోఽఖిలంజగత్॥"

తా. సత్ అనెడి అవిద్యతోఁగూడఁ జేరినది పరబ్రహ్మము. ఆ బ్రహ్మమునుండి అవ్యక్తమును (మూలప్రకృతియును,) అవ్యక్తమునుండి మహత్తును, మహత్తునుండి అహంకారమును, అహంకారమునుండి పంచతన్మాత్రలును, పంచతన్మాత్రలనుండి పంచమహాభూతములును, పంచమహా భూతములనుండి సకల జగత్తును కలిగెను.

ఇట్లు పంచీకరణమునందుఁ జెప్పఁబడి యున్నది.

సీ॥ అవని జలానల యనిలాంబరములైదు
నొపంచభూతముల వలఁగర్ణ।
చర్మ చక్షువు జిహ్వా సరవిఘ్రాణములైదు
శబ్దంబు స్పర్శయు సరవి రూపు।
రసము గంధముతోడఁ బొసఁగంగ నవియైదు
వా క్పద కర గుహ్య పాయులైదు।
మనసు నహంకార మమకారబుద్ధితో
నిరువది మూడునై యొసఁగుచుండు॥

తే॥ బ్రకృతి జీవుల నటమీఁదఁ బరఁగఁగూర్పఁ ।
బంచవింశాఖ్యుఁడని సదా ప్రాజ్ఞులంద్రు ।
అవల సకలార్థ సాక్షియౌ యాత్మ నెపుడు ।
పరగ షడ్వింశకుండని పలుకుచుంద్రు ॥ 49

తా. ఓ పార్వతీ ! వినుము.

| | |
|---|---|
| 1. పృథివి | 4. వాయువు |
| 2. అప్పు | 5. ఆకాశము |
| 3. తేజస్సు | |

అను నీ యైదును పంచభూతము లనఁబడును.

| | |
|---|---|
| 1. త్వక్కు | 4. జిహ్వ |
| 2. చక్షువు | 5. ఘ్రాణము |
| 3. శ్రోత్రము | |

అనునివి అయిదును జ్ఞానేంద్రియము లగును.

| | |
|---|---|
| 1. శబ్దము | 4. రసము |
| 2. స్పర్శము | 5. గంధము |
| 3. రూపము | |

అనునివి అయిదును పంచతన్మాత్ర లనఁబడును.

| | |
|---|---|
| 1. వాక్కు | 4. వాయువు |
| 2. పాణి | 5. గుహ్యము |
| 3. పాదము | |

అనునివి అయిదును పంచకర్మేంద్రియము లగును.

ఈ చెప్పఁబడిన పంచభూతములు, పంచజ్ఞానేంద్రియములు, పంచతన్మాత్రలు పంచకర్మేంద్రియములు, అను నివి ఇరువదింటితోఁగూడ,

1. మనస్సు, 2. నేను నాదియనెడి అహంకారము, 3. బుద్ధి, అను నీ మూఁడును జేరి ఇరువది మూఁడగును. పిదప, 1. ప్రకృతి, 2. జీవుఁడు, అను నీ రెంటినిఁ జేర్పఁగా ఇరువదియైదు తత్త్వము లగును. వివేకము గలవారు జీవుఁడు ఇరువదైదు తత్త్వములతోఁ

గూడినవాఁడని చెప్పుదురు. వీనితోఁగూడ సర్వసాక్షియగు పర మాత్మనుజేర్చి ఇరువదియాఱవ తత్త్వమని పలుకుదురు.

వి. శ్లో॥ "యేషడ్వింశతి తత్త్వజ్ఞా యత్రకుత్రాశ్రమేరతాః।
జటీముండీ శిఖీవాపి ముచ్యతే నాత్రసంశయః॥"

తా. ఎవ్వరు తత్త్వంబులను దెలిసినవారో (పంచవింశతి యను ఇరువదియైదు తత్త్వంబులకంటె వేఱైన ఇరువది యాఱవ తత్త్వమైన పరమాత్మను దెలిసినవారో) వారు ఎచ్చోటనున్నను, బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసములను నాలుగా శ్రమములలో ఏయాశ్రమమునందున్నను, మునియైనను, సన్న్యాసి యైనను, గృహస్థుఁడైనను, సంసారబంధమునుండి విడివడు చున్నాఁడు. ఈ విషయంబునందు సంశయములేదు.

క॥ షడ్వింశకుఁడగు నాత్మని।
షడ్వారిజములకుమీఁది సారాంశునిగా।
షడ్భ్రమలు మాని నిరతము।
షడ్వర్గము లను జయించి సాంఖ్యునిఁ గనుమీ॥ 50

తా. ఓ పార్వతీ! వినుము. ఇరువదియాఱవ తత్త్వమగు పరమాత్మను, మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ,ఆజ్ఞేయములనుషడాధారములనెడి ఆఱుకమలములకుమీఁద నుండువాఁడని, షడ్భ్రమలుమాని, నిరంతరమును కామాదులైన శత్రువర్గముల నాఱింటిని జయించి ఆ పరమాత్మని చూడుమని భావము.

వి. పంచభ్రమలనుగూర్చి ప్రథమాశ్వాసము 101 పద్యము విశేషార్థమునందుఁ గనఁదగును. షడ్భ్రమలనఁగా పంచభ్రమలతోఁ గూడ సంగభ్రమను జేర్పఁగా షడ్భ్రమలగును. దీనినే సంసర్గా ధ్యాసమనియును, సంబంధాధ్యాసమనియును జెప్పుదురు

తే॥ అతివ యాయాత్మ తానుగా నరయలేక।
మలినమగునట్టి క్షరదేహ మమతదగిలి।
జనన మరణా ద్యవస్థల జాలఁజెందు।
ఘనతరాత్మాక్షరుని నెప్డు గనను మఱచి॥ 51

తా. ఓ పార్వతీ! వినుము. ఆ యాత్మను తానని తెలియక అసహ్యమును నాశమును అగు శరీరమునందలి యభిమానముచేత జననము మొదలగు అవస్థ లనేకములను బొంది, శ్రేష్ఠమైనదియును శాశ్వతమైనదియును అగు పరమాత్మను సర్వకాల సర్వావస్థల యందును చూచుటకు మఱచి (ఉందురని పై పద్యముతో నన్వయము.)

క॥ బలువగు విషయేచ్ఛలలో ।
మెలఁగుచు సుఖదుఃఖములను మేలనితలచుః ।
గుల మిల్లు సతులు సంపద ।
కలిమెల్లను నిత్యమనుచు గామించి శివా॥ 52

తా. పార్వతీ! వినుము. తనలోనున్న పరమాత్ముని తెలిసి కొనలేని మూఢుఁడు అధికమైన విశేషయేచ్ఛలతో మెలంగుచు సుఖములను మేలని యెంచుచు తనకులమును, గృహమును సకల సంపదలను, ధనమును, శాశ్వతమని తలంచి కోరుచుండును.

వి. సుఖముతోఁగూడ దుఃఖమును మేలని యెంచుటకుఁ గారణ మేమనఁగా—సుఖములు మేలని యెంచునప్పుడు దుఃఖమును గూడ మేలనియే యెంచవలయును. ఏలన, దుఃఖములేక సుఖము కలుగనే కలుగదుకదా? "సుఖస్య బిందుమాత్రంచ దుఃఖం పర్వత మేవచ" అని అభిజ్ఞులు వచించెదరు.

కులమును నిందించుటకు గారణమేమన—కులము, దేహ పాతానంతరము నిష్ప్రయోజనము. కాఁబట్టియేకదా, "శ్లో॥ జాతినీతి కులగోత్రదూరగం॥" అని శ్రీ శంకరాచార్యుల వారు వక్కాణించిరి. తక్కిన సంపదలును శాశ్వతములు కావు. ఈ విషయమును శ్రీ శంకరాచార్యులు రచియించిన ద్వాదశ పంజరికా స్తోత్రమునఁ గనందగును.

శ్లో॥ మూఢజహీహిధనాగమతృష్ణాం,కురుసద్బుద్ధిం మనసివితృష్ణాం।
యల్లభసేనిజ కర్మోపాత్తం, విత్తంతేన వినోదయచిత్తం॥

తా. ఓ మూఢుఁడా! ధనము రావలయుననెడి ఆశను విడువుము. మనస్సునందు కోరికను విడిచిపెట్టుము. మంచిబుద్ధి గలవాఁడ

వగుము. తన కర్మముచే సంపాదింపఁబడిన (అనఁగా తన శ్రమకుఁ దగినట్లు లభించిన) ధనముతో తృప్తినొంది సంతోషముతో నుండుము.

శ్లో॥ అర్థమనర్థం భావయనిత్యం నాస్తి తతః సుఖలేశస్సత్యం॥

తా. ధనము అనర్థమైనది, అని ప్రతిదినంబును తలంచుచుండుము.

శ్లో॥ "జాతిర్నాస్తి గతిర్నాస్తి వర్గోనాస్తి నలౌకికం॥" అని తేజోబిందూపనిషత్తునందు చెప్పంబడి యున్నది.

తే॥ కర్త భోక్తయు దానుగాఁ గాంక్షఁజేసి।
నీమ కర్మాది నిష్ఠలఁ బ్రేమ తగిలి।
కాయమే యాత్మగా నమ్మి క్రమముతోడ।
బాయ లేకయె సంసార బద్ధుఁడయ్యె॥ 53

తా. ఓ పార్వతీ! వినుము. (జీవుడు) నేనే కర్తయనియును, నేనేభోక్త (అనుభవించువాఁడ)ననియును, తలంచి జాత్యాచారము మొదలగు కర్మములందు ప్రేమ (విశ్వాస) ముంచి, శరీరమునే ఆత్మ యని నమ్మకము నుంచికొని యుండుటచేతనే సంసారమునందు కట్టుపడినవాఁడయ్యెను.

వి. నేనేకర్త, నేనేభోక్త, యనుటను వర్జించుటయే ముక్తి యని యభిప్రాయము.

శ్లో॥ "దేహాదిషు స్వకీయత్వ దృఢబుద్ధి విసర్జనం।
నిర్మమత్వం స్మృతంయేన కైవల్యం లభతేనరః॥"

తా. దేహము, ఇల్లు, భార్య మొదలగునవి నావి యను తలంపును విడిచియుండుటయే నిర్మలత్వము (అనఁగా నావికాదని యుండుటయే) ముక్తియని భావము.

మఱియును ఈ శరీరము ఆత్మ కాదు. ఎట్లన,

శ్లో॥ "ఆత్మాయం దేహఏవేతి చార్వాకేణ వినిశ్చితం॥

తా. ఈ దేహమే ఆత్మయనుట చార్వాకునిచే నిశ్చయింపఁబడినది.

అంతియు కాని శరీరమునశించునట్టిదిగాన, శరీరముఆత్మ కానేరదని భావము. ఇట్లు సర్వవేదాంతసిద్ధాంతసంగ్రహామునందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ "కర్తృభోక్త్రాదికం సర్వం తదవిద్యోత్థమేవచ ॥"

తా. కర్తృత్వ భోక్తృత్వములాదిగాఁ గల వన్నియును ఆ యవిద్యనుండి కల్గినవేగాని వేఱు కాదు.

క॥ పాపముఁ బుణ్యముఁ బెంచుచుఁ ।
దాపముఁగోపంబుఁ బెంచి తగనేపారన్ ।
నాపాదింపుచు నగణిత ।
మా పరతంత్రమగు ముక్తి నాదిని మఱచున్ ॥ 54

తా. ఓ పార్వతీ! వినుము. (జీవుఁడు) పాపమును, పుణ్యమును, తాపమును, కోపమును, వృద్ధిచేసికొనుచు పరతంత్రమైనట్టి గుఱియగు అనఁగా లక్ష్యముంచదగిన కైవల్యమును మఱచినవాఁడై యుండును.

వి. క్రూరమైన పాపతాపాదులను వృద్ధి చేయఁగూడదు. ఇది సరియేగాని, పుణ్యములనే వృద్ధిచేయఁగూడదు? అనఁగా— పుణ్యమువలన లభించు స్వర్గాది భోగానుభవములునశించినతర్వాత మరల నెప్పటియట్లు భూలోకమున జన్మము నొందవలయును. ఈ విషయమును "క్షీణేపుణ్యే మర్త్యలోకంవిశంతి" అను భగవద్గీత యందలి నవమాధ్యాయము 20-వశ్లోక ప్రమాణము నిట అనుసంధించునది.

తే॥ జప తపంబుల వ్రతముల స్నానములను ।
వైభవంబంది మోక్షంబు వడయఁలేడు ।
పసిఁడికాయలో బురుగు సంపత్కరందు ।
గానునిర్మించి నశియించు కరణి జుమ్మి ॥ 55

తా. ఓ పార్వతీ! వినుము (జీవుఁడు) జపముచేతను, తపముచేతను, వ్రతములచేతను, స్నానములచేతను, శ్రేష్ఠత్వమునొందిముక్తినిబొందఁడు. పసిఁడికాయ యొక్క సంపత్తువలెనే (ప్రాప్తి

పురుగుకాయ) యందుండు పురుగు గూడుకట్టికొని లోపలనుండి బయటరానియట్లు (పైని చెప్పిన జపతపాదులచే) నశించును.

వి. శ్లో॥ కోశక్రిమి స్తంతుభి రాత్మదేహ ।
మావేష్ట్య చావేష్ట్య చ గుప్తిమిచ్ఛన్ ।
స్వయంవినిర్గంతు మశక్తఏవ సన్ ।
తత స్తదంతే మ్రియతేచ లగ్నః ।
యథాతథా పుత్త్రకళత్రమిత్ర ।
స్నేహానుబంధై ర్గ్రథితోగృహస్థః ।
కదాపి వాతాన్ పరిముచ్య గేహా ।
ద్గంతుంనశక్తో మ్రియతేముథైవ ॥

తా. పట్టుపురుగు (పసిఁడికాయపురుగు) దాగికొనియుండుటకై తన నోటి చొంగవలనఁగల్గు ద్వారములచేత తన్నుపలుమఱు చుట్టుకొని యందుండి బయటికి రాను సాధ్యములేక మృతి చెందునట్లు, గృహస్థుఁడును భార్య బిడ్డలు స్నేహితులు మొదలగు వారి యందుఁగల ప్రేమచేత, ఆప్రేమ యనెడి బంధనమునుండి బయలు వెడలుటకు సాధ్యముగాక, అనఁగా గృహమునుండి వెడలిపోనేరక ముక్తినొందుటకు చేతగాక మరణము నొందుచున్నాఁడు ఇట్లు శ్రీశంకరాచార్యులు వక్కాణించియున్నారు.

వి. శ్లో॥ "నధనాన్యుపకుర్వన్తి నమిత్రాణి నబాంధవాః ।
నకాయ క్లేశవైధుర్య నతీర్థాయతనాశ్రయః ।
కేవలం తన్మనోమాత్ర జయేనా సాద్య తేపదం ॥"

తా. ధనమును, స్నేహితులును, పుత్త్రులును, బంధువులును, శరీరమును శోషింపఁజేయు వ్రతాదులును. గంగాది తీర్థములును, ఆలయములును, ఇవి మోక్షము నొసంగదు. ఆముక్తి కేవలము మనస్సును జయించినవానికి మాత్రమే లభించును.

ఇట్లని మహోపనిషత్తునందు నాలవ అధ్యాయములోఁ జెప్పఁబడి యున్నది.

వి. శ్లో॥ "అనంతకర్మ శౌచంచ జపయజ్ఞ స్తథైవచ ।
తీర్థయాత్రానుగమనం యావ త్తత్వం నవిందతి॥"

తా. అనేకములగు కర్మములయొక్క పరిశుద్ధత్వమును, వివిధములగు శివకేశవాదినామ జపములును, పలువిధములగుపశు హింసాది యజ్ఞములును, కేవలము ఆత్మోజ్జీవనార్థమై కావింపఁబడు బ్రహ్మయజ్ఞాది యజ్ఞములును, గంగాది తీర్థయాత్రల కేగుటయును, ఇవి యంతయును పరమాత్మతత్త్వమును దెలిసికొను నంతవఱకును జేయఁదగును.

శ్లో॥ "తీర్థానితోయరూపాణి దేవాః పాషాణ మృణ్మయాః।
యోగినో నప్రపద్యంతే ఆత్మధ్యాన పరాయణాః॥"

తా. ఆత్మధ్యానమును జేయునట్టిమహనీయులగు యోగులు జలరూపములైన తీర్థములను, శిలామయములును మృణ్మయములును అగు దేవతలను సేవింపరని భావము.

క॥ బహువిధములైన వృత్తుల।
దహతహపడి జన్మకర్మ తాపంబులచే।
నిహవాంఛలు తాఁగోరుచు।
మహి దినములు గడపుచుండు మానవుఁడ గజా॥ 56

తా. ఓ పార్వతీ! వినుము. (జీవుఁడు) అనేకములగువ్యాపారముల నవలంబించి కష్టమొంది జన్మము నెత్తిన దాని కనుగుణంబగు కర్మముల నవలంబించి బాధపడి భూలోకమునందలి కోర్కులను కోరుచు కాలమును గడపుచుండును.

గీ॥ అగజ విను క్షరుఁ డక్షరు డాత్మ దెలియ।
లేక త్రిగుణప్రకృతులను లెస్సతిరుగు।
నట్టి యక్షరుఁడగు నాత్మ నరసికాంచి।
ఘనగురుం డున్న యాశ్రమమునకు నరిగి॥ 57

తా. ఓ పార్వతీ! వినుము. మనస్సునందు జీవునియొక్కయు, ఈశ్వరునియొక్కయు భేదమును దెలిసికొనక, సత్త్వరజస్తమో గుణములకుఁ జిక్కి సంచరించుచుండును. ఆ శాశ్వతుఁడగు పరమాత్ముని విచారించి తెలిసికొని (ఆ విషయమును జక్కఁగా బోధించునట్టి) గురువు వసించు ఆశ్రమమునకు పోయి, (పై పద్యముతో నన్వయము.)

మ॥ పరిపూర్ణత్వ మఖండమార్గపదవిం బాగొప్పగాఁగన్న స।
ద్గురు రాజేంద్రుని పాదపద్మములు సంకోచింపకన్ గొల్చియున్।
బరమానంద కృపావశత్వ పరుఁడై భావంబులోఁ జిన్మయుం।
డరయం దామని గన్న ధన్యులవిధం బాద్యంతమున్ జెప్పెదన్॥

తా. పరిపూర్ణమైనదియును, అఖండమైనదియును అగు పరమాత్మ పదమును బాగుగా నెఱింగిన గురుశ్రేష్ఠుని పద కమలములను సంకోచముఁ మాని సేవించి పరమానందమొంది మనంబునందు పరమాత్ముఁడే తామని తెలిసికొన్నట్టి పుణ్యాత్ముల క్రమంబును ఆద్యంతంబుగాఁ జెప్పెదను.

వి. ఆ పరమాత్మ లక్షణమును ప్రథమాశ్వాసము 47-వ పద్యముయొక్క విశేషార్థమునందు తెలియఁజేయఁబడి యున్నది.

శ్లో॥నత్వాభక్తి పురస్సరంగురువరం విజ్ఞాయ తత్పార్శ్వతః।
స్థిత్వా జన్మ శతాగతాద్భవభయా ద్భీతోఽస్మి మాం పాహిభో।
ఇత్యుక్తో గురు రాదరేణకృపయా శిష్యం సమీపస్థితం।
స్పృష్ట్వా పాణితలేన సాధుగదితో ప్రీతోఽస్మి వత్సత్వయా॥

తా. శిష్యుఁడైనవాఁడు సద్గురువుకడకుఁ బోయి నమస్కరించి వారిప్రక్కను నిలువంబడి, స్వామీ! నేను అనేకజన్మముల నెత్తితిని, జననమరణ భయమువలన నన్నుఁ గాపాడుఁడని మిమ్ము వేఁడెదను. అని శిష్యుఁడు చెప్పఁగా, గురువు శిష్యునిమాటను విని, శిష్యుని మిగుల నాదరించి, దయతో సమీపంబున నుండునట్లు నియమించి, తన హస్తముచే శిష్యుని మస్తకమునందు స్పృశించి ప్రీతితో నిట్లనియె. అని ఆగమప్రమాణము.

ఉ॥ అంగములోని యింద్రియము లంతట నేనను భ్రాంతి మాని యు।
ప్పొంగుచు నన్నిచర్యలను బొందుగనుండెడి తుర్యమైన స।
త్సంగతిఁ బొందు నయ్యెలుక సామజయానరొ తానుగాఁగనిన్।
భంగమొనర్చు నీజగతి భ్రాంతులఁబొందనివారు ధన్యులే॥ 59

తా. గజగామినివగు పార్వతీ! వినుము. శరీరమునందుండు ఇంద్రియములన్నియును, నేను అనెడి భ్రాంతినివదలి సంతోషముతో సకలకార్యముల నాచరించునట్టి దగు తుర్యంబైన సద్విష

యము నొందెడి ఆయెఱుకను (పరమాత్మను) తానని తెలిసి కొన్నట్టివారును, ప్రపంచభ్రమలను బొందనివారును ధన్యులని యెఱుంగుము.

వి. తుర్యముఅనఁగా, జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అను నీ మూఁడవస్థలును లేని యవస్థ.

శ్లో॥ "పరబ్రహ్మ వదాభాతి నిర్వికారైకరూపిణీ।
సర్వావస్థాసుధారైకా తుర్యాఖ్యా పరికీర్తితా॥

తా. జాగ్రత్స్వప్న సుషుప్తులను మూఁడవస్థలయందును వికారరహితమైన స్వరూపముగలదియును, పరమాత్మవలె ఒక్కటే అయినదియును అగు ఏధారకలదో అది తుర్యమని చెప్పఁబడును. తురీయలక్షణమును నారదపరివ్రాజకోపనిషత్తు మొదలగువాని యందును గనందగును.

క॥ అనవిని పార్వతి యిట్లను।
నిన శశివైశ్వానరాక్ష యీదేహములోఁ।
బెనుపొందుచున్న యాత్మని।
గనలేకను మఱపుజెందు కారణమేమీ॥　　60

క॥ నిండిన సద్గుణుల మది క।
ఖండుఁడునై తోఁచుచున్న ఘనుఁడాత్ముఁడులో।
నుండఁగ నెఱుఁగనిచోద్యము।
దండిగ నాకెఱుఁగఁబల్కు తగభూతేశా॥　　61

తా. ఇట్లు పరమశివుఁడు చెప్పఁగా పార్వతి శివునిఁజూచి యిట్లనియె. ఓసూర్యచంద్రాగ్నులను నేత్రములుగాఁ గలవాఁడా! ఈశరీరములోనుండు పరమాత్మను ఎఱుంగక మఱపుచెంది యుండుటకుఁ గారణంబేమి?

సద్గుణముచే సంపూర్ణులైనవారికి బుద్ధికి ఆ పూర్ణుండగు పరమాత్మ తెలియక యుండునట్టి ఆశ్చర్యమును నాకు బోధింపుము.

మ॥ అని యీలాగున గౌరి పల్కఁగ విరూపాక్షుండు తానిట్లనెన్।
వినవే పార్వతి దేహమందగణుఁడై విశ్వాత్ముఁడై వెల్గు నా।

త్మని దాఁగానక తామటంచు నహమ్మునఁ దోఁచేటి దుర్వృత్తిచే।
తను సత్యాత్ముఁ గనంగ వేరుసుగుణుల్ తామంచు నూహింపరే ॥

తా. ఓ పార్వతీ! వినుము. సుగుణవంతులు శరీరాంతర్వర్తి యగు పరమాత్మ, లెక్కింప నలవికానివాఁడై విశ్వమంతయు కనుఁగొనుచున్నవాఁడై తేజరిల్లుచున్నాఁడు. అట్లుండియు నేను అనెడి అభిమానముగలవారై అందువలనఁ గల్గు దుర్వృత్తిచే నా పరబ్రహ్మము తామని కనుగొననివారై యున్నారు.

వ॥ అనిన భవునకు భవాని యిట్లనియె॥ 63

తా. సులభము.

క॥ ఓ పరమేశ్వర దేవా।
వ్యాపారేంద్రియము లాత్మ వదలక నెపుడున్।
గాపట్యత చరియించునె।
యాపద్ధతిఁ దెలియ సర్వమానతియీవే ॥ 64

తా. ఓ పరమేశ్వరా! ఆత్మ శరీరేంద్రియ వ్యాపారములను వదలక నిరంతరమును కపటముతో సంచరించును. దీని కారణము నంతయుఁ దెలియఁ జేయుము.

వ॥ అనినఁ బార్వతికి పరమేశ్వరుం డిట్లనియె॥ 65

తా. సులభము.

తే॥ వారిజాక్షిరొ యింద్రియవ్యాప్తులందుఁ।
బాప పుణ్యాది సుఖదుఃఖ భావములను।
దగిలి తగులక సాక్షియై తనరుచున్న।
యాత్మ సేవించి పరమొంది రార్యులెల్ల॥ 66

తా. ఓ పార్వతీ! వినుము. ఆత్మజ్ఞానము గలవారందఱును ఇంద్రియ వ్యాపారములయందు పాపము పుణ్యము మొదలగు సుఖదుఃఖముల భావములయందు అంటియును అంటకయును సర్వమునకు సాక్షీయును నై యుండు పరమాత్మునింగని కైవల్యము నొందిరి.

గీ॥ ఆత్మఁ డెల్లప్డు ప్రకృతిని నంటకుండి।
వేఱుగాకున్న పద్ధతి వినవె యిపుడు।

జలములోపల మీనంబు జాతమయ్యుఁ।
దెలియకుండంగ వేఱునౌ తీరు సుమ్ము॥ 67

తా. ఓ పార్వతీ! వినుము. ఆ పరమాత్మ దేని నంటక ప్రకృతికంటె వేఱైయుండునట్టి పద్ధతిని చెప్పెదను. నీళ్లలో చేప జన్మించియు నాచేప నీళ్లనంటక వేఱైయుండునట్లని యెఱుంగుము.

తే॥ ఉదకమునఁ బద్మపత్రంబు నుదయమయ్యు।
జలమునంటక యున్నట్లు చంద్రవదన।
ఘటజలంబున గగనంబు గానిపించు।
నందు దివిచూడ నెట్లుండు నంబుజాక్షి॥ 68

తా. ఓ గౌరీ! వినుము. జలములందు తామరాకుఁబుట్టియు అది యెట్లు జలమునంటక యున్నదో, కుండలోని జలములందు ఆకాశం బెట్లు కనఁబడియు దాని నంటకయున్నదో, అట్లు ఆ పరమాత్మ శరీరములోపలనుండియు ఇంద్రియముల నంటక యుండునని తెలియుము.

వి. "పద్మపత్రమివాంభసి" అను ఉపనిషద్వాక్యము నిట గ్రహించునది.

శ్లో॥ ఘటాభావే ఘటాకాశో మహాకాశో యథాతథా।
ఉపాధ్యభావే త్వాత్మైవ స్వయం బ్రహ్మైవ కేవలం॥

తా. ఘటము నశించినతర్వాత అందుండు ఆకాశము మహాకాశములో కలిసి పోవునట్లు, ఉపాధి నశింపఁగానే తానును బ్రహ్మంబగును. ఈ విషయము అనేకములగు ఉపనిషత్తులందును, గౌడపాద కారికయందును గనందగును.

తే॥ ప్రకృతితో నాత్మ మిశ్రమై పరఁగుచుండి।
ప్రకృతినంటక భేదమై ప్రబలుచుండు।
నట్టి ప్రకృతికి వేఱుగా నమరు నాత్మ।
యొరులచేఁ గానగాలేక మఱుఁగుతగిలి॥ 69

తా. ఓ పార్వతీ! వినుము. ప్రకృతితో (శరీరముతో) ఆత్మ మిశ్రముగాఁ గనంబడుచుండియు, ఆ యాత్మ ప్రకృతినంటక

వేఱుగాఁ గనంబడుచుండును. ఇట్టి ఆత్మ మఱపుచే ఇతరులకు గానంబడక యున్నది.

క॥ ప్రాకృత చేష్టలఁ బెనఁగొని।
సాకృతుఁడై జన్మకర్మసంసర్గముల।
న్నేక్రియలు చేయలేక ని।
రాకృతుఁడగు నాత్మ నచలుఁ డరయఁగఁ దలఁచెన్॥ 70

తా. పార్వతీ! వినుము. (జీవుఁడు) అవిద్యా సంబంధమైన వ్యాపారములందు జిక్కి సకల కార్యములను జేయుచు నుండియు జన్మార్జితమైన కర్మములకు లోఁబడి యేకార్యమును జేయక నిశ్చలముతో నుండువాఁడై ఏక్రియను చేయకయుండు ఆ పరమాత్మను కనుంగొనవలయునని భావించెను.

తే॥ ఏకమై విశ్వమంతట నెసఁగుచుండి।
సగుణ నిర్గుణములకుఁ దా సాక్షియగుచు।
నుండు పరమాత్మ గాంచ నఖండమైన।
మనసు గలవాని కదిగల్గు మందయాన॥ 71

తా. ఓ పార్వతీ! వినుము. (ఆ పరమాత్మ) ఒక్కఁడే యై ప్రపంచమంతట వ్యాపించి, సగుణ నిర్గుణస్వరూపుఁడై యుండు ఆ పరమాత్మను, అఖండమైన మనస్సుగలవాఁడుమాత్రమే దర్శించును.

వి. శ్లో॥ "ఏకామూర్తి స్త్రయోభాగా బ్రహ్మావిష్ణు మహేశ్వరాః॥"

తా. ఒక్క మూర్తియగు ఆ పరమాత్మయే బ్రహ్మ విష్ణు మహేశ్వరులని మూఁడువిధములుగా నున్నది. ఇట్లు మత్స్యపురాణము 3-వ అధ్యాయమునందు జెప్పఁబడియున్నది.

క॥ ఒకఁడై సచరాచరముల।
నకలంకత నేలుభావ మదియెట్లన్నన్।
బ్రకటించి తెలియఁబల్కెద।
శుకవాణిరో మనసునిల్పి సుస్థితి వినుమీ॥ 72

తా. ఓ గౌరీ! ఒకఁడగు ఆ పరమాత్ముఁడు చరములను అచరములను అగు నీ జగత్తునంతయుః రక్షించుచున్నాఁడు. ఆవిషయమునంతయుః జెప్పెదను. నీవు చక్కఁగా మనస్సునుంచి వినుము.

తే॥ కంబుకన్ధరి సకల జగంబులెల్ల।
భాను నొక్కని కళచేతఁ బ్రబలుచున్న ।
మాడ్కి దేహేంద్రియము లాత్మ మహిమ వలనఁ ।
బ్రబలమగుచుండు నడఁగును బద్మనేత్రి ॥ 73

తా. ఓ శంఖమువంటి కంఠముగల పార్వతీ ! వినుము. ప్రపంచంబంతయు ఒక్కఁడగు సూర్యుని తేజస్సుచేతనే వెలుఁగుచుండు విధమునఁ శరీరములో నుండు ఇంద్రియములన్నియునుఆత్మయొక్క ప్రకాశమువలన తేజరిలుచుండును. ఆత్మయొక్క ప్రకాశము లేనియెడల ఆ యింద్రియములు అణఁగిపోవును.

వి. శ్లో॥ "ఇంద్రియైర్బధ్యతేజీవ ఆత్మావై నచ బధ్యతే।
మమత్వేన భవేజ్జీవో నిర్మమత్వేన కేవలః ॥"

తా. జీవుఁడు ఇంద్రియములచే కట్టువడియున్నాఁడు. నేను జీవుఁడుకాదు; అనుటచేత ఈశ్వరుఁ డగుచున్నాఁడు. ఇట్లు యోగచూడామణ్యుపనిషత్తునందుఁ జెప్పబడియున్నది.

ఈ విషయమును భగవద్గీత 13-వ అధ్యాయము 34-వ శ్లోకమునందు గనందగును.

వి. శ్లో॥ "ప్రత్యయార్థంహి జగతా మేకస్థోపి దివాకరః ।
ఏకోపి బహుదా దృష్టో జలధారేషు సువ్రతాః ।
జంతవో దివి భూమౌచ సర్వేవై పాంచభౌతికాః ।
తథాపి బహుళాద్రష్టా జాతివ్యక్తి విభేతః ।
దృశ్యతే శ్రూయతే యద్యత్తద్వద్ధిశివాత్మకః ।
భేదేజనానాం లోకేస్మిఁ ప్రతిభాసో విచారతః ॥

తా. ఒకఁడైయుండు సూర్యుఁడు జలాశయములం దనేక సూర్యులుగా నెట్లు కనఁబడుచున్నాఁడో, ఆలాగు పంచభూతస్వరూపములు స్వర్గమునందును భూమియందును నుండు దేవమనుష్యాది భేదములుగా గానంబడుచున్నవి. ఏదేది కనంబడుచున్నదో ఏదేది వినఁబడుచున్నదో అవి యన్నియు శివస్వరూపమే యగుచున్నది. విచారించి తెలిసికొన్నవారికి ఈ లోకమునందలి జనుల

భేదము లన్నియును వ్యత్యాసమువలె కనఁబడుటయేగాని మత్తేమి యునుగాదు.

ఇట్లు లింగపురాణము పూర్వ భాగమునందుఁ జెప్పఁబడి యున్నది.

తే॥ అక్షరునిగాను దననిజ మరసినపుడె।
పరఁగ షడ్వింశ పరమాత్ము నరయనయ్యె।
నతఁడు దానుగ నరసిన యవసరమున।
సతమునై యున్న ప్రాకృత మతివమాను॥ 74

తా. ఓ పార్వతీ! వినుము. ఎవఁడు తన్ను నాశములేని పరబ్రహ్మ వస్తువని యెఱుఁగునో అపుడు ఇరువదియాఱవ తత్త్వ మగు పరమాత్ముని యెఱిఁగినవాఁడగును. ఇట్లెప్పుడు తన్ను పరమాత్మ స్వరూపమని యెఱుఁగుచున్నాఁడో, అపుడే ప్రకృతి నశించును.

ప్రకృతియనఁగా మాయ. కావుననే ఈప్రపంచము ప్రకృతి యనఁబడును. ప్రకృతియందుండువారు ప్రకృతులు. అనఁగా జీవులు అని భావము.

క॥ క్షరుఁడపు డక్షరుఁ గలయంగ।
బరిపూర్ణాద్వైతబ్రహ్మ భావంబొందుఁ।
బరమైన ప్రకృతితోడను।
బొరయక యద్వైతసుఖముఁ బొందును గౌరీ॥ 75

తా. ఓ పార్వతీ! వినుము. క్షరుఁడను పేరుగల జీవుఁడు అక్షరుఁడగు పరమాత్మతో నైక్యమొందునేని పరిపూర్ణమైన యట్టియు, రెండవది లేనట్టియు, నేనే బ్రహ్మము అనెడి భావమును బొందును. (ఇట్టి భావము కలిగినప్పుడు) వేఱైనట్టి ప్రకృతితోఁ జేరక అద్వైతానంద సుఖమును బొందును.

వి. శ్లో॥ "కార్యోపాధి రయంజీవః కారణోపాధిరీశ్వరః।
కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే॥" ✓

తా. ఈ జీవుఁడు కార్యమైన అవిద్యను ఉపాధిగాఁ గల వాఁడు. ఈశ్వరుఁడు కారణమైన మాయను ఉపాధిగాఁ గలవాఁడు.

కార్యకారణములను నిగ్రహించినయెడల పూర్ణజ్ఞాన స్వరూపియైన ఆత్మయే శేషించు (మిగులు) చున్నది. ఇట్లు శుకరహస్యోపనిషత్తు నందు జెప్పఁబడియున్నది.

శ్లో॥ "ప్రకృతి స్త్వం పుమాం స్త్వంచ వేదాన్యేన క్వచిద్భవేత్ ।
జీవ స్త్వం సాక్షిణోభోగీ స్వాత్మనః ప్రతిబింబకః ॥

తా. ఓ కృష్ణా! ప్రకృతియు నీవే, పురుషుఁడును నీవే, దేని చేత నిన్ను దెలిసికొనుట కగును? సర్వసాక్షియైన నీయొక్క ఆత్మ, ప్రతిబింబముగాను, భోగమును అనుభవించువాఁడుగను నుండు జీవుఁడును నీవే.

ఇట్లు పద్మ పురాణము గణపతిఖండమునందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ "బుద్ధ్యాత్మభావయోరైక్యం జీవ ఇత్యభి ధీయతే॥"

తా. బుద్ధియు, అందు (బుద్ధిగుహయందు) తోఁచునట్టి ఆత్మ ప్రతిబింబమును, అను నీ రెంటియొక్క సంబంధమే జీవుఁడని చెప్పఁ బడుచున్నాఁడు. ఇట్లని అధ్యాత్మరామాయణమునందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ "తద్బ్రహ్మైవ జగత్సృష్ట్వా ప్రాప్య జీవాత్మనా జగత్॥"

తా. ఆ బ్రహ్మమే ప్రపంచమును సృష్టిచేసి జగత్తులో జీవాత్మగా నున్నది.

శ్లో॥ "ఆత్మన స్తత్వవిజ్ఞానా త్తత్వంబ్రహ్మైవ కేవలం ॥"

తా. పరమాత్మయొక్క వాస్తవమైన జ్ఞానమువలన (జీవుఁడు) బ్రహ్మమే యని తెలియనగును. ఇట్లు సూతసంహితయందు ముక్తి కాండమునఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ "అహంబ్రహ్మాస్మి వాక్యాచ్చ జ్ఞానా న్మోక్షో భవేన్నృణాం॥

తా. "నేను బ్రహ్మమైయున్నాను." అను వాక్యముచే గల్గిన జ్ఞానముచేత మనుష్యులకు ముక్తి గలుగుచున్నది.

ఇట్లు సనత్కుమార సంహితయందుఁ జెప్పఁబడియున్నది.

క్షరాక్షర భేదమునకుఁ గారణములను భగవద్గీత 15 - వ అధ్యాయము, 16-18-వ శ్లోకములందు తెలిసికొనందగును. క్షుత్ర

గీ॥ అక్షర బ్రహ్మపరమని యమరుచుండు ।
గీతలనుగను మీరీతి కీరవాణి ।
యచలుఁ డవ్యక్తుఁ డాధ్యుఁడౌ యక్షరుండు ।
జంగమ స్థావరములందు సాక్షినుండు ॥ 76

తా. ఓ చిలుకవంటి పలుకులుగల పార్వతీ! వినుము. కృష్ణార్జునసంవాదమైన భగవద్గీతలయందుఁ "అక్షరం బ్రహ్మపరమం" అని చెప్పఁబడియుండు వాక్యప్రకారముగా చలనములేనివాఁడును, అవ్యక్తుఁడును, ఆధ్యుండును(గొప్పవాఁడును,)నాశములేనివాఁడును జంగమ స్థావరములందు నుండువాఁడును, ఆ పరబ్రహ్మ మొకఁడే యని యెఱుంగుము.

వి. శ్లో॥ అక్షరంబ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ॥

తా. ఈ శరీరమునందు పరమాత్మ వసించుచున్నాఁడు. కావుననే ఇది అధ్యాత్మ మనఁబడును. ఇదే ప్రత్యగాత్మ. ఇట్లు భగవద్గీత ఎనిమిదవ యధ్యాయమునందుఁ జెప్పఁబడి యున్నది.

జంగమము=కదలునట్టి జీవజంతువులు.

స్థావరము=కదలకయుండు పర్వతములు వృక్షములు మొదలగునవి.

క॥ అత్యుత్తమ మగు గీతల ।
సత్యమనిర్దేశ్య మనుచుఁ జాటించుతగన్ ।
ప్రత్యాసక్తిని దీనిని ।
కాత్యాయని తెలిసిముక్తిఁ గనవలెజగతిన్॥ 77

తా. శ్రేష్ఠమగు భగవద్గీతలయందు, ఆ పరమాత్మయే సత్యమైనదియనియును, దానిని ఇట్టిదని యెఱుంగుటకు సాధ్యముకాదనియును జెప్పఁబడియున్నది. కాఁబట్టి దీనిని మిగుల నాశక్తితో నెఱింగి ముక్తినిఁ బొందవలయును.

క॥ విక్షేపశక్తి మానియు ।
నక్షీణ పరావరంబె యది పరమంబౌ ।
యక్షరము పరమపద మని ।
క్షితగా శ్రుతులు పల్కుఁ దామరసాక్షీ॥ 78

వాఁడు.

తా. పార్వతీ! వినుము. విక్షేపమనెడి మాయాశక్తిని విడిచి పెట్టి,సత్యమైనట్టి పరావర మనెడి పరబ్రహ్మమును శ్రేష్ఠమైన పరమ పద మని శ్రుతులందుఁ జెప్పఁబడి యున్నది.

వి. శ్లో॥ "విక్షేపావృతిరూపాభ్యాం ద్విధావిద్యా వ్యవస్థితాః ।
నభాతినాస్తికూటస్థ ఇత్యాపాదన మావృతిః ॥"

తా. అవిద్య విక్షేపము, ఆవరణము, అనెడి రెండు రూపములుగాఁ నున్నది. కూటస్థుఁడు లేఁడనియును, ప్రకాశింప లేదనియును, వ్యవహరించుటకు హేతు వెద్దియో, అదియే ఆవరణ మనఁబడును.

శ్లో॥ "అవిద్యావృతకూటస్థే దేహద్వయయుతాచితిః ।
శుక్తౌరూప్య వదధ్యస్తా విక్షేపాధ్యాస ఏవహి ॥"

తా. ముత్తెపుచిప్పను జూచి వెండి యని భ్రమించునట్లు అవిద్యచేత మఱుఁగింపఁబడియుండు కూటస్థునియందు స్థూలసూక్ష్మ శరీర సహితుఁడగు చిదాభాసుఁడు కల్పింపఁబడెను. ఈ చిదాభాసుఁడే విక్షేప మనెడి పేరుగల అధ్యాసమని యెఱుంగందగును.

శ్లో॥ "అవిద్యావృతితాదాత్మ్యే విద్యయైవ వినశ్యతః ।
విక్షేపస్య స్వరూపంతు ప్రారబ్ధ క్షయమీక్షతే ॥"

తా. అవిద్యాకార్యమగు ఆవరణాధ్యాసముజ్ఞానముచేతను, (అవిద్యాకార్యమగు) విక్షేపము ప్రారబ్ధకర్మ నాశముచేతను నివృత్తియగును.

ఇట్లు వేదాంత పంచదశియందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ "క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్దృష్టే పరావరే ॥"

అనెడి ఉపనిషద్వాక్యమును ఇచట గ్రహించునది.

తే॥ క్షేత్రమే దేహ ని దేహచర్య లెఱుఁగఁ।
దరుణి క్షేత్రజ్ఞుఁడౌనని తత్త్వ విదులు।
పల్కుదురు క్షేత్రజ్ఞుం డాత్మభావుఁడెట్టు।
లరసి కాఁగలడన్నట్టి యర్థమునను ॥ 79

తా. ఓ పార్వతీ! వినుము. క్షేత్రమేదేహమని దేహతత్త్వ మెఱింగిన వారెఱుంగుదురు. ఆ పరమాత్మ దేహమనెడి క్షేత్ర

మునం దుండుటంజేసి క్షేత్రజ్ఞుఁడని వేదాంతవేద్యులు చెప్పుదురు. క్షేత్రజ్ఞుఁడు పరమాత్మయే యని విచారించినయెడల తెలియ వచ్చును. ఈ విషయము దిగువ పద్యముతో నన్వయము.

వి. శ్లో॥ ఇదంశరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥

తా. ఈ శరీరము క్షేత్రమని చెప్పఁబడుచున్నది. ఈ శరీర మిట్టిదని తెలిసినవారు ఇందుండు పరమాత్మను క్షేత్రజ్ఞుఁడని చెప్పుదురు.

ఈ విషయము భగవద్గీత 13-వ అధ్యాయమునందుఁ గనం దగును.

క॥ ఇదం శరీరమనుచుఁ ।
బదిలముగా గీతలందుఁ బల్కుచునుండుఁ ।
సుదతీమణి యీభావము ।
మదినెఱిఁగిన ముక్తి సర్వమంగళ వినవే॥ 80

తా. ఓ పార్వతీ! వినుము. ఈచెప్పఁబడిన క్షేత్రజ్ఞ విషయము భగవద్గీతలయందు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. ఈ పరమాత్మ తత్త్వము నెఱింగిన యెడల మోక్షము కలుగును.

వ॥ అదియునుంగాక ॥ 81

తా. సులభము.

క॥ క్షేత్రజ్ఞమ్మా మపియని ।
పాత్రతతో గీతలందుఁ బల్కు భవానీ ।
క్షేత్రజ్ఞు మహిమ యిదియను ।
సూత్రంబును నెఱిఁగి ముక్తిఁ జొరవెలుఁగఁదగున్ ॥ 82

తా. ఓ పార్వతీ! వినుము. క్షేత్రజ్ఞుఁ డిట్టి మహిమ గలవాఁడని భగవద్గీతలయందుఁ జెప్పఁబడియున్నది. ఆ రహస్యంబును దెలిసికొని ముక్తినొందుమార్గమును ఎఱుఁగవలయును.

వి. శ్లో॥ క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి సర్వక్షేత్రేషుభారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ॥

తా. పార్వతీ! వినుము. సకలక్షేత్రముల (శరీరముల)యం దుండు నన్ను (భగవంతుఁడగు పరమాత్మను) తెలిసికొనుము. ఇట్లు సకల శరీరములను, ఆ శరీరములయందుండు పరమాత్మయగు నన్ను దెలిసికొనుటయును, జ్ఞానమని యెఱుంగుము.

ఇట్లని భగవద్గీతయందు శ్రీకృష్ణమూర్తి అర్జునునకు ఉపదేశించి యున్నాఁడు.

తే॥ క్షరుఁడు నక్షరభావంబుఁ జెంది నపుడె ।
యాద్యుఁ డక్షరుఁ డగణుఁ డవ్యక్తుఁడయ్యు ।
నిత్య సత్యస్వరూపుఁడై నెగడునాత్మ ।
తానుగానక ప్రకృతిని దగులఁబడుట॥      83

తా. ఓ పార్వతీ! వినుము. క్షరుఁడు అను పేరుగల జీవుఁడు అక్షరభావంబనెడి పరమాత్మ,అను భావము నొందినపుడే ఆద్యుఁడు అనఁగా మొదటివాఁడు, మూలపురుషుఁడు, కారణపురుషుఁడు, అనియును; అక్షరుఁడు అనఁగా నాశములేనివాఁడు అనియును; అగణుఁడు అనఁగా లెక్కింప నలవికానివాఁడు అనియును; అవ్యక్తుఁడు అనఁగా అతఁడిట్టివాఁడని యెఱుఁగబడుటకు సాధ్యముకానివాఁడుఅనియును; నిత్యసత్యస్వరూపుఁడు అనఁగా శాశ్వతముగను వాస్తవముగను నుండునట్టివాఁడు అనియును; ప్రకాశించును. ఇట్లు ప్రకాశించు పరమాత్మను దెలిసికొననందుననే జీవుఁడు మాయలోఁ జిక్కువడి జీవత్వము నొందియున్నాఁడని తెలిసికొనుము.

తే॥ జీవభావనుఁడై చాలఁ జిక్కువడియె ।
జీవుఁడే దేవుఁ డనునట్టి చిక్కు తెలియ ।
దైవభావనుఁడై యాత్మ తానె యగును ।
జీవ దైవుల భావ సంసిద్ధివినుము॥      84

తా. ఓ పార్వతీ! పరమాత్మగా నుండదగినవాఁడు జీవభావమునొంది మిక్కిలి కష్టమునొందెను. ఆ జీవుఁడే ఆత్మయనెడి కీలు నెఱింగినచో తానేపరమాత్మయగును.ఇట్లుజీవాత్మయొక్కయు పరమాత్మయొక్కయు భేదభావము నెఱుఁగుము.

తే॥ సకల సంకల్పజాలంబు సమసెనేని ।
జీవుఁ డనుభ్రాంతి మాని తా దేవుఁడగును ।
నట్టి దేవుఁడె యక్షరుఁ డనఁగఁ బరఁగు ।
నట్టి జీవుండె క్షరుఁడందు రంబుజాక్షీ॥ 85

తా. పార్వతీ! వినుము. సమస్తంబైన సంకల్పములును నశించినయెడల జీవుఁడనెడి భ్రమనశించి తానే పరమాత్మయగును. ఆపరమాత్మయే అక్షరుఁ డనఁబడును. ఆజీవుఁడే అక్షరుఁ డనిచెప్పఁబడును. ఇదియే దైవభావ మని తెలిసికొనుము.

వి. శ్లో॥ "సత్యంజ్ఞాన మనంతంయ ద్బ్రహ్మతద్వస్తు తస్యతత్ ।
ఈశ్వరత్వంచ జీవత్వ ముపాధిద్వయ కల్పితం॥"

తా. ఆ పరబ్రహ్మము సత్యత్వభావమును, జ్ఞానస్వభావమును, అనంతస్వభావమును అగు పారమార్థికమగును. ఆ బ్రహ్మవస్తువునకు ఈశ్వరత్వమును జీవత్వమును కల్పింపఁబడి యున్నది.
అని వేదాంతపంచదశియందుఁ జెప్పఁబడియున్నది.

క॥ అక్షరమును క్షరభావము ।
లక్షించి ప్రపంచభ్రాంతులం దగులక తా ।
జక్షుర్మధ్యను నాత్మని ।
నీక్షించియు బ్రహ్మమొందు మిభరిపుమధ్యా॥ 86

తా. ఓ పార్వతీ! వినుము. అక్షరము, క్షరము, అనెడి జీవబ్రహ్మలయొక్క స్థితిని దెలిసికొని ప్రపంచమందలి భ్రమలకు లోఁబడక నేత్రమధ్యమునందు ప్రకాశించునట్టి పరమాత్మను దెలిసికొని ఆ పరమాత్మను బొందుము.

వి. భ్రాంతియనఁగా భ్రమ. ఈ విషయమును ఈ గ్రంథమునందు 6-వ పుటను చూడుము.

క॥ అటువంటిది సాంఖ్యంబని ।
కుటిలాలక తెల్పినాఁడ గురుతుగ నవలన్ ।
బటుగతిఁ దారకభావము ।
ఘటియించెదఁ దెలియ వినుము కంజదళాక్షీ॥ 87

తా. ఓ పార్వతీ! వినుము. అట్టిదియే (పరమాత్మయే) సాంఖ్యమని తెలియఁజేసితిని. ఇఁక తారక భావమును జెప్పెదను తెలిసికొనుము.

## తారక ప్రభావము.

ఆ॥ తారక ప్రభావసార మెట్లన్నను।
నల యు కారకార మా మకార।
ములను నాదబిందుకళ లవయవములఁ।
దగులఁ బ్రణవవర్ణ డగును గౌరి॥ 88

తా. ఓ పార్వతీ! వినుము. తారకప్రభావ మెట్లనఁగా.— అకారము, ఉకారము, మకారము, అను నీ మూఁడక్షరము లే నాదము, బిందువు, కళ, అను నీ మూటియందు లయమగునేని ప్రణవ స్వరూపుఁ డగును. అనఁగా పరమాత్మయగును.

క॥ పరఁగ నకారము నాదము।
మరిబిందు వుకారమగుచు మహి విలసిల్లున్।
పరగ మకారము కళయగు।
నారయుచు నీమూఁడుగలయ నోంకారమగున్॥ 89

తా. ఓ గౌరీ! వినుము. అకారము నాదమనియును, ఉకారము బిందువనియును, మకారము కళయనియును, నీ మూఁడును జేరిన ఓంకార మనెడి ప్రణవ మగుననియును దెలిసికొనుము.

గీ॥ అట్టి యోంకారవర్ణాశ్రమమును నరయ।
గౌరి యాపోజ్యోతియై ఘనత కెక్కు।
నట్టి జ్యోతిని సత్తుతా నరసెనేని।
తారకంబండ్రు బుధవరుల్ సారసాక్షి॥ 90

తా. ఓ శాంభవీ! వినుము. ఆ ప్రణవమే ఆపోజ్యోతి యని ప్రసిద్ధినొందును. అట్టి సత్తామాత్రమగు జ్యోతిని తెలిసికొనుటయే తారకమగునని తెలిసినవారు చెప్పుదురని యెఱుఁగుము.

క॥ ఓమి త్యేకాక్షరమని।
యోమాపోజ్యోతి యనుచు నొప్పగుచుశ్రుతులన్।

రామారామణి యీభావను।
కామించియు రామతారకము గనుగౌరి॥ 91

తా. ఓ పార్వతీ! వినుము. ఆ యోంకారము ఏకాక్షర మనియు, ఆపోజ్యోతియనియు, శ్రుతులయందు చెప్పఁబడును. దీనిని తెలిసికొనుము ఇదే రామతారక మగును.

శ్రుతి॥ "జ్యోతిరహంవిరజా విపాప్మా।" "ఓమిత్యాత్మానం యుంజీత।"
"జ్యోతిర్మయోస్మ్యహం జ్యాయాన్ జ్యోతిషాం జ్యోతిరస్మ్యహం।"
"ఓంకార ఏవేదంసర్వం।" "ఓమిత్యేకాక్షరంబ్రహ్మ।"
"అక్షరం బ్రహ్మసమ్మితం।" "ఓమిత్యేదక్షరం పరంబ్రహ్మ।"
"ప్రణవోహి పరంబ్రహ్మ ప్రణవశ్చ పరంస్మృతః।"
"అక్షరం పరమంబ్రహ్మ నిర్విశేషం నిరంజనం॥"

శ్లో॥ రామఏవ పరంబ్రహ్మ రామఏవ పరంతపః।
రామఏవ పరంతత్త్వం శ్రీరామో బ్రహ్మతారకం॥

అని శ్రుతులయందును, ఉపనిషత్తులయందును జెప్పఁబడి యున్నది.

సీ॥ హరిణాక్షి యీయర్ధ మలయంగను నకార
మరుదుగా లక్ష్మణుఁ డరయనయ్యె।
సరవి నుకారమే శత్రుఘ్నుఁడై యొప్పు
బరగ మకారమే భరతుఁడగును।
గర మొప్పు నోంకార ఘనయర్ధమాత్రయు
రామవిగ్రహ మని రసికులంద్రు।
ప్రేమైనబిందువే ప్రియసీతయై యొప్పు।
నిది రామతారక విధముసుమ్ము॥
తే॥ ఇట్టి యోంకారపదమెన్న గట్టిగాను।
నతివ తారక లక్ష్యత్రయములు మూఁడు।
కూర్మితోడుత దెలిసిన కొదువలేద।
టంద్రు పరిపూర్ణు లరసి యోచంద్రవదన। 92

తా. ఓ చంద్రవదనయు జింకవంటి కన్నులునుగల పార్వతీ! ఈ చెప్పఁబడిన రామతారక రహస్యము నెఱిగించెదను వినుము.

అకారము—లక్ష్మణుఁడు.
ఉకారము—శత్రుఘ్నుఁడు.
మకారము—భరతుఁడు.
అర్ధమాత్ర—శ్రీరాముఁడు.
బిందువు—సీత.

ఇదియే రామతారకము. ఈ ఓంకారమునందలి అక్షరములు మూఁడును, లక్ష్యత్రయములును, నెఱింగినవారికి యేకోఅఁత యును లేదు. అని వేదాంత విద్యను జక్కఁగాఁ దెలిసికొన్నవారు చెప్పుదురు.

వి. లక్ష్యత్రయములను ప్రథమాశ్వాసము 115-వ పద్యము యొక్క విశేషార్థమునందు గనందగును. రామతారక విషయము రామతాప నీయోపనిషత్తునందు విస్తరముగాఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ అతఃపరంతారకం గుహ్యం దృష్టిప్రత్యయ సంయుతం।
మమానుభవ సంసిద్ధం యోగం ప్రాణ ప్రియేశ్రుణు॥

తా. ఓ ప్రేయసీ! ఇఁక కనఁబడు దృష్టి ప్రత్యయముతో గూడినదియును, నా అనుభవ సిద్ధమైనదియును రహస్యమైనదియును అగు తారకయోగమును వినుము.

శ్లో॥ మంత్రేణ లయయోగేణ హఠయోగేన సర్వదా।
యావద్బ్రహ్మ నజానంతి తావత్ క్లిశ్యన్తి పండితాః॥

తా. మంత్రయోగముచేతను, లయయోగముచేతను, హఠయోగముచేతను, ఎంతవఱకు బ్రహ్మమును దెలిసికొనలేదో అంత వఱకును పండితులు క్లేశ మొందుచున్నారు.

శ్లో॥ నేత్రే నిమీలితేనిత్యం కించి దున్మీల నేతదా।
యో మనశ్చక్షుషాబ్రహ్మ పశ్యతీతి సయోగిరాట్॥

తా. నిత్యమును నేత్రములు రెంటిని తెఱచుకొని, కొంచెము మూసికొని యుండి మనోదృష్టిచే బ్రహ్మమును ఎవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు రాజయోగి యగును.

శ్లో॥ శశిభాస్కరయో ర్మధ్యే తారయో స్థిరతేజసః।
బిందుద్వయంచ సంయోజ్య బ్రహ్మతారక మభ్యసేత్॥

తా. చంద్రసూర్యుల నడుమ తారము రెంటియొక్క స్థిరమైన తేజస్సును, బిందుద్వయమును లెస్సగా చేర్చి బ్రహ్మతారకమును అభ్యసింపవలయును. చంద్రసూర్యులు అనఁగా కుడియెడమల నేత్రములకు నడుమ అని యర్థము. ఇట్లనుటచేత రెండు కనులకు మధ్యభాగమునందలి యెఱుంగవలయును.

తారమనఁగా=కనుగ్రుడ్డు అని సామాన్యజనుల యభిప్రాయము.
తారమనఁగా=కంటిలోని పాప యని అనుభవజ్ఞుల యభిప్రాయము.

తే॥ పరగ నాంతరలక్ష్యంబు బాహ్యలక్ష్య।
మరయఁగా మధ్యలక్ష్య సన్మార్గమరసి।
ప్రణవ సంపూర్ణశరధి పట్టాభిషేకుఁ।
డైనవానికిఁ గొదువలేదండ్రు బుధులు॥ 93

తా. ఓ పార్వతీ! వినుము. బాహ్యలక్ష్యము, ఆంతరలక్ష్యము, మధ్యలక్షము, అను నీ మూఁడు లక్ష్యములయొక్క మార్గములను తెలిసికొని ప్రణవసముద్రమునందు పట్టాభిషేకుఁడైనవానికి ఏవిధమైన కొఱఁతయును లేదని పెద్దలు చెప్పుదురు.

వి. ఈ లక్ష్యత్రయములను గూర్చి ఆ-1. 115-వ పద్యముయొక్క విశేషార్థమును జూచినచో స్పష్టమగును.

ప్రణవము నాదబిందు కళాత్మకంబై యుండును. సృష్టి స్థితి లయములకు కారణమై విరాట్టు సూత్రాత్మ అంతర్యామి భావమై శక్తిత్రయంబై యుండును.

ఆప్రణవము అ-ఉ-మ అర్ధమాత్రతోఁ గూడినది. కావుననే మాండూక్యోపనిషత్తునందు— "అకార ఉకార మకార అర్ధమాత్రాః చత్వారఃపాదః" అనియు; "విశ్వ తైజస ప్రాజ్ఞ తురీయాః" అనియుఁ జెప్పఁబడియున్నది. మఱియు;

శ్లో॥ ప్రథమం తారకంచైవ ద్వితీయం దండముచ్యతే।
తృతీయం కుండలాకారం చతుర్థం చార్థచంద్రకం।
పంచమం బిందుసంయుక్తం ఓమితి జ్యోతిరూపకం॥

తా. ఓమ్, అను అక్షరముయొక్క ఆకృతి, మొదటిది తారకము, రెండవది దండకము, మూడవది కుండలాకారము,నాలవది అర్థచంద్రాకారముగ నుండును. అయిదవది బిందువుతోఁ గూడినందువలన ఓంకారమగును. అకారముతోఁగూడ ఉకారము చేరినప్పుడు గుణసంధిచేత ఓ అను అక్షరమగును. దానితో అనునాసికమైన మకార వ్యంజనాక్షరముచేరి "ఓం" అని యగును.ఉచ్చరించవలసినప్రకారమును బట్టి అర్థమాత్రగా ఆ మకారము శబ్దించుచున్నది. దీనికే ప్రణవమని నామము. దీనియందే సర్వమును అణఁగియున్నది. ఈ విషయము "ఓంకారగీత" యందు విస్తరముగాఁ గనందగును. అయినను విచారపరుల యుపయోగార్థము ఆ విషయము సంగ్రహముగా నిటఁ దెలియఁ జేయఁబడుచున్నది.

## లక్ష్యత్రయము.

బాహ్యా
శ్లో॥ "బ్రహ్మాంతర్మధ్యలక్ష్యేషు బ్రహ్మదర్శన తత్పరః।
దృష్టాదృష్ట స్వరూపాణి నను తాని విలోకయ॥"

తా. బాహ్యాంతర మధ్యలక్ష్యములయందు బ్రహ్మదర్శన తత్పరుఁడై దృష్టాదృష్ట స్వరూపములైన వానిని చూడవలయును.

## అంతరలక్ష్యము.

శ్లో॥ మూలకందా దండలగ్నాత్ బ్రహ్మనాడీ శశిప్రభా।
తస్యమధ్యే తటిత్కోటి నిభా తా మూర్ధ్వగామినీమ్।
మనసా లక్ష్యతే మ్మూర్తిం సదృశీం బిసతంతునా।
ఆబ్రహ్మరంధ్ర పర్యంత గతాం సిద్ధిప్రదాం స్మరేత్॥

తా. మూలకందము మొదలు వీణాదండమునంటి చంద్రప్రభవంటి బ్రహ్మనాడికలదు. దాని మధ్యయందు కోటి మెఱుములవంటి కాంతితో సమాన మైనదియును, తామర నూలివంటిదియును, అగు ఆ మూర్తిని మనస్సుచేఁ జూడవలయును. బ్రహ్మరంధ్ర పర్యంతము

పోవునట్టిదియును సిద్ధినొసంగునదియును అగు ఆ తేజస్సునుచింతింప వలయును.

శ్లో॥ లలాటోర్ధ్వే తథా లక్ష్యే యోగీ గోల్లాటమండపే।
విస్ఫుర త్తారకాకారం మనసా లక్షయేత్ సదా॥

తా. ఆ ప్రకారమే యోగి లలాటముయొక్క పై భాగము నందు గోల్లాటమండప మను స్థానమునందు ప్రకాశించు తారక స్వరూపమును ఎల్లప్పుడును మనస్సుచేత లక్షింపవలయును. నెత్తికి మీఁద శిరస్సునకు క్రిందనుండు స్థానము గోల్లాటమండప మని తెలియునది.

శ్లో॥ అథవా కర్ణ యోర్ద్వారే తర్జనీభ్యాం నిరోధయేత్ ।
శ్రీహట్ట మస్తకే నాదం ఘుంఘుంకారం శృణోతిచ॥

తా. మఱియు కర్ణరంధ్రములు రెంటిని జుట్టన వ్రేళ్లచే మూయవలయును. శ్రీహట్ట మస్తకమునందు ఘుం ఘుం అను స్వరూపమైన నాదమును వినవలయును.

శ్లో॥ చతుర్మధ్యే తథా నీల జ్యోతిరూపం విలోకయేత్ ।
అంతర్లక్ష్య మితిజ్ఞేయం బాహ్యేర్లక్ష్య మథశృణు॥

తా. నేత్రమధ్యమునందు నీలజ్యోతి స్వరూపమును జూడ వలయును. ఇట్లు అంతర్లక్ష్యమును తెలిసికొనవలయును. ఇఁక బహి ర్లక్ష్యమును జెప్పెదను వినుము.

## బా హ్య ల క్ష్య ము.

శ్లో॥ నాసాగ్రదేశా చ్చతుర షడష్ట ।
తథా దశ ద్వాదశ సంఖ్యయాంగుళిః ।
బహిస్థ నీలంచ సుధూమ్రరక్త ।
తరంగ పీతాద్భుత తత్త్వపంచకమ్ ॥

తా. నాసికాగ్రమునుండి నాలుగు, ఆఱు, ఎనిమిది, పది, పండ్రెండు అంగుళములకు బయటనుండు నీలము, మంచిపొగవంటి కాంతి, ఎఱుపు, అలవంటి తెలుపు, పచ్చ అను వర్ణములు, గల అద్భుతమైన తత్త్వపంచకమును జూడవలయును.

శ్లో॥ అథవా సమ్ముఖాంకాశం చలదృష్ట్యా విలోకయేత్ ।
జ్యోతిర్మయూఖాః దృశ్యంతే యోగిభి ర్ధీర మానసైః ॥

తా. మఱియు బహిర్ముఖాకాశమునుగాని, చలదృష్టిచేతగాని చూడవలయును. ధీరులగు యోగులచేత జ్యోతికిరణములుచూడఁబడుచున్నది.

అనుభవమునందును ఉపనిషత్తులందును చలదృష్టి చేతనే చూడవలయునని చెప్పఁబడియున్నవి.

శ్లో॥ దృష్ట్యగ్రేవా ప్యపాంగేవా తప్తకాంచన సన్నిభామ్ ।
భూమిం సం లక్షయేద్దృష్టిః స్థిరా భవతి యోగినః ॥

తా. కంటికి ముందుగాగాని, కడకంటియందుగాని కరగించిన బంగారముతో సమానమైన భూమిని చూడవలయును. అపుడు యోగియొక్క దృష్టి స్థిరమగుచున్నది.

శ్లో॥ అథవా శిరసాశ్చోర్ధ్వ ద్వాదశాంగుళ సమ్మితే ।
జ్యోతిఃపుంజం నిరాకారం లక్షయే న్ముక్తిదం భవేత్ ॥

తా. మఱియు శిరస్సుయొక్క మీఁదిభాగమునందు పండ్రెండు అంగులములకు మీఁదుగా నిరాకారమైన జ్యోతిస్సమూహములను జూడవలయును. అది ముక్తినొసంగును.

శ్లో॥ యత్రయత్రార్థవాన్ యోగీ తత్ర తత్ర విలక్షయేత్ ।
ఆకాశమేవ యస్తస్య చిత్తం భవతి తాదృశమ్॥

తా. ఎచ్చటెచ్చట యోగి పురుషార్థము కలవాఁడగుచున్నాఁడో అచ్చటచ్చట ఆకాశమును రక్షించవలయును. యోగియొక్క చిత్తమెదియో అది అప్రకార మగును.

శ్లో॥ ఇత్యేకం వివిధాకారం బహిర్లక్ష్య ముదీరితమ్ ।
శ్రుణుష్వ మధ్యలక్షంచ కథితం పూర్వసూరిభిః ॥

తా. ఇట్లు అనేకవిధములైన బహిర్లక్ష్యము చెప్పఁబడెను.

ఇఁక పూర్వజ్ఞానులచే చెప్పఁబడిన మధ్యలక్ష్యము చెప్పెదను వినుము.

## మధ్యలక్ష్యము.

శ్లో॥ శ్వేతాదివర్ణ నవఖండ సుచంద్ర సూర్య ।
సౌదామినీ వహ్నిశిఖేన బింబాత్ ।
జ్వల న్నభోవా స్థలహీన మేకం ।
విలక్షయే తత్ఖలు మధ్యలక్ష్యమ్ ॥

తా. తెలుపు మొదలగు వర్ణములు గలదియును, బాల చంద్రుఁడు, సూర్యుఁడు, మెఱుపు, అగ్నిశిఖ, అను వీనిచే బింబము నుండి జ్వలించునట్టి ఆకాశమును, లేక బాహ్యప్రదేశమును జూడ వలయును. ఇది నిశ్చయమైన మధ్యలక్ష్య మనఁబడును.

శ్లో॥ నిరాకారం పశ్యేద్గుణరహిత మాకాశ మథవా।
తమోరూపం గాఢం స్ఫుర ద్రూప మాకాశ మథవా।
మహాకాశం కాలానలనిభ మథాప్యంత రుచిరం ।
తథా తత్త్వాకాశం రవిశతనిభం సూర్యఖమితి ।
వ్యోమపంచక మేతద్ధి తద్బాహ్యాభ్యంతర స్థితం ।
యః పశ్యతి నరోలక్ష్యే సవ్యోమ సదృశోభవేత్ ॥

తా. 1. నిరాకారమును నిర్గుణమునగు ఆకాశము; 2. గాఢమైన చీకటివలెనుండు ఆకాశము; 3. కాలాగ్నివంటి ఆకాశము; 4. రమ్యమైన తత్త్వాకాశము; 5. నూర్గురు సూర్యులవలె నుండు సూర్యాకాశము, అను నీ పంచాకాశములను ఎవ్వఁడు బాహ్యమునందును అంతరమునందును జూచుచున్నాఁడో. వాఁడు ఆకాశముతోఁ సమానుఁడగును. అనఁగా నిర్మలుఁడగును.

శ్లో॥ తారణాచ్చ గురిశిష్యయోర్ద్వయో ।
స్తారకోయ మితియోగసంజ్ఞికః ।
తారకం భవ మహాబ్ధితారకం ।
తత్త్వమేవ పరిశీలనం కురు ॥

తా. గురుశిష్యుల నిరువురను తరింపఁజేయుటంబట్టి తారక మనఁబడును. భవసాగరమును దాఁటించెడి తారక తత్త్వమునే పరిశీలనము చేసి అభ్యాసము చేయవలయును.

శ్లో॥ ఫలమేకం ద్విధాచార్యం యథార్థం సాంఖ్యతారయోః।
ఉపాధి రహితస్సాంఖ్యో యోగసోపాధిక స్త్వయమ్॥

తా. సాంఖ్యతారకములు రెంటియందును యథార్థ ఫలమొకటి ఆచరింపఁ దగినది. రెండువిధములగు ఉపాధులును లేనిది సాంఖ్య మనఁబడును. స్వయముగా ఉపాధితోఁ గూడినది తారక యోగమగును.

ఈ ప్రకారము శివయోగ శాస్త్రమునందుఁ జెప్పఁబడియున్నది.

ఇట్లు తెలిసికొని జ్ఞానియైన అభ్యాసయోగి వర్తింపవలయునని యెఱుంగవలయును. ఈ గురుగీతాసారముయొక్క ముఖ్యాభిప్రాయ మంతయును నీ తారకయోగమును గూర్చియే చెప్పఁబడియున్నదని యెఱుంగవలయును.

శ్లో॥ ప్రణవో హి పరబ్రహ్మ ప్రణవః పరమంపదమ్।
ప్రణవం సర్వదేవమయం విదుః।
సర్వేషాం చైవ మంత్రాణాం ప్రణవః ప్రాణ ఉచ్యతే॥

తా. ప్రణవమే పరబ్రహ్మము, ప్రణవమే మోక్షపదము, ప్రణవమే సకలవేదములకును మూలము, ప్రణవమే సకలదేవతలు, అని తెలియవలయును. ప్రణవమే సకల మంత్రములకును జీవముగా నున్నదని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ ఓంకారప్రభవా వేదాః ఓంకారప్రభవా స్వరాః।
ఓంకారప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరమ్॥

తా. ఓంకారమునందుండియే నాలుగువేదములును కలిగెను. ఓంకారమునుండియే ఉదాత్తాది సకల స్వరములును (నాదమును) కలిగెను. ఓంకారమువలననే సర్వమును కలిగెను. ఓంకారమువలననే త్రిలోకములును సకల చరాచరములును కలిగెను.

వి. ప్రణవోపాసనమును 'అహంగ్రహధ్యాన' మనియును జెప్పఁబడును. ప్రణవమును జపించినయెడల యోగసిద్ధి కల్గును. మఱియు, ఈశ్వరునికి ఓంకారము వాచకమనియును, ఓంకారమునకు ఈశ్వరుఁడు వాచ్యమనియును, ఇట్లు నిత్యసంబంధముండుట

వలన ప్రణవజపము యోగికి ఆవశ్యకమని తెలియునది. ఈ ఓంకారముల నే నాదమనియు, శబ్దగుణమనియు, పరా-పశ్యంతి-మధ్యమా-వైఖరీ-అను చతుర్విధవాక్కనియు, జెప్పంబడును. ఈ నాదము బిందువు, కలా, అను రెంటితోఁ గూడియుండును. బిందు వనఁగా, ఓంకారముయొక్క అలఘ్వర్థరూపమైన తురీయపదము. కలా అనఁగా, ఓంకారముయొక్క అకారాది మాత్రలైన పరావాగ్రూపమగు శబ్దావయవము. ఎట్లనఁగా, "శ్లో॥ పరా ప్రాణమయీప్రోక్తా పశ్యన్తీచ మనోమయీ, మధ్యమా ఇంద్రియా ణ్యాహుః వైఖరీవా గితిస్మృతాః ॥ అనఁగా, పరావాక్కు ప్రాణమయమనియును, పశ్యంతీవాక్కు మనోమయమనియును, మధ్యమావాక్కు ఇంద్రియమయ మనియును, వైఖరివాక్కు వాఙ్మయ (వేద) మనియును తలంపఁ బడుచున్నది. మఱియు, పరావాక్కునకు స్థానము నాభిప్రదేశము. పశ్యంతీవాక్కునకు స్థానము హృదయము. మధ్యమా వాక్కునకు స్థానము కంఠము. వైఖరీవాక్కునకు స్థానము వాక్కు. అనఁగా, నాభిస్థానంబునందు సంకల్పము కలుగుచున్నది. హృదయస్థానమునందు అ సంకల్పము వృద్ధియగుచున్నది. కంఠస్థానమునందు ఆ సంకల్పము దృఢమగుచున్నది. వాక్కుస్థానంబునందు ఆ సంకల్పము నిశ్చయమగుచున్నది. ఈసంకల్పముయొక్క మూలము (పరావాక్కు) నశించినయెడల తురీయపదము (బహ్మానందము) కల్గును సంకల్పరాహిత్యమే మోక్ష మనుటకుం బ్రమాణము. "శ్లో॥ సశాంత సర్వసంకల్పా యాశిలా వ దవస్థితిః, జాగ్రన్నిద్రా వినిర్ముక్తా సా స్వరూపస్థితిః పరా ॥" అనఁగా సకల సంకల్పములును శాంతి బొందినవై, జాగ్రన్నిద్రా ద్యవస్థలు లేనివై, శిల (ఱాయి) వలె నుండునట్టిస్థితియే శ్రేష్ఠమైన స్వరూపస్థితి. (స్వరూపావస్థానరూప మోక్షము.) అని చెప్పఁబడి యున్నది.

మఱియు,

శ్లో॥ ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే ।
మనసాతోపపన్నేన దృశ్యతే సూక్ష్మదర్శిభిః ॥

తా. ఓంకారము విల్లుగాను, ఆత్మ బాణముగాను, బ్రహ్మము గుర్తుగాను చెప్పఁబడుచున్నది. అందువలన యుక్తమనస్సుచేతను, సూక్ష్మదృష్టి గల వారిచేతను (బ్రహ్మము) చూడఁబడుచున్నది.

క॥ గురుబోధయు శాస్త్రార్థము ।
మరినిర్గుణ సగుణభావ మార్గములందున్ ।
స్థిర బాహ్యాంతర్లక్ష్యపు ।
సరణిదియని పల్కుచుంద్రు శశినిభవదనా॥　　94

తా. ఓ చంద్రవదనయగు పార్వతీ! వినుము. ఆచార్యుఁడు బోధించినదియును, సకల యోగ వేదాంత శాస్త్రములును, సగుణ నిర్గుణోపాసనములును, బాహ్యాంతరలక్ష్యములును అనునివి యన్నియును ఈ ప్రణవోపాసనమునే తెలియఁ జేయుచుండు నని యెఱుంగుము.

తే॥ సకల నిగమార్థముల నర్థ జాలమెల్ల ।
దాను వివరించు బయలున గానిపించు ।
కళలు సత్తుగఁ దోఁచు సంకల్పమేది ।
యదియపో బాహ్యలక్ష్యంబు నంబుజాక్షీ॥　　95

తా. ఓ శాంభవీ! వినుము సకల వేదములయందును జెప్పఁబడు వివరణంబంతయును బాహ్యమునందుఁ గనంబడును. కళలన్నియు సత్తామాత్రమై దోఁచెడి భావమెదియో యదియే బాహ్య లక్ష్య మని తెలిసికొనుము.

వి. ఈ విషయమును 69-వ పుటయందుఁ గనందగును.

చ॥ సరసిజనేత్రి సన్మునులు చక్కఁగలక్ష్యము చూడుమన్నచో ।
టరయఁద్రికూటమంద్రదదియె యగ్నిపదంబని యందుఱాపయిన్ ।
సురుచిర నేత్రపద్మమున శోభిలుచున్ విలసిల్లుచుండునే ।
యురివి జలాగ్నిగంధవహవ్యోమములున్ బెనుపొందునద్రిజా॥

తా. ఓ తామరరేకులవంటి కనులుగల పార్వతీదేవీ! వినుము. మహామునులు ఎచ్చట దృష్టినిలిపి చూడుమని చెప్పుదురో ఆ భ్రూమధ్యస్థానమును త్రికూట మనియును, అగ్నిపద మనియును, లేక అగ్నిస్థానమనియును జెప్పుదురు. తర్వాత నేత్ర కమ

లమునందు అనఁగా నేత్రమునందుపృథివ్యప్తేజోవాయురాకాశము
లనెడి పంచభూతములను తేజరిల్లుచుండును.

సీ॥ అయిదువర్ణంబుల నలమి ప్రకాశించు
నొప్పుల కుప్పయై యుజ్జ్వలముగ ।
నతిగూఢమై దివ్యమై సదానందమై
సహజ ప్రకాశ మచ్చుటవెలుంగు ।
నక్కడగాక బాహ్యాంభ్యంతరములందు
నిండి యఖండమై నెగడుచుండు ।
నది నేత్రమధ్యంబునందుఁ జిన్మాత్రమై
ప్రబలించి నడఁగింప భవ్యమైన ॥

తే॥ స్థాన మదియని వేద విధజ్ఞులెల్లఁ ।
బల్కుచుందురు శ్రుతులట్లు పల్కుచుండు ।
విశ్వతశ్చక్షురుతమని విమలముగను ।
భాసురంబుగ వినఁబడు బద్మనయన ॥ 97

తా. ఓ తామరసాక్షివగు పార్వతీ! వినుము. ఆ ప్రణవము అనఁగా పరమాత్మ అయిదు వర్ణములై (రంగులై) ప్రకాశించును. అది మహారహస్యమై దివ్యమై సదానందమై సహజమై ప్రకాశమై నేత్రస్థానమునందు వెలుఁగుచుండును. మఱియును అది బాహ్యాభ్యంతరములందును అఖండమై యుండును. నేత్ర మధ్యస్థానంబునందు ఆ పరమాత్మ సర్వమును ప్రకాశింపఁజేయుచును లయింపఁజేయుచును నుండును. ఈ విషయమై వేదమునందుఁ "విశ్వత శ్చక్షురుత విశ్వతోముఖో హస్త ఉత విశ్వత స్పాత్" అని చెప్పఁబడి యున్నది.

శ్రుతి॥ విశ్వత శ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోహస్తఉత విశ్వత
స్పాత్ । సంబాహుభ్యాం నమతి సంపతత్త్రైర్ద్యావా పృథివీ
జనయ న్దేవఏకః ॥ చతుర్థప్ర.శ్నే.ప్రథమోనువాకః. 12. మంత్రము.

తా. సమస్తమైన చోటులయందును కన్నులు గలవాఁడుగను, సకల స్థలములయందును ముఖములు గలవాఁడుగను, అన్ని చోటులయందును చేతులు గలవాఁడుగను, సమస్తమైన స్థలముల

యందును కాళ్లు కలవాఁడుగను, ఆకాశము భూమి అను వీనిని సృష్టించువాఁడుగను, నుండు ఒక్కఁడైన పరమాత్మ చేతులు కాళ్లు వీనితోఁగూడిన శరీరము నిచ్చుచున్నాఁడు.

ఇట్లు తైత్తిరీయోపనిషత్తు నారాయణవల్లియందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ చిదాత్మా సర్వదేహేషు వ్యాపితం జ్యోతిరూపకం ।
సాజ్యోతి శ్చక్షురగ్రేచ గురునేత్రేచ పశ్యతి ॥

తా. ఆ పరమాత్మ సకల జీవుల శరీరములయందును అనఁగా హృదయ గుహాయందును జ్యోతిర్మయమై ప్రకాశించు చున్నాఁడు. మఱియును అది నేత్రాగ్రమునందును వెలుంగుచున్నది.

వ॥ అట్లుగావున భావంబును గ్రహించి తెలియవలయును. 98

తా. సులభము.

గీ॥ పరగ రవి శశిదహన బింబంబు లెపుడు ।
మఱియు నొకటిగఁ బెనగొన్న మధ్యమమున ।
దివ్యమై తీవ్రమై మహాదీప్తియగుచు ।
భవ్యతేజంబు వెలుఁగొందు భాసురాంగి ॥ 99

తా. ఓసుందరాంగివగు పార్వతీ ! వినుము. ఆ పరమాత్మ యొక్క తేజస్సు సూర్యచంద్రాగ్నులు ఒక్కటిగాఁ జేరి ప్రకాశించునపుడు దానినడుమ మిగుల తీవ్రమైనదియును, దివ్యమైనదియును, మహా తేజస్సుతోఁ గూడినదియును, భవ్యమైనదియును, అగు ప్రకాశముతోఁ వెలుఁగుచుండును.

సీ॥ ఆకళ నిగమ మూలాధారమగునది
తగ జలమధ్య గతప్రకాశ ।
మగుజ్యోతి సద్వాశ మగువజ్ర సంస్పర్శ
నీల రత్నంబు కాన్తిని వెలుంగు ।
నదిగాక నీలతోయద మధ్యమందున
వెల్గు సౌదామని విలసనంబు ।
పోల్కెనుండునటంచు బుధవరుల్ పల్కుదు
రాపోజ్యోతి మూర్తి త్రయాత్మకంబు ॥

తే॥ నై ప్రకాశించు నదిస్వరాట్టయి వెలుంగు ।
నదియె యక్షరపరమాత్మ యనఁగబరఁగు ।
నట్టి వెలుగుకె నిగమాదిమాదులెల్ల ।
మ్రొక్కి ప్రణుతింపుచుండు సన్మోహనాంగి ॥ 100

తా. ఓ పార్వతీ ! వినుము. ఆ తేజస్సు వేదములకు మూల కారణమైనది. జలమధ్యమందలి తేజస్సువలెను, వజ్రమువంటి (తెల్లని) కాంతిగలదియును, నీలరత్నమువంటి కాంతిగలదియును, నీలమేఘ మధ్యమునందు వెలుంగు మెఱుమువలెనునుండునని వివేకవంతులు చెప్పుదురు. అదియే ఆపోజ్యోతి యనఁబడును. అదియే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముప్వురును జేరిన మూర్తిత్రయమై ప్రకాశించును. ఇదియే స్వరాట్టు, ఇదే అక్షరమైన (నాశములేని) పరమాత్మ యనంబడును. ఈ తేజస్సునకే సకల శ్రుతులును నమస్కార మొనర్చుచుండును.

వి. ఈ తేజస్సును గూర్చియే యోగశాస్త్రములందు దిగువ నుదహరింపఁబడిన విధమున పై పద్య తాత్పర్యానుగుణముగ నిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో॥ కైశ్చిద్బ్రహ్మేతి కైశ్చిద్ధరిరితి శివ ఇత్యాది విష్ణ్వేశ్చ కైశ్చిత్ । నానాభేదైః ప్రోక్తస్సం శూన్యప్రకృతి పురుషకాలార్థ రూపీతికైశ్చిత్ । కైశ్చిల్లోకై రనైర్వికల్పాత్మక బహువచనైర్దేహ యుక్తోఽపినిత్యం । ముక్తస్సాన్యదస్తురీయాతీతసమాఖ్యా మవస్థాం సమేత్య ॥

తా. కొందఱచే ఆతేజస్సును బ్రహ్మమనియును, కొందఱచే చిత్తనియును, కొందఱచే విష్ణువనియును, కొందఱచేశివుఁడనియును, కొందఱచే శూన్యప్రకృతియనియును, కొందఱచే పురుష కాలార్థ స్వరూప మనియును, కొందఱచే వికల్పాత్మక స్వరూపమనియును, ఇంకను అనేకులు అనేక విధములుగను చెప్పుదురు. తుర్యాతీతావస్థను బొందినవాఁడు ఈ తేజస్సును తెలిసికొని నిత్యముక్తుఁ డగుచున్నాఁడు.

క॥ ఆ తేజము రవిచంద్రుల।
చేతను ద్వివిధమును గూర్చి చెలువుగఁ గనుట।
న్నో తరుణి మధ్యలక్ష్యము।
భాతిగ నౌ నండ్రు మునులు పంకజనేత్రి॥ 101

తా. ఓ తామరసాక్షివగు పార్వతీదేవీ! ఆ తేజస్సు సూర్య చంద్రులచే గూర్చి చూచుటయే మధ్యలక్ష్యమని యోగులు చెప్పుదురు.

సూర్యచంద్రులచే ననఁగా కుడికంటిచేతను ఎడమకంటి చేతను జూచుటయని తెలియునది.

శ్లో॥ త్రిషులక్ష్యేషు యో బ్రహ్మ సాక్షాత్కారం గమిష్యతి।
జ్ఞానోవా రమనోవృత్తి రహితో రాజయోగవత్॥

తా. త్రివిధ లక్ష్యములయందునుదృష్టినుంచి జూచిన యెడల బ్రహ్మసాక్షాత్కారము కలుగును. మఱియును రాజయోగమువలె మనోవృత్తి రహితమగును.

వ॥ ఈ లక్ష్యత్రయంబులచేత వివరింపఁగల్గిన ధన్యునకు బ్రహ్మ సాక్షాత్కారం బగునని మరియు నిట్లనియె. 102

తా. సులభము.

క॥ ఆలక్ష్యసారమరయ వి।
శాలనయన వట్టివాక్య జాలంబుల నా।
మూలమరయంగ రాదు వి।
శాలోన్నత తారకంబు సమకురు టరుదే॥ 103

తా. ఓ విలాక్షివగు పార్వతీదేవీ! ఆ లక్ష్యత్రయములను ఉత్తమాటలచేఁ దెలిసికొనుటకు సాధ్యము కాదు. తారకము కుదు రుటయును సులభము కానేరదు.

క॥ తారకబ్రహ్మ విధానము।
ధారుణిఁ బొడగన్న సావధానాత్ములకుఁ।
గౌరీ శాంభవిముద్ర వి।
చారము సిద్ధించు నట్టి చర్యలు వినవే॥ 104

తా. ఓ పార్వతీ! తారకబ్రహ్మ విధాన పద్ధతిని తెలిసికొన్న శాంత చిత్తులగువారికి శాంభవీ ముద్రాభ్యాసము సిద్ధించును ఆ క్రమము నెఱింగించెదను వినుము.

శాంభవీ ముద్రా లక్షణము.

శా॥ అంతర్బాహ్యంబున లక్ష్యమున్ వెలుపలన్నత్యుత్తమా దృష్టిచే।
చింతల్ మాని నిరంతరంబు నిమిషత్సిద్ధిన్ సదాభ్యాసులై।
భ్రాంతుల్ పొందకయున్న శాంభవనుచుం బ్రావీణ్యులూహింతురో, కాంతా నీవిది సత్తుగాఁగని మదిన్ గాంక్షింపకే యన్యముల్ ॥ 105

తా. ఓ పార్వతీ! వినుము. దృష్టిని అంతరముగను బాహ్యముగను భ్రమనుమాని లక్ష్యమునందుంచి నిరంతరమును అభ్యసించుచు నుండినయెడల శాంభవీముద్ర యగును. నీవు ఇతరమును గోరక దీనినే సత్తని యెఱుంగుము.

శ్లో॥ జ్ఞాతవ్య మంతరంగేచ బహిరంగేచ పశ్యతి।
దృశ్యతే అక్షిరూపేణ దృష్టాంతంచ ప్రవర్తతే ॥

శ్లో॥ అంతర్లక్ష్యం బహిర్దృష్టి ర్నిమేషో న్మేషవర్జితా।
విశేషా శాంభవీముద్రా సర్వతంత్రేషు గోపితా ॥

తా. అనఁగా కనులు మూయుటయును, తెఱచుటయును లేని దృష్టిచే లక్ష్యమును వీక్షించుటయే శాంభవీముద్ర యనఁబడును.

శ్లో॥ లక్ష్యలీన మనసానిలేన యోవర్తతే ఉచలితతారయోర్భవేత్।
ఖేచరీయ మథసైవ శాంభవీ ముద్రయాస్తుకృతయాజగద్గురుః॥

తా. లక్ష్యమునందు లయమైన వాయువుతోను మనస్సుతోను గూడినవాఁడై యెవఁడుండునో వాఁడు చలింపని తారము రెంటిని (దృష్టిని రెంటిని) గలవాఁడగును. ఇది ఖేచరి యనఁబడును ఈ శాంభవీ ముద్రాకృపచే జగద్గురు వగుచున్నాఁడు.

వ॥ ఇట్లు పలుకంబడిన గ్రంథార్థంబు గ్రహించిన వారికి మోక్షంబు గల్గునని యిట్లనియె. 106

తా. సులభము.

శా॥ చూపెల్లప్పుడు సర్వజీవులుసదా చూచేటి యాచూపులో।
నేపారంగను నాత్మరూపుఁడచట న్నేవేళ భాసిల్లు దు।
ర్వ్యాపారస్థితిమాని చిత్తము మనీషాయత్తముం జేసి నీ।
వేప్రొద్దుంగను చూపులో మెలఁగు వెల్గే వేగఁ గాంక్షింపుమీ॥

తా. ఓ పార్వతీ! వినుము నిరంతరమును సకలజీవులును జూచునట్టి చూపునందు పరమాత్మ ప్రకాశించును. దుష్టవ్యాపారములను మాని చిత్తమును మనస్సునందుఁ జేర్చి ఆచూపులో వెలుంగునట్టి వెలుఁగును జూడుము. దానినే నీవు కోరుము.

గీ॥ చూపు నీరీతిఁ జూచెడు చూపులందుఁ
మూఁడువిధముల నాచూపు మొనయుచుండు।
నమవసయుఁ బాడ్యమియుఁ బున్న మనఁగబరఁగు।
ననుచు నార్యులు పల్కుదు రబ్జవదన॥ 108

తా. ఓ పార్వతీ! వినుము. ఈప్రకారముగాఁ జూచునట్టి చూపు మూఁడువిధములుగా నుండును. అమావాస్య, పాడ్యమి, పూర్ణిమ అని యిట్లు పెద్దలు చెప్పుదురు.

క॥ అమవస పాడ్యమి చూపుల।
భ్రమయును బొందకను నిండు పౌర్ణమిదృష్టిన్।
క్రమమొప్పఁ జూడవలె నని।
సుమతులు పల్కుదురు విమల సుందరవదనా॥ 109

తా. ఓ పార్వతీ! వినుము. అమావాస్య దృష్టియును, పాడ్యమిదృష్టియును, జూడకూడదు. ఎప్పుడును పౌర్ణమిదృష్టినే చూడవలయును. అని వివేకవంతులు చెప్పుదురు.

క॥ ముక్కును చెవులును గన్నులు।
చక్కఁగ హస్తమునమూసి చలియింపనియా।
మక్కువ యమవస దృష్టిన్।
జిక్కులఁ బడఁబోరు బుధులు శీతాంశుముఖీ॥ 110

తా. ఓ చంద్రముఖివగు పార్వతీ! వినుము. ముక్కుపుటములను, చెవుల రంధ్రములు రెండును, కన్నులు రెండును చేతి

వ్రేళ్లతో మూసి చలియింపక చూచునట్టి చూపు అమావాస్యదృష్టి యనఁబడును. వివేకజ్ఞులు ఈ దృష్టియందు మనసు నుంపరు.

క॥ రెప్పలిడి యర్థదృష్టిగఁ।
దప్పక వంచియునుజూడ దాక్షాయణి నే।
ర్పొప్పగఁ బాడ్యమిచూపని।
యెప్పుడు నాసింపబోవ రిందునిభాస్యా॥ 111

తా. ఓ పార్వతీ! వినుము. కన్నులను సగము తెఱచి క్రింది చూపుగా వంచి చూచినయెడల పాడ్యమి చూపని చెప్పఁబడును. వివేకవంతులు ఈ పాడ్యమిచూపును కోరరు.

ఉత్సాహవృత్తము॥ ఆదిరెండు చూపులు న్నిరర్థకంబు లంచునుꣳ।
వేదవేద్యులెంచి మిగుల వేడ్క బూర్ణదృష్టి నే।
పాదుచేసిమాపుమనసుబట్టుకొల్పి యెప్పుడుꣳ।
మోదమంది భ్రూయుగమునముక్తికాంతమాతురే॥

తా. ఓ పార్వతీ! వినుము. బుద్ధిమంతులు అమావాస్య చూపును, పాడ్యమిచూపును, ప్రయోజనము లేదనియును, పూర్ణిమాదృష్టియే ప్రయోజనంబైనదియును తలంచి యెల్లపుడును భ్రూయుగమునందు అనఁగా రెండు కనుబొమలనడుమ దృష్టిని నిల్పి సంతోషముతో ముక్తికాంతను కనుఁగొందురు.

సీ॥ ఆచూపు స్థిరముగా నరయంగఁ జూడను।
నరసురాసురులకు నలవిగాదు।
అలవిగా నాచూపుఁ జలియింపకను జూచు
వాని కసాధ్యమౌ వస్తువేది।
లేదుగావున మది పాదుకొల్పియు
దృష్టి నేకముఖముచేసి యింపుతోడ।
సావధానముచేతఁ జక్కఁగా వెదకిన
బ్రహ్మానందమై ప్రబలుబయట।
తే॥ నపుడు నిశ్చల చిత్తుఁడై యరసిచూడ।
ననుపమజ్యోతియై ప్రకాశమునుబొంది।

మండలాకారముననుండి దండిగాను ।
దివ్యతేజంబు వెల్గు నిందీవరాక్షి ॥ 113

తా. ఓ పార్వతీ! వినుము. ఆపూర్ణిమాదృష్టిని స్థిరముగా నిల్పి చూచుటకునరులకును, దేవతలకును, రాక్షసులకును,సాధ్యము కాదు. పూర్ణిమాదృష్టిచే చంచలములేక చూచువారికి అసాధ్యం బెద్దియును లేదు. కాఁబట్టి పూర్ణిమాదృష్టిని ఏకాగ్రముచేసిసావధాన ముగఁ జూచినయెడల పరమాత్మానందము ప్రబలమగును. ఆ సమ యమునందు స్థిరచిత్తుఁడై చూచినయెడల మహాజ్యోతిమండలము కానఁబడును.

మ॥ అటమీఁదం దన కంటికిన్నెదురుగా నజ్ఞాననాకారమై ।
పటుతేజో విభవస్వభావమమరుఁ బ్రహ్మజ్ఞులీమార్గమే ।
కుటిలత్వంబులు మాని కాంతు రిదియే గుప్తంబునౌ ఖేచరీ ।
నటనౌన్నత్యపు ముద్రయందురు చిదానందాత్ములై శాంభవీ ॥

తా. ఓ పార్వతీ! వినుము. ఆ తర్వాత కంటికెదురుగా బ్రహ్మాకారమైన మహాప్రకాశము గోచరించును. బ్రహ్మజ్ఞానులైన వారు దీనినే నిశ్చలచిత్తులై వీక్షింతురు. ఇది పరమరహస్యమైన ఖేచరీ ముద్ర యనఁబడును.

సీ॥ అంతర్యమున మనసానిలమొకటిగాఁ
గీలించి వెలుపలఁ జాలనేత్ర ।
ములచేత బాహ్యంబు చెలువొప్పఁజూచి చంచ
చలవస్తు వను భ్రాంతి గలయకుండ ।
మతినిల్పి సతతంబు ధృతివెలింగెడు నాత్మ
గనుల ఖేచరిముద్ర యనిరి బుధులు ।
ఈముద్ర నెప్పుడు ధీమంతుఁడై చూడ
నతఁడు జగద్గురుం డనఁగఁ బరఁగు ॥

తే॥ నిదియె ఖేచరిముద్రని యెఱుఁగలేక ।
బాహ్య ఖేచరియందును బట్టుపఱచి ।
జిహ్వ ఛేదించి చొక్కియు చిక్కియుందు ।
రదియు రాక్షస కృత్యంబు లనుచు విడిచి ॥ 115

తా. ఓ పార్వతీ! వినుము. ఆంతర దృష్టిచేత మనస్సును వాయువును ఒకటిగాఁ జేసి చంచలరహితుఁడై బాహ్యదృష్టిచేతఁ జూచినయెడల అది ఖేచరీముద్ర యనఁబడును. ఈ ఖేచరీ ముద్రను తెలివితోఁ జూచువాఁడు జగద్గురుఁడని ప్రసిద్ధినొందును. ఈ ఖేచరీ ముద్రా మహత్త్వము నెఱుంగక కొందఱు బాహ్యఖేచరిని యవలంబించెదమని వ్యవహరించి నాలుకను ఛేదించి చొక్కి (తన్మయులై) యుందురు ఇది రాక్షసకృత్యంబని తెలిసి విడువ వలయును.

వి. శ్లో॥ లోకేఽ తే ఖేచరీముద్రా అజ్ఞాత్వా బాహ్యఖేచరీం।
అవలంబనతా కేచిత్ జిహ్వాచ్ఛేదనకర్మణా॥

తా. లోకమునందు లోపలి ఖేచరీ (ఆంతరఖేచరీ) ముద్ర నెఱుంగక కొందఱు బాహ్యఖేచరిని అవలంబించి నాలుకను ఛేదించి కొనుచున్నారు.

మ॥రమణీ ఖేచరీముద్ర నిశ్చయముచే రంజిల్లఁగా జూచునా।
సమయంబందునఁ జిత్తవాయువులలో సంచారమేదైన రెం।
డమరన్నిల్వవటంచు నెన్నఁబడుగా నారెంట నేదైననున్।
గ్రమమొప్ప న్నిలుచుండు రెండమరఁగాఁ గన్పట్టు నొండద్రిజా॥

తా. ఓ పార్వతీ! వినుము. ఖేచరీముద్రను అభ్యసించు కాలమునందు చిత్తమును వాయువును రెండును ఒక్కప్పుడే నిశ్చలము కాదు. అపుడు ఆ చిత్తము, వాయువు, అను నీ రెంటియందు ఏదైనను ఒకటిమాత్రమే చలనములేక నిల్చునని యెఱుంగుము.

ఉ॥ మారుత మానసంబులు క్రమంబునఁ బట్టుగ నిల్పఁ బూనినన్।
సారసనేత్రి మారుత మసాధ్యమటంచును బల్కుచుందురే।
ధీరులు దాని నిల్పఁగను దిన్నఁగ జిత్తము పాదుకొల్పి సం।
చారము సేయు వాయువును జక్కఁగ నిల్పఁగవచ్చు శైలజా॥

తా. ఓ పార్వతీ! వినుము. మనస్సును. వాయువును ఏకముగాఁ జేసి చలింపక చేయువలయుననిన చో అసాధ్యమని చెప్పుదురు. అయినను ధీరులైనవారు మొదట చిత్తమును స్థిరముచేసి, పిదప సంచరించువాయువును నిల్పవచ్చును; అని యెఱుంగుము.

మ॥ అవలన్ గొందఱుయోగివర్యులుసదా యభ్యాసులై వాయువున్ ।
వివరం బొప్పఁగనిల్పినార మనుచు న్విద్యల్ ప్రచారించుటల్ ।
అవివేకత్వమె కాని యాయనిలమున్నభ్యాసమై నిల్చునా ।
యవలీలన్ విహరించు మారుతము శక్యం బెరికి న్నిల్పఁగాన్ ॥

తా. ఓ పార్వతీ! వినుము. కొందఱు యోగీంద్రులు ఖేచరీ ముద్రను అభ్యసించుచు వాయువును నిల్పితిమని చెప్పుదురు. ఇది అవివేకమేగాని వేఱుకాదు. మఱియు అవలీలగా సంచరించునట్టి వాయువును నిల్పుటకు ఎవ్వరికిని సాధ్యముకాదని తెలిసికొనుము.

క॥ ఆమారుతమున మనసును ।
తామరయంఁగ నిల్పి పట్టఁ దలఁచుటయెల్లన్ ।
సామజమును బిసతంతునఁ ।
బ్రేమను గట్టంగఁజూచు బ్రీతియుగాదే ॥ 119

తా. ఓ పార్వతీ! వినుము. వాయువును మనస్సును చలనములేక అణఁచిపట్టుటకు ప్రయత్నించుట యనునది ఏనుఁగును తామరకాడ నూలితోఁ గట్టుటకు బ్రయత్నించుటతో సమానమగును.

ఆ॥ మనసు నెచట నిల్పు మారుతం బచటుండుఁ ।
బవనమునను మనసు పట్టరాదు ।
ఓడ గాలిచేత నోగిఁ జనునా నావ ।
నిలువ వాయువచట నిలుచుభంగి॥ 120

తా. ఓ పార్వతీ! వినుము. ఎచ్చట మనస్సు నిల్చునో అచ్చట వాయువును నిల్చును. వాయువుచేత మనస్సును నిల్పుటకు (స్వాధీనము చేసికొనుటకు) సాధ్యముకాదు. ఓడ గాలిచేత పోవుచుండునుగాని నిల్వదుకదా. ఆ ప్రకారము ఈ శరీరమందు వాయువుండు పర్యంతము అది చలించుచుండునుగాని, కట్టువడ నేరదని తెలిసికొనుము.

క॥ హృద్వాయు వడఁచు యోగము ।
విద్వాంసుల వలనఁ దెలిసి వివరణమొప్పన్ ।

సద్వ్రితులై మదినిల్పఁగఁ।
దదవ్వర్తన మాని గాలి తప్పక నిలుచున్॥ 121

తా. ఓ పార్వతీ! వినుము. ప్రాణవాయువును అడఁగించు నట్టి యోగమును బ్రహ్మజ్ఞానులవలనఁ దెలిసికొని, నిరంతరమును అభ్యాసముచేసెడి సద్వ్రితమును మనస్సునందు నిల్పి, పిదప ఆ యభ్యాసమును సైతము మఱచి నిశ్చలచిత్తుఁడై యుండినయెడల వాయువు స్థిరముగా నిలుచునని యెఱుంగుము.

క॥ కాయములోపల దశవిధ।
వాయువులున్ దిరుగఁ బ్రాణ వాయువొకటిన్।
స్థాయిపడి నిల్ప సద్గురు।
రాయనిచే వినక మనసు రంజిలునె శివా॥ 122

తా. ఓ పార్వతీ! వినుము. శరీరములోపల దశవిధ వాయువులు తిరుగుచుండును. వానిలోఁ బ్రాణవాయు వొకటిమాత్రము హృదయమునందు స్థిరముగా నిల్చియుండును. దీనిని సద్గురుముఖముగాఁ దెలియక గాని మనస్సు రంజిల్ల నేరదు. అనఁగా మనస్సు స్థిరపడదని భావము.

సీ॥ ఉవిద సద్గురువరుం డుపదేశమిచ్చిన
కరణిని లక్ష్యంబు స్థిరముఁజేసి।
క్షణకాల మభ్యాసమును జేయునప్పుడు
మనసు భ్రాంతులవెంటఁ జనకనిల్చు।
వెలయ మానసవృత్తి విలయంబు నీక్షణ
కాలంబు తనువాయుగతి యడంగు।
నీమార్గమెఱుఁగక ధీమంతులనుబోలి
వాగ్డంబబ్రహ్మముల్ వదరుకొంద్రు॥
తే॥ వారు శ్రీరాజయోగ సంవర్తనంబు।
తెలుఁగనేరరు గురుకృపాకరులుగారు।
రాజయోగంబు తెల్పెడు రసికుఁ డవని।
గల్గు టది పూర్వ సంస్కార కారణంబు॥ 123

తా. ఓ పార్వతీ! వినుము. సద్గురువు బోధించిన ప్రకారముగ లక్ష్యమును స్థిరపఱచి క్షణముసేపు అభ్యాసము చేసినయెడ మనస్సునందుఁ గలుగు భ్రమలన్నియు నివర్తియై స్థిరముగానిల్చును. ఇట్లు క్షణకాలము అభ్యాసము చేసినయెడల మనోవృత్తి లయ మొందును. ఆ సమయంబున ప్రాణవాయుగతి యడంగును. అనఁగా వాయువు మనస్సుతోఁగూడ లీనమగును. ఈ మార్గంబును దెలిసికొనక కొందఱు బుద్ధిశాలురవలె నటించుచు వాగాడంబరముగాఁ బల్కుచు మేము పరబ్రహ్మమును జూచినారమని చెప్పుదురు. అట్టివారు రాజయోగమార్గము నెఱుంగరు. మఱియు సద్గురు కటాక్షము నెఱింగినవారు కారు. రాజయోగమును బోధించునట్టి వివేకవంతుఁడు కనంబడుట పూర్వజన్మ పుణ్యంబేకాని వేఱుకాదని తెలిసికొనుము.

వ॥ అట్లుగావున లోకంబునందు గొందఱు వేదశాస్త్రంబులు చదివి గురువులవలన వేదాంతార్థరహస్యంబు లెఱుంగక స్వభావంబున నుపనిషద్వాక్యార్థప్రయోగంబుల మనోన్మని యని రహస్యంబులు కొందఱికి దెల్పుచుందురది విజ్ఞానరహితంబును గ్రియాశూన్యంబును నవివేకకారణంబు ననంబరఁగుఁగాని పరమార్థ ప్రకాశంబు గానేరదు. కావున నట్టి యనుభవసిద్ధులుగాని వారి వాక్యంబుల భ్రమలం బొందక నిశ్చయజ్ఞాన సమాధ్యనుష్ఠానపరుఁడైన తత్త్వవేది యానతిచ్చు శాంభవీముద్ర నభ్యసింపవలయును. 124

తా. సులభము.

క॥ శాంభవి ముద్రాభ్యాసము।
జృంభణముగఁ జేయునట్టి శిష్టజనులకా।
రంభమున దివ్యతేజము।
సంభవమై కళలువెల్గు సరసిజనేత్రీ॥ 125

తా. ఓ పార్వతీ! వినుము. శాంభవీముద్రను జక్కఁగా నవలంబించెడి వారికి ముద్రాభ్యాస కాలంబునందు మహాజ్యోతి కనంబడును ఆ ప్రకాశము అనేక విధములుగాఁ దోచును.

వి. శాంభవీ ముద్రాలక్షణమును, 69-వ పుటయందుఁ జూచి తెలిసికొనవలయును. అయినను అనుభవజ్ఞులు ఖేచరీముద్రయే శ్రేష్ఠ మని చెప్పుచున్నారు. ఎట్లన,

శ్లో॥ నాద ఏవ లయశ్రేష్ఠం ముద్రాణాం ఖేచరీ వరా।
యోగశ్రేష్ఠో నిరాలంబో హ్యవస్థాసు మనోన్మనీ॥

తా. లయములలో నాదలయమే శ్రేష్ఠము. ముద్రలలో ఖేచరీముద్రయే శ్రేష్ఠము. యోగములలో నిరాలంబమే శ్రేష్ఠము. అవస్థలలో మనోన్మని యనెడి అవస్థయే శ్రేష్ఠము.

అని యోగశాస్త్రములందుఁ జెప్పఁబడి యున్నవి.

సీ॥ పౌర్ణమిదృష్టిచేఁ బరమాత్మఁ గాంక్షించి
చూడంగ నందున నొరిదిబుట్టు।
చిహ్నాలు చెప్పెదఁ జెలువొప్పఁగా విను
నింద్ర ధనుచ్ఛాయ చంద్రబింబ।
ముండుపోలిక తార లుండుభాతిని వజ్ర
దర్పణ భ్రమలచేఁ దనరుచుండు।
మెఱుముత్తెఁగెలచంద మరయ రత్నంబుల
కాంతిని బంగారు కళలవలెను॥

తే॥ వరకమలరీతి కేసర వర ప్రకాశ।
కారణములుగ బహువిధ కళలు వెల్గు।
నట్టివేళను దృష్టిని గట్టిపఱిచి।
నిలిపి చూడంగ బ్రణవంబు పలుకుచుండు॥ 126

తా. ఓ పార్వతీ ! పౌర్ణమిదృష్టిచేత పరమాత్మను జూచెడి వారికి కల్గునట్టి చిహ్నములను జెప్పెదను వినుము. ఇంద్రధనుస్సు చ్ఛాయ, చంద్రబింబమువంటి కాంతి, నక్షత్రముల ప్రకాశము, వజ్రమువంటి ప్రకాశము, అద్దమువంటి ప్రకాశము, మెఱుము కాంతి, బంగారమువంటి తేజస్సు, తెల్ల దామరపుష్పము పోలిక, కేసరమువంటి ప్రకాశము, అను నీ విధములైన అనేక కళలు తోఁచును. ఆసమయమునందు దృష్టిని చలనములేక నిల్పిచూచుచు

పరధ్యానములేక వినుచుండినయెడల ప్రణవనాదము వినఁబడు చుండును.

వి. శ్లో॥ రోచిస్తటిద్ధూమ్రక బిందునాద।
కలాభ ఖద్యోత రవీందు దీపాః।
తత్పాత్యయానేక సువర్ణకంజ।
కింజల్క దండా నవరత్నముఖ్యాః॥

తా. మహాప్రకాశము, మెఱుము, పొగవన్నె, బిందువు, నాదము, కల, నక్షత్రము, మిణుఁగురు, సూర్యుఁడు, చంద్రుఁడు, దీపము, అనేకములైన బంగారుకేసరములు, నవరత్నములు, మొదలగు కాంతులవలె కనఁబడుచుండును.

అని యోగశాస్త్రములందుఁ జెప్పఁబడి యున్నది.

ప్రణవనాదము.

వ॥ ఆ ప్రణవనాద ప్రభావంబు వినుము॥ 127

తా. సులభము.

క॥ విరిగజ్జెలు తాళంబులు।
మరి వేణువినోదనాద మభ్రధ్వనియుఁ।
స్థిరమగు ఘంటాశబ్దము।
కరణిని వర్తించి ప్రబలుఁ గంజదళాక్షీ॥ 128

తా. ఓ పార్వతీ! వినుము. ఆ ప్రణవనాదము గజ్జెల శబ్దము, తాళముశబ్దము, వేణునాదము, మేఘధ్వని, ఘంటాశబ్దము అను శబ్దమువలె వినంబడును.

వ॥ అదియునుం గాక॥ 129

తా. సులభము.

క॥ వీణారవము విధంబున।
నాణెంబౌ భేరిరీతి నగజ మృదంగ।
ధ్వానమువలె శంఖధ్వని।
గాను సముద్రముల ఘోషగతిఁ బ్రబలు సుమీ॥ 130

తా. ఓ పార్వతీ! వినుము. మఱియును వీణెయొక్క ధ్వని, భేరీధ్వని, మృదంగశబ్దము, శంఖధ్వని, సముద్రఘోషము, అను వీనివలె వినంబడును.

సీ॥ హంసయానరో నాద మాలించి యాప్రాంత
మున మది నిలుకడ ననువుసేయ।
నప్పుడు పవమానుఁ డాధారకమలంబు
విడిచి పశ్చిమవీథి వెంటనరిగి।
కొమరొప్ప నాసా త్రికోణమార్గము జేరఁ
బ్రణవ నాదంబును బ్రబలముగను।
ఝణఝణత్కారమై వినఁబడుఁ జెవులకుఁ
దా భీతిఁజెంది హృదయము చెదరి॥
తే॥ భయము తోఁచును వెరువకావ్యయమునైన।
పదవి గోరుచు గురుపాదపద్మములను।
మనసు స్థితియందుఁ జేర్చి నిర్మలసమాధి।
యోగ మభ్యాసమొనరింప యోగమగును॥ 131

తా. ఓ పార్వతీ! వినుము. ఆ నాదము ఎచ్చటనుండి వినంబడుచున్నదో అచ్చట మనస్సునుంచి వినుచుండినయెడల, అపుడు దాని యాధారపద్మంబైన హృదయస్థానంబునందలి అనాహత చక్రమునందుండు ప్రాణవాయువు ఆ చోటునుబాసి పశ్చిమ భాగమున నుండు వీణాదండము మార్గముగా నాసికద్వార మూలముగా త్రికోణమార్గమును జేరును. ఆకాలమున ప్రణవనాదము ప్రబలమై ఝణఝణశబ్దముతో వినంబడును. ఆధ్వని చెవులకు మిగుల భయంకరముగా నుండును. ఆ సమయమున హృదయము చెదరి చాల భయముతోఁచును. ఆ భయమునకు భీతినొందక శాశ్వతమైన పదమును గోరుచు సద్గురువర్యుని పాదకమలములను మనస్సునందుఁ జేర్చి నిర్మలసమాధి స్థితినొంది యోగము నభ్యసింపవలయును. ఇదియే యోగమగును. అనఁగా రాజయోగ మగు నని భావము.

వ॥ సమాధి లక్షణం బెట్లంటేని వినుము॥ 132

తా॥ సులభము.

వి. సమాధిలక్షణము.

శ్లో॥ సవికల్పో నిర్వికల్ప స్సమాధి ర్ద్వివిధా భవేత్ ।
దృశ్యశబ్దానువిద్ధోయం సవికల్పః పునర్ద్విధా ॥

తా. సమాధి సవికల్పకమనియును, నిర్వికల్పక మనియును, రెండువిధములు. అందు సవికల్పము దృశ్యానువిద్ధ సవికల్పమనియును, శబ్దానువిద్ధ సవికల్పకమనియును, రెండువిధములు. ఈ మూఁడును బాహ్యాభ్యంతర భేదములవలన నాఱు తెఱంగులగును. ఎట్లన,

1. బాహ్య దృశ్యానువిద్ధ సవికల్పసమాధి.
2. ఆంతర దృశ్యానువిద్ధ సవికల్పసమాధి.
3. బాహ్యశబ్దానువిద్ధ సవికల్పసమాధి.
4. ఆంతరశబ్దానువిద్ధ సవికల్పసమాధి.
5. బాహ్య నిర్వికల్పసమాధి.
6. ఆంతర నిర్వికల్పసమాధి.

సమాధియే ముక్తికి ముఖ్యసాధనమని తెలియఁదగును.

1. బాహ్య దృశ్యానువిద్ధ సవికల్ప సమాధియనఁగా:— బ్రహ్మాది సకలదేవతలును, సకలమైన చేతనాచేతనములును,అనఁగా బాహ్యము దృశ్యము లనెడి సమస్తమును, తన తెలివియందే పుట్టి నశించుననియును, సకల దృశ్యములకును తాను విలక్షణుఁడైన పరమాత్మ స్వరూపుఁడనియును తలంచుట బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పసమాధి యనఁబడును.

2. ఆంతర దృశ్యానువిద్ధ సవికల్పసమాధి: — తనయందు స్వభావముగాఁ బుట్టు ఆంతరదృశ్యము లనఁబడు వృత్తులకు తాను విలక్షణుఁడైన పరబ్రహ్మ స్వరూపుఁడని తలంచుట ఆంతరదృశ్యానువిద్ధ సవికల్పసమాధి యనఁబడును.

3. బాహ్య శబ్దానువిద్ధ సవికల్పసమాధి: — బాహ్యశబ్దములగు సకల నామములకును తాను విలక్షణుఁడనియును, నామ

రూప క్రియా రహితుఁడగు పరమాత్మయే తానని తలంచియుండుట యును, బాహ్యశబ్దానువిద్ధ సవికల్పసమాధి యనఁబడును.

4. ఆంతర శబ్దానువిద్ధ సవికల్పసమాధి:— ఆంతరశబ్దము లనెడి కామ క్రోధ లోభాది షడ్వర్గములకును, మఱియు ప్రణవ నాదమునందలి చిణీనాదము, చిణిచిణీనాదము, ఘంటానాదము, శంఖనాదము, వీణానాదము, తాళనాదము, వేణునాదము, భేరీ నాదము, మృదంగనాదము, మేఘనాదము, అను దశవిధనాదముల కును, తాను విలక్షణుఁడననియును దలంచుట ఆంతర శబ్దానువిద్ధ సవికల్పసమాధి యనఁబడును.

5. బాహ్య నిర్వికల్పసమాధి:—పైన జెప్పిన నాలుగు విధములగు సమాధులయందును తనకంటె వేఱైన దేదియుఁ దోఁపక పరబ్రహ్మ స్వరూపముగనే కనంబడుటయే బాహ్య నిర్వికల్ప సమాధి యనఁబడును.

6. ఆంతర నిర్వికల్పసమాధి:—తాను పైన జెప్పినవాని కంటె విలక్షణుఁడ ననెడి వృత్తిలేక, కేవలము పరమాత్మస్వరూ పమే నేనని తలంచియుండుట ఆంతర నిర్వికల్పసమాధి యనఁబడును.

ఈ సమాధులయందు సర్వ సమరసభావముఁ దోఁచును. ఏవిధమగు భేదభావమును గోచరముకాదు. మఱియు నీ సమాధి యందు మనస్సు సంపూర్ణముగా ఐక్యముగాక యుండునది సంప్రజ్ఞాత సమాధియనియును; మనస్సు ఏకమై పరమాత్మయందే ఐక్యమై యుండునది అసంప్రజ్ఞాత సమాధియనియును జెప్పఁబడును. ఈ అసంప్రజ్ఞాత సమాధినే ఆంతర నిర్వికల్ప సమాధి యని చెప్పుదురు.

శా॥ ఈడాపింగళ నాడులం దమరగా నేవేళ నవ్వాయువుల్।
గూడం బట్టియుఁ జూపులన్ స్థిరముగాఁగూర్పన్మనోవాయువుల్।
జోడుంగూర్చియు నాసికంబున సుషుమ్నానాడియున్ లోపలన్।
గూఢత్వంబున నుండు నంచును జనుల్ గోప్యంబునం జూతురే॥

తా. ఓ పార్వతీ! వినుము. ఇడానాడి, పింగళానాడి అను నీనాడులవలననే ప్రాణవాయుసంచారము కల్గును. ఆ ప్రాణవాయు

సంచారమునుబట్టి దృష్టిని స్థిరముగా నిల్పి మనస్సును వాయువును ఏకముచేసి ఇడాపింగళానాడుల రెంటినడుమ సుషుమ్నానాడి రహస్యంబుగా సంచరించు చుండుననియును, దీనిని ఉత్తములగు వారు గోప్యముగాఁ జూతురనియును భావము.

వి శ్లో॥ దక్షిణే పింగళానాడీ వహ్నిమండల గోచరా।

ఇడాచ వామనిశ్వాసో సోమమండల గోచరా।

ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ।

సుషుమ్నాంతర్గతంవిశ్వం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం॥

తా. దక్షిణ నాసికాద్వారమునందు పింగళానాడియుండును. అది అగ్నిమండల గోచరమైనది.

వామనాసికా ద్వారమునందు ఇడానాడియుండును. అది చంద్రమండల గోచరమైనది.

ఇడాపింగళానాడులకు నడుమ సూక్ష్మరూపముగాసుషుమ్నా నాడియుండును. సుషుమ్నానాడియందు సర్వప్రపంచమును ప్రతిష్ఠితమై యున్నది.

ఈ సుషుమ్నానాడి, శరీరముయొక్క వెనుక భాగమునందు వీణాదండమువలె శిరస్సు పర్యంతముదాఁక యుండు బ్రహ్మదండి యొక్క నడుమ సూక్ష్మరూపముగా ప్రవేశించియున్నది. దీనినే బ్రహ్మనాడి యని చెప్పుదురు. ఇందే సర్వము నున్నది. ఇచ్చటనే పరమాత్మయు నున్నాఁడు. ఇది మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధి, ఆజ్ఞేయ, బ్రహ్మరంధ్రము లనఁబడు షట్చక్రములందును బ్రవేశించి యున్నది. ఈసుషుమ్నానాడికి అంతర్గతముగా కుండలినీశక్తి కలదు. ఇదికపాలమునఁ బ్రవేశించి యచ్చట నుండి నాలుక కొనకుఁజేరి "సరస్వతి" యను పేరఁ బరగుచున్నది. ఈ సుషుమ్నానాడి భ్రూమధ్యమందు ఇడా పింగళానాడులతోఁ జేరి యున్నది ఆస్థానము త్రివేణీసంగమము, త్రికూటము, ఆజ్ఞాచక్రము అను పేరుల నొప్పుచున్నది.

ఇట్లు పెక్కు ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడియున్నది.

తే॥ అది దశాంగుళిమీఁదను నమరివెల్లు ।
ననుచు శ్రుతులను బల్కును వనజనేత్రి ।
యత్యతిష్ఠద్దశాంగుళి యనెడివార్త ।
నమ్మి సన్మార్గమరసి కనంగవలయు ॥ 125

తా. ఓ పార్వతీ! వినుము. ఆ పరమాత్మ దశాంగుళమునకు మీఁద తేజరిల్లుచున్నాఁడు. ఇట్లు వేదములు ఘోషించుచుండును. మఱియు "అత్యతిష్ఠ ద్దశాంగుళమ్" అని ఛాందోగ్య శ్రుతియందుఁ జెప్పఁబడియున్నది. ఈ శ్రుతిని నిజమని నమ్మి సన్మార్గమును విచారించి, అనఁగా సన్మార్గచిత్తుఁడై యెఱుంగవలయును.

చ॥ అటుచని మారుతంబు నిటలాగ్రము చేరియుఁ జంద్ర బింబముల్ ।
బటుగతి దాఁటి యావలను బల్కునఖండపు నాదజ్యోతిలోఁ ।
గుటిలతమాని మానసముఁగూర్చి చిదంబరమందు జేరుటే ।
పటుతరమైనయాత్మయని బ్రహ్మవిదుల్ ప్రకటింతు రద్రిజా ॥ 126

తా. ఓ పార్వతీ! వినుము. ఆవాయువు కపాలమునందుఁ జేరి చంద్రమండలమునుదాఁటి, ఆతర్వాత నుండు అఖండమైన నాదజ్యోతియందు మనస్సును జేర్చి చిదంబరమనెడి చిదాకాశమును జేరుటయే ఆత్మయని బ్రహ్మజ్ఞానులు చెప్పుదురు.

వి. శ్లో॥ అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్య యోధ్వనిః ।
ధ్వని రంతర్గతంజ్యోతిః జ్యోతి రంతర్గతం మనః ।
తన్మనో విలయంయాతి తద్విష్ణోః పరమంపదం ॥

తా. అనాహత చక్రమునడుమ (ఇదివఱకుఁ జెప్పినట్లు) ప్రణవనాద శబ్దము కలదు. ఆశబ్దమునడుమ నొక ధ్వని కలదు. ఆధ్వనినడుమ జ్యోతి కలదు. ఆ జ్యోతినడుమ మనస్సు కలదు. ఆ మనస్సు ఎచ్చట లయమును (నాశమును) పొందుచున్నదో అచ్చటనే పరమపదము, అనఁగా పరమాత్మస్థానము కలదు

శ్లో॥ ఓంకారధ్వని నాదేన వాయు సంహారణాత్మకం ।
నిరాలంబం సముద్దిశ్య తత్ర నాదో లయంగతః ॥

తా. వాయువు లయమగు చోటునందు ఆ పరమాత్మను ఓంకారనాదముచేత లక్ష్యముంచి యుండినయెడల ఆనాదముకూడ

లయమై (నశించి) పోవును. అనఁగా పరమాత్మయందే నాదము కూడ లయమగును. ఆ స్థలమే పరమపదము. అనఁగా పరబ్రహ్మ స్థానమని భావము.

క॥ ఇది తారక భావంబని।
మదివదలక నిరత మిట్లు మననముసేయన్।
గొదువలు నన్నియు దీరును।
సుదతీ పరమాత్మపదము చొప్పుగ గల్గున్॥ 127

తా. ఓ పార్వతీ ! వినుము. ఈ చెప్పఁబడిన విషయంబంతయును తారకభావ మని యెఱింగి దీనినే నిరంతరమును మననము సేయుచుండినయెడల సమస్తమైన కొఱఁతలు దీరును. మఱియు పరబ్రహ్మపదమును గల్గును.

మ॥ అనుచున్ దెల్పిన వామదేవుని ముఖం బాపార్వతీక్షించి యో।
యిన చంద్రాగ్ని త్రిలోచనా యిపుడు మీరీయర్థముల్ దెల్పనా।
మనసు న్నిశ్చలమై చిదాత్మఁగనఁగా మాలిన్యమున్ బాయలే।
దనఘా యీభ్రమ లన్నిమాని పరమార్థంబందఁగా దెల్పుమీ॥

తా. ఈప్రకారముగా పరమేశ్వరుఁడు పార్వతీదేవికిం జెప్పఁగా నా మహాదేవి విని మరల చంద్రసూర్యాగ్ని నేత్రుండగు పరమశివునింజూచి యిట్లనియె. ఓ పాపరహితుఁడా! మీరు నాకుఁ జెప్పిన విషయములనువిని నామనస్సు నిశ్చలమై పరమాత్మని దర్శించుటకు అనువుగాక భ్రమనొంది యున్నది. కావున నాయొక్క మనోమాలిన్యమును బాపి పరమార్థమును (పరమాత్మను) బొందునట్లు చేయుము. అని యడిగెను.

ఆ॥ తారకమునఁ గళలు ధర్మంబునను నాద।
ముల్ల సిల్లు నంచు నుల్లమలరఁ।
దెల్పితింక నాత్మ దివ్య స్వరూపంబు।
తాను నై వెలుంగు దానిదెలుపు॥ 129

తా. ఓ పరమేశ్వరా! తారకమునందు కళలును, దాని వలన నాదమును కల్గు నని చెప్పితిరి. ఇఁక ఆత్మస్వరూపమును, తానేఆత్మయనుటను, బోధింపుఁడు. అని ప్రార్థించెను.

వ॥ అని గిరిరాజకుమారి పల్కువాక్యంబులకు గిరిశుం డిట్లనియె॥

తా. సులభము.

ఉ॥ అంబిక నీవుపల్కు పరమార్థ రహస్యమునైన ప్రశ్న వా।
గ్డంబముచేత సిద్ధియగు కాశ్యపిలో బహువిస్ఫుటంబు చి।
త్తంబున నన్ని చర్యలు సదా తనుజూచుచు మర్వకున్న సా।
రంబగు జ్ఞప్తి యాత్మయని ప్రాజ్ఞులు నిత్యము నెన్నుచుందురే॥

తా. ఓ పార్వతీ! వినుము. ఇప్పుడు నీవు చెప్పిన పరమార్థ రహస్యమైన ప్రశ్నము ఈ భూమిలో వాగ్డంబముచేత సిద్ధించుట అరుదుగా నున్నది. చిత్తమును స్థిరపఱచి సకల చర్యలను మాని ఎల్లప్పుడును తన్నుఁజూచుచు అనఁగా ఆత్మ యిట్టిదని భావించుచు మఱపుచెందక యుండుటయే పరమాత్మ యని నిత్యమును పెద్దలు తలంచుచుందురు.

క॥ తారకభావం బిది యని।
గారవమునఁ దెల్పినాఁడఁ గ్రమమున నవలఁ।
ధీరులు నాత్మానాత్మ వి।
చారులునై ముక్తిఁగనుట చండిక వినవే॥ 132

తా. ఓ పార్వతీ! ఇదివఱకు నీకుఁ జెప్పిన విషయములు తారకభావంబని యెఱుంగుము. నేను దీనిని నీకు గారవబుద్ధిచేత నెఱింగించితిని ఇఁక వేదాంతవిదులు ఆత్మ యిదియనియును, అనాత్మ యిదియనియును దెలిసికొని ముక్తినొందుదురు. ఆ విషయము నిఁక నెఱింగించెదను వినుము.

## ఆత్మానాత్మ వివరణము.

ఆ॥ తారకప్రభావ ధర్మమా సాదృశ్య।
సంచయములఁబాయ నంచితముగ।
ముక్తిగల్గునంచు మోక్షాధికారులు।
పల్కుచుందు రట్టి ప్రజ్ఞ తెలియ॥ 133

తా. ఓ పార్వతీ! వినుము. తారకప్రభావమైన సాదృశ్యముల నన్నిటిని తొలఁగించి ఆప్రజ్ఞను తెలిసికొన్నయెడల మోక్షము సిద్ధించునని బ్రహ్మజ్ఞానపరులు చెప్పుచుందురు.

ఆ॥ ఆత్మ తానటంచు నరయు సజ్జనులకు।
దృశ్యములను భ్రాంతి తీరిపోవు।
దృశ్యచయముబాయ దృక్కు బ్రహ్మం బని।
యెఱుకగలిగి యపుడు మఱపుమాను॥ 134

తా. ఓ పార్వతీ! వినుము. తానే పరమాత్మయని విచారించి తెలిసికొన్న సత్పురుషులకు దృశ్యములనెడి భ్రాంతి తొలఁగిపోవును దృశ్యమంతయు నశించినతర్వాత దృక్కే బ్రహ్మంబని యెఱుక (జ్ఞప్తి) కల్గును అపుడు తాను దృశ్యము కాదనెడి మఱపు మానిపోవును.

ఆ॥ ఎఱుక గలిగి మనసు కేమి భ్రాంతియు లేక।
యున్న దృశ్య భ్రమము లన్ని పాయు।
నన్న వాక్యమునకు నానావిధంబుల।
సాదృశములు వినుము జలరుహాక్షి॥ 135

తా. ఓ పార్వతీ! ఎప్పుడు జ్ఞప్తి (ఎఱుక) గల్గి మనస్సునకు ఏభ్రమయును లేక దృశ్యభ్రమలన్నియు నివర్తియగునో, అనెడి వాక్యములకు అనేకవిధములగు దృష్టాంతములు గలవు. వానినెఱింగించెదను వినుము.

సీ॥ దృశ్యమా వస్తువు నశ్వరంబని శ్రుతుల్
పల్కుచునుండు సంపత్కరముగ।
నాదృశ్యమున్నశ్య మను వాక్య మూహించి
యత్కృతం తదనిత్య మనియు తెలిసి।
సాకార మనృతమైచాటుట యెఱిఁగియుఁ
దనువులోపలి దృశ్య ధర్మమంత।
యనృతమే యని నేత్రమందు సర్వంబును
గనుఁగొని యిది బ్రహ్మకళ యటంచు॥

తే॥ నిరతమును నమ్మి దృశ్యము న్నిరసనంబు।
చేసి తద్బ్రహ్మమని మనోల్లాసముగను।
నుండు ధన్యుండు మలినభావుండు గాక।
దృశ్యమును రోసి దృక్కునే నిశ్చయించు॥ 136

తా. ఓ పార్వతీ! వినుము. దృశ్యమైనట్టి (కనఁబడునట్టి) సమస్తమును నశ్వరమని వేదములు ఘోషించుచున్నవి. ఈవిషయము వేదములందు "యద్దృశ్యం తన్నశ్యమ్" "ఏదేది కనఁబడుచున్నదో అదియంతయు నశించునట్టిది" అని చెప్పఁబడియున్నది. ఈ వేదాంతవాక్యార్థము నెఱింగి, "యత్కృతం తదనిత్యమ్" "ఏదేది చేయఁబడుచున్నదో అది యంతయు అనిత్యమనియును" మఱియు సాకారమైన వస్తువులన్నియును అబద్ధమనియునుఎఱింగి, దృశ్యమైనదంతయుఅసత్యమనియును, నేత్రమునందు సమస్తమును దెలిసికొని, అదియే బ్రహ్మజ్యోతి యని సదాకాలమును నమ్మి, దృశ్యమైన వానినంతయు తొలఁగించి, తాను ఆ పరమాత్మయని మనస్సునందు భావించి, బ్రహ్మజ్ఞానియగువాఁడు దృశ్యమును నిరసించి, మలినచిత్తుఁడుగాక దృక్కనుమాత్రము తెలిసికొనును.

క॥ దృశ్యము సర్వము నాత్మని।
విశ్వములో శ్రుతులుపలుకు వివరణగని యా।
నశ్వరమా దృశ్యమునకు।
విశ్వాసము చేయవలదు విమలేందుముఖి॥ 137

తా. ఓపార్వతీ! వినుము. వేదములు కొన్నిటియందుదృశ్యమగు పదార్థములెల్లను ఆత్మయే యని చెప్పుచుండును. అయినను దాని తాత్పర్యము నెఱింగి, నశ్వరంబైన దృశ్యమునందు విశ్వాసము నుంపవలదు.

ఆ॥ ఘటము చూచువాఁడు ఘటమున కన్నను।
నెటుల భిన్నమౌను నటుల నీవు।
దృక్కు గాంచుచున్న దృశ్యము నశ్యమై।
దృక్కు నిలుచుచుండుఁ దివిరి గౌరి॥ 138

తా. ఓ పార్వతీ! వినుము. కుండను జూచువాఁడు కుండకంటె వేఱైయుండునట్లు, నీవు దృక్కును జూచుచుండిన యెడల దృశ్యము నశించి దృక్కుమాత్రమే మిగిలి యుండును.

క॥ దృగ్దృశ్యౌ ద్వౌ యనఁగా।
దృగ్బ్రహ్మ మటంచుఁ బల్కు దృఢమార్గము నౌ।

తద్బ్రహ్మమరసి దృశ్యము ।
దృగ్బ్రహ్మయని పొందఁబోకు దేవస్తుత్యా॥ 139

తా. ఓ పార్వతీ! వినుము. దృక్కు, దృశ్యము, అను నీ రెంటిలో, దృక్కు బ్రహ్మమని పల్కుచుండు దృఢమార్గము నెఱింగి, దృక్కును బ్రహ్మ మని తెలిసికొనుము. దృశ్యమునే దృక్కనెడి భ్రమను చెందకుము

వి. శ్లో॥ దృగ్దృశ్యౌ ద్వౌ పదార్థౌతు పరస్పర విలక్షణౌ ।
దృగ్బ్రహ్మం దృశ్యమాయేతి సర్వవేదార్థడిండిమః॥

తా. దృక్కు, దృశ్యము, అను నీరెండును ఒకదానికంటె మఱొకటి వేఱుగానున్నది. దృక్కు బ్రహ్మమనియును, దృశ్యము మాయ యనియును సకల వేదార్థములును ఘోషించుచున్నవి.

వ॥ అని పలికెడి గావున, దృక్కు పరమాత్మస్వరూపంబుగా నెఱుంగవలయు॥ 140

తా. సులభము.

వి. శ్లో॥ ఇదం జగ దహం సోయం దృశ్యజాత మవాస్తవమ్॥

తా. ఈ జగత్తు నేను, వాఁడు, అనెడి ఈ కనఁబడువస్తువు లన్నియును వాస్తవము కాదు.

శ్లో॥ యదిదం దృశ్యతె సర్వం జగత్థ్సావర జంగమం ।
తత్సుషుప్తా వివ స్వప్నః కల్పాంతే ప్రవినశ్యతి॥

తా. స్థావర జంగమాత్మకమై కనంబడు నీ సకలప్రపంచ మును సుషుప్తికాలమునందు స్వప్నమువలె, కల్పాంతమందునశించు చున్నది. అని వాసిష్ఠమునందుఁ జెప్పఁబడి యున్నది.

శా॥ తుర్యాతీతపునాత్మ దృక్కనుచు నెంతో చెల్లు విజ్ఞప్తిచే ।
ధైర్యండై కళమించుచున్న యెఱుకే తత్త్వజ్ఞు లెల్లప్పుడున్ ।
మర్యాదాత్మగనెంచి దృశ్యపదమున్ మాయింతు రెల్లప్పుడున్ ।
నార్యా నీవిపుడాత్మలో నెఱుకనే యశ్రాంత మూహింపుమా॥

తా. ఓపార్వతీ! వినుము. తుర్యాతీతంబైన ఆత్మనే దృక్కు అని వాక్రువ్వఁబడి యున్నది. వేదాంతవిదులు జ్యోతిర్మయమై యుండు ఎఱుకనే (ప్రజ్ఞనే) ఆత్మయని తెలిసికొని దృశ్యమనెడి పద

మును బోఁగొట్టుకొందురు. కావున నీవును ఆ యెఱుకనే నిరంతర మును భావింపుము.

తే॥ అన్ని కనుఁగొను దృక్కు చిదాత్మయంచు।
నమ్మువానికి నయనపద్మమునందు।
బంచ విగ్రహములతోడఁ బంచకళలు।
గలిగి యావల పరమునై వెలుఁగుచుండు॥ 142

తా. ఓ పార్వతీ! వినుము. సమస్తమును దెలిసికొనెడి దృక్కును చిదాత్మ యని నమ్మెడి పురుషునకు, నేత్రకమలమునందు పంచవిగ్రహములతోడ పంచకళలుగలిగి, ఆ చిదాత్మ ఆ పంచకళ లకు తర్వాత పరమై ప్రకాశించుచుండును.

వి. ఇచ్చట పంచవిగ్రహములనఁగా సద్యోజాత, అఘోర, తత్పురుష, ఈశాన, వామదేవ, అను పరమశివుని పంచమూర్తులని యెఱుంగవలయుననుట పరమరహస్యము. అయినను అనుభవజ్ఞులు స్థూలము, సూక్ష్మము, కారణము, మహాకారణము, అను నాలుగుశరీరములును, కైవల్యస్థానమునందుండు పరమాత్మ యొక టియుఁ జేరి పంచవిగ్రహములని చెప్పుదురు.

క॥ కన్నులను బంచదేహము।
లున్న ప్రభావంబు తెలియకున్నను నాత్మన్।
దిన్నగను బొందరాదని।
మున్నాత్మను గన్నయట్టి మును లం డద్రిజా॥ 143

తా. ఓ పార్వతీ! వినుము. నేత్రములయందుండు పంచ దేహముల ప్రభావంబును దెలియనియెడల ఆ పరమాత్మను బొందు టకుఁ గాదని, పరమాత్మను దెలిసికొన్నమునులు పల్కుదురు.

సీ॥ వలయమయ్యును రక్తవర్ణమై యాదిని
నున్నది స్థూలంబు నున్నతముగ।
నవల శుభ్రాంశమై నలరుచుండుటయది
సూక్ష్మ శరీరమై సొరిదివెలయు।
నాపైని నీలకళాప్రకాశం బొప్పు
నది కారణాంగంబునై చెలంగు।

నామీఁద నతిపీత మప్రకాశముఁబోలి
　　నది మహాకారణ మంద్రుబుధులు ॥

తే॥ అన్నిటికిఁ బైని గైవల్య మనెడుదేహ ।
మెపుడు వెల్గొందుచుండు నోయిందువదన ।
దాని తుద సూక్ష్మఛిద్రంబు తనరియొకటి ।
సకలజగమును వెలిఁగింపఁ జాలియుండు ॥　　144

తే॥ యచ్చకించి జ్జగత్సర్వ మనుచుశ్రుతులు ।
పల్కు దృశ్యత యనియెడి పనిచెలఁగు ।
వరుస నంతర్బహిస్సర్వ వ్యాప్తిచేతఁ ।
దనరు నారాయణస్థిసత మనఁగవినవె ॥　　145

తే॥ శ్రుతియజామేక లోహితశుక్లకృష్ణ ।
మనుచుఁ బల్కుట భావమం దరసీ తెలియు ।
మవలఁ దనువులు కన్నుల నలరియున్న ।
వివరమంతయుఁ దెల్పెద విను శుభాంగి ॥　　146

తా. ఓ పార్వతీ ! వినుము. నేత్రములయందు చుట్టును రక్తవర్ణమై మొదట ఉన్నతమై కనంబడునది స్థూలదేహము. ఆ తర్వాత తెల్లఁగాఁ గనంబడునట్టిది సూక్ష్మదేహము. ఆ మీఁద నీల వర్ణమై కనంబడునది కారణశరీరము. తర్వాత అత్యంతము పచ్చ నిదియు మలినవర్ణమునైనది మహాకారణశరీరము. అన్నిటికంటెను మీఁదనుండునది కైవల్య మనెడి శరీరము. దీని కొనయందు సూక్ష్మమైన రంధ్రము కలదు. ఆ రంధ్రమునందు సర్వమును ప్రకాశించు చుండును. ''యచ్చకించి జగత్సర్వమ్'' అని శ్రుతులు పల్కు చుండును. అందువలన "దృశ్యత" "సమస్తమును చూడంబడును" అనెడి వ్యాపారము జరుగుచుండును. ఈ హేతువుచేతనే "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యం నారాయణస్థితమ్" అనియును, ''అజామేకాం లోహితశుక్లకృష్ణామ్" అనియును, వేదములు ఘోషించు చుండును. కావున, మున్ను చెప్పినపంచదేహములును కన్నులయందు వెలయుచుండును. ఈ వివరమునంతయు నీ కెఱిఁగించెదను తెలిసి కొనుము.

వి. "శ్లో॥ త్రీణ్యర్థహస్తం యది స్థూలదేహా ।
మంగుష్ఠమాత్రంచ ప్రమాణ లింగం ।
సర్వార్థమాత్రం చతుర ప్రమాణం ।
ప్రమాణజానో అథ వేదతీతః ॥"

తా. స్థూలశరీరము మూడున్నరఅంగుళము, సూక్ష్మదేహము అంగుష్ఠప్రమాణము, కారణశరీరము అర్ధాంగుళము, మహాకారణ శరీరము నాలుగంగుళముల ప్రమాణము, పరమాత్మ శరీరమునకు ఇంతయనెడి ప్రమాణము లేదు.

వ॥ అది యెట్లంటేని ॥ 147

తా. సులభము.

సీ॥ అంగుళార్ధము గుంద్రమై యుండుస్థూలంబు
నంగుళ పరిమాణ మగునుసూక్ష్మ ।
మర్థాంగుళంబునై యమరును గారణ
మరయ మహా కారణాంగమయ్యె ।
నావలఁ గైవల్య మనుదానికింత ని
పరిమాణమును లేక ప్రబలుచుండు ।
నిన్నిటితోఁ గూడి యెట్లుండునదియన్న
వలయమై బిసకోశ మలరునట్లు ॥
తే॥ శిలసమానమునయ్యుఁ జంచలము లేక ।
కలదు లేదను వర్తనఁ గాంచునెపుడు ।
ఘనత నన్ని ప్రకాశింపఁగాను జేయుఁ ।
గాన నది యాత్మగాఁగను కంబుకంఠి ॥ 148

తా. ఓ పార్వతీ ! వినుము. గుండ్రమై ఒకటిన్నరయంగుళ ప్రమాణము కలిగియుండునది స్థూలదేహము. అంగుళప్రమాణము కలిగియుండునది సూక్ష్మశరీరము. అర్ధాంగుళప్రమాణము కలది కారణశరీరము మూఁడంగుళముల ప్రమాణమైనది మహాకారణ దేహము. ఇంతయనెడి ప్రమాణము లేక యుండునది పరమాత్మ శరీరము. ఇట్టి పరమాత్మ యెట్లుండునదియనఁగా వలయాకారమై

పద్మకోశమువలె శిలవలె చంచలములేకయు కలదో లేదో యను నంతటి అతిసూక్ష్మమైయుండునదియే పరమాత్మయని యెఱుంగుము.

ఈ స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరములయొక్క ప్రమాణములను గూర్చి ఒక్కొక్కగ్రంథమునం దొక్కొక్కవిధముగాఁ జెప్పఁబడియున్నది. కావున, ఈ వ్యత్యాసములవలన విషయభేదము కలుగదని యెఱుంగఁదగును.

గీ॥ పద్మకోశ ప్రతీకాశ మనుచు శ్రుతుల।
భావమంతయు నీమదిఁ పాదుకొల్పి।
యాత్మఁ డచ్ఛాంత మక్కడ నమరవెల్గు।
ననుచు నెఱుకను మఱవక యాత్మఁగనుము॥ 149

తా. ఓ పార్వతీ! వినుము. పద్మకోశ ప్రతీకాశమని పల్కునట్టి వేదములయొక్క వాక్యములను నీ హృదయమునందుఁ జక్కఁగా నెఱుంగుము. పరమాత్మం డచ్చోటనే ప్రకాశించును. ఇట్లు ఆత్మను (ఎఱుక) మఱువక నెఱుంగుము.

వి. "పద్మకోశప్రతీకాశం సూర్యకోటి సమప్రభమ్" అనియును,

శ్లో॥ అంగుష్ఠమాత్రః పురుషోఽంగుష్ఠంచ సమాశ్రితమ్।
ఈశస్సర్వజగతః ప్రభుః ప్రీణాతివిశ్వభుక్।
అంగుష్ఠపరిమాణం హృదయపుండరీకం।
అంగుష్ఠమాత్ర వంశపర్వ మధ్యవర్త్యంబరవత్పురుషశ్శరీరే తిష్ఠతి॥

అను కఠోపనిషత్తు మొదలగు శ్రుతివాక్యములను ఇచ్చుట ననుసంధించునది.

తే॥ జ్వాలమాలాకులంభాతి లీలఁదనరు।
మరియు విశ్వస్యయనుచుఁ దన్మహిమగలిగి।
యుండి ననియెడి శ్రుతిమూల మూహజేసి।
యాత్మరూపుని గనుఁగొను మంబుజాక్షీ॥ 150

తా. ఓ పార్వతీ! వినుము. జ్వాలమాలాకులమువలె, అనఁగా అగ్నిజ్వాలలు అన్నిదిశలందు వ్యాపించునట్లు, ప్రపంచము ఆ పరమాత్మ ప్రకాశముచే వ్యాపించి యున్నది. అనెడి వేదరహస్యము నెఱింగి పరమాత్మునిఁ దెలిసికొనుము.

వి. "జ్వాలామాలా కులంభాతి" అని శ్రుతిప్రమాణము.

తే॥ అగజ సతతం శిలాభిస్తులంబటంచుఁ।
కోశసన్నిభమని పల్కుఁ గూర్మితోడ।
దాని తుద సూక్ష్మ సుషిరంబు దనరి సర్వ।
మును బ్రకాశింపఁజేయు సన్మోహనాంగి॥ 151

తా. ఓ పార్వతీ! వినుము ఆపరమాత్మ ఎల్లప్పుడును "శిలాభిస్తులం" బని, అనఁగా చలనములేక యుండునది యనియును, కోశసన్నిభమైనది, అనఁగా పద్మకోశముతోఁ దుల్యమైనది యని యును, వేదమునందుఁ జెప్పఁబడి యున్నది. అట్టి పద్మకోశము తుది యందు సూక్ష్మమైన రంధ్ర మున్నది. దానియందు సమస్తమును ప్రకాశించుచున్నది.

క॥ తస్యాంతేసుషిరంబని।
తస్మిన్సర్వం ప్రతిష్ఠితం బని శ్రుతుల౯।
విస్మయముగఁ బల్కఁగనీ।
వస్థిరమా లౌక్య భ్రమల నాసింపకుమీ॥ 152

తా. ఓ పార్వతీ! వినుము. ఆ రంధ్రమునందు సమస్తమును ప్రతిష్ఠింపఁబడి యున్నదని వేదములందుఁ జెప్పఁబడి యున్నది. కావున, నీవు అస్థిరంబైన (అనఁగా శాశ్వతముకాని యట్టి లౌక్య భ్రమలందు ఆశనుంపకుము.) అనఁగా నీబుద్ధిని ప్రవేశింపనీయకుము.

వి. శ్లో॥ "దేహస్య పశ్చిమేభాగే వీణాదండ స్వరూపభృత్।
దీర్ఘాస్థి మూర్ధ్నిపర్యంతం బ్రహ్మదండీతి కథ్యతే।
తస్యాంతే సుషిరంసూక్ష్మం బ్రహ్మనాడీ తు సూరిభిః।
ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ।
సర్వం ప్రతిష్ఠితం తస్మి౯ సర్వగం సర్వతోముఖమ్"॥

తా. శరీరముయొక్క వెనుకటిభాగమునందు వీణాదండము వలె శిరస్సునందలి సహస్రారముదనుక వ్యాప్తమైన వెన్నెముకయే బ్రహ్మదండి యనఁబడును. ఆ బ్రహ్మదండముయొక్క కొనయందు సూక్ష్మమైన రంధ్ర మున్నది. అందుండు నాడియే బ్రహ్మనాడి యని యును, సుషుమ్నానాడి యనియును జెప్పఁబడును. ఆ సుషుమ్నానాడి ఇడాపింగళలనెడి నాడులయొక్క మధ్యయందు సూక్ష్మమై యుండు నాడియే సుషుమ్నానాడి యనఁబడును. ఆ సుషుమ్నానాడియందే సమస్తమును ప్రతిష్ఠింపఁబడి యున్నది.

శ్రుతి॥ "తస్యాశ్శిఖామధ్యే పరమాత్మా వ్యవస్థితః"॥

అని శ్రుతియందును జెప్పఁబడి యున్నది.

భ్రమలనుగూర్చి ప్రథమాశ్వాసము 101-వ పద్యము విశేషార్థమును జూచినచో బోధమగును.

గీ॥ తస్యమధ్యే మహావహ్ని దనరినపుడు ।
మొనసి విశ్వార్చి ర్విశ్వతో ముఖయటంచు ।
నన్నిటికిఁ బైన వెల్గొందు ననవరతము ।
జనన మరణ స్థితులులేని సరణి నెలుఁగు॥ 153

తా. ఓ పార్వతీ! వినుము. "తస్యమధ్యే మహావహ్ని"యని యును, "విశ్వార్చిర్విశ్వతోముఖః" అనియును జెప్పఁబడియుండునట్టి ప్రమాణముల ననుసరించి, ఆసమయమునందు, అనఁగా సుషుమ్నానాడియొక్క మధ్యయందుండు మహాజ్యోతి స్వరూపమైన బ్రహ్మము, అగ్ని శిఖవలె వెలుఁగుచుండును అది సకల స్థలములయందును వ్యాపించి అన్నిటికంటె మీఁదుగా నెల్లకాలములందు నుండును. దానికి జననమరణములు లేవు.

వి. శ్రుతి॥ "తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః॥"

అని ఉపనిషత్ప్రమాణము.

తే॥ అదియు దశదిక్కులను గాంతు లావహిల్లఁ ।
జేసి నఖశిఖలందును జెల్వుఁగాంచు ।
నమరి యణువయ్యుఁ బ్రాణుల్గం దతిశయిల్లు ।
ననుచు శ్రుతులను బల్కుట గనుము తరుణి ॥ 154

తా. ఓ పార్వతీ! వినుము. ఆ పరమాత్మ సర్వత్ర ప్రకాశించుచుండుననియును, అది అణుమాత్రంబయ్యును కాలిగోరు మొదలు తలయందుండు వెండ్రుకల పర్యంతము వ్యాపించియుండు ననియును, శ్రుతులందుఁ జెప్పఁబడియున్నది.

వి. మీఁదఁజెప్పిన ఉపనిషత్ప్రమాణమునే యిచటను గ్రహించునది.

గీ॥ నీలతోయదమధ్యస్థ నిభములోన।
మెఱుఁగు తీఁగెలభాతిని మెఱయుచోట।
నివరి శూకాణువర్తియై నెగడు పీత।
భాస్వరముఁబోలి యణువునై ప్రబలుచుండు॥ 155

తా. ఓ పార్వతీ! వినుము. ఆ పరమాత్మ సుషుమ్నానాడీ రంధ్రమున నీలమేఘమధ్యమునందలి మెఱుముతీఁగెవలెను, నివ్వరి ముల్లువలెను, అణుమాత్రమై స్వర్ణసమానమైన కాంతితోఁగూడినదై వెలుఁగుచుండును.

వి. శ్రుతి॥ "నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవభాస్వరా।
నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా" ॥

అని ఉపనిషత్ప్రమాణము.

తే॥ కూర్మి వెలుఁగు దాని కొన మధ్యమందున।
నాత్మ నిండియుండు ననుచు సాధు।
లెపుడు దెల్పుచుండు రేవేళ నీవది।
సత్తుగాఁ దలంపు చంద్రవదన॥ 156

తా. ఓ పార్వతీ! వినుము ఆసుషుమ్నానాడి తుదనుండు రంధ్రము యొక్క నడుమ పరమాత్మ ప్రకాశించుచుండును. అని యిట్లు సాధుపురుషులు (వేదాంతవేద్యులు) చెప్పుచుందురు. నీవు ఆ పరమాత్మను సత్తామాత్ర మని తలంచుచుండుము.

సీ॥ అతివితతస్యాత్మశిఖాయా మధ్య యని యుప
నిషదంబులనుబల్కు నియతి దెలిసి।
యొనర నాత్మవ్యవస్థిత యనుచును శ్రుతుల్
బల్కు నచ్చోటనే ప్రబలునాత్మ।

మఱి వేదవేదాంత మహిమజ్ఞు లెల్లరు
భావించు తత్త్వార్థ ప్రౌఢినెఱుఁగు।
సచతురానన సగిరీశ హరిస్సేంద్ర
సూక్ష్మ స్వరాట్టని చూడఁ బడుట ॥
తే॥ విధియు నదె యీశ్వరుండును విష్ణు వదియె।
యదియె మఘవుండును స్వరాట్టు నగునతండె।
నక్షిలోపల వెలుపల నమరివెల్గు।
నా చిదాత్ముఁడు నీవని యరయు గౌరి॥ 157

తా. ఓ పార్వతీ! వినుము. "తస్యాశ్శిఖాయామధ్యే" యని యుపనిషత్తులందుఁ జెప్పఁబడియుండు నియతినెఱింగి అనఁగా, సుషుమ్నానాడి కొనయందలి రంధ్రముయొక్క నడుమ "పరమాత్మా వ్యవస్థితః" పరమాత్మ యున్నదనెడి శ్రుతివాక్యములను దెలిసికొని, మఱియును, వేదములయొక్కయు, వేదాంతముల యొక్కయు, (ఉపనిషత్తులయొక్కయు) రహస్యములను దెలిసిన వారు, తెలిసికొనిన తత్త్వములను చక్కఁగా నెఱుంగుము. ఆ పరబ్రహ్మమే బ్రహ్మ విష్ణు మహేశ్వర ఇంద్రులనియు, అదియే సూక్ష్మమైన స్వరాట్టనియును, ఆ పరమాత్మయే నేత్రముయొక్క లోపలను, వెలుపలను, నిండి ప్రకాశించు చున్నాఁడనియును, ఆ పరబ్రహ్మమే నీవనియును దెలిసికొనుము.

వి. శ్లో॥ "సబ్రహ్మా సశివస్సహరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్॥
అని శ్రుతియందుఁ జెప్పఁబడి యున్నది.

వి. "అహంబ్రహ్మాస్మి" యను శ్రుతి ప్రమాణమును బట్టి ఆ పరమాత్మయే నీవని తెలిసికొనుము అని భావము.

క॥ దృక్కున్నచోట దృశ్యము।
చక్కగఁ వెల్గుచును నుండు జాడయుఁగనిఁ యీ।
మక్కువ దృశ్యభ్రాంతులఁ।
జిక్కక దుర్భ్రాంతివదలఁ జిన్మయ మదియౌ॥ 158

తా. ఓ పార్వతీ! దృక్కు (దృష్టి) ఉండుచోటనే దృశ్యము ప్రకాశించుచుండు నని యెఱుంగుము. దృశ్యమైన (కనంబడునట్టి

వస్తువులయందు) భ్రాంతిని (భ్రమలను బొందక యుండుము. ఇట్టి దుష్టమైన (దోషభూయిష్ఠమైన) భ్రమలను మానినయెడల అదే (చూడఁబడు సమస్తమును) చిన్మయ మగును. అనఁగా పరమాత్మ యగును.

వి. ఇచ్చట "సర్వం ఖల్విదంబ్రహ్మ" అను శ్రుతి ప్రమాణ మును గ్రహించునది

ఉ॥ అంగన దృక్కు సర్వ సచరావళిలోపల నిండియుండు సా ।
రంగనలేక దృశ్యమున కాస యొనర్చుచు వట్టిభ్రాంతు లు ।
ప్పొంగఁగఁ జేసి చిన్మయుని బొందఁగలేకయె మాయ జెందిరే ।
ముంగలవచ్చు కర్మగతి మూలముగానక ప్రాకృతాత్ములై ॥ 159

తా. ఓ పార్వతీ! వినుము. దృక్కు ఆబ్రహ్మస్తంబ పర్యంత మును వ్యాపించియుండు సారంబు నెఱుంగ లేక దృశ్యమునం దాశ నుంచి వట్టిభ్రమలందు మనసునుంచి చిన్మాత్రుండగు పరమాత్మను బొందక,మాయకు లోఁబడి రాఁబోవు కర్మము నెఱుంగలేక ప్రకృతి వశ్యులై పోయిరి. అనఁగా అవిద్యకు లోఁబడి మాటిమాటికి జన్మ మెత్తవలసినవారైరి.

క॥ ఆపరమాత్ముఁడు దృక్కై ।
లోపలనే నిలిచి దృశ్య రోచులనెల్లన్ ।
దీపించు నీవు దృశ్యము ।
ప్రాపని నమ్మకుము దృక్కు బ్రహ్మంబు జుమీ॥ 160

తా. ఓ పార్వతీ! వినుము: ఆ పరమాత్ముఁడు దృక్కై నీ లోపలనే నివసించియున్నాఁడు. కావున, దృశ్యమగు కిరణముల నన్నిటిని (కనఁబడువస్తువుల నన్నిటిని) పరమాత్మ స్వరూపిణివగు నీవు రక్షకం బని నమ్మకుము. దృక్కునుమాత్రమే బ్రహ్మం బని తెలిసికొనుము.

వి. శ్లో॥ "అదృశ్యే భావనానాస్తి దృశ్యమేత ద్వినశ్యతి॥"

తా. కనఁబడని వస్తువునందు భావన (భ్రాంతి) లేదు. ఈ కనఁబడుచున్న ప్రపంచమంతయును (దృశ్యమంతయు) నశించు

చున్నది. అను ఉపనిషత్ప్రమాణమ్మునుబట్టి దృశ్యమును నమ్మ రాదని చెప్పఁబడి యున్నది.

తే॥ అట్టి దృగ్బ్రహ్మమే నీవటంచు దెలిసి।
దృశ్యమున కాససేయక దృఢముగాను।
నరసి దృగ్బ్రహ్మ మని దృశ్య మస్థిరంబు।
గాను దలపోసి మేలొందు కమలనేత్రి॥ 161

తా. ఓ పార్వతీ ! వినుము. ఆ దృష్టియందుండు పరమాత్మను నీవని యెఱింగి దృశ్యమునందు అభిలాషనుంపక దృష్టియే బ్రహ్మమనియును, దృశ్యము అస్థిరం బనియును నిశ్చయించి ఉత్తమ స్థితినిఁ బొందుము.

వి. ఆపరమాత్మ దృక్కునందే వెలుంగుచున్నాఁడని యిది వఱకే 45-వ పద్యమునందుఁ జెప్పఁబడియున్నది. ఆ పద్యము యొక్క విశేషార్థమును జూచిన స్పష్టమగును.

శ్లో॥ చతుర్మధ్యే స్థితంగుహ్యం మంగుష్ఠే పర్వమాత్రకమ్।
తదర్ధం చాపి పర్వార్ధ తస్యాగ్రే సూక్ష్మకం ధ్రువమ్।
గుహ్యాద్గుహ్యతరంగుహ్యం చతుస్థానేషు తిష్ఠతి।
తస్మాద్ధిర్లక్ష్యతేదృశ్యం ఆపాద తలమస్తకమ్।
అమలం నిర్మలందేవం శూన్యవ్యాపి నిరంజనం।
తజ్జ్యోతి విమలస్థానే జ్ఞేయం ప్రత్యక్షగోచరమ్।
రక్తం శ్వేతం తథాకృష్ణం నీలపీతాదిశోభితమ్।
గురోర్ముఖేన జ్ఞాతవ్యం అన్యథా నోపలభ్యతే॥

తా. నేత్రముయొక్కనడుమ ఆపరమాత్మ తేజరిల్లుచుండును. అది ఒక యంగుళప్రమాణము స్థూలముగను, అర అంగుళప్రమాణము సూక్ష్మముగను నుండును. అది ఎఱుపు, నలుపు, నీలము, పచ్చ అను నీ కాంతులతోనుండును. అనఁగా కన్నుచుట్టునుండు వర్ణము లీవిధముగా నుండును. ఆ పరమాత్మ శిరస్సుమొదలు పాదముదనుక శరీరమువలె తోఁచును. ఇది ప్రత్యక్షముగాఁ గనంబడును. దీని నెఱుంగఁదగును. దీనిని గురుముఖముగానే తెలియవలయును. వేఱేవిధముగా నెఱుంగుటకును సాధ్యముకాదు.

౧ (స్థూల) అండపిండ బ్రహ్మాండములు.

అండాండము=భూచక్రము.
పిండాండము=పర్వతములు, నదులు, జీవజంతువులు.
బ్రహ్మాండము=ఆకాశము.

౨ (సూక్ష్మ) ఆంతర అండపిండ బ్రహ్మాండములు.

అండాండము=కనుగ్రుడ్లు.
పిండాండము=బిందువు (పాప)
బ్రహ్మాండము=పాపనడుమ వెలుఁగుకళ.

3 పంచభూతములు.

పృథ్వి=కన్నుచుట్టునుండు ఎఱుపు.
అప్పు= „ తెలుపు.
అగ్ని= „ నలుపు.
వాయువు= „ నలుపులోని నీలము.
ఆకాశము= „ నీలములోనికళ. ఈ కళయందలి నిష్కళయే తానైన పరబ్రహ్మము.

౪ త్రివేణులు.

నల్లగ్రుడ్డు=గంగ.
నీలమనెడి కుండలి=యమున.
పాపనడుమ వెలుఁగుకళ=సరస్వతి. ఇదేవిద్యుల్లేఖ, ఇదే నీవారశూకము, ఇదే అపోజ్యోతి, ఇదే విరాడ్రూపము, ఇదే స్వరూపము, ఇదే ముక్తికాంత, ఇదే గురుస్వరూపము, ఇదే తానైన పరబ్రహ్మము.

౫ త్రిమూర్త్యాదులు.

ఎఱుపు=బ్రహ్మ, అకారము.
తెలుపు=విష్ణువు, ఉకారము.
నలుపు=రుద్రుఁడు, మకారము.నలుపులోని సునీలమే ఓంకారసునాదము, ఆ ఓంకారమునకు పరమైన నిశ్శబ్దమైన నిష్కళయే తానైన పరబ్రహ్మము. ఇదే హృదయకమలము, ఇచ్చటనే నిద్ర, సంగము మొదలగునవి కల్గును.

౬ పంచశక్తులు.

ఎఱుపు=క్రియాశక్తి.
తెలుపు=జ్ఞానశక్తి.
నలుపు=ఇచ్ఛాశక్తి.
సునీలము=ఆదిశక్తి.
సునీలమండలికళ=పరాశక్తి, ఈకళలోని నిష్కళయే తానైన పరబ్రహ్మము.

౭ రేచకాదులు.

ఎఱుపు=రేచకము.
తెలుపు=పూరకము.
నలుపు=కుంభకము.
నీలము=సూచనము.
నీలమండలికళ=సూచనము. ఈ కళయందలి నిష్కళయే తానైన పరబ్రహ్మము.

౮ మండలత్రయము.

నలుపు=అగ్నిమండలము.
సునీలము=చంద్రమండలము.
కళ=సూర్యమండలము. ఈకళయందలి నిష్కళయే ఎఱుక మఱపు, తెలిసికొనినట్టి తత్త్వస్వరూపము.

౯ సచ్చిదానందాదులు.

కళ=సత్తు.
బిందువు=చిత్తు.
నిష్కళ=ఆనందము. అనఁగా ఎదుట కనఁబడునట్టి వస్తువులన్నియును (ప్రపంచ మంతయును) మిథ్య యని తెలిసి నిష్కళజ్యోతిస్వరూపమే తానై యుండుట ఆనందము.

౧౦ తత్త్వం పదాదులు.

స్వప్రకాశమైన తేజస్సు=తత్పదము.
జీవత్వమైన బిందువు=త్వంపదము.
కళయందు మనస్సును స్థిరపఱచి, నిష్కళ తానగుట=అసిపదము.

### ౧౧ నాదాదులు.

నీలము=నాదము.
సునీలము=బిందువు.
సునీలమందలి సత్కాంతి=కళ. ఈకళలోని నిష్కళయే తానైన పరబ్రహ్మము.

### ౧౨ ఇడా పింగళాదులు.

నలుపు=ఇడానాడి.
సునీలము=పింగళానాడి. ఇది సునీలము నడుమ వరిముల్లు వంటి సూక్ష్మరంధ్రమున జగద్వ్యాపకమై వెల్గులోపల ప్రకాశించుచున్నది.
భ్రూమధ్యము=సుషుమ్నానాడి. దీనికి మధ్యనాళమనియు, బ్రహ్మరంధ్రమనియు, మేరుశిఖర మనియు, ఆపోజ్యోతి యనియు పేరులుగలవు.దీనిని ఆత్మయందు కనవలయును.

### ౧౩ సాలోక్యాదులు.

ఎఱుపు=సాలోక్యము
తెలుపు=సామీప్యము.
నీలము=సారూప్యము.
సునీలము=సాయుజ్యము.
కళ=స్వాధిష్ఠానము. ఈకళలోని నిష్కళయే విదేహ కైవల్యము.

### ౧౪ షట్చక్రాదులు.

తానైన ఆత్మస్థానము=ఆధారము, దీనికి దేవత గణపతి.
ఎఱుపు=స్వాధిష్ఠానము, బ్రహ్మ.
తెలుపు=మణిపూరకము, విష్ణువు.
నీలము=అనాహతము, రుద్రుఁడు, తామసము.
బిందువు=విశుద్ధము, జీవుఁడు, మనోగుణము.
కళ=ఆజ్ఞేయము, పరమాత్మ, జీవగుణము. ఇందలి నిష్కళయే తానైన పరబ్రహ్మము. ఇదే అంతరాత్మ, ఇందలి

కిరణములే సహస్రారము. ఈ సహస్రారమునకు దేవత గురుస్వామి.

౧౫ శూన్య చక్రాదులు.

నీలములో కర్బురవర్ణము, ధూమ్రవర్ణము, తామ్రవర్ణము. ఈ మూడును శూన్యచక్రములు.

౧౬ అష్టతనువులు.

ఎఱుపు, ఎఱుపులో తెలుపు, తెలుపు, తెలుపులో నలుపు, నలుపు, నలుపులో కపిలవర్ణము, సునీలము, స్ఫటికము, లేకదీప్తి, ఇదే అష్టదళ కమలము.

౧౭ త్రిపుటులు.

ఎఱుపులో తెలుపు, తెలుపులో నలుపు; నలుపులో తామ్రవర్ణము, ఈమూడును బాహ్య త్రిపుటులు.

సునీలము, స్ఫటికము, దీప్తి, ఈమూడును అంతరత్రిపుటులు.

ఈ చెప్పినవానినంతయు తెలిసికొని రాత్రియందు ఏకాంతమున దీపమునందు నాసికాగ్రమున దృష్టినినిల్పి కన్నులు మూయక చూచుటవలన గల్గునట్టి ప్రకాశమే పరబ్రహ్మ స్వరూపము. అనఁగా ఇట్లు చూచినమీఁద కనులు మూసినయెడల స్వస్వరూపము కనఁబడును. ఇట్టి కళయందలి నిష్కళను దర్శించుటయే పరబ్రహ్మ సాక్షాత్కారము. పార్వతీదేవికి పరమశివుఁడు ఉపదేశించినది యని యును, ఇదే రాజరాజేశ్వరీయోగమనియును, తెలియఁదగినది.

క॥ ఈయర్థము విని పార్వతి।
కాయంబున నాత్మయందుఁ గంగాధర నేఁ।
బాయక నుండెడఁ దెలియని।
మాయా మహిమంబు దెల్పు మనసిజహరణా॥ 162

తా. ఇట్లు పరమేశ్వరుఁడు పార్వతీదేవికిఁ జెప్పఁగా విని, పార్వతీదేవి పరమశివునిం జూచి యిట్లనియె. ఓ శంకరా! నేను శరీరంబునందును ఆత్మయందును స్థిరంబుగా నున్నదానను. అయినను నాకుఁ దెలియని యట్టి మాయాప్రభావంబు నెఱింగింపుము.

తే॥ ఎచట మాయనిలుచు నేలాగువర్తించు।
నిజమునైన యాత్మ నేరి భ్రమముఁ।
జేయుచున్నయట్టి మాయాప్రభావంబు।
క్రమముగాను దెల్పు సుమహితాత్మ॥ 163

తా. ఓ శంకరా! మాయ యెచటనుండును? ఏప్రకారము వర్తించును? శాశ్వతమైన ఆత్మయందు మాయచేరి భ్రమము చేయుచున్నదికదా? అట్టి మాయామహిమంబును క్రమముగాఁ దెలియఁజేయుము.

క॥ అనవిని శంకరుఁ డిట్లను।
వనజాక్షీ నీవు మాయ వర్తనక్రమ మె।
ట్లని యడిగినావు గోప్యము।
గను దెల్పెద సూక్ష్మబుద్ధిఁ గనుఁగొను గౌరీ॥ 164

తా. ఇట్లు పార్వతీదేవి పరమశివుని అడుగఁగా పరమశివుండు పార్వతినిం జూచి, ఓ పార్వతీ! నీవు పరమరహస్యమైన మాయాప్రవర్తనమును గూర్చి తెల్పవలయునని యడిగితివి. నీకా విషయమును రహస్యముగఁ జెప్పెదను. నీవు సూక్ష్మబుద్ధిచేఁ దెలిసి కొనుము.

మాయాస్థాన నిరూపణము.

శా॥ నేత్రాంగస్థలమందు మాయవదలు న్నిక్కంబుగాదాని స।
త్పాత్రుల్ నెన్నుచునుందు రెప్పు డదియేప్రత్యక్షబింబంబునా।
క్షేత్రస్థానమునందునుఁగలయుచో క్షీప్రంబునై మాయయుఁ।
బాత్రాపాత్రము లేక వెల్గుననుచుఁ బ్రాజ్ఞుల్ విలోకింతురే॥ 165

తా. ఓ పార్వతీ! వినుము. నేత్రమునందు నిశ్చయముగా మాయ యుండునని వేదాంతము నెఱింగిన సాధుజనులు తలంచుచుందురు. అదియే ప్రత్యక్షబింబము అనఁగా పరమాత్మ. ఆ నేత్ర ప్రతిబింబమైన మనస్సులేక నేత్రములందుండు పరమాత్మను క్షేత్ర స్థానంబైన శరీరమందలి బుద్ధియందు ఆపరమాత్మ చేరినప్పుడు సకలమైన శరీరులయందును భేదభావంబు లేక ఆమాయయే తోఁచుచుండునని వివేకవంతులు చూచుచుందురు.

క॥ కనుబింబ ప్రతిబింబము।
లనయము నెచ్చోటఁగలయు నచ్చోటఁజుమీ।
యనువొంద నుండుననుచును।
ఘనయోగులు నెన్నుచుంద్రు గజరిపుమథ్యా॥     166

తా. ఓ పార్వతీ! వినుము. నేత్రమందలి పరమాత్మ బింబమును, అందలి ప్రతిబింబమును ఎచ్చటఁ జేరునో, అచ్చట మాయ యుండునని యోగులైనవారు తెలిసికొందురు.

ఐ. శ్లో॥ "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి।
భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢానిమాయయా॥

తా. అనఁగా ఈశ్వరుఁడు సకలప్రాణులయొక్క హృదయ ప్రదేశమునం దున్నాఁడు. యంత్రములం దెక్కిన సకలభూతములను మాయచేతవలె భ్రమింపఁ జేయుచున్నాఁడు. ఇట్లు భగవద్గీత యందుఁ జెప్పఁబడియున్నది.

ఈశ్వరుఁడు తనమాయచేతనే సకల ప్రాణులను మోహింపఁ జేయుచున్నాఁడు గాన, ఈశ్వరుఁ డుండెడి స్థానమును జెప్పినందున మాయయు నచ్చోటనే యుండునని యెఱుంగునది.

తే॥ కపిలగీతలవిను దీని క్రమము తెలియ।
చక్షురగ్రస్థితచ్ఛాయ సంతసముగఁ।
బ్రీతి నామాయ మూలరూపిణి యటంచు।
బలుకు నెఱిఁగియుఁ బరమాత్మఁ గలయు దుర్గ॥     167

తా. ఓ పార్వతీ! వినుము. దేవహూతికి భగవంతుఁడగు కపిలుఁడు బోధించిన కపిలగీతలయందు మాయలక్షణంబంతయు వివరముగాఁ జెప్పఁబడియున్నది. మాయయే మూలరూపిణియని యును, అది చక్షువుయొక్క అగ్రస్థానమునందుండు ఛాయయే యనియును, ఎఱింగి, నీవును అచ్చటనుండు పరమాత్మను బొందు మని భావము.

శ్లో॥ చక్షురగ్రే స్థితచ్ఛాయా మన్మాయా మూలరూపిణీ।
దృశ్యాదృశ్య స్వరూపేణ శివసాయుజ్య కారిణీ॥

తా. నేత్రముయొక్క తుదియందుండుఛాయయే నామాయ యనియు, అదియే మూలరూపిణియు, దృశ్యాదృశ్య స్వరూప మనియు, అదియే శివసాయుజ్యపదవి నొసంగునదియునై యున్నదని యెఱుంగుము.

వ॥ అని యిట్లు పలుకుచున్న వాక్యార్థంబునం జేసి మాయా ప్రభా వంబు తెలియవలయు॥ 168

తా. సులభము.

తే॥ కాన హైమవతీ మాయ గడచి యచల।
మహివెలింగెడి దృక్కు బ్రహ్మంబటంచుఁ।
జూపులోఁజూచి సుజ్ఞానరూపముగను।
జెంది నిర్మలపరమాత్మ నందఁగలయు॥ 169

తా. ఓ పార్వతీ! ఈమాయను దాఁటి స్థిరమై వెలుఁగునట్టి దృక్కును పరబ్రహ్మంబని ఆంతరదృష్టిచే నెఱింగి సుజ్ఞాన స్వరూ పంబునొంది నిర్మలంబైన పరబ్రహ్మమునందు లీనమగుము. అనఁగా పరమాత్మతో నైక్యమునొందుము.

క॥ గౌరీ యాత్మానాత్మల।
సారము వివరించితింక జడతయు లేక।
ధీరతతో నమనస్క వి।
చారపరులు నాత్మఁగనుట చండిక వినవే॥ 170

తా. ఓ పార్వతీ! నీకు ఆత్మయొక్కయు అనాత్మయొక్కయు సారమునంతయుఁ దెలియఁజేసినాఁడను. ఇఁక నీవు జడత్వబుద్ధి (మందబుద్ధి) నొందకుము. వివేకవంతులు అమనస్కవిచారపరులై ఆత్మనెఱుంగుపద్ధతి నెఱింగించెదను వినుము.

అ మ న స్క వి చా ర ము.

క॥ విషయేంద్రియముల భ్రాంతులు।
మృషలంచు నెఱింగియాత్మ మెలఁకువతో దు।
ర్విషయముల రోసి చూచుట।
ఋషదృగి యమనస్కమంత్రదు శశినిభవదనా। 171

తా. ఓ మీననేత్రివగుపార్వతీ ! వినుము. ఇంద్రియములయొక్క విషయములవలనఁ గలుగు భ్రమలను మిథ్యయని దెలిసికొని, మెలఁకువతో, అనఁగా, భ్రమలవలనఁ గలుగు కార్యములందు ప్రవేశింపక, దుష్టవిషయములందు మనస్సునుంపక చూచుటయే, (అంతరదృష్టిచే ఆత్మను దెలిసికొనుటయే), అమనస్కమని చెప్పుదురు అనఁగా మనస్సును నిశ్చలముగా నుంచుకొనుటయే అమనస్క మనఁబడును.

ఉ॥ వారధు లీవలావలికి బాహుబలంబున నీఁదవచ్చు వి।
స్తారదవానలాగ్నులను ధైర్యముచేఁ గబళింపనౌఁగదే।
మేరుసమాన శైలముల మేలిమి బంతులరీతినాడదా।
నేరువవచ్చు మానసము నిశ్చలవృత్తిని సేయరాదుగా॥    172

తా. ఓ పార్వతీ ! వినుము. సప్తసముద్రములను ఈ గట్టునుండి ఆ గట్టునకును, ఆ గట్టునుండి యీ గట్టునకును చేతుల బలంబుచే నీఁదవచ్చును. విశేషమైన కార్చిచ్చును ధైర్యముచే మ్రింగవచ్చును. మేరుసమానమైనట్టి కులాచలము లేడింటిని బంతులవలె నాడుటకు నేర్వవచ్చును. అయినను, మనస్సుమాత్రము నిశ్చలముగాఁ జేయుటకు సాధ్యముకాదు.

చ॥ రసఘుటి కాదిసిద్ధుల స్థిరంబుగఁగాంచి యరణ్యవాసియై।
వెసఁ జరియింపవచ్చు పలువిద్యలు తాఁ బ్రకటింపవచ్చు నీ!
వసుధనిధుల్ నదుల్ గనుచు వాని మహత్త్వము లెన్నవచ్చుఁగా।
మసలుచు నున్న మానస భ్రమంబుల మాన్పఁగ రాదు శైలజా॥

తా. ఓ పార్వతీ ! వినుము రసగుళికలప్రభావంబుచే అరణ్యంబున సంచరింపవచ్చును. పలువిద్యలను తాను బయలు పఱచవచ్చును. ఈ భూమియందు అచ్చటచ్చటనుండు నిక్షేపములనునదులను జూచుచు వానియొక్క మహత్త్వమును దెలిసికొనవచ్చును. అయినను మనస్సులోని భ్రమలను మాన్పుటకు సాధ్యము కాదు.

మ॥ అటుగాన న్నమనస్కయోగమును దానత్యంతకష్టంబుచే।
ఘటనౌనంచు మహాత్ము లెన్నుదురదే కాంక్షించి లోనాత్మనే।

కుటిలత్వంబులుమాని నిశ్చయముగాఁ గుంభించిహృద్వాయువున్।
నిటలాగ్రంబున నిల్పిచూడ నదియే నిర్మానసం యోగమా॥ 174

తా. ఓ పార్వతీ! వినుము. కావున అమనస్క యోగము మిగుల కష్టముచే కల్గునని మహాత్ములు తలంతురు అమనస్కమును గోరి, ఆత్మనే కుటిలత్వములుమాని హృదయమందలి ప్రాణవాయువును కుంభించి దృష్టిని నిటలాగ్రంబునందు అనఁగా నాసికాగ్రమునందు నిల్పి చూచినయెడల అమనస్కయోగంబగును.

ఉ॥ దారువు మృణ్మయంబు శిల తామ్రపటంబుల దైవభావనన్।
గోరి యఖండభక్తి నొడఁగూర్చి సుమంబులఁ బూజఁజేసి తాఁ।
జేరఁగఁ గోరునట్టి సవిశేషపదంబున కంటె జిత్తవృ।
పారము మాని దృక్పథము పట్టుగగన్నమనస్కమందురే॥ 175

తా. ఓ పార్వతీ! వినుము. దారువు, మృత్తిక, శిల, తామ్రము, పటము, అగు వీనిచే నిర్మితంబై యుండు ప్రతిమలయందు దైవభావంబునుంచి అఖండమైన భక్తిచే పుష్పములతోఁ బూజ చేసి తాను పొందనెంచిన ఉత్తమ పదంబునకంటె, చిత్తమందలి వృత్తులనుమాని దృష్టిని పరమాత్మయందుంచి పట్టుగఁ జూచుటయే అమనస్కమని చెప్పుదురు. ఇదే అమనస్కయోగము.

వి. శ్లో॥ "తీర్థాని తోయరూపాణి దేవాన్ పాషాణమృణ్మయాన్।
యోగినో నప్రపద్యంతే ఆత్మధ్యాన పరాయణాః॥"

తా. ఆత్మధ్యానమునం దాసక్తిగల యోగులు గంగాది పుణ్యతీర్థములను జలములనియును, దేవతలను శిలామయములును మృణ్మయములును అని తెలిసి సేవింపరు.

శ్లో॥ జడతాం వర్జయిత్వైకాం శిలాయాం హృదయం హి తత్।
అమనస్క స్వరూపం య త్తన్మయోభవ సర్వదా॥

తా. బుద్ధిమాంద్యమును, విడిచి ఱాయివలె నిశ్చలత్వము నొందినమనస్సు ఎదియో అదియే అమనస్కస్వరూపము. నీవును అట్లగుము.

చ॥ క్రతువుల దానధర్మములఁ గర్మతపంబుల నాశ్రమాదిస।
ద్వ్రతముల వేషభాషలను వాదవిభేదము లెన్ని నేర్చినన్।

జతపడి తత్ప్రసంబు భువి శిష్టులపాదతలంబుఁ జేర్చు స।
ద్గతికి సమంబుగాదనుచు ధన్యులు మానసభ్రాంతి పొందరే॥176

తా. ఓ పార్వతీ! వినుము. అశ్వమేధాది యజ్ఞములచేతను, గోదానాది షోడశదానములచేతను, దేవాలయ ప్రతిష్ఠాది ధర్మముల చేతను, నిత్య నైమిత్తిక కర్మములచేతను, పంచాగ్ని మధ్యాదితపస్సులచేతను, బ్రహ్మచర్యాద్యాశ్రమములకుఁ దగిన పుణ్యవ్రతముల చేతను, జాతికిని ఆశ్రమమునకును అనుగుణమైన వేషభాషలచేతను, మఱియు వాదవిభేదములు (తర్కములు) మొదలగునవియెన్ని నేర్చి నప్పటికి ప్రయోజనంబు లేదు. మనంబును శిష్టులగు సద్గురువర్యుల పద కమలంబులందుఁ జేర్చినయెడల గల్గు సద్గతితో సమముకాదని యెఱింగి పుణ్యాత్ములు చిత్తభ్రమను బొందరు.

క॥ మనసే సకలేంద్రియముల।
కును నధిపతియయ్యు భ్రమలఁ గూడఁగఁ జేయుఁ గా।
గనుకను మనసును నాతను।
ననువున గీలించినదియె యమనస్కమగున్॥ 177

తా. ఓ పార్వతీ! వినుము. మనస్సు సకలేంద్రియముల కును అధిపతిగానున్నది. ఆ మనస్సే భ్రమలను కలుగఁజేయును. కాఁబట్టి మనస్సును ఆత్మను ఐక్యముచేసి (అనఁగా మనస్సునందు సదా పరమాత్మనే చింతించుచు, ఇతరచింతలను మానియుండుటయే) అమనస్కయోగ మనంబడును.

గీ॥ సర్వభ్రాంతులు మనసున సంభవించు।
సర్వభ్రమలును మనసుచే సమసిపోవు।
నట్లుగావున మనము చిదాత్మయందుఁ।
జేర్ప నమనస్కమండ్రు రాజీవనేత్రి॥ 178

తా. ఓ పార్వతీ! వినుము. సమస్తభ్రమలును మనస్సు నందే సంభవించును మనస్సుచేతనే సకలభ్రమలును నివర్తి యగును. కాఁబట్టి మనస్సును పరమాత్మయందుఁ జేర్చుటయే అమనస్కమని చెప్పుదురు.

మత్తకోకిల॥ ఈవిధంబున మానసంబును నెప్పుడుః ... ాత్మతోఁ।
గేవలంబును జేర్చువానికిఁ గిట్టదెప్పుడు కర్మముల్।
భావమెప్పుడు చంచలింపక భక్తియోగము నందునే।
ధీవిలాసము నొందుఁగావున దివ్యయోగులు మర్వారే॥

తా. ఓ పార్వతీ! వినుము. ఈ ప్రకారంబుగా మనస్సును ఎల్లప్పుడును పరమాత్మతోఁ జేర్చువానికి ప్రారబ్ధాది త్రివిధకర్మములును అంటవు. మఱియు మనస్సెప్పుడును చంచలమునొందక చిత్త పరిశుద్ధికలిగి భక్తియోగమునందే మగ్నమై యుండును. కాఁబట్టి దీనిని రాజయోగులు మఱువకయుందురు.

క॥ మనసు చిదాత్ముని వశముగ।
వనజజ హరి వామదేవ వాసవు లెపుడున్।
బెనుపొందఁ జేయలేకయె।
ననయము దుర్భ్రమలఁబొంది రార్యా వినవే॥ 180

తా. ఓ పార్వతీ! వినుము. మనస్సును చిదాత్మునితో నైక్యము చేయనందున బ్రహ్మ విష్ణు మహేశ్వర ఇంద్రాదులు నిరంతరమును దుర్భ్రమలను బొందిరి.

వి. శ్లో॥ మనోద శేంద్రియాధ్యక్షం హృత్పద్మే గోళకస్థితం।
తచ్చాంతః కరణంబాహ్యే ష్వస్వాతంత్ర్యాద్వినేంద్రియైః॥

తా. మనస్సు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదింటికిని అధిపతియగును. ఆ మనస్సు హృదయకమలమునందున్నది. మనస్సు ఇంద్రియములతోనే సంబంధముకలది. దానికి స్వతంత్ర గమనములేదు. కాఁబట్టియే మనస్సు అంతరింద్రియము, లేక అంతఃకరణము, అని చెప్పఁబడును.

ఇట్లు పంచదశియందుఁ జెప్పఁబడి యున్నది.

## మ నో ప్ర భా వ ము.

వ॥ ఆ మనోప్రభావం బెట్లం టేని॥ 181

తా. సులభము.

సీ॥ శాస్త్ర వేదంబులు జగతివారలచేతఁ
జదివింపవచ్చుఁ దాఁ జదువవచ్చు

సగణిత దానంబు లధికులచేతను
జేయింపవచ్చుఁ దాఁ జేయవచ్చు।
సకల తీర్థములకుఁ జన ధాత్రి జనముల
బోధింపవచ్చుఁ దాఁ బోవవచ్చు।
చౌషష్టివిద్యలు చక్కఁగా నరులకు
నేర్పంగవచ్చుఁ దాఁ నేర్వవచ్చు॥
తే॥ గాని యెవ్వరికైనను గ్రమముతోడ।
మనసువృత్తుల ద్రుంచి నిర్మలపదమును।
బొంది సుజ్ఞానమును దాను బొందుటరుదు।
భవ్యతరగాత్రి భాసుర పద్మనేత్రి॥ 182

తా. ఓ పద్మనేత్రివగు సుందరీ! ఆఱుశాస్త్రములను, నాలుగు వేదములను, భూమియందుఁగల జనులచేతఁ జదివింప వచ్చును. మఱియుఁదానును జదువవచ్చును లెక్కలేని దానంబును ధనికులచేతఁ జేయింపవచ్చును. తానును జేయవచ్చును. గంగాది సకలతీర్థములకును బోయి స్నానము చేసిరమ్మని లోకులకు బోధింప వచ్చును. తానును పోయిరావచ్చును. అరువదినాల్గు శాస్త్రములను (కలలను) ఇతరులకు బాగుగా నేర్పవచ్చును తానును నేర్వ వచ్చును. అయినప్పటికిని ఎట్టివారికిఁగాని క్రమముగా మనోవృత్తు లను ఖండించి పరిశుద్ధమైన పరమాత్మపదమును బొంది తానును సుజ్ఞానమును బొందుట యరుదని తెలియుము.

తే॥ తన్నుఁదాఁగానలేక యున్నట్టివాని।
మనసులో నాత్మఁజెందక మసలుచుండు।
దన్నుఁ దాఁగన్న పురుషున కెన్నిగతుల।
మనసు నాత్మలో మగ్నమా వనజనేత్రి॥ 183

తా. ఓ పార్వతీ! వినుము. తన్నుతానెఱుంగక యున్నట్టి వానిమనస్సు ఆత్మనుజేరక మసలుచునుండును తన్ను తా నెఱింగిన వానికి అన్నివిధములచేతను మనస్సు పరమాత్మతో నైక్యమగును.

వ॥ అది యెట్లంటేని॥ 184

తా. సులభము.

క॥ జలమందు నుప్పుగలసిన ।
జలముండియు నుప్పులేక సమసినభంగిం ।
దెలివెప్పు డాత్మఁగలసిన ।
బలు సుజ్ఞానంబు వెలసి భ్రాంతులడంగున్॥ 185

తా. ఓ పార్వతీ! వినుము. నీళ్లలో ఉప్పు కలసినపుడు ఆ నీళ్లుమాత్రము మిగిలి ఉప్పు ఎట్లు లేక సమసిపోవునో, అట్లు తెలివి (జ్ఞానము) ఆత్మయందుఁ గలిసెనేని విశేషమైన జ్ఞానము ఉదయించి భ్రమలన్నియు నివర్తియగును.

తే॥ సకల సంకల్పములుమాని సచ్చిదాత్ముఁ ।
నందుఁ జిత్తంబు జేర్చు నానందునకును ।
సర్వకర్మముల్ తనుదానె సమసికలియు ।
దారువునఁబుట్టి మడిసెడు దహనుభంగి॥ 186

తా. ఓ పార్వతీ! వినుము. సమస్తమైన సంకల్పములు మాని సచ్చిదానందుఁడగు పరమాత్మునియందు మనస్సును జేర్చునట్టివానికి సకలకర్మములును తనంతట మాని కలిసిపోవును. ఎట్లన, మ్రానియందుఁ బుట్టి నశించెడు అగ్నివలెనని యెఱుంగునది.

శా॥ స్వాంతం బెక్కడఁజేరియుండు నచటన్ సంకల్పముల్ సేయు న।
శ్రాంతం బింద్రియవృత్తు లన్నిసమయన్ సాదృశ్యమెట్లంటివా ।
కాంతా యర్కుఁడు పుట్టువేళను మయూఖశ్రేణివెల్గొందు దా।
నంతన్ సూర్యుఁడు గ్రుంకగాను విలయం బందున్ గదే పార్వతీ॥

తా. ఓ పార్వతీ! వినుము. ఎచ్చట మనస్సు పరిణమించి యుండునో అచ్చట ఇంద్రియవృత్తులగు సంకల్పములు నిరంతరమును సేయుచుండును. ఆఇంద్రియవృత్తులు నశించుటకు తార్కాణ యెట్లనఁగా, సూర్యుండు ఉదయించునపుడు కిరణములు ప్రవృద్ధి నొందును. ఆ కిరణములు సూర్యుఁడు అస్తమింపఁగానే తనంతట నశించును.

వ॥ అట్లుగావున॥ 188

తా. సులభము.

ఉ॥ సామజయాన మానసము చక్కఁగ నాత్మనుగూర్చువానికిన్ ।
నీమహినెప్పుడైన విషయేంద్రియ భ్రాంతులయందుఁ జిత్త వి।
భ్రామికలేమిసేయునవి పైకొనివచ్చి కలంతపెట్టినన్ ।
నేమియు సేయఁబోదు విషమెక్కనె పాములవాని కెప్పుడున్ ॥

తా. ఓ మత్తగజగామినివగు పార్వతీ! వినుము. ఈ భూమియందు మనస్సును ఆత్మతోఁ జేర్చువానికి ఎప్పుడుగాని విషయేంద్రియ భ్రమలయందు చిత్తము పరిణమించి భ్రాంతిని కలుగఁజేయదు. ఎట్లనఁగా, పాము పైకొనివచ్చికలఁత పెట్టినప్పటికిని, పాములవానికి విషమెక్కదుకదా. అట్లని యెఱుంగవలయును.

చ॥ మనసు దృగాత్మయం దునిచి మగ్నతబొందినవాని కెయ్యెడన్।
బనివడి యింద్రియభ్రమలు భ్రాంతులబెట్టవదెట్టులంటివా ।
విను మినకాంతిబొందు ఘనవేళను దీపము లెన్ని వెల్గినన్ ।
ఘనతకు గానరాని గతి గానఁగఁ బో గిరి రాజపుత్రికా ॥    190

తా. ఓ పార్వతీ! మనస్సును దృక్కునందు (నేత్రమునందు తేజరిల్లు) పరమాత్మతోఁ జేర్చినట్టివానికి, ఇంద్రియభ్రమలు మోహమును కల్గింపవు. అదెట్లంటివేని వినుము. సూర్యుని తేజస్సు ప్రకాశించు సమయమునందు దివిటీలు ఎన్ని వెలిఁగినప్పటికిని అవి ప్రకాశింపవుకదా. ఆ ప్రకారమే కనఁబడకపోవును.

వి. దృగాత్మ=నేత్రపురుషుఁడు. ఈ విషయమును 133 పుటయందుఁ జూచి తెలిసికొనఁదగును.

చ॥ స్థిరముగ నాత్మలో మనసు జేరిచి నిశ్చయ మొందువానికిన్ ।
మరి విషయేంద్రియభ్రమలు మానసమందునఁ బుట్టవందురా ।
సరణి యదెట్టులంచిపుడు చర్చనొనర్చెదవేని తెల్పెదన్ ।
గరుడునిగన్న పన్నగులకైవడి సుమ్ము ధరాధరాత్మజా ॥    191

తా. ఓ పార్వతీ! ఆత్మయందు మనస్సును జేర్చి నిశ్చయమొందియుండువానికి విషయేంద్రియభ్రమలు మనస్సులోఁ బుట్టవని చెప్పుదురు. ఆపద్ధతి యెట్లనఁగా, చెప్పెదను వినుము. గరుత్మంతునిఁ జూచిన సర్పములవలె నశించును.

ఉ॥ భాసుర సచ్చిదాత్మఁగన భ_క్తినిగూర్చు మనంబుగల్గినన్ ।
మోసము గల్గదంచు మునుముట్టి హృషీకపు వ_ర్తనంబులన్ ।
దేశికు లెన్నుచుందు రది తేటపడన్ విను సావధానతన్ ।
గేసరిఁగన్న నేనుఁగుల క్రీడయునౌ హిమవన్నగాత్మజా ॥ 192

తా. ఓ పార్వతీ! వినుము. తేజోమూ_ర్తియైన సచ్చిదానందుఁడగు పరమాత్మను మనస్సుతోఁ జేర్చునట్టి భ_క్తికల్గిన యోగికి ఇంద్రియ వ_ర్తనంబులవలన సంప్రా_ప్తమగు మోసవృత్తులన్నియును, సింహమునుగన్న ఏనుగులవలె చెల్లాచెదరై పోవును, లేక నశించును. అని ఆచార్యులు చెప్పుచుందురని తెలిసికొనుము.

ఉ॥ అంగము లోననున్న పరమాత్మునిఁ గన్న మహాత్ముఁడెప్పుడే ।
సంగతినున్న నింద్రియవిచారము లాత్మ భ్రమింపవంచు స ।
త్సంగులు నెన్నుచుందు రది చక్కఁగఁ దెల్పెద నెట్టులన్న సి ।
వ్వంగినిఁగన్న లేళ్ళ క్రియ వర్థిలుఁ జి_త్తము పద్మలోచనా ॥ 193

తా. ఓ పార్వతీ! వినుము. దేహములోపల నుండెడు పరబ్రహ్మమును దర్శించిన మహాత్ముఁడు, ఏకాలమునం దెట్లున్నప్పటికిని, అతనిని ఇంద్రియవృత్తులు చలింపఁజేయవని సత్పురుషులు చెప్పుదురు. ఎట్లనఁగా, తోడేటినిగన్న లేళ్ళవలె మటుమాయ మగునని యెఱుంగుము.

వ॥ అనిన పార్వతి శివునకిట్లనియె ॥ 194

తా. సులభము

ఉ॥ గోపతివాహ దేహమునఁ గూర్మి వెలింగెడు నాత్మఁగన్న నే ।
పాపముఁ బొందఁబోదనుచుఁ బట్టుగ నీవిపుడంటిగానఁ దా ।
నేర్పునఁజేయు దుష్క్రియలు నేవిధిఁబొందక పోవుచుండునో ।
యో పరమేశ సత్కృపను నొప్పుగ దీని విధంబుఁ జెప్పవే॥ 195

తా. ఓ వృషభవాహనా! శరీరములో ప్రకాశించునట్టి పరమాత్మను దర్శించువారికి ఏవిధమైన పాపమును కలుగదని చెప్పితిరి. అయినను జీవుఁడు మనఃస్ఫూ_ర్తిగాఁ జేసినట్టి పాపము ఏ ప్రకారముగా నివ_ర్తియగును? ఓ పరమేశ్వరా! ఆవిషయమును కృపతో నా కెఱిఁగింపుము.

తే॥ అనిన పార్వతిఁజూచి ఫాలాక్షుఁ డిట్టు ।
లనియె దేహవికారము లాత్మఁ గన్న ।
వాని కేరీతి జెందక వదలుననుచు ।
నడిగితివిగానఁ దెల్పెద నంబుజాక్షి॥ 196

తా. ఓ పార్వతీ ! శరీరవికారములు పరమాత్మను దర్శించిన వానికి, ఎట్లు నివర్తియగునని యడిగితివి. ఆవిషయము నెఱుకపఱ చెదను వినుము.

చ॥ సరసిజనేత్రి చిన్మయునిఁ జక్కఁగ దృక్కుఁగ జూచువానికిన్ ।
మరియును బ్రాకృతభ్రమలు మానసమందును దోఁపకుండు ।
దుష్కరముగ దోఁపవాని ఫలసంతతియాతని బొందకుండుఁబో ।
పరఁగఁ గులాలకీటమును బంకమునంటునె యెన్నిభంగులన్ ॥197

తా. ఓ తామరసాక్షివగు పార్వతీ! వినుము చిన్మయాత్ముం డగు పరమాత్మను దృక్కని తెలిసి లెస్సఁగా దర్శించువానికి ప్రకృతి సంబంధమైన మాయలు (భ్రమలు) మనస్సునందుఁ దోఁపకుండును. ఎట్లన, కుమ్మరపురుగును అడుసు అంటదుకదా ? అయినను దృక్కు దుష్కరముగాఁ దోఁచువానికి మాత్రము వానియొక్క కర్మఫల సంతతి యానరుని చెందకయుండునా? అనఁగా జెందునని భావము.

## దృగ్దృశ్య లక్షణము.

1. దృక్కు—త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు.

2. దృశ్యము—శబ్ద స్పర్శ రూప రస గంధములు.

1. దృక్కు—సగుణబ్రహ్మ సాక్షాత్కారమునకు సాధక మైన శుద్ధమనస్సునందు జనించిన బుద్ధి వృత్తి యనెడి జ్ఞానము.

2. దృశ్యము—ఉపాస్యుఁడైన సగుణబ్రహ్మము.

1. దృక్కు—నిర్వృత్తికమైన స్వరూపోపాధియగు ఆత్మజ్ఞా నమునందు వ్యష్టి సమష్టిభావమును కలుగఁజేసి బ్రహ్మస్వరూప మునకు భిన్నముగాని వ్యష్టియైన జీవాత్మకును, సమష్టియైన పర మాత్మను ప్రత్యక్షము జేయునట్టి జ్ఞానము.

2 దృశ్యము—బాహ్యోపాధిలేక కేవలము స్వరూపో పాధిచేత నిర్గుణబ్రహ్మమునందే వ్యష్టి సమష్టిభావ ముదయమై, తదు పరి సమష్టియైన శుద్ధ బ్రహ్మమునందే దార్ఢ్యము కలుగునట్టి స్థితి

క॥ నిరతం బాత్మసమాధిని।
గురిగని వర్తించువాని కూహకములునే।
వెరవున జెందవదెట్లన।
నరయగ నద్దమునరూప మంటునె దుర్గా॥ 198

తా. ఓ పార్వతీ! వినుము ఎల్లప్పుడును ఆత్మసమాధియందు (అనఁగా మనస్సును ఆత్మయందే) లక్ష్యముంచి యుండువానికి చెడుగు లేకాలమునందును కలుగవు అదెట్లనఁగా, అద్దమునందు రూప మంటదుకదా.

తే॥ ఆత్మఁ గన్నట్టి ధీరుఁ డహర్నిశాదు।
లేమిచేసిన నెచటున్న నెట్లుచనిన।
నఘము లంట వదెట్లని యంటివేని।
నాలుకను నంటునె జిడ్డు నళిననేత్రి॥ 199

తా. ఓ పార్వతీ! వినుము పరమాత్మను దర్శించిన ధీరుఁడు రేయింబవళ్లు ఏ కార్యము లొనర్చినను, ఎచ్చటనుండినను, ఎట్లు పోయినను, అనఁగా నెట్లు వర్తించినను పాపము లంటవు. ఎట్లన, నాలుకయందు జిడ్డు అంటదుకదా.

తే॥ అంత మేనున దశవిషయాదు లెపుడు।
మెలఁగుచుండఁగఁ బరమాత్మఁ దెలియఁ జూడ।
నవల విషయేంద్రియభ్రాంతు లచటనిలువ।
కెట్లు పోనని మది సంశయించె దేని॥ 200

తా. ఓ పార్వతీ! వినుము. శరీరమందు పది విధములగు విషయములు సంచరించుచుండఁగా, పరమాత్మను దర్శించినవారికి, ఏప్రకారము విషయేంద్రియభ్రమలు నశించిపోవునని సంశయించితి వేని చెప్పెదను వినుము.

తే॥ వనహుతాశను చేఁ గాలు వనముఁజూచి।
యాశ్రయించునె పక్షిమృగాదు లెప్డు।

డట్టులనె యాత్మఁగన్న మహాత్మునెపుడు ।
పుణ్యపాపంబు లంటునే పువ్వుఁబోఁడి ॥ 201

తా. ఓ పార్వతీ ! వినుము. పక్షులు మృగములు మొదలగునవి కార్చిచ్చునే కాలునట్టి వనమును జూచినతర్వాతకూడ ఆశ్రయించునా ? ఆశ్రయింపదుకదా ? అట్లు పరబ్రహ్మమును దర్శించిన మహాత్ముని పుణ్యపాపములు అంటవుకదా ?

వ॥ అదియునుంగాక ॥ 202

తా. సులభము.

చ॥ అనలుడు సర్వవస్తువుల నాహుతిజేసిన దాన నేమియుఁ ।
ఘనతకు దక్కువయ్యె నదిగాకను సూర్యునికాంతి యంతటఁ ।
బెనఁగొని యున్న సూర్యునకుఁ బ్రేమదలిర్ప కళంకమున్నదా ।
యనువున నాత్మఁగన్న ఘనుకెన్నివిధంబుల దోషమంటునే ॥203

తా. ఓ పార్వతీ ! వినుము. అగ్నిదేవుఁడు సమస్తపదార్థములను దహించుచున్నాఁడు. అందువలన నా యగ్నిదేవునకు ఏవిధమునను తక్కువ లేదుకదా ? మఱియు సూర్యుఁడు సర్వత్ర వెలుఁగుచున్నాఁడు. అందువలన నతనికి ఏదైనను కళంకముకలదా ? ఆప్రకారమే ఆత్మనుగన్న మహాత్మునకు ఏవిధముచేతను దోషమంటదుకదా.

క॥ తనువుండగ నేదోషము ।
లనయము నంటవని యెట్టులంటి వనుచు నీ ।
మనసున సంశయమందకు ।
వినిపించెద సాదృశంబు వినుము శుభాంగీ ॥ 204

తా. ఓ పార్వతీ ! శరీరముండునపుడు ఏదోషమును అంటవని నీవు సంశయమొందకుము. ఈ విషయమును బోధించు సాదృశ్యము నెఱింగించెదను వినుము.

క॥ చేలంబగ్నినిఁ గాలియు ।
జేలముగా నున్నభంగి చిద్రూపునిఁ దా ।
నాలోకించు మహాత్మున ।
కేలీలనుగాని వికృతియే లేదు శివా ॥ 205

తా. ఓ పార్వతీ ! వినుము. వస్త్రము నిప్పునందు కాలి నప్పటికిని వస్త్రమువలెనే కనఁబడునట్లు, చిదాత్ముని దర్శించు యోగికి, ఏవిధముచేతను వికారములు సంభవింపవు.

తే॥ తరుణి వ్రాసిన తాళపత్రంబు నగ్ని ।
చేతఁ గాలియు పత్రంబురీతినుండు ।
నట్లు పరమాత్మఁగన్న మహాత్మ ఘటము ।
నుండి దోషము లంటదో యువిద వినవే ॥ 206

తా. ఓ పార్వతీ ! వినుము. అగ్నిచే కాలినట్టి తాటియాకు ఎట్లుదానిపూర్వరీతిగానే గనఁబడునో అట్లు, పరమాత్మునిఁ గన్న మహాత్ముని శరీరమునం దేవిధమైనదోషములును అంటవు.

క॥ ఇది యమనస్కవిధానము ।
మదివదలక యెప్పుడిట్టిమార్గమునకునె నీ ।
హృదయమును గుదురుపఱచిన ।
సుదతీ పరమాత్మపదము చొప్పుగఁ గల్గుఁ ॥ 207

తా. ఓ పార్వతీ ! వినుము. ఇదివఱకుఁ జెప్పిన విషయములు అమనస్కయోగమని యెఱుంగుము. ఈ విషయమును నీ మనస్సునందు ఎప్పుడును స్థిరముచేసియుండుము. ఇట్లుండినయెడల నీకు పరబ్రహ్మస్థానము తప్పక కల్గును.

క॥ ఈరీతి నీకుఁదెల్పిన ।
తారక సాంఖ్యామనస్క తత్త్వవిచారం ।
బౌ రాజ యోగపదవికి ।
జేరికగాఁ దలఁచి ముక్తిఁ జేరుభవానీ ॥ 208

తా. ఓ పార్వతీ ! వినుము. ఈప్రకారముగా నీకు నే నెఱింగించినట్టితారకయోగము, సాంఖ్యయోగము, అమనస్కయోగము అను నీ మూఁడుయోగములయొక్క తత్త్వవిచారణచేత రాజయోగము కలుగును. అనఁగా ఈ మూఁడుయోగములును, రాజయోగపదవికి సమీప మని యెఱుంగుము. వీనివలన మోక్షము సిద్ధించును.

క॥ అని శివుడు పార్వతికిఁ దెలి।
పినయట్టులు సూతమౌని ప్రేముడిచెప్పఁగ।
విని సంతోషముతోడను।
ఘనుఁడగు శౌనకుఁడు నవలి కథ నడుగుటయుఁగ॥ 209

తా. అని యిట్లు పరమశివుఁడు పార్వతి కెఱింగించినట్లు, సూతమహామునీంద్రుండు శౌనకునకుఁ జెప్పఁగా, నతఁడు తర్వాత కథను జెప్పుమని సూతమునీంద్రుని యడిగెను.

క॥ శ్రుతిమూల తత్త్వనిశ్చిత।
యతిశయయోగానుసార మవ్యయపద స।
ద్వ్రితనిష్ఠా పరతంత్రా।
శ్రితపాలకధుర్య రామ శ్రీబ్రహ్మేంద్రా॥ 210

మాలినీవృత్తము॥ సుజనహృదయవాసా సుస్థిరాత్మా విలాసా।
విజనపదనివేశా వేదవిద్యాప్రకాశా।
సుజనగుణవిహారా సుస్థిరానందసారా।
భజత వినుతయోగా భక్తపాలానురాగా॥ 211

గద్య॥ ఇది శ్రీరామబ్రహ్మేంద్ర గురువర ప్రసాదలబ్ధ కవితావిలాస నారపామాత్య ప్రణీతంబైన శ్రీగురుగీతా సారంబునందు బంచీకరణ ప్రశంసయు, చంచలతత్త్వ ప్రకారంబును, అష్టతనువుల నిర్ణయంబును, సాంఖ్యభావ ప్రకారంబును, తారకప్రభావంబును, ఆత్మానాత్మ వివరణమును, మాయాస్థాన నిరూపణమును, అమనస్క విచారంబును నన్నది.

ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.



ఓం తత్సత్.



శ్రీ ర స్తు.

శ్రీరామబ్రహ్మ గురవే నమః.

# గు రు గీ తా సా ర ము.

## తృ తీ యా శ్వా స ము.

## ఆంధ్రతాత్పర్యవిశేషార్థసహితము.



క॥ శ్రీరాజయోగవిద్యా వి।
చార మహోదార భక్తజన సేవిత చి।
త్సారార్థామల సత్క్రియ।
పారీణాఖండ రామ బ్రహ్మేంద్రవరా॥ 1

గీ॥ అవధరింపుము సకలతత్త్వార్థవేత్త।
యైన శంభుఁడు నగజాత కమరఁబల్కె।
నట్లు సూతుండు శౌనకా ద్యఖిలమునుల।
కెల్ల శబలైక్యవిధము రంజిల్లఁ బల్కె॥ 2

తా. గ్రంథకర్త రామ బ్రహ్మేంద్రయోగీంద్రుని అవధరింపుమని ప్రార్థించుచున్నాఁడు.

సమస్త విషయములనెఱింగిన పరమశివుఁడు పార్వతీదేవినిం జూచి యిట్లనియె. అట్లు సూతమునీంద్రుండు శౌనకాది మునీంద్రులకు శబలైక్య విషయమును బోధించెను.

వి. శబళ బ్రహ్మవిషయమును, 136-వ పుటయందుఁజూడుము.

## —శబలైక్య నిర్ణయము.—

క॥ ఉదకమున సూర్యబింబం।
బుదయంబై సలిలచలన మొందినరీతిన్।
జిదచిత్స్వరూపకారణ।
సదమలబ్రహ్మం బవిద్య చలనంబొందెన్॥ 3

తా. ఓ పార్వతీ! వినుము. జలమునందు సూర్యబింబము ఉదయమై చలనమొందినట్లు చిత్తునకును అచిత్తునకును కారణమైన నిర్మలపరబ్రహ్మము అవిద్యచేత చలనము నొందెను.

వి. శ్లో॥ "సత్త్వశుద్ధ్యవిశుద్ధాభ్యాం మాయాఽవిద్యేచ తేమతే।
మాయాబింబో వశీకృత్య తాం స్యాత్సర్వజ్ఞఈశ్వరః"॥

తా. శుద్ధసత్త్వముచేత మాయయనియును, మలినసత్త్వముచేత అవిద్యయనియును, ప్రకృతి రెండువిధములగును. మాయయందు ప్రతిఫలించిన చిదాత్ముఁడు ఆమాయను స్వాధీనము చేసికొని, సర్వజ్ఞత్వాది గుణములు గల ఈశ్వరుఁ డనఁబడుచున్నాఁడు.

శ్లో॥ "మాహేశ్వరీతు మాయా యా తస్యా నిర్మాణశక్తివత్।
విద్యతే మోహశక్తిశ్చ తం జీవ మోహయత్యం సా"॥

తా. ఈశ్వర సంబంధినియగు మోహశక్తి, ఆమాయను ప్రపంచ నిర్మాణశక్తి కలిగియున్నట్లు మోహనసామర్థ్యము కలిగియున్నది. ఈమోహనశక్తియే జీవుని మోహింపఁ జేయుచున్నది.

ఇట్లు పంచదశియందుఁ జెప్పఁబడి యున్నది.

ఈ విషయమును భగవద్గీత 7-వ అ. 14-వ శ్లో. చూచినచో స్పష్టముగా బోధమగును.

తే॥ విమలమైనట్టిబ్రహ్మం బవిద్యయందు।
నలర బ్రతిబింబరూప సంకలితుఁడగుచు।
లింగదేహాన బింబించి లెస్స జీవ।
కార్యములయందు వివశుఁడై కానంబడియె॥ 4

తా. ఓ పార్వతీ! వినుము. నిర్మలమైన పరబ్రహ్మము అవిద్యతోఁజేరి లింగదేహమునందు ప్రతిబింబించి జీవకృత్యములయందు

ప్రవేశించి యున్నాఁడు. అనఁగా ప్రపంచముతోఁ జేరి వృత్తులను కావించుచున్నాఁడని భావము.

వి. భావము లింగశరీరవిషయము 81-వ పుటయందుఁ గనఁదగును.

క॥ అంబిక కార్యోపాధి ర।
యంబని శ్రుతులందుఁజాటు టరసియు మాయా।
డంబర దేహమునందు వి।
జృంభింపుచు జననమరణ సిద్ధిఁ జెలంగున్॥ 5

తా. ఓ పార్వతీ! వినుము. కార్యోపాధివలన జీవుఁడు ప్రకృతికార్యముల నాచరించుచున్నాఁడు. ఇట్లు శ్రుతులందుఁ జెప్పఁబడియున్నది ఇట్లు చెప్పఁబడియుండియు జీవులీరహస్యము నెఱుంగక ప్రకృతివశులై జననమరణములను బొందుచున్నారు.

వి. శ్లో॥ "కార్యోపాధి రయంజీవః కారణోపాధిరీశ్వరః"॥

అని శ్రుతియందుఁ జెప్పఁబడియున్నది అనఁగా పరమాత్మ కారణోపాధిచేత ఈశ్వరుఁడనియును, కార్యోపాధిచేత జీవుఁడని యును పేర్కొనఁబడు చున్నాఁడు.

క॥ నీరంబు లోని జలగయుఁ।
బారాడుచు నన్యతృణము పట్టకమును పా।
ధారమగు తృణమువిడిచిన।
తీరున దేహముల దేహి తీవ్రత విడుచున్॥ 6

తా. ఓ పార్వతీ! వినుము. జలములోనుండు జలగ జలమునందు సంచరించుచు తృణమును పట్టుకొనును. అది పట్టుటకు మునుపు వేఱొకతృణమును పట్టుకొని మొదటిపట్టును వదలును. అట్లే దేహియైనవాఁడు వేఱొక దేహము నాశ్రయించిన తర్వాత మొదటి దేహమును విడుచును.

సీ॥ కమలాక్షి సుఖదుఃఖ కారణమైనట్టి
తనువెత్తి మృత్యువు దాఁటలేక।
యలమటనొంది శతాంశంబులకునైన
కర్మానుభవములఁ గడచి మీఁదఁ।

జచ్చి వేటొకచోట జనియించి యాకాయ
మును వీడి యన్యాంగమునను బుట్టి।
ప్రకట జీవుఁడట్టి పద్ధతిసూక్ష్మ
మహోపాధి యందుండి యొనర జాగ్ర ॥

తే॥ మందునను బాహ్యవిషయంబు లనుభవించి।
యవల రెంటను గలిగిన యాస్త్రవిడిచి।
పూని కర్తృత్వభోక్తృత్వ ములను గుంది।
జ్ఞాన విరహితజీవుఁడై కానఁబడియె ॥ 7

తా. ఓ కమలనేత్రివగు పార్వతీ! వినుము. సుఖదుఃఖములకు కారణమైనట్టి శరీరమెత్తి మృత్యువును దాఁటలేక అలమటనొంది అనేకవిధములగు జన్మంబులెత్తి కర్మానుభవములు తీరిన తర్వాత మృతినొంది జన్మములు నివృత్తియైన మీఁద వేటొకశరీరమునఁ బుట్టును. ఇట్లు జీవుఁడు సూక్ష్మమహోపాధినొంది జాగ్రదవస్థ యందు బాహ్యవిషయంబు లనుభవించును. తర్వాత జీవుఁడు జనన మరణములనెడి ద్వివిధావస్థలయందును గల ఆశనువదలి, కర్తృత్వ భోక్తృత్వములయందు మగ్నుఁడై జ్ఞానములేనివాఁడై కనం బడియెను.

ఉ॥ వారిజనేత్రి సూక్ష్మతనువందును మానస మూహ జేసియుఁ।
గారణదేహమందు క్షణకాలము సుప్తిని జెందియుండ నా।
ధారుఁడు నైనజీవుఁడు ముదంబునఁ దుర్యమునందుఁబొంది దు।
ర్వారపు లింగదేహమున వచ్చుచుఁ బోవుచు నుండు నేర్పునన్ ॥

తా. ఓ తామరనేత్రివగు పార్వతీ! వినుము. జీవుఁడుసూక్ష్మ శరీరమునందు మనస్సును ఊహచేయును. కారణశరీరమునందు క్షణముసేపు నిద్రపోవును. ఈ సుప్తి సమయమునందు జీవుఁడు తుర్యావస్థను బొందియుండును. అపుడు జీవుఁడు లింగదేహము నాశ్రయించి వచ్చుచుఁ బోవుచు నుండును.

తే॥ స్థూల దేహాభిమానియై సూక్ష్మతనువుఁ।
జొచ్చి కలలను జెందియు సొరిదిసుప్తి।

వశతఁ దుర్యుఁడునయ్యుఁ బూర్వాను సరణుఁ।
డగుచు స్థూలాభిమానియై తగులుపడును ॥ 9

తా. ఓ పార్వతీ! వినుము. జీవుఁడు మొదటస్థూలదేహాభిమానియై యుండును. పిదప సూక్ష్మశరీరమును ధరించును తర్వాత కలలనొంది సుషుప్తి వశముచేత తుర్యావస్థను బొందును. మరల ఎప్పటివలె స్థూలశరీరమునొందును.

వి. ఈ విషయమును 81-టవ పుటయందుఁ జూచినచో విశదమగును.

క॥ ఒకవేళనైన జీవున।
కొకచోటను నిలువఁబడని యూహలచేతన్।
వికలత నొందున్గావున।
శుకవాణిరో జన్మములను సొరది జనించున్ ॥ 10

తా. ఓ పార్వతీ! వినుము. జీవుఁడు నిరంతరమును సంచరించుచుండునుగాని, ఒకవేళనున్నట్లు మఱొకవేళయుండఁడు. పలుతెఱంగుల సంచరించుచుండును గావున, అపుడపుడు జన్మముల నెత్తుచు నుండును.

క॥ అమరంబై వాసోయని।
విమలముగా గీతలందు వినఁబడుగానన్।
గ్రమమొప్ప జీవునకు నీ।
క్రమమునఁ దనుప్రళయమందుఁ గనఁబడుఁగౌరి॥ 11

తా. ఓ పార్వతీ! వినుము. భగవద్గీతలయందు "వాసాంసి జీర్ణాని యథావిహాయ" అని చెప్పఁబడియున్నది. కావున జీవునకు ఈయభిప్రాయముచొప్పున ప్రళయకాలమునందుఁ గానంబడును. అనఁగా ప్రళయము సంప్రాప్తమగునంతవఱకును జీవుఁడు పుట్టుచు గిట్టుచు నుండునని యెఱుంగవలయును.

వి. ఈవిషయమును భగవద్గీత రెండవఅధ్యాయము 22-వ శ్లోకమునందుఁ జూచి తెలిసికొనఁదగినది.

సీ॥ వినుమదె జన్మకారణమైన సూక్ష్మ
దేహోపాధి జీవుని నొనరబట్టి।

సంగ్రహించుచు పోయి సరవితో మునుపూర్వ
వాసన కనుకూలవర్తియైన।
తనువునఁ జేర్చినందునఁ బ్రీతిఁ జరియించి
కడపట స్థూలంబు విడిచిపోవు।
నెట్లన్న నావిధమెఱిఁగింతు విను పువ్వు
లోపలిగంధంబుఁ బోలు వాయు॥

తే॥ వశమువలనను గ్రహియించి వట్టిపువ్వుఁ।
బాఱవైచినతీఱునఁ బ్రకటమయిన।
స్థూలదేహంబుఁబాయును జుమి యిదంత।
ఘటమునకుఁగాని జీవికిఁ గలుగదార్య॥ 12

తా. ఓ పార్వతీ! జన్మమునకు కారణమైనట్టి సూక్ష్మదేహోపాధి జీవుని ఆశ్రయించి పూర్వజన్మవాసన కనుకూలమైన శరీరమును కలుగఁజేసి నందున దానియందుఁ (దేహమునందు) ప్రీతి జనించి కడపట స్థూలశరీరమును విడిచిపోవును. ఎట్లనఁగా, చెప్పెదను వినుము. పుష్పమునందలి పరిమళమును వాయువు తన (వాయువు)వశమువలనగ్రహించి, పిదప నాపుష్పమును పాఱవైచిన రీతిగా స్థూలదేహము నివర్తియగును. ఇది శరీరమునకేగాని జీవునికి గాదని యెఱుంగుము.

క॥ చావులు తనువుకుఁగలుగును।
జీవునికెప్పటికిఁజావు జెప్పఁగఁరాదే।
యోవనిత జీర్ణవస్త్రముఁ।
బోవిడిచి నవీనవస్త్రముఁ గట్టుగతిన్॥ 13

తా. ఓ పార్వతీ! వినుము. మరణము శరీరమునకేగాని, ఎప్పటికిని జీవునకు (మృత్యువు) కలుగదు. ఎట్లన, జీర్ణవస్త్రమును విడిచిపెట్టి నూతనవస్త్రమును గ్రహించునట్లు, జీవుఁడు పూర్వశరీరమును విడిచిపెట్టి నూతనశరీరము నెత్తును.

వి. ఈ విషయము భగవద్గీత రెండవయధ్యాయమునందు **20**-వ శ్లోకముమొదలు **30**-వ శ్లోకమువఱకుఁ జూచి తెలిసికొనునది.

తే॥ వనిత వాసాంసిజీర్ణాని యనుచు గీత ।
లందుఁ బల్కుటనెఱుఁగు రాకేందువదన ।
మాటిమాటికిఁ దనువుకే మరలి మరలి ।
పుట్టువులుగాని జీవికిఁ బుట్టువేది॥ 14

తా. ఓ చంద్రముఖివగు పార్వతీ! వినుము. భగవద్గీతలందు "వాసాంసి జీర్ణాని యథావిహాయ" అనునట్లు, జీవునకు మాటి మాటికి పుట్టువులు గలుగుచుండునుగాని, ఆత్మకుఁ గలుగవని యెఱుంగుము.

క॥ పొసఁగిన రాకల పోకల ।
విసువక జీవుండుతిరుగు విధమెఱిఁగిభువిన్ ।
రసికులు శబలైక్యంబని ।
ప్రసరింతురు తత్త్వరీతి బాగుగఁ దెలియన్॥ 15

తా. ఓ పార్వతీ! వినుము. భూమియందు జీవుఁడు పుట్టుచు గిట్టుచు నుండుటను దెలిసికొన్న, రసికులైనవారు, ఆ తత్త్వలక్షణ మును బాగుగా నితరులును దెలిసికొనుటకొఱకు శబలైక్యంబని చాటుచుందురు.

తే॥ ఇదియు ముక్తిగాదు ఈభావమెఱిఁగియు ।
మరలి మరలి పుట్టుమాయ బాపు ।
గురువరేణ్యుసేవ కొమరొప్పఁగాఁజేయ ।
జన్మ, దుఃఖమెల్ల సమసిపోవు॥ 16

తా. ఓ పార్వతీ! వినుము. శబలైక్యము నెఱింగినప్పటికిని మోక్షము కలుగదు. దీనివలనను జననమరణములు కలుగుచు నుండును. అయినను గురుసేవ చేసినయెడల మాటిమాటికి జనన మరణములను కలుఁగజేయుమాయనెడి జన్మదుఃఖమంతయు నివర్తి యగును. పోఁగొట్టును.

వి. శ్లో॥ "హిత్వాద్వౌ శబలౌవాచ్యౌ వాక్యం వాక్యార్థబోధనే।
యథా ప్రవర్తతేఽస్మాభిస్తథా వ్యాఖ్యాతమాదరాత్॥"

తా. శబలమైన (ఉపాధులతోఁ గూడిన) వాచ్యములు రెంటిని విడిచి, వాక్యము వాక్యార్థమును తెలియఁజేయుటయందు

ఎట్లు ప్రవర్తించుచున్నదో, అట్లు నాచేత ఆదరముతో వాఖ్యానము చేయఁబడినది.

శబలమనఁగా — మాయతోఁగూడిన ఈశ్వరుఁడును, అవిద్యతోఁగూడిన జీవుఁడును అను నీ రెండును వాచ్యములగును. ఈ రెంటిని విడువవలయునని భావము. ఈవిషయమును వాక్యవృత్తియందు, శ్రీ శంకరాచార్యులు వ్రాసియున్నారు.

ఈ గ్రంథమునందు 2-వ ఆశ్వాసము 49-వ పద్య విశేషార్థమును జూచిన బోధమగును.

చ॥ అని హరుఁడాడు వాక్యముల కప్పుడు విస్మయ మంది యిట్లుమీ
రొనరఁగ జన్మహేతువుల నొందని మార్గ మెఱుంగు మంచు।
బల్కిన, బహువింతయయ్యె సురకిన్నర సాధ్య పిశాచయక్షులే।
యనువున సంచరించి తను వెత్తఁగలేకను చేయజాలిరే॥ 17

తా. ఇట్లు పరమేశ్వరుఁడు పార్వతీదేవికిఁ జెప్పఁగా, నామహాదేవి యాశ్చర్యమొంది పరమశివునింజూచి యిట్లనియె స్వామీ! మీరు గురుసేవవలన జననమరణములు కలుగవని వ్రాసిచ్చితిరి. ఇది మిక్కిలి వింతగానున్నది. దేవతలు, కిన్నరులు, సాధ్యులు, పిశాచులు, యక్షులు, ఏప్రకారమైన శరీరములను ధరించి సంచరించినప్పటికిని, జననమరణ రహితమైన శరీరమును ధరింపక పోయిరికదా.

వి. గురుసేవాక్రమము 21-వ పుటమొదలు 72-వ పుటదనుక చెప్పఁబడియున్నది.

క॥ తనువుండగనే గురువుఁ।
గనిమోక్షము నొందవచ్చు కడువడినుచుఁ।
అనిపల్కి మరలఁ దత్త్వము।
గనియును జన్మంబు లెత్తఁ గారణమేలా॥ 18

తా. ఓ పరమేశ్వరా! ఈ శరీరముండునప్పుడే గురువును దర్శించినయెడల మోక్షమును బొందవచ్చునని పల్కితిరి. ఆ ప్రకారముగానే గురువునుదర్శించి తత్త్వమును తెలిసికొన్నపిదపకూడ జన్మముల నెత్తుటకుఁ గారణమేమో తెలియఁజేయుము.

## లింగశరీరభంగము.

వ॥ అనిన భవానికి భవుం డిట్లనియె॥ 19

తా॥ సులభము.

చ॥ క్రమమున దత్త్వమార్గమును గట్టిగగన్నను జన్మహేతువుల్।
సమసియు బోవటంచు సువిచారులుపల్కుచు నుంద్రు గట్టిగా।
భ్రమలనుబాసి లింగతనుభంగము సేయను నేర్పులేక।
దుర్మమతలు చెందఁబుట్టుకలు మానవు పో నగరాజపుత్రికా॥

తా. ఓపార్వతీ! వినుము. క్రమముగా తత్త్వలక్షణమును తెలిసికొనినప్పటికిని, జననమరణాదులు నశింపవని వేదాంతను నెఱింగినవారు చెప్పుదురు. భ్రమలను నివర్తిచేసికొని లింగశరీరమును బోఁగొట్టుకొనుటకు చేతగాక, అహంకార మమకారములను జెందినయెడల జననమరణమును నివర్తి కానేరదు.

వి. భ్రమలలక్షణమును 60-వ పుటయందును, 138-వ పుటయందును గనందగును. లింగశరీరలక్షణమును 81-వ పుటయందును, 127-వ పుటయందును జూచి తెలిసికొనునది.

మ॥ తనరక్ జ్ఞానవిహీనకార్యములచే తన్నెప్పుడుక్ సూక్ష్మమా।
తనువందుక్ జరియించుజీవుని కసాధ్యంబైన యజ్ఞానవా।
సనచేఁ గారణబ్రహ్మమందు గలపక్ సంసారబద్ధుండు తా।
ననువొందన్న గునంచుఁ బ్రాజ్ఞులుమదిన్న శ్రాంత మూహింతురే॥

తా. ఓ పార్వతీ! వినుము. జీవుఁడు అజ్ఞానమై సూక్ష్మశరీరమునందు వసించునప్పుడు అజ్ఞానవాసనచే నిర్మలమైన పరబ్రహ్మమందు తన్ను జేర్చిన కారణముచేత, జీవుఁ డజ్ఞానమొంది సంసారబద్ధుఁ డగునని వివేకులు నిరంతరమును చెప్పుచుందురు.

వి. వాసనాత్రయ వివరణమును 103-వ పుటయందుఁ గనందగును.

క॥ శుద్ధ బ్రహ్మైక్యవిధం।
బిద్ధంబని తెల్పువాఁడ నేర్పడధరలో।
శుద్ధాత్మను సద్భక్తిని।
సిద్ధముగాఁ జెంది ముక్తిజేరు భవానీ॥ 22

తా. ఓ పార్వతీ! జీవేశ్వరైక్యమును ఇట్టిదని తెలియఁజేసెదను. నీవు నిర్మలమైన పరబ్రహ్మమును భక్తితో నెఱింగి మోక్షమును బొందుము.

క॥ నిర్మలుఁడగు చిద్రూపుని।
మర్మంబు ముహూర్తమాత్రకాలములో స।
ద్ధర్మముగఁ దెలియఁబడునని।
కర్మత్రయ రహితులంద్రు కంజదళాక్షీ॥ 23

తా. ఓ కమలనేత్రివగు పార్వతీ! వినుము, మలినరహితుఁడగు పరమాత్మయొక్క రహస్యమును ఒక్కముహూర్తము సేపులో నెఱుంగవచ్చునని, కర్మత్రయములను నివర్తిచేసినవారు చెప్పుదురు.

వి. కర్మత్రయమనఁగా—1. సంచితము, 2. ప్రారబ్ధము, 3. ఆగామి (క్రియమాణము) అని మూఁడువిధములు. ఈ మూఁడు కర్మములును వాసనానాశము చేసికొనినయెడల, ఈకర్మల ననుభవించుటకై మరల మరల పుట్టుచు గిట్టుచు నుండవలసినది లేదు. అయినను, జ్ఞానిమాత్రము ఈ కర్మము లంటవు.

1. సంచిత కర్మము.

శ్లో॥ "అహంబ్రహ్మేతి విజ్ఞానాత్ కల్పకోటి శతార్జితమ్।
సంచితం విలయం యాతి ప్రబోధాత్స్వప్నకర్మవత్॥"

తా. నేను బ్రహ్మమైతిననెడి దృఢాపరోక్షజ్ఞానము (శ్రవణ మనన నిదిధ్యాసన సమాధులచే జీవబ్రహ్మైక్య సాక్షాత్కారము) కలవానికి, శతకోటి కల్పకాలముచేసిన సంచితకర్మము నిద్రనుండి మేల్కాంచిన వానికి స్వప్నమందలి కర్మలు నశించునట్లు నశించును.

వి. సంచిత కర్మమనఁగా, జన్మాంతరములయం దనుభవింపఁబడక మిగిలియుండునది. ఇందలి కొంతభాగమే రాఁగల జన్మమునం దనుభవించునట్టి ప్రారబ్ధ మనఁబడును.

2. ప్రారబ్ధ కర్మము.

శ్లో॥ "అజరోఽస్మ్యమరోఽస్మీతి య ఆత్మానం ప్రపద్యతే।
తదాత్మనాతిష్ఠతోఽస్యకుతః ప్రారబ్ధకల్పనా॥"

తా. నేను వార్ధక్యము లేనివాఁడను, నేను మరణము లేని వాఁడను, అని యే బ్రహ్మజ్ఞానిపొందునో అట్టి బ్రహ్మవేత్తకు ప్రారబ్ధముయొక్క ఆరోపముకూడ సంభవింపదు. అనఁగా ప్రారబ్ధము బ్రహ్మవేత్తకు కలదని ఆరోపమునైన చేయకూడదని భావము.

వి. ప్రారబ్ధకర్మమనఁగా, పూర్వజన్మమునందు చేర్చియుంచిన సంచితకర్మమునుండి యనుభవింపఁబడునది. ఈ కర్మము నిశ్శేషముగా అనుభవింపఁబడక పోయినయెడల మిగిలిన సంచితముతోఁ జేరి మరల జన్మమును గలుగఁజేసి యనుభవింపఁజేయును. ప్రారబ్ధ నివృత్తి జ్ఞానులకుతప్ప తదితరులచే నివర్తిచేసికొనుటకు సాధ్యము కాదు.

3. ఆగామికర్మము.

శ్లో॥ స్వమసంగ ముదాసీనం పరిజ్ఞాయ నభోయథా।
నశ్లిష్యతే యతిఃకంచిత్ కదాచిద్భావికర్మభిః॥

తా. బ్రహ్మవేత్తయైన యతి తన్ను సర్వసంగ పరిత్యాగియైన బ్రహ్మమని తెలిసికొని ఆకాశమువలె స్వచ్ఛత్వముచేతను విభుత్వముచేతను అసంగత్వముచేతను బ్రహ్మమాత్రుండై యుండుటవలన యతికి ఆగామికర్మములు అంటవు.

వి. ఆగామి కర్మమనఁగా, వర్తమాన కాలంబునందుఁ జేయునట్టి కర్మములలో మిగిలియుండునది. ఇదే రాఁగలజన్మమున అనుభవింపఁబడునట్టి సంచితముతోఁ జేరునది.

సర్వదోషనాశము.

శ్లో॥ జ్ఞానిన స్సర్వపాపాని జీర్యతే నాత్రసంశయః।
క్రీడన్నపి నలిప్యేత పాపై ర్నానావిధైరపి॥

తా. జ్ఞానికి సకలపాపములును నశించుచున్నవి. సంశయము లేదు. వానికి పలువిధములైన పాపము లున్నను, వాఁడు విషయలోలుఁడై యున్నను, ఆ పాపములు వాని ననుసరించుటలేదు.

సీ॥ కరమొప్పఁ గా నాత్మ గన్నమీఁదట
ముక్తి కరతలామలకంబు సరణి నుండు।

సకల సంశయములు చను మఱి బలువైన
యజ్ఞాన పటదీప్తి యడఁగిపోను।
భావంబు ముకురంబుభాతిని చెన్నొందుఁ
గైవల్యసంధానుఁ డగును మఱియు।
నలర నవిద్యతోఁ గలిసి వర్తించెడు
లింగదేహ గుణాల భంగపఱచు॥

తే॥ నపుడు జీవుఁడు చిన్మయానందపదవిఁ।
బొంది బ్రహ్మంబు తానయై పూర్ణుఁడగుచు।
వెల్గు నావిధమంతయు విశదముగను।
తేటపఱచెద విను గౌరి వాటముగను॥ 24

తా. ఓ పార్వతీ! బాగుగా పరతత్త్వమును దెలిసికొన్న తర్వాత మోక్షము కరతలామలకంబై యుండును. అనఁగా అఱచేతి యుసిరికకాయవలె నుండును. సమస్తమైన సంశయములును నివర్తియగును అదియునుగాక గాఢమైన అజ్ఞానములన్నియు నశించును. మనస్సు అద్దముఁవలె పరిశుద్ధమగును. మోక్షము నొందుట యందు ప్రవర్తకుఁడగును. అవిద్యాసంబంధమువలనఁ గలిగినట్టి లింగశరీర గుణములనన్నిటిని పోఁగొట్టును. ఇట్లు జీవుఁడును జ్ఞానియైనతర్వాత ముక్తిపదమును బొంది పరబ్రహ్మము తానేయై తేజరిల్లును. నీకు ఆవిషయమంతయుఁ జక్కఁగాఁ దెలియఁజేసెదను వినుము.

వ॥ మఱియును॥ 25

తా. సులభము.

సీ॥ మాన మోహాదుల మమతలఁ జెందక
సుఖదుఃఖముల హృదిఁ జొరగ నీక।
నిందాస్తుతులయందు నెఱిచలియింపక
గురుసేవయందు సంకోచపడక।
షడ్వర్గ భ్రాంతుల జాడలఁదిరుగక
శాంతుఁడై కౌటిల్య సరణిఁబోక।

జీవహింసలయందు భావంబు జొనుపక
తనువునిత్యంబను తలఁపులేక॥

తే॥ పగలు రేయును దన నేత్రపద్మమందు।
నున్న చిద్రూపుఁ గనుఁగొంచు నున్నవాని।
కపుడు లింగాంగభంగంబు నయ్యె ననుచు।
బలుకుచుందురు రాత్మజ్ఞు లలఘుగతుల॥ 26

తా. ఓ పార్వతీ! వినుము. మానమునందును, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడి అరిషడ్వర్గముల యందును, మమకారమునొందకయు; సుఖదుఃఖములలో మనస్సు నుంపకయు; నిందయందు దుఃఖమును, స్తుతియందు సంతోషమును జెందకయు; గురుసేవసేయుటయందు సిగ్గులేకయు; షడ్విధములను భ్రమలను బొందకయు; శాంతుఁడును, మోసములేనివాఁడును, జీవహింసచేయుటయందు మనస్సు నుంపనివాఁడును, శరీరమును శాశ్వతమని తలంపనివాఁడును, పగటియందుఁగాని రాత్రియందుఁ గాని (నిరంతరమును) తన నేత్రకమలమునందుండు పరమాత్మను దర్శించుచు నుండునట్టివానికి ఆ సమయమున లింగశరీరము నివర్తి యగునని పరమాత్మ నెఱింగిన మహాత్ములు పలుతెఱంగులుగాఁ జెప్పుచుందురని తెలిసికొనుము.

వి. కామక్రోధాదులను గూర్చి 43-వ పుటయందును, షడ్విధభ్రమలను గూర్చి 138-వ పుటయందును, తక్కినసుఖదుః ఖాది ద్వంద్వములందు సమభావముగలిగి యుండవలయు ననెడి విషయములను భగవద్గీతయందు రెండవదగు సాంఖ్యయోగము నందు 38-వ శ్లోకమునందును, పండ్రెండవదగు భక్తియోగము నందు 18, 19-వ శ్లోకములందును జూచి తెలిసికొనవలయును.

క॥ అరిమిత్రుల నొకతీరుగ।
నరయుచు సరసంబు విరసమగు నన్నంబుల్।
సరిగా భుజింపఁగలిగిన।
పురుషుఁడు లింగాంగ భంగమొందును గిరిజా॥ 27

తా. ఓ పార్వతీ! వినుము. శత్రులను మిత్రులను సమానముగాఁ జూచువాఁడును, రుచిగల అన్నమును రుచిలేని అన్నమును సమానముగా నెంచి భుజించువాఁడును, లింగశరీరమును త్యజించును. అనఁగా మోక్షమునొందును.

వి. భగవద్గీత 6-వ యధ్యాయము 9-వ శ్లోకమునందును 14-వ అధ్యాయము 24-వ శ్లోకమునందును, చూడవలయును.

తే॥ నిత్యసంతోష మగునాత్మ నిత్యమనుచు ।
దెలిసి తత్సాక్షిఁ గనుగంటఁ దేజరిల్లుఁ ।
నాత్మ తాననితలఁచు మహాత్ముఁ డెపుడు ।
ద్వంద్వములుమాని సంతతానంద మొందు॥  28

తా. ఓ పార్వతీ! వినుము. నిరంతరము సంతోషముతో నుండు పరమాత్మను శాశ్వతమని యెంచి, ఆ పరబ్రహ్మము నేత్రమునం దున్నదనియు, అదియే తాననియును తలంచునట్టి మహాత్ముఁడు, సుఖదుఃఖాది ద్వంద్వములు మాని ఎల్లప్పుడును ఆనందము నొందును.

తే॥ తనరఁ గోర్కులు మాని నిర్ద్వంద్వుఁడయ్యె ।
ఫలముగోరని ప్రజ్ఞప్తి భావునకును ।
భోగములువచ్చి తనుదాన పొందెనేని ।
యదియు తనయంతఁ దొలఁగు నో యంబుజాక్షి ॥  29

తా. ఓ పార్వతీ! వినుము. సమస్తమైన అపేక్షలను మాని, ద్వంద్వములను వర్జించి, తా నొనర్చు కర్మములకు ఫలమును గోరనివాఁడై యుండువానికి తనంతట భోగములు కలిగినప్పటికిని, అదియు తనంతనే తొలఁగిపోవును. (అనఁగా కర్మములను మాత్రముచేయుచుండవలయునని యభిప్రాయము.)

వి. శ్లో॥ కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన ।
మాకర్మ ఫలహేతుర్భూ ర్మాతే సఙ్గో స్త్వకర్మణి ॥

తా. నిత్యనైమిత్తికములగు సకల కర్మములనుఅవశ్యముగా చేయవలయును. అయినను, ఆ కర్మముల ఫలములందు మాత్రము

అపేక్ష నుంపరాదు. ఇట్లు భగవద్గీత సాంఖ్యయోగము 47-వ శ్లోకమునందుఁ జెప్పఁబడియున్నది.

కll జగమెల్ల మాయయనుచును ।
దిగులొందక దేనియందు దైవవశముచే ।
నగుదానికి భయపడకను ।
నగణిత పరమాత్ముఁజూడు మబ్జదళాక్షీ ॥ 30

తా. ఓ పార్వతీ! వినుము. ఈప్రపంచమంతయు మాయగా నున్నదనియును, మాయ చేయురీతిగా వర్తించు చున్నాఁడనియును, అనఁగా నెట్లుచేసినను చేయవచ్చుననియును తలంపక, దైవవశముగా సంప్రాప్తించినదానికి భీతినొందక, లెక్కింప నలవికానట్టి పరమాత్మను దర్శింపవలయును.

తేll మనసు సుఖదుఃఖములయందు మఱగియుండు ।
నైన నద్దపుమలినంబు నమరఁబాపఁ ।
దెల్లముగఁ దోమినంతనే తేజమొందు ।
తద్విధంబుగ బ్రహ్మమై తానె వెల్గు ॥ 31

తా. ఓ పార్వతీ! వినుము. మనస్సు ఎల్లప్పుడును ద్వంద్వములైన సుఖదుఃఖములందు అలవాటు పడియుండును. అయినప్పటికిని, అద్దములోని మురికిని పోఁగొట్టుటకు దానిని తెల్లగాతోమిన యెడల, ఏ ప్రకారము ప్రకాశమునొందునో. ఆ విధముగా పరిశుభ్రము చేసినయెడల జీవుని అజ్ఞానమంతయు తొలఁగి బ్రహ్మము తానేయై తేజరిల్లును.

కll మాసిన గుడ్డకు సబ్బును ।
బూసియు నుదుకంగ దాని పూర్వపుమలినం ।
బోసరిలి పాయునటువలె ।
దోసములనుబాసి యాత్మ దృక్కై వెలుఁగున్ ॥ 32

తా. ఓ పార్వతీ! వినుము. మలినమైన వస్త్రమునకు సబ్బునుపూసి ఉతికినయెడల దాని మునుపటి మైలనివర్తియగునట్లు. మనస్సునందలి దోషములన్నియు నివర్తియై పరమాత్మదర్శనము కలుగును. అనఁగా దృగ్బ్రహ్మము గోచరమగునని భావము.

చ॥ వనజదళాక్షి నీరమున వర్ధిలుపంకము పోవునందుకున్।
ఘనమగుచిల్లగింజలను గంధము తీసియు నీటఁగల్పినం।
తన నుదకంబు నిర్మలతఁ దార్కొని దోఁచినపూడ్కి నాత్మునిన్
గనిన పురాకృతంబయిన కల్మషమెల్లఁ దొలంగు శాంభవీ ॥ 33

తా. ఓ కమలనేత్రివగు పార్వతీ ! వినుము. అడుసుతో జేరిన జలమందుండునట్టి అడుసును పోఁగొట్టుటకు చిల్లగింజను గంధము తీసి యా జలములోఁ జేర్చినయెడల, జలమునందలి మలినంబంతయు పోయి నిర్మలంబగును. ఆప్రకారమే పరబ్రహ్మమును దర్శించినవారికి సకల పాపములును నివర్తియగును.

ఆ॥ అట్టియాత్మఁగన్న నజ్ఞానవాసన।
యనెడి ముఱికివాయు నంతమీఁద।
మనసు స్వచ్ఛమగును ఘనశుద్ధస్ఫటికంబు।
వలెను వెల్గుచుండు వనరుహాక్షి ॥ 34

తా. ఓ పార్వతీ ! వినుము. ఆ పరబ్రహ్మమును దర్శించిన వారికి సమస్తమైన మలిన వాసనలన్నియు నివర్తియగును. అనంతరము మనస్సు శుద్ధ స్ఫటికమువలె పరిశుభ్రమై ప్రకాశించుచుండును.

మ॥ పరిశుద్ధాత్మను గాంచి దుఃఖసుఖము ల్భావంబులోఁ జేర్పకన్।
స్థిరుఁడై నిత్య సమాధినుండుటదియే చిద్రూపుఁగన్నట్టి స।
త్పురుషు ల్లింగతనూవిభంగమనుచున్ బుద్ధిన్విచారింత్రు త।
త్సరణిన్ వర్తిలువాని కెయ్యెడ నసాధ్యంబున్నదే శైలజా॥ 35

తా. ఓ పార్వతీ ! వినుము. నిర్మలంబైన పరమాత్మను దర్శించి, సుఖదుఃఖములు మొదలుగాఁగల ద్వంద్వములను మనస్సునందుఁ జేర్పక, నిశ్చలచిత్తుఁడై, నిత్యసమాధియందుండుటయే లింగశరీరభంగమని పరమాత్మను దర్శించినట్టి సత్పురుషులు తెలియుదురు. ఇట్లు లింగశరీరభంగమును కావించుకొన్నవారికి ఎచ్చోటను అసాధ్యమైన కార్యము లేదని యెఱుంగుము.

గీ॥ అట్టినిర్మలచిద్రూపుఁ డవనిలోన।
నన్నియును పరమాత్మయే యంచుఁ గాంచి।

తలఁపు నాత్మునియందును నిలుపునతఁడు ।
పలు తెఱంగుల మేలొంది పరము గనును ॥ 36

తా. ఓ పార్వతీ! వినుము. ఆ ప్రకారము పరమాత్మను దర్శించిన చిదానందుఁడు, భూమియందు దేనిని చూచినప్పటికిని సర్వమును బ్రహ్మంబేయని తెలిసికొనును. ఇట్లు తెలిసికొని మనస్సును పరమాత్మయందు నిలిపియున్నట్టివాఁడు సకలవిధములయందును మేలునుపొంది మోక్షము నొందును.

వి. ఈ విషయమునంతయు భగవద్గీత ఆఱవఅధ్యాయమగు ఆత్మసంయమయోగమునందుఁ జూచిన బోధమగును. అయినను, ముఖ్యముగా ఈయధ్యాయమునందు 9, 12, 14, 15, 29, 30, ఈ శ్లోకములను జూడఁదగును.

తే॥ తుర్యమైనట్టి విజ్ఞాన కార్యమందు ।
మనసునుంచిన యజ్ఞానమెల్లఁ దొలఁగు ।
బరగ నామనసే తుర్య పదవినొంది ।
నపుడు భ్రమలన్ని మానును నంబుజాక్షి ॥ 37

తా. ఓ పార్వతీ! వినుము. తుర్యంబైన విజ్ఞానకార్యమునందు మనస్సు నుంచినవానికి అజ్ఞానంబంతయుఁ దొలఁగిపోవును. మఱియును ఆమనస్సే తుర్యపదమును బొందును. అప్పుడు సకల భ్రమలును నివర్తియగును.

వి. తుర్యమునుగూర్చి ఈగ్రంథమున 145-వ పుటయందుఁ గనందగును.

క॥ కనువేళను వినువేళను ।
దనుసోఁకినవేళఁ బెదురు దగిలిన సమయం ।
బున దుర్యపదముఁజెందిన ।
ఘనునకు మదిఁ జంచలంబు కలుగదు గౌరీ ॥ 38

తా. ఓ పార్వతీ! వినుము. చూచునప్పుడును, వినునప్పుడును, తనయందు దావహించినప్పుడును భీతినొందినప్పుడును, తుర్యంబు నొందినట్టి మహాత్మునకు మనస్సునందు చంచలము కలుగదని యెఱుంగుము.

క॥ పలుకఁడు తలఁపడు మనసునఁ।
జలియింపఁడు లాభనష్ట సంజ్ఞలుపొందక।
గలఁగడు సర్వంబాత్మగఁ।
దెలియును భ్రమలందుఁబడఁడు ద్విజరాజముఖీ॥ 39

తా. ఓ చంద్రముఖివగు పార్వతీ! వినుము. ఎవ్వరితోను సంభాషింపఁడు, ఏ విషయమునుగూర్చియు మనస్సునందు ఆలోచింపఁడు, దేనికొఱకును చలనమునొందఁడు, లాభనష్టములు మొదలగు ద్వంద్వములకు చలియింపఁడు, భ్రమలందుఁబడఁడు, సర్వమును పరమాత్మయని యెఱుంగును

వి ఈ విషయమును భగవద్గీత 6-వ దగు ఆత్మసంయమ యోగమున 29, మొదలు, 32-వ శ్లో. వఱకుఁ జూచిన స్పష్టమగును.

సీ॥ వినుము కార్యోపాధి విరహితజీవుఁడు
విజ్ఞానమయమగు విమలబుద్ధి।
కలిగి యజ్ఞానమా కారణోపాధినిఁ
దగులక శుద్ధాత్మఁ దగిలి మనసు।
నిరుపమ నిర్గుణ నిర్మలమైనట్టి
పరమ శుద్ధాద్వైత బ్రహ్మమందు।
ఖేదంబులనుబాసి మోద మాత్మునిఁజేరు
మఱియును సహితవిస్మయ ప్రకాశ॥

తే॥ మైన పరిపూర్ణతేజుని మానసమున।
నన్యములుమాని సచ్చిదానందపదవిఁ।
బొంది యజ్ఞానవాసన జెందకెపుడు।
నిర్మలుఁడునయ్యు వెలుఁగొందు నీరజాక్షి॥ 40

తా. ఓకమలముఖివగు పార్వతీ! వినుము. కార్యోపాధిలేని జీవుఁడు విజ్ఞానమయంబైనట్టి నిర్మలబుద్ధిగలవాఁడై, అజ్ఞానంబైన కారణోపాధినొందక యతనిమనస్సు నిర్మలమగు పరబ్రహ్మమును జేరును. అపుడు సకలదుఃఖములును మానును. ఇట్లు జీవుఁడు సమస్త విచారములను వర్జించి పరమాత్మను స్మరించుచు సచ్చిదానందపద

మును బొందును. ఇవ్విధముగా అజ్ఞానవాసనల నొందనివాఁడై మహాతేజోవంతుఁడగు పరమాత్మ స్వరూపుఁడై ప్రకాశించును.

వి. విజ్ఞానమయవిషయమును 93, 96-వ పుటలయందును, వాసనలనుగూర్చి 104-వ పుటయందును జూడవలయును.

క॥ నదులన్ని సాగరంబునఁ।
బదపడి కలయంగ భేదభావంబెల్లన్ ।
వదలి యొకటైనమాడ్కిని।
విదితాత్మునిఁ గన్న కర్మరహితులుగారే॥

తా. ఓ పార్వతీ! వినుము. సకలనదులును సముద్రమునందు కలిసినతర్వాత భేదములన్నియుమాని, అనఁగా ఆయానదుల జలముయొక్క వర్ణములుమాని ఒకటేవిధముగాఁ గనఁబడునట్లు, పరమాత్మ దర్శనము కలిగినతర్వాత సకలకర్మములను మానినవారగుదురు.

పంచపాది గీ॥ కుండలోజలముండంగ కుదురుగాను।
నభముకన్పడు నాకుండ నలిగిపోవ।
నమలమైన ఘటాకాశ మదిమహత్త్వ।
మైన నభమునఁ గలసినయట్లు జీవుఁ।
డమలబ్రహ్మంబునం దైక్యమగుభవాని॥ 42

తా. ఓ పార్వతీ! వినుము. కుండయందు జలముండు నంతదాఁక ఆకాశము కనఁబడును. అపుడు అది ఘటాకాశమని పేరొందును. ఆకుండ పగిలిపోయినపుడు జలమంతయు నింకిపోవును. అపుడు ఆ ఘటాకాశము మహత్త్వమైన మహదాకాశముతోఁగలియును. ఆ ప్రకారమే జీవుఁడు బ్రహ్మముతోఁ గలిసినపుడు జీవుఁడను పేరుపోయి జననమరణములు లేని శుద్ధబ్రహ్మమగును.

వి: శ్లో॥ "యథాఘటేషు నష్టేషు ఘటాకాశో ననశ్యతి।
తథాదేహేషు నష్టేషు నైవ నశ్యామిసర్వగః॥"

తా. ఎట్లు కుండలు నష్టమైనపుడు ఘటాకాశము (ఆ కుండలలో కనఁబడుచున్న ఆకాశము. వాస్తవమైన ఆకాశముయొక్క ఆభాసమే గావున, కుండలు నశించునపుడు అందున్న ఆకాశము

ఘటాకాశ మనఁబడును.) నశించుట లేదో? అట్లు శరీరములు నశించి నపుడు సర్వత్ర నిండియుండు నేను (పరబ్రహ్మము) నశించుట లేదు.

ఇట్లు అద్వైతానుభూతియందుఁ జెప్పఁబడి యున్నది.

క॥ కప్పురము దీపమందున ।
నొప్పుగఁ గలయంగఁ దేజమొందెడురీతిన్ ।
ఎప్పుడు జీవుండాత్మునిఁ ।
జొప్పడఁగలయంగ దివ్యసుఖమున వెల్గున్ ॥ 43

తా. ఓ పార్వతీ! వినుము. కర్పూరము దివ్వెయందు కలిసి నప్పుడు ఏప్రకారము దానివలెనే కలిసి వెలుఁగునో, అట్లు జీవుఁడు పరమాత్మతోఁ జేరినప్పుడు, ఆ పరమాత్మవలె ప్రకాశించును.

తే॥ నేను బరిశుద్ధ బ్రహ్మ సంధానమెల్ల ।
ననువుగాఁ జెప్పి నాఁడ నీ వావిధముగ ।
నాత్మ మననముఁజేసి బ్రహ్మైక్యపదవిఁ ।
బొంది చిద్బ్రహ్మసాక్షిఁ జెన్నొందుదుర్గ ॥ 44

తా. ఓ పార్వతీ! వినుము. నేను నీకు శుద్ధబ్రహ్మైక్యవిధాన మంతయు దెలియఁజేసినాఁడను. నీవు ఈ చెప్పిన ప్రకారముగా పర బ్రహ్మమును చింతనముచేసి పరమాత్మైక్యపదవిని బొంది చిదాత్మవై తేజరిల్లుము.

తే॥ శబలజీవైక్య విధమెల్ల సరగఁదెలిసి లింగ ।
భంగం బొనర్పుము లీల నవలఁ ।
బ్రవిమలాత్మకు జీవత్వభ్రాంతి మరలఁ ।
దోఁచఁబడు భావమెఱిఁగింతు తోయజాక్షి ॥ 45

తా. ఓ పార్వతీ! నేను నీకుఁ జెప్పిన శబలబ్రహ్మ జీవైక్య క్రమము నెఱింగి లింగశరీరభంగమును జేయుము. ఇంకను ఆత్మకు మరల దోఁపఁబడు జీవభ్రాంతి లక్షణమును దెల్పెదను వినుము.

చ॥ అగణితమైన చిన్మయ మహార్ణిశముం గనుఁగొంచు నెందునున్ ।
దగులక నున్నవానిమది తప్పక జీవవికారభ్రాంతులున్ ।
దగులు నటంచు నెన్నుదురు ధన్యులు నీకిపు డావిధంబు తె ।
ల్పెగ వినిపింతునా తెఱఁగు వీనులవిందుగ నాలకింపుమా? ॥ 46

తా. ఓ పార్వతీ ! వినుము. లెక్కింపనలవిగాని చిన్మయ పర బ్రహ్మమును రేయింబవలు దర్శించుచు, దేనియందును ప్రవేశింపక నున్నట్టివాని మనస్సునందుకూడ ఒకానొక సమయమునందు జీవ వికారభ్రమలు దోఁచునని మహాత్ములు చెప్పుదురు ఇప్పుడు నీకు ఆ పద్ధతిని చెప్పెదను ; చక్కఁగా గ్రహింపుము.

జీ వ గు ణ ప్ర శం స.

క॥ ముత్తెపుఁ జిప్పనుగని ధర ।
చిత్తములో వెండియనుచుఁ జెలువుగఁదోఁపక ।
దత్తఱపడిచని రజితం ।
బుత్తదిగాఁ దెలిసినట్టు లూహింపుమదిక ॥ 47

తా. ఓ పార్వతీ ! వినుము. అజ్ఞానముచేత జీవుడు ముత్తెపు చిప్పను గాంచి, అది వెండియని భ్రమించి తొందరగాఁ బోయి చూచి, అచ్చట వెండిలేదని యెఱింగి నిజమును తెలిసికొనినయట్లని యూహింపుము.

వి. శ్లో॥ "శుక్తేర్బాధానఖల్వస్తి రజతస్య యథాతథా ।
అవస్తు సంజ్ఞితంయత్త జ్జగదధ్యాసకారణమ్ ॥

తా. ముత్తెపుచిప్పయందు తోఁచెడి వెండికి యెట్లు బాధ లేదో, ఆప్రకారము జీవునియందు తోఁచెడి పరబ్రహ్మమునకు బాధ లేదు. ఏది జగముయొక్క అధ్యాసమునకు (భ్రాంతికి) కారణ మైనదో, ఆ యజ్ఞానము సత్యముకాదు, (ఇది విశేషాధ్యాసమని చెప్పఁబడును )

ఆ॥ చీఁకటందుఁ ద్రాడు చెలువొప్పఁగనియది ।
సర్పమనుచుఁ దలఁచి జడియు మూఢ్క ।
మనసు శుద్ధబ్రహ్మమును బొంది యొకవేళ ।
భ్రాంతిచేతఁ దగులుపడు శుభాంగి ॥ 48

తా. ఓ పార్వతీ ! వినుము. చీఁకటియందు దారము కనఁ బడును. దానిని దారమని యెఱుంగక, సర్పమనిదలంచి భయఁ పడునట్లుగా, మనస్సు శుద్ధమైన పరమాత్మను బొందియు అజ్ఞానము

వలనఁ గల్గిన భ్రమచేత నొకప్పుడు ప్రపంచమాయయందుఁ దగులువడును.

వి. శ్లో॥ "వస్తున్యవస్త్వారోపోయ స్సోఽధ్యారోప ఇతీర్యతే ।
అసర్పభూతే రజ్జ్వాదౌ సర్పత్వారోపణంయథా॥"

తా. దారము మొదలగు వానియందు లేనివస్తువు అజ్ఞానముచే సర్పము మొదలగునవిగాఁ గనంబడుట యేదికలదో, అది అధ్యారోపమని చెప్పఁబడుచున్నది. (ఆప్రకారమే సచ్చిదానంద పరబ్రహ్మము భ్రాంతిచే ప్రపంచమువలెఁ గనఁబడుచున్నది.)

క॥ బయలందు నెండమావుల ।
నయముగఁ గని భ్రమముచేత నలయువిధముగా ।
వ్యయరహితాత్మ నెఱిఁగియు ।
భయపడు నొకవేళ జీవభ్రాంతిని గౌరి॥　　49

తా. ఓ పార్వతీ! వినుము. ఎండయందు తోఁచెడి ఎండమావులను జూచి, జలమని భ్రమించును. ఆ ప్రకారముగా శాశ్వతుండగు పరమాత్మ సర్వత్ర నిండి వెలుంగుచున్నాఁడని తెలిసి నప్పటికిని భ్రమచే జలప్రవాహమని తలంచి భయమొందును.

వి. ఎండమావులు జలమువలెను, జలప్రవాహమువలెను గానంబడును. ఇది "మృగతృష్ణిక" యనంబడును. ఈ యభిప్రాయముచేతనే ఏదేని దృష్టాంతము చెప్పవలసినప్పుడు "మృగతృష్ణికా న్యాయము" అని చెప్పుదురు

వి. శ్లో॥ "కింమరుస్థమృగ తృష్ణాంబు పూరేణార్ద్రీత్వమృచ్ఛతి ।
దృష్టిసంస్థితపీతేన శంఖః పీతాయతే కిము ।
బాలకల్పితనైల్యేన వ్యోమం కిం మలినాయతే॥

తా. చవిటినేలయందలి, యెండమావులను జూచి జలమని భ్రమించుచున్నారు. అంతమాత్రముచే చవిటినేల తడియునా? తడియదు. కామలారోగము గలవారు తెల్లని శంఖమును జూచి పచ్చ (పసుపు)గా నున్నదని తలంచుచున్నారు ఇంతమాత్రముచే పచ్చన యగునా? బాలురు ఆకాశమునుజూచి నల్లనిదని యెన్నుచున్నారు అందువలన నల్లనిదగునా? ఇట్లే శుద్ధమైన ఆత్మయందు

(పరబ్రహ్మమునందు) అనాత్మదోషము నారోపించుచున్నారు. అయినను అనాత్మదోషము ఆత్మను అంటనేరదు.

ఇట్లు శ్రీ శంకరాచార్యులు సర్వవేదాంత సిద్ధాంత సంగ్రహమునందుఁ జెప్పియున్నారు

ఆ॥ సరసిజాక్షి రాత్రి స్థాణువుఁ గనుఁగొని।
చోరుఁడని తలంచు తీరుగాను।
నిత్యుఁడైనయాత్మ నిజరూప మెఱఁగియుఁ।
జిత్త వికలములను జెందుసుమ్ము॥ 50

తా. ఓ కమలనేత్రివగు పార్వతీ! వినుము. రాత్రియందు మోడును (మొద్దును) చూచి దొంగయని తలంచునట్లు, నిత్యసత్య పరబ్రహ్మము నెఱింగియు, చిత్త విక్షేపమువలన దొంగయని భ్రమించును.

వి. శ్లో॥ "యోఽయంస్థాణుః పుమానేష పుం ధియా స్థాణు ధీరివ।
బ్రహ్మాస్మీతి ధియాశేషా హ్యహంబుద్ధిర్నివర్తతే॥"

తా. మొద్దునుజూచి పురుషుఁడని తలంచినప్పటికిని, ఇది మొద్దని తెలిసినతర్వాత పురుషుఁడనెడి భ్రమ నివర్తియగుచున్నది. ఇట్లే నేను బ్రహ్మమై యున్నాఁడనని తెలిసినతర్వాత నేను కర్తననెడి బుద్ధి నివర్తింపఁ బడుచున్నది.

ఇట్లు వేదాంత పంచదశియందుఁ జెప్పఁబడియున్నది.

శ్రుతి॥ "అహంబ్రహ్మాస్మి" అని బృహదారణ్యకోపనిషత్తునందుఁ జెప్పఁబడి యున్నది.

క॥ ముత్తెపుఁ జిప్పను ద్రాటిని।
మొత్తపు మృగతృష్ణికలను మోటును భ్రమచే।
సత్యమగు వెండి యహి జల।
శత్రువులని తెలియలేరు జగతి మృగాక్షీ॥ 51

తా. ఓ పార్వతీ! వినుము భ్రమచేత ముత్తెపుచిప్పను, దారమును, ఎండమావులను, మోడునుజూచి వెండి, సర్పము, జలము, దొంగ అని తెలియక యున్నారు.

చ॥ గజరిపుమధ్య యీభ్రమలు కల్పితమై మదిఁదోఁచినంతటన్ ।
సుజనతరాత్మ నేమఱి యశుద్ధపు జీవగుణంబునొందిరే।
గజిబిజి నొందు మేఘమునఁ గల్గిన చంచలవృత్తి చంద్రుకే।
నిజమనితోఁచుభంగి నిను నిత్యము భ్రాంతులఁ బెట్టు శాంభవీ॥

తా. ఓ సింహమువంటి నడుముగల పార్వతీ ! వినుము. పైన చెప్పిన భ్రమలన్నియు కల్పితములు. (జీవుఁడు) పరిశుద్ధమైన పరబ్రహ్మమును తెలిసికొననందువలననే, అశుద్ధమైన జీవగుణ విశిష్టుఁడై గజిబిజినొందును. అనఁగా తాఱుమాఱగును. ఆకాశమున మేఘములు వాయువశమున సంచరించుటవలనఁ గల్గు చలనముచేత చంద్రుఁడు సంచరించునట్లు తోఁచును అయినను అసత్యమైన యీ చలనము తనదని చంద్రుఁ డెఱుఁగును. కాని, ఈ చలనము చంద్రునిది కాదు. అట్లే నిన్ను నిత్యమును భ్రమలు పరిభ్రమింపఁ జేయుచుండును.

సీ॥ అర్కబింబము జలంబం దమరఁగఁ దోఁచు
జలచలనమురవిఁ గలఁచుమాడ్కి ।
దేహేంద్రియాదులఁ ద్రిప్పు చాంచల్యంబు
పరమాత్మదని మనోభ్రాంతి జేసి ।
కడుపాపపుణ్య సంకల్పంబులను జెంది
కలవరింపఁగఁజేయు సలలితముగఁ ।
గరిమముత్యపుఁ జిప్ప మఱివెండిగఁదలంచి
తెలిసిచూడఁగ భ్రాంతి తీఱి దాని ॥

తే॥ నిజముగన్నట్లు జ్ఞానంబు నిజమెఱుంగు ।
విమలబుద్ధిని భ్రమలన్ని విడిచియవల ।
శుద్ధబ్రహ్మైక్యపదవిని సిద్ధముగను ।
జేరుదువుగాని నన్యంబు జేరవార్య ॥ 53

తా. ఓ పార్వతీ ! వినుము. జలచలనము సూర్యబింబమును కదలించునట్లు, తోఁచుచుండును. అట్లే దేహేంద్రియాదులను చలింపఁజేయుచుండు చంచలత్వము పరమాత్మదియని యెన్నుట మనోభ్రమయేగాని వేఱుకాదు. మనస్సు పుణ్యపాప సంకల్పము

లను జెంది కలవరించున ట్లొనర్చును. ముత్తెపుచిప్పయందుఁ గనంబడు తెల్పునుజూచి, ఇది వెండికాదు అనెడి భ్రమతీఱి, ఇది ముత్తెపు చిప్పయని తెలిసికొొన్నతర్వాత, (అనఁగా నిజము నెఱింగినట్లు) నీవు సకలభ్రమలును తీఱి శుద్ధమైన పరబ్రహ్మము నొందుదువు అపుడు నీవు పరమాత్మపదము తప్ప తక్కిన దేనిని పొందవు (పరబ్రహ్మైక్య మొందుదువు.)

శ్లో॥ "ప్రతిబింబ చలత్వాద్యా యథాబింబస్య కర్హిచిత్ ।
నభవేయు స్తథాభాస కర్తృత్వాద్యాస్తునాత్మనః ॥"

తా. (సూర్యచంద్రాది) ప్రతిబింబమునందలి చలనము ఎట్లు బింబమునకు లేదో, అట్లు చిదాభాసునియందుఁ గల కర్తృత్వాదులు ఆత్మకు లేదు.

ఇట్లు అద్వైతాను భూతియందుఁ జెప్పఁబడి యున్నది.

తే॥ బ్రహ్మమందును జీవత్వ భ్రాంతిమరలఁ ।
గల్పితంబౌట తెల్పితిఁ గాననింక ।
నన్నియునుమాని యెఱుక శుద్ధాత్మయనుచు ।
నెన్ను పరమాత్మపదము నీ కెఱుకపఱతు ॥ 54

తా. ఓ పార్వతీ ! వినుము. పరమాత్మయందు జీవత్వభ్రాంతి మరలఁ గల్గుట కల్పితంబగుననుటను గూర్చి తెలియఁజేసితిని. ఇంక నీవు సమస్తభ్రమలను వదలి సుజ్ఞానము నొంది యెఱుకయే పరబ్రహ్మమని యెఱుంగుము. నీకు ఆ పరమాత్మపదమును బోధము కావించెదను.

క॥ నేనెవ్వఁడనని యనుచును
మానసమునఁ దలఁచుసూహ మఱి యెఱుకదియే ।
జ్ఞానమున నీవుగాఁగని ।
తాను న్నేననెడిభ్రాంతి తలఁగుము దుర్గా॥ 55

తా. ఓ పార్వతీ ! వినుము. నేను ఎవ్వఁడను ? అని మనస్సునందు తలంచునట్టి తలంపు ఎదియో అదియే ఎఱుకయనియును, అదియే నీవనియును వివేకముచేత ఎఱుంగుము. మఱియు తాను,

నేను, అనెడి భ్రమలను సైతము మానుము. (అనఁగా సర్వమును పరబ్రహ్మమేయని యెఱుంగవలయునని భావము.)

ఇదివఱకుఁ జీవగుణ ప్రశంస యనఁబడు అధ్యారోప విషయమును గూర్చి చెప్పఁబడిన విశేషార్థములందలి శ్లోకములు శ్రీశంకరాచార్యులు వాక్రుచ్చిన "సర్వవేదాంతసిద్ధాంతసంగ్రహము" లోనిదని యెఱుంగవలయును

పరిపూర్ణాఖండ జ్ఞప్తి విచక్షణము.

మ॥ ఒకఁడై సర్వచరాచరాదిపరుఁడై యొప్పంగఁ జిద్రూపుఁ డ।
త్యకలంకోజ్జ్వలతుర్యుఁడై యెఱుకచే నందంబుగా వెల్గు న।
త్యకలంకాత్ముని నీవుగాఁగనుచు దేహభ్రాంతిచేఁగల్గు భ్రా।
మికనెల్లప్పుడు నాత్మగా వని మదిన్ మీరందగున్ శాంభవీ॥

తా. ఓ పార్వతీ! వినుము. ఒక్కఁడై సకల చరాచరములకంటె వేఱైనవాఁడై చిదానందుఁడై మహాతేజోవంతుఁడై తుర్యాతీతుఁడై జ్ఞానముచే ప్రకాశించువాఁడై ఏవిధమైన దోషమును లేనివాఁడై యుండు పరమాత్మను నీవని యెఱింగి సమస్తమును నేనే యనెడి శరీరభ్రమచేఁ గల్గు భ్రాంతులన్నియును పరమాత్మది కాదని యెఱుంగుము.

వి. శ్లో॥ "సర్వం బ్రహ్మేతియస్యా తద్భావనా సా విముక్తిదా।
భేద బుద్ధి రవిద్యేయం సర్వథాతాం పరిత్యజ॥"

తా. ఈ సమస్త ప్రపంచమును (సకల చరాచరములును) బ్రహ్మస్వరూపమని మనస్సునందు తలంచుచుండుటయే మోక్షము. ప్రపంచము వేఱు, బ్రహ్మము వేఱు, అని తలంచుట బంధము. అనఁగా అజ్ఞానము. ఈ అజ్ఞానమును వదలుము. ఈ యజ్ఞాన మున్నంతవఱకును మోక్షము కలుగదు.

ఇట్లు వాసిష్ఠరామాయణమునందుఁ జెప్పఁబడి యున్నది.

గీ॥ తనువులోనుండి కలదను తలఁపుగలుగు।
తెలివి నీవుగఁ దలపోయు తెలివిలేని।
తనువు నీవంచుఁ దలఁపక తనువులోన।
నుండి తనుధర్మములు సేయ ఖండమగును॥

తా. ఓ పార్వతీ! వినుము. శరీరములోపల ప్రకాశించు పరమాత్మ, నేనేయనెడి యభిప్రాయ మేదికలదో, అదియే అఖండ జ్ఞానమనెడి యెఱుక యని యెఱుంగుము. శరీరమునందు తేజరిల్లు పరమాత్మ, నేనుకాదనెడి భావముతో విషయ సుఖములయందుండి పుణ్యపాప కృత్యములు సేయుచుండుటయే ఖండజ్ఞాన మనఁబడును.

సీ॥ అనఘుఁడౌ పరమాత్ముఁ డఖిలసంవేదియై
చెవులు లేకయె మాట చెలఁగివినును।
గన్నులులేకయె కనుఁగొను రూపంబు
జిహ్వలేకయె రుచుల్చెలువుఁగాంచు।
పాదంబులును లేక పరగంగఁజరియించు
బరఁగ జేతులు లేక పట్టివిడుచు।
నెసఁగంగఁ గైవల్య యుపనిషత్తునఁబల్కు-
శ్రుతి పరంధామము దేహమనుచు॥

తే॥ వినఁబడును గాన భ్రాంతుల విడచియెప్పు।
డగణితంబైన తెలివి నీవంచుఁ దలఁచి।
నిజము తెలివని దేహ మనిత్యమనుచు।
నిరతమును నెంచి పరమొందు నీరజాక్షి॥ 58

తా. ఓ పార్వతీ! వినుము. నిర్దోషుఁడగు ఆ పరమాత్ముఁడు చెవులులేకయే సమస్తమైన మాటలను చక్కఁగా వినును. కన్నులు లేకయే సకల రూపములను చూచును. నాలుకలేకయే అన్నిరుచులను చవిగొనును. కాళ్లు లేకయే సంచరించును. చేతులు లేకయే పట్టివిడుచును. ఇట్లు కైవల్యోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది. కావున నీవు భ్రమలనువిడిచి, తెలివియే (ఎఱుకయే) నీవని యెఱుంగుము ఎల్లప్పుడును శరీరము శాశ్వతము గాదనియును, పరబ్రహ్మమునకు వాసస్థానము శరీరమే యనియును తలంచి మోక్షము నొందుము

వి. ఈ విషయమును 46-వ పుటయందుఁ గనందగును.

మఱియును,

శ్లో॥ "దేహో దేవాలయఃప్రోక్తం వామదేవం ప్రతిష్ఠితం॥"

తా. ఈ శరీరమే దేవాలయమనియును, దీనియందు ఈశ్వరుఁడు ప్రతిష్ఠింపఁబడి యున్నాఁడనియును భావము.

ఇట్లు ఉపనిషత్తులందుఁ జెప్పఁబడి యున్నది.

చ॥ రవియుదయింపఁ గార్యములు రాజిలఁజేయఁగ నీజగత్క్రియల్
రవికిని నెట్లు నంటవటు రంజిలుచుండను ధర్మలీల లీ।
శివకర మైన యాత్మునకుఁ జెల్వగ నంటవటంచు భ్రాంతులన్।
దగులక సాక్షిరూపు సమతన్ దలపోయుచు జ్ఞప్తినుండుమీ॥

తా. ఓ పార్వతీ ! వినుము. సూర్యుండు ఉదయింపఁగా క్రియలు జరుగుచుండును అయినను, ఈ ప్రపంచకార్యములు సూర్యునిచెందని యట్లు శరీరధర్మములగు సకలకార్యములును శుభకరుఁడైన పరబ్రహ్మమును జెందదు. అట్లే నీవు భ్రమలను బొందక సర్వసాక్షివగు పరబ్రహ్మమును చింతించుచు ఎఱుకను అనుభవింపు చుండుము.

ఆ॥ ఎఱుక యాత్మయనుచు నెఱిఁగినపిమ్మట।
తనువికారములను దగుల వీవు।
అఖిలసర్వసాక్షి యగునాత్మఁ గనుఁగొన్న।
దివ్యసుఖముగల్గుఁ దివిరి నీకు॥ 60

తా. ఓ పార్వతీ ! వినుము. ఎఱుకయే ఆత్మయని తెలిసికొన్న తర్వాత శరీర వికారములయందు నీవు తగులవు. సర్వవ్యాపియగు పరమాత్మను కనుఁగొన్నవారికి దివ్యమైన మోక్షపదము కల్గును.

వి. శ్లో॥ "జన్మాస్తిత్వ వివృద్ధయః పరిణతిశ్చాపక్షతిర్నాశనం।
దృశ్యస్యైవ భవన్తి షడ్వికృతయోనానావిధావ్యాధయః।
స్థూలత్వాదిచ నీలతాద్యపి మితి ర్వర్ణాశ్రమాది ప్రథాః।
దృశ్యన్తే వపుషోణచాత్మన ఇమే తద్విక్రియాసాక్షిణః॥"

తా. శరీర వికారములనఁగా.—జన్మించుట, ఉండుట, పెరుగుట, మార్పుచెందుట, కృశించుట, నశించుట, అనునీయాఱును షడ్భావశరీరవికారము లనఁబడును.

మఱియు వ్యాధులును బలియుట, మొదలగునవియును, నలుపు మొదలగు గుణములును, పరిమాణములును, వర్ణాశ్రమాది

వ్యవహారములును, ఈశరీరమునకు కనఁబడుచున్న వేకాని, శరీరము యొక్క సాక్షియగు ఆత్మకు కనఁబడవు. అనఁగా పరబ్రహ్మమునకు లేవనిభావము.

ఇట్లు శ్రీ శంకరాచార్యులు సర్వవేదాంతసిద్ధాంతసంగ్రహమునందు వ్రాక్రుచ్చియున్నారు.

తే॥ హెచ్చుతక్కువలెందాక యెంచుచుండు ।
నగజ యందాక యెఱుకకు హానియగును ।
నెఱుకతలఁపును బాసియు మఱపుఁజెంద ।
ఘోరసంసారతరువు నంకురమునొందు ॥ 61

తా. ఓ పార్వతీ ! వినుము. జీవుఁడు ఎంతవఱకు మనస్సునందు ఒకదానిని అధికముగను, మఱియొకదానిని తక్కువగను తలంచునో, అంతవఱకును ఎఱుకకు హానికల్గును. అనఁగా జీవునకు జననమరణములు కలుగును జీవుఁ డెప్పుడు ఎఱుకను బాసి మఱపునొందునో, అప్పుడు క్రూరమైన సంసారవృక్షము మొలచును, అనఁగా సంసారము వృద్ధియగు నని భావము.

వి. శ్లో॥"శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః ॥"

తా. ఆఁడుకుక్క, కుక్కనువండితినెడి చండాలుఁడు, సకల వేదశాస్త్రముల నెఱింగిన పండితుఁడు, అను వీరినందఱను హెచ్చుతక్కువలులేక సమముగాఁ జూడవలయును అని భగవద్గీతయందుఁ జెప్పఁబడియుండెడి భావము నిట అనుసంధింప వలయును.

క॥ పరమార్థమైన యెఱుకను ।
బరిపూర్ణత నెఱిఁగినడువ భావమునను దు ।
స్తరమో లఘువో యనుచును ।
మరిసంశయపడకు మెఱుక మఱవకు గౌరీ ॥ 62

తా. ఓ పార్వతీ ! వినుము. నీవు పరబ్రహ్మమైనట్టి ఎఱుకను చక్కఁగా నెఱింగి, ఆప్రకారము నడుచుకొనుటకు, సాధ్యపడునో పడదో యని సంశయ పడక ఎఱుకను మఱువకుండుము. అనఁగా సంశయమువలన కీడు కలుగుననియును, ఆచార్యోపదేశము ప్రకారము నడువవలయుననియును భావము. ఈయభిప్రాయమ్ము చేతనే

శ్రీకృష్ణమూర్తి అర్జునికి "సంశయాత్మా వినశ్యతి" అని చెప్పి యున్నారు.

తే॥ సర్వసాక్షిత్వభావ సంసర్గసిద్ధి।
గలుగుజీవికి నన్యమూ తలఁపుగలదె।
జ్ఞప్తి చిన్మాత్రకళయను జ్ఞానమునకు।
సాక్షి కేవలమని శ్రుతు ల్చాటుదుర్గ॥ 63

తా. ఓ పార్వతీ! వినుము. సర్వప్రపంచ (సకలభూత) సాక్షియగు పరబ్రహ్మముతో సంసర్గముగల జీవునకు సర్వంబ్రహ్మమయమనెడి తలంపు గల్గునేగాని, తనకంటె వేఱే యొకవస్తువు కలదని తోఁచదు. ఎఱుకయే చిన్మాత్రకళ యనెడి జ్ఞానము కలవాఁడు మాత్రము సర్వసాక్షియగు పరమాత్మ ఒక్కఁడే యని వేదములు ఘోషించుచుండెడి అభిప్రాయమును ఎఱుంగును.

వి. "సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ" అని శ్రుతియందుఁ గలదు.

ఆ॥ ఎఱుకకన్న బ్రహ్మ మెక్కడ లేదని।
పల్కి తింకమీఁదఁ బంకజాక్షి।
మఱియు జాగ్రతాది మహితాద్యవస్థల।
భావమెల్లఁ దేటఁ బరతుగౌరీ॥ 64

తా. ఓపార్వతీ! ఇంతదనుక ఎఱుక (జ్ఞానము) కంటె పరమాత్మ ఎచ్చోటను వేఱేలేదని నీ కెఱింగించినాఁడను. ఇఁక జాగ్రత్స్వప్న సుషుప్తు లనఁబడు త్రివిధావస్థల విషయమును నీ కెఱింగించెదను వినుము.

## అవస్థాత్రయలక్షణము.

ఆ॥ నిదురబోవువేళ నెఱె మేలుకొనువేళ।
కలవరించుచున్న కాలమందు।
సకలవృత్తులకును సాక్షియునై వెల్గు।
ప్రవిమలాత్మ నీవె భాసురాంగి॥ 65

తా. ఓపార్వతీ! వినుము. నిద్రపోవునపుడు, మేల్కొనునపుడును, కలవరించుచుండునపుడును,అనఁగా జాగ్రత్స్వప్న సుషుప్తుల

యందును, ఇంకను ఇతర సమయములయందును, సాక్షియై వెల్గు చుండు పరమాత్మ నీవే యని యెఱుంగుము.

చ॥ కలగనువేళ జాగ్రతను గాయవికారము లెల్ల లెస్సఁగాఁ।
దెలిసినభంగి నిద్దురను దెల్విగ నుండమి యేమియంటివా।
పలికెద సుప్తికాలమునఁ బ్రౌఢత బుద్ధిసహాయమయ్యుఁదా।
నలర నవిద్యవాసన ఘనంబుగఁబొందగఁ దెల్వి గల్గదే॥ 66

తా. ఓ పార్వతీ! వినుము. కలగను సమయమునందును, జాగ్రత్కాలమునందును శరీర వికారములను చక్కఁగా దెలిసిన ప్రకారముగా, నిద్రాసమయమునందు (అనఁగా గాఢనిద్రయగు సుషుప్తికాలమునందు) శరీరవికారము లేమియుఁ దెలియకపోవుటకు కారణ మేమనఁగా, సుషుప్తికాలమునందు పరమాత్మ, బుద్ధిని ప్రాణమునకు సహాయముగా నుంచి, ఆ పరమాత్మ (ఎఱుక) వెడలి పోవును. అవిద్యావాసనాబలము విశేషముగా నుండుట వలన తెలివి లేకుండును. ఇట్లు ఆ సమయమునందు తెలివిలేని కారణమునుబట్టి అపుడు ఏవృత్తియును తెలియఁబడదు.

వి. ఈ వాసనావిషయమును 103, 104, 105-వ పుట లందుఁ గనందగును.

చ॥ మఱియును నిద్రవేళ సుఖమందుచు మత్తిలి బాహ్యచేష్టలే।
మెఱుఁగక లేచి నేనహహ మేలిమి నిద్దురఁజెందితంచునుర్వ్।
పరవిని సుప్తికాలమునఁ జక్కఁగ నుండియు జ్ఞప్తిచేత ద।
న్నెఱుగఁగవచ్చుగాన నది యేఁవగు సాక్షియునై వెలుంగునే॥

తా. ఓ పార్వతీ! వినుము. నిద్రాసమయమున మత్తిల్లి, జాగ్రత్కాలమునందలి వృత్తులన్నియును మఱచి, నిద్రనుండి లేచి నపుడు (జాగ్రద్దశ నొందినపుడు) ఆహా, నేను చక్కఁగా నిద్రపోయి నాఁడని తలంచును సుషుప్తికాలమునందు జీవాత్మకుజ్ఞానముండియు తన్నుదాను ఎఱుంగఁదగును. అయినను, అపుడు ఆ పరమాత్మ సర్వ సాక్షియై ప్రకాశించుచుండునుగాని, ఇతర విషయముల నేమియు నెఱుఁగక యుండును.

మత్తకోకిల॥ మూఁడవస్థలకెల్ల కాలను మూలమే పరమాత్ముఁడే।
జాడలందును జేరి యావల సాక్షియై యొకటంటకన్ ।
గూడికూడకయుండు నంతట గూర్మి నీవదికంటివా ।
యాడనీడన నేల చిన్మయమై వెలుంగును దెల్విచే॥ 68

తా. ఓ పార్వతీ ! వినుము జాగ్రత్స్వప్న సుషుప్తులకు ఎల్లపుడును పరమాత్మయే మూలకారణ పురుషుఁడై యుండును. అతండు సకలకార్యములయందును జీవునితోఁ గూడియుండును. అయినను,ఆపరమాత్ముఁడుఏకార్యమునందును దేనితోను కూడియుఁ గూడక యుండును. నీవు ఆ పరమాత్మస్థితిని యెఱింగితివా? అతఁడు అక్కడ ఇక్కడ యనక ఎచ్చోటను చిన్మాత్రుఁడై ఎఱుకచే ప్రకాశించుచుండును.

తరల॥ కలిమిలేములులేక యెప్పు డఖండవృత్తిని వెల్గుచున్ ।
దెలిసిచూడఁ జరాచరంబుల దేవుఁడై విలసిల్లునే।
యలఘుఁడీశుఁ డగణ్యసత్యమయాత్ముఁడై జగమంతయున్ ।
దెలిసి లోవెలి నేయకెప్పుడు తేజరిల్లుచు నుండునే॥ 69

తా ఓ పార్వతీ! వినుము. ఆ పరబ్రహ్మము కలిమిలేములు లేక సర్వకాలమును అఖండవృత్తిచే ప్రకాశించుచుండును విమర్శించిచూడఁగా నతఁడు చరాచరంబులందంతట(ఎల్లచోటులందును) విభుఁడై యుండును మఱియును అతఁడు ఘనుఁడు, అధిపతి, లెక్కింప నలవికానివాఁడు, ప్రపంచమెల్లను ఎఱింగినవాఁడై యుండియు, ఆంతరమును బాహ్యమును కనఁబడనీయక ఏకరీతిగా ప్రకాశించుచుండును.

తే॥ అగజ పిండాండ బ్రహ్మాండ మందునరయ ।
నెఱుకమాత్రము దక్క మఱేమిలేదు ।
అట్టియెఱుకను నీవుగా నాత్మయందు ।
నమ్మి పరిపూర్ణసుఖివగు నళిననేత్రి॥ 70

తా. ఓ కమలనేత్రివగు పార్వతీ! వినుము. పిండాండము (శరీరము)నందును, బ్రహ్మాండమునందును, ఎఱుకతప్ప వేఱేమియు

లేదు. ఎఱుకయే నీవని మనస్సునందు తలంచితివేని, నీవు పరిపూర్ణమైన సుఖమును అనఁగా మోక్షమును బొందుదువు.

తే॥ ఎఱుక పరమాత్మయనినీవు నెంచితేని।
నీకు గించిత్ జ్ఞుఁడనుభ్రాంతి లేకపోను।
అవల సర్వజ్ఞుఁడనినీవు నరసియింక।
నేమిలేదని మఱినమ్ము మిందువదన॥ 71

తా. ఓ చంద్రముఖివగు పార్వతీ! వినుము. నీవు ఎఱుకను పరమాత్మయని తలంచినయెడల, నీకు కించిద్జ్ఞత్వ భ్రమముతీఱిపోవును. ఆతర్వాత నీవే సర్వజ్ఞుఁడనని యెఱింగి, ఇఁక నాకేమియును (నాకంటెవేఱేమియును లేదని) నమ్ముము. అనఁగా నీవే సకల చరాచరములయందు నుండు పరబ్రహ్మమని నమ్ముము.

ఆ॥ మాయవిడిచి యెఱుక మదినమ్మి వెలయుము।
నీవు జీవుఁడనుచు నెన్నవలదు।
నేను బ్రహ్మమనుచు నెన్నంగ మోక్షంబు।
సమము నీకు నాకు జలరుహాక్షి॥ 72

తా. ఓ కమలాక్షివగు పార్వతీ! వినుము. నీవు మాయను వదలి, (ఎఱుకను = పరమాత్మను) మనస్సునందు నమ్మి వెలయుము. నీవు జీవుఁడని తలంపవలదు. నేనేపరబ్రహ్మమని తలంచుటయే ముక్తియగును. మఱియు నీకును నాకును భేదములేదని యెఱుంగుము.

వి. శ్లో॥ "నిరవధి నిరహం కేప్యఖండే।
మయిచితి సర్వ వికల్పనాదిశూన్యే।
ఘటయతి జగదీశ జీవభేదం।
అఘటిత ఘటనాపటీయసీ హి మాయా"॥

తా. హద్దులేనిదియును, అంశము (భాగము) లేనిదియును, అఖండమైనదియును, వికల్పములు లేనివియును, చిదాత్మయునగు నాయందు ప్రపంచము, ఈశ్వరుఁడు, జీవుఁడు, అను భేదములను మాయయే ప్రవర్తింపఁజేయుచున్నది. కాఁబట్టి జరుగనిదానిని జరుగునట్లు చేయునట్టిది మాయ యగును. అనఁగా లేనిప్రపంచమును ఉన్నట్లు తోఁపింపఁజేయునట్టిది మాయ యని భావము.

క॥ నీకును నాకును భేదము।
లేకయె యసిపదమునందు లీనంబగుటన్ ।
ధీకుశలు లెఱిఁగి కాదే।
శ్రీకరులై కోరుచుంద్రు శీతాంశుముఖీ॥ 73

తా. ఓ చంద్రవదనయగు పార్వతీ! వినుము. నీకును నాకును భేదము లేదనుటను గూర్చి వివేకవంతులైన మంగళప్రదులగు వారు అసిపదమునందు లీనమగుటను తెలిసికొని, వారును ఆ ప్రకార మగుటకై నిరంతరమును కోరుచుందురు.

వి. "తత్త్వమసి" తత్=అది, త్వం=నీవు, అసి = అయితివి, అనఁగా, "అదినీవైతివి" అను విషయమును శుకరహస్యోపనిషత్తునందును, సామవేదము ఛాందోగ్యోపనిషత్తు ఆఱవ ప్రపాఠకమందును చెప్పఁబడియున్నది.

ఆ॥ అంబుజాక్షి నిరుపమానందనిర్గుణ
నిర్మలాత్మనిత్య నిగమవేద్యుఁ।
డైనయాత్మనీవు నదె నేను నఖిలప్ర।
పంచమదెయె యనుచు నెంచుమదిని॥ 74

తా. ఓ కమలనేత్రివగు పార్వతీ! వినుము. సాటిలేని మహానందమూర్తియును, గుణరహితుండును, శుద్ధ పరబ్రహ్మమును వేదాంతవేద్యుఁడును, అగు పరబ్రహ్మము నీవైయున్నావు, అట్టిదే నేను నై యున్నాఁడను. ఆదే సకలప్రపంచమును నై యున్నది. అని నీవు మనస్సునందు భావింపుము.

ఆ॥ వేదశాస్త్రములను నాదియంతములందుఁ।
బంచభూతమయ ప్రపంచమందు।
సాధుబోధలందు సాక్షిసచ్చిద్రూపు।
నెఱుకయనితలంచి మఱపుమాను॥ 75

తా. ఓ పార్వతీ! వినుము. చతుర్వేదములయు, సకల శాస్త్రములయు, ఆదియందును, అత్యంతమునందును, పంచభూతములచేనైన జగమునందును, సదుపదేశమునందును, వెలసియుండు

నట్టిది ఎఱుకయని మనస్సునందు భావించి మఱపును (భ్రమను) మానుము.

క॥ శర్వరిచంద్ర వదనవినుము ।
సర్వమబద్ధంబు నెఱుక సత్యంబు చుమీ ।
సర్వంఖల్విదమను శ్రుతి ।
మర్వక తలపోసి యెఱుక మది నూనుశివా॥ 76

తా. ఓ శరత్కాల చంద్రముఖివగు పార్వతీ! వినుము. ప్రపంచమునందు ఎఱుకతప్ప తక్కినవన్నియును అసత్యము. "సర్వంఖల్విదంబ్రహ్మ" అను వేదవాక్యమును నీవు మఱవక ఆ యెఱుకయొకటే సత్యమని నిశ్చయింపుము.

వి. ఈయభిప్రాయముననుసరించుటయే వేదములందు "సత్యం జ్ఞానమనంతంబ్రహ్మ" అనఁగా సత్యమైనది జ్ఞానము. (ఎఱుకయే శాశ్వతమైనది.) అంతములేనిది, అదియే పరమాత్మ. "సర్వంఖల్విదం బ్రహ్మ" అనఁగా ఈ కనంబడు ప్రపంచమంతయును బ్రహ్మముగా నున్నది. బ్రహ్మమునకంటె శేషించియుండున దేదియును లేదు.

శ్లో॥ "సమస్తం ఖల్విదంబ్రహ్మ సర్వమాత్మేతిమాగతః ।
అహమన్య ఇదంచాన్య ద్బ్రహ్మరూప మఖండయ"॥

తా. ఈప్రపంచమంతయు బ్రహ్మమే, నేను ఈ ప్రపంచ స్వరూపమైయున్నాను. అనఁగా నాకును ప్రపంచమునకును భేదము లేదు. అయినను నేనుజీవుఁడనుగాను, ప్రపంచమునుగాను, కావున, అన్నియు అఖండమైనది.

ఇట్లు యోగవాసిష్ఠమునందుఁ జెప్పఁబడియున్నది.

క॥ అనుచుఁ శంకరుఁ డాడిన ।
విని పార్వతి యెఱుకకన్న వేఱేమిఁకలే ।
దని యంటి వీ జగంబే ।
ఘనుచే నగు నెఱుక యెట్లు కనఁబడు భర్గా ॥ 77

తా. ఈప్రకారముగా పరమశివుఁడు చెప్పఁగా విని పార్వతీ దేవి యిట్లనియె ఓ భర్గా! నీవు ఈప్రపంచమునందు ఎఱుకకంటె వేఱేమియును లేదని చెప్పితివి. అయినను, ఈ జగత్తుఏమహాత్మునిచే

నిర్మింపఁబడును ? ఆయెఱుకయెట్లు కనంబడును ? చెప్పుము. అని యడిగెను.

—⊶ పరమాత్మ వలన నైన ప్రపంచభ్రాంతి. ⊷—

ఆ॥ ఎఱుక వలన జగము లెసఁగుచుండునో లేక।
విశ్వమునకు నెఱుక వేఱో దీని।
దెలియఁజెప్పుమన్న దృఢబుద్ధిగలిగిన।
గౌరి జూచి శివుఁడు కరుణ బలికె॥ 78

తా. ఈ ప్రపంచము ఎఱుకవలననే కలుగుచున్నదా ? లేక, ఎఱుక ప్రపంచమునకంటె వేఱుగానున్నదా ? ఈ విషయమును నాకెఱింగింపుమనగా, వివేకవంతురాలగు పార్వతినిఁజూచి పరమేశ్వరుఁడు కృపతో నిట్లని చెప్పందొడంగెను.

మ॥ వినవే పార్వతి తెల్వి గుర్తెఱింగినన్ విశ్వంబు వర్థిల్లునే ? ।
తనుదానమ్మక యాత్మ నిత్యమనుచున్ దల్పందు నూహింపకన్।
దినమున్ సంశయమొందినందున గదా ధీవృత్తిచే మాయకున్।
జననభ్రాంతి జనించి కల్మషపద స్థానంబగున్ శాంభవీ॥ 79

తా. ఓపార్వతీ ! వినుము. ఎఱుకను తెలిసికొన్న యెడల ఈప్రపంచము కలుగనేకలుగదుకదా ? ఎఱుకను తెలిసికొనక, తన యందు ప్రకాశించు పరబ్రహ్మమును సత్యమని మనస్సునందెంచక, ప్రతిదినమునందును సంశయ మొందినందున, బుద్ధియందు వృత్తి దోఁచి, ఆమాయకు ప్రపంచసృష్టి చేయవలయుననెడి తలంపు గలిగి, అందుచే జననము కల్గినది. అందువలన నరకము సంభవించును.

తే॥ గౌరి సంశయపడకు జగంబులెల్ల।
నెఱుకచే నగు నంచు ధీవరులుచాటి।
పలుకుచుండుదు రందుకు బట్టుగాను।
దెలియవినిపింతు దృష్టాంతములు శుభాంగి॥ 80

తా. ఓపార్వతీ ! వినుము.-ఈప్రపంచమంతయు ఎఱుకచే కల్గునని వివేకులు చాటించి చెప్పుదురు. ఈ విషయమును దార్ఢ్యము కొఱకు నీకు దృష్టాంతములతోఁ దెలియఁ బఱచెదను.

తే॥ ప్రత్తివలనను నైనట్టి పటములెల్లఁ।
జిత్రవన్నెల మృదువునై చెలఁగియుండు।
ధాత్రిజనులకుఁ బ్రత్తియన్ దలఁపుగలదె।
యట్ల నెఱుకచే జగమాట యరయలేరు॥ 81

తా. ఓపార్వతీ! వినుము. ప్రత్తిచేఁ గల్గిన వస్త్రములన్నియు పలువిధములగు రంగులతోడను, మృదువుగాను కనఁబడును. అది లోకులకు ప్రత్తియనెడి తలంపులేదుకదా? అట్లే లోకులు ఎఱుక వలననే జగము కలుగునని తెలిసికొనలేరు.

క॥ మృత్తికనగు ఘలసమితి ను।
దాత్తస్థితిఁజూచి యవియుఁ దగమృత్తికగాఁ।
జిత్తములోపలఁ దలఁపరు।
మృత్తికవలె నెఱుక నెఱుఁగుమీ శర్వాణీ॥ 82

తా. ఓపార్వతీ! వినుము. మన్నుచేనైన కుండలు మొద లగువానిని జూచి, ఇవి మన్నువలనఁ గలిగినవియని తెలిసికొన లేరు. నీవు, ఈ కుండలు మొదలగునవి మన్నువలననైనవనిభావించి ఈప్రకారమే ప్రపంచమంతయును ఎఱుకవలనఁ గల్గినదని తెలిసి కొనుము.

వి. "శ్లో॥ పటరూపేణ సంస్థానాత్పటస్తంతో ర్వపుర్యథా।
సర్వరూపేణ సంస్థానాత్సర్వమన్య వపుస్తథా॥"

తా. నూలు వస్త్రరూపముగా నుండుటచేత, ఆ వస్త్రము నూలునకు శరీరమెట్లో, అట్లే పరమాత్మయు (ఎఱుకయు) సకల ప్రపంచరూపముగా నుండుటచేత, సకలప్రపంచమును పరమాత్మకు శరీరమగునని యెఱుఁగవలయును.

తే॥ కనకమయమైన సొమ్ముల ఘనతఁ జూచి।
వాని కనుకూలమగు పేర్ల వసుధనుంచి।
ఎఱుక గుఱిసేయలేక యీ యిలను భ్రమలఁ।
దాను బొందుచు నవివేకుఁ డౌనుదుర్గ॥ 83

తా. ఓపార్వతీ! వినుము. అజ్ఞానులు బంగారుమయమైన సొమ్ములు పలువిధములుగా అనేక నామములతోఁ గనఁబడినప్పటి

కిని, అవియన్నియును బంగారముతో నైనవని తెలిసికొనలేక, భ్రమలను బొందుదురు. అట్లే జీవుఁడు ఎఱుకను తెలిసికొనక అవివేకవంతుఁడై భ్రమలంబడి నరకమునందుఁ బడును.

గీ॥ మఱియు వటబీజమును జూడు మహితముగను।
కొంచెమగు విత్తనమునందు కుజము దోఁచి।
వెలయు శాఖోపశాఖలై విపులముగను।
నావిధంబుగ బ్రహ్మంబు నవనిఁ దనరు॥ 84

తా. ఓ పార్వతీ! వినుము. మఱ్ఱివిత్తు చాల కొంచమే యైనప్పటికిని, అందుండి గొప్పవృక్షముగల్గి, అది పెక్కుశాఖలుగా వృద్ధియై,అందలి యూడలన్నియునుగూడవృక్షములై వెలయునట్లు, పరబ్రహ్మమువలన నీ ప్రపంచము విస్తారమై ప్రకాశించుచున్నది.

వి. శ్లో॥ "దేహావద్వట బీజాదా సువిచార్య విలోక్యతాం।
క్వధానా కుత్రవావృక్ష స్తస్మాన్మాయేతి నిశ్చిను॥

తా. శరీరమువలెనే మఱ్ఱివిత్తనము మొదలగువానిని చక్కఁగావిచారించి తెలిసికొనవలయును. చాల చిన్నదగు మఱ్ఱివిత్తనము మొదలగు బీజములయందు, అవి చిన్నవియైనను, ఎట్లు వానియందుండి గొప్పవృక్షములు కలుగుచున్నవో, అట్లు ప్రపంచమంతయు కంటికిఁ గనఁబడని సూక్ష్మమగు మాయవలన కలిగినదని తెలియవలయును.

ఇట్లు వేదాంతపంచదశియందుఁ జెప్పఁబడి యున్నది.

చ॥ సరసిరుహాక్షి తంతువులఁ జక్కనిమృత్తిక హేమమందునన్।
మరి వటబీజమందున సమంచిత వస్తుచయంబులెట్లుగా।
గరిగొను మాడ్కి సర్వము నఖండమయాత్ముని చేత నౌ నదే।
నిరతము నీమనంబునను నేర్పునెంచి సుఖింపు మద్రిజా॥ 85

తా. ఓ కమలనేత్రివగు పార్వతీ! వినుము. తంతువులను (నూలిని), మన్నును, బంగారమును, మఱ్ఱివిత్తనమును, అను వీనియందే ప్రకారములుగా వస్తుజాలములు వృద్ధినొందుచున్నవో, ఆ ప్రకారముగా ఈ ప్రపంచమంతయును అఖండస్వరూపుఁడగు పర

మాత్ముని వలననే కల్గును. ఆ పరబ్రహ్మమునే నీవు నిరంతరమును నీ మనస్సునందు భావించి మోక్షమును బొందుము.

సీ॥ హరిమధ్యయచటఁ గూటస్థచిద్రూపుండు
నమరి నీయందు నెల్లప్పుడుండు।
సచరాచరంబైన జగములునన్నియుఁ
గలిగి నీరూపమై ఘనతనుండు।
నిరతంబు నఖిలముల్నీయందు వెలుఁగొందు
విశ్వసాక్షిత్వమై వెలయుదీవు।
నావిధంబుననుండి యవియు నెల్లప్పుడు
నంటవవియు నిన్ను నంటబోదు॥
తే॥ అదియు నెట్లన్న నాకాశమందు వాయు।
వృద్ధియయ్యును నవి రెండు వేఱువేఱ।
నున్నవిధమున సర్వమం దుండి నీవు।
తగుల వెప్పుడు చెందవు తరలనేత్రి॥ 86

తా. ఓ సింహమువంటి నడుముగల పార్వతీ! వినుము. నీ హృదయమునందు కూటస్థ చిద్రూపుఁడగు పరమాత్మ యెప్పుడును వసియించియుండును. చరాచర ప్రపంచమంతయు నీస్వరూపంబై యున్నది. అనఁగా నీవు ఆత్మస్వరూపంబును,ప్రపంచమునకు, సాక్షిస్వరూపంబునునై యున్నావు. కాఁబట్టి, సర్వమును నీయందే యమరియున్నది. సమస్తమును నీయందే యుండినప్పటికిని, నీవు దేనిని అంటకయుందువు. ఎట్లన, ఆకాశమునందు వాయువుకలిగి వృద్ధియైయుండియు, అవి రెండును (ఆకాశమును వాయువును) వేఱువేఱుగా నుండునట్లు, అన్నియునీయందేయుండినప్పటికిని,నీవలననే అన్నియు కల్గినప్పటికిని, నిన్ను ఎదియునంటదు.

వి. శ్లో॥ "కూటస్థ బ్రహ్మణోర్భేదో నామమాత్రా దృతేనహి"॥

తా అనఁగా, కూటస్థుఁ డనబడు ప్రత్యగాత్మకును, పరబ్రహ్మమునకును నామమాత్రమువలన భేదమేగాని, వాస్తవమునందు భేదము లేనేలేదు.

ఇట్లు వేదాంతపంచదశియందుఁ జెప్పఁబడి యున్నది.

మఱియును ఈ విషయమును 153-వ పుటయందుఁ జూచిన స్పష్టమగును.

క॥ ఉదధిని దరగలు సతతం।
బుదయంబై స్థితియు లయము నొనరఁగ నందే।
యొదవుక్రియ నాత్మఁ దెప్పుడు।
నెదలోపలఁ దోఁచు నడఁగు నిందునిభాస్యా॥　87

తా. ఓ చంద్రవదనయగు పార్వతీ ! వినుము. జలమునందు అలలు ఏప్రకారము పుట్టి మరల అందేయణఁగుచున్నవో, అట్లే ఈ ప్రపంచముపుట్టి అందే లయమగుచున్నది. ఆ ప్రకారమే పరమాత్మ హృదయమునందుఁ దోఁచి అందే లయమగును.

క॥ భేదమొకవేళ యయినను।
లేదనిమది నూహజేసి లెస్సంగ నెఱుకే।
పాదనుచు నరయు బ్రహ్మాం।
డోదయములు తనకుఁదానె యుబ్బియడంగుꣳ॥　88

తా. ఓ పార్వతీ ! వినుము. ఎప్పుడుగాని పరమాత్మకును జీవాత్మకును భేదములేదనియును, ఎఱుకయొక్కటే సర్వమునకును ఆధారమనియును ఎఱుంగుము. ఆ ప్రకారమే బ్రహ్మాండమును కల్గి తనకు దానే లయమగును

క॥ జననంబును స్థితి లయ మొక।
ఘనుచేనగు భేదమెపుడు కానఁగరాదే।
విను సర్వము బ్రహ్మంబని।
వినఁబడుఁ దద్భావమెఱుఁగు విమలేందుముఖీ॥　89

తా. ఓ పార్వతీ ! వినుము పుట్టుటయును, వృద్ధియగుటయును, నశించుటయును, పరమాత్మచే నగును. అనఁగా ప్రపంచ సృష్టి స్థితి లయములకు కారణకర్త పరబ్రహ్మమని యెఱుంగుము. ఈ యభిప్రాయముచేతనే సమస్తమును బ్రహ్మమని చెప్పఁబడుచున్నది. నీవు ఈ రహస్యమును దెలిసికొనుము.

వి. "సర్వంఖల్విదంబ్రహ్మ" అను శ్రుతివాక్యము నిచట అనుసంధించునది.

సీ॥ అతిసూక్ష్మమై నీదు నక్షిలోపలియెఱు
కయుఁ బరమాత్మయై ఘనతనుండుఁ ।
దనదు లోపలనున్న దైవస్వరూపంబు
నెట్టిదేవిధముచే నెసఁగుమఱియు ।
ననియంటివేని యీ ఘనతరాత్మునకెప్డు
రూపనామక్రియల్ రూఢిలేక ।
నిలసిల్లునని వేద వేదాంతములుచాటు
కావున నీవును క్రమతనెఱుఁగు ।
తే॥ మట్టి చిద్రూపునకుఁ గీర్తి హాని వృద్ధి ।
కాలములు లేక సంవిదాకారమగుచు ।
నుండుననియెడి భావ మఖండవృత్తి ।
నెంచి పరిపూర్ణుఁగాంచి సుఖింపు దుర్గ ॥ 90

తా. ఓ పార్వతీ ! వినుము. నివ్వరిముల్లువలె మిగుల సూక్ష్మమై నీయొక్క నేత్రమునందుండు యెఱుకయే పరమాత్మ యనఁబడును. ఇట్లు నీయందే యుండు పరమాత్మ యేప్రకారముగ నున్నదనియెదవేని చెప్పెదను వినుము. ఆ పరబ్రహ్మమునకు నామ రూపక్రియలు లేవు. ఇట్లని వేదములును,ఉపనిషత్తులును ఘోషించు చుండును. కావున నీవు ఈ క్రమము నెఱుంగుము. మఱియును, ఆ పరమాత్మకు కీర్తియు, హానియు, వృద్ధియు, కాలములును (ఒక కాలమునందుండి ఇంకొక కాలమునందు లేకుండుటయును) లేక, ఎల్లప్పుడు నేకరీతిగా నుండును. నీవు ఈ యభిప్రాయమును మనస్సునందుంచికొని నాశమును, ఖండమును (క్షీణమును) లేని అఖండాకార పరబ్రహ్మమును దర్శించి మోక్షమునుబొందుము.

సీ॥ కరమొప్పనాయాత్మ ఘనశస్త్రకరవాల
ములు ద్రుంపలేవని తెలిసికొమ్ము ।
అనలునిచేతను నమరంగఁ గాలదు
జలములోముంచినఁ జావదెప్డు ।
పవమానుఁ డొకవేళ భంజింపఁజాలఁడు
క్రూరసత్త్వములచేఁ గూలిపోదు ।

నొనరంగ సాకారతనుబాధలే గాని।
చిన్మాత్రుఁ డీక్రియఁ జెడఁడటంచు॥

తే॥ బలుకబడు పూర్వగీతల సలలితముగ।
నమరు ఛిందంతిశస్త్రాణి యనెడు తెఱఁగు।
భావమందునఁ దలపోసి బ్రహ్మమునకు।
హానిలేదని యెఱుఁగు నీ వదియెగౌరీ॥ 91

తా. ఓ పార్వతీ! వినుము. ఆ పరమాత్మను శస్త్రములు కత్తులు మొదలగు ఆయుధములు ఖండింపఁజాలదు. అగ్ని కాల్పదు. నీళ్లలోముంచినచో మునిఁగిచావదు. వాయువు (గాలి) అలసట పెట్టదు. సింగము మొదలగు దుష్టమృగములచే చంపఁబడదు. ఆ యాత్మకు వివిధశరీరములు ధరించినందున బాధయేగాని వేఱేబాధ లేదు. అనఁగా భగవద్గీతయందు చెప్పఁబడియుండు "నైనంఛిందంతి శస్త్రాణి" అను నీ మొదలగు వాక్యములవలన, పరబ్రహ్మమునకు ఏవిధముచేతను, హానిలేదనియును, ఆ పరబ్రహ్మమే నీవనియును నెఱుంగుము.

వి. భగవద్గీత సాంఖ్యయోగము 23-వ శ్లోకము మొదలు 25-వ శ్లోకమువఱకుఁ జూచినచో నీ విషయము విశదముగా బోధమగును.

క॥ నిరుపమ నిర్గుణు నిత్యునిఁ।
బరిపూర్ణు నఖండమయుని బ్రహ్మస్వరూపుఁ।
నిరతము నీవు గనుంగొని।
స్థిరబుద్ధినినిలిచి పరము జేరు భవాని॥ 92

తా. ఓ పార్వతీ! వినుము. సాటిలేనివాఁడును, గుణరహితుఁడును, శాశ్వతమైనవాఁడును, సర్వత్ర నిండియుండువాఁడును, ఖండము గానివాఁడును, పరమాత్ముఁడును, అగు పరబ్రహ్మమును నీవు యెఱింగి స్థిరబుద్ధిగలదానవై యుండి (అన్యచింతలను వర్జించి) ముక్తినిఁ బొందుము.

క॥ అంగములోపల నాత్మ చె।
లంగుచు నున్నట్టి సర్వలక్షణమంతఁ।

సంగతిగఁ దెల్పినాఁడను ।
ముంగల వినిపింతు దేహ మూలంబంతన్॥ 93

తా. ఓపార్వతీ! ఇంతవఱకును నీకు దేహములోపల ప్రకాశించుచుండు పరమాత్మ లక్షణంబంతయుఁ దెలియఁజేసితిని. ఇఁక శరీరలక్షణంబంతయు నెఱింగించెదను వినుము.

గీ॥ ఘనుఁడు నాయాత్మఁడెల్లప్డు కాయములను ।
నిండి వెలుఁగుచుఁ గ్రియలన్ని నెమ్మిఁజేయు ।
జీవునిన్ సూత్రకారుండు చెలగి నాట్య ।
మలరఁ బ్రతిమలనాడించునట్లు సున్ము॥ 94

తా. ఓ పార్వతీ! వినుము. మహాధికుఁడగు పరమాత్ముఁడు సకలశరీరములయందును పరిపూర్ణుఁడై ప్రకాశించుచు సకలకార్యములను జేయుచున్నాఁడు. ఎట్లన, సూత్రకారుఁడు బొమ్మలను నాట్యమాడించునట్లు, జీవుని, పలువిధక్రియలు చేయునట్లు చేయుచున్నాఁడని యెఱుంగుము.

సీ॥ స్థూలత్వమను బొమ్మ సొంపుగాఁ గల్పించి
తనరఁ బంచప్రాణ తంతువులను ।
మానసమను చేత మఱిపట్టిభ్రమమను
తెఱ దిగవేసియు దీవ్రమైన ।
కర్మేంద్రియములను గలిగి యహంకార
ప్రకృతిక్రియల నృత్యపద మమర్చి ।
జ్ఞానేంద్రియములను ఘనదీపకాంతులు
వెలిగించి బుద్ధిని వెలయఁగూర్చి ।
తే॥ యాటలాడించుచుండు చిదాత్ముఁడెప్పు ।
డట్టి చిద్రూపు విజ్ఞానమనెడి దృష్టి ।
గాంచి సర్వంబు పరమాత్మ కరుణచేత ।
నొనటంచును దలపోసి యాత్మనొందు॥ 95

తా. ఓ పార్వతీ! వినుము. స్థూలముశరీరములనెడి బొమ్మను కల్పించి (నిర్మించి), ఆ బొమ్మలకు పంచప్రాణములనెడి దారములను గ్రుచ్చి, మనస్సనెడి చేతితో పట్టి, భ్రమయనెడి తెఱను దిగవేసి

వేగమనెడి కర్మేంద్రియములను కల్గి, అహంకారమనెడి మాయా క్రియలను నాట్యము చేయునట్లొనర్చి, జ్ఞానేంద్రియములనెడి దీపములను వెలిఁగించి బుద్ధిచేత (ఆబొమ్మను) ఆటలనాడించునపుడు శరీరము లోపలనిండి వెలుఁగునట్టి ఆ పరమాత్ముఁడు,విజ్ఞానమనెడి నేత్రములచే ఆ చిదాత్ముని గనుంగొని, సమస్తమును పరబ్రహ్మముయొక్క కరుణచేతనే జరుగుచున్నదని యెఱింగి, యా పరమాత్ముని చెందును. అనఁగా పరమాత్మతో నైక్యమగును.

వ॥ ఆయాత్మ ప్రభావం బెట్లంటేని ॥ 96

తా. సులభము.

క॥ విశ్వము విశ్వాధీశులు ।
విశ్వస్థులు తెగినతుది నవిశ్వంబగు నా ।
శశ్వద్గాఢతమంబున ।
శాశ్వతుఁడై వెల్గునాత్మ సరణిం గనుమీ ॥

తా. ఓపార్వతీ ! వినుము. ప్రపంచమును, ప్రపంచమునకధిపతులును, ప్రపంచములో నుండు ప్రజలును, నశించినతర్వాత ప్రపంచమే లేకపోవును. అపుడు గాఢాంధకారమగును. అట్టి గాఢాంధకార సమయమునందు సర్వస్థలములయందును శాశ్వతుఁడై నిండివెలుఁగునట్టి పరబ్రహ్మమును కనుంగొనుము.

వి. ఈ యభిప్రాయమును. గజేంద్రమోక్షణంబున గనందగును.

గీ॥ జగము నొకవేళఁగల్పించు సమయజేయు ।
నట్టి యాత్మస్వరూపుని నాత్మయందు ।
నిపుణముగనమ్మి యన్యము ల్నిరసనంబు ।
చేసి కల్మషములఁబాపు భాసురాంగి ॥ 98

తా. ఓపార్వతీ ! వినుము. ఆపరమాత్ముఁడు, ఒకప్పుడు ప్రపంచమును సృష్టించును. ఒకప్పుడు నాశముచేయును. అట్టి పరబ్రహ్మమును మనస్సునందు చక్కఁగా నమ్మి, ఇతరములైన వానినంతయు తొలఁగించి సకల దోషములను (పాపములను) బోఁగొట్టుకొనుము.

ఉ॥ ఎవ్వఁడో యాత్ముఁడంచు మది నెంచకు మాత్మకు నీకు భేదమే।
యెవ్విధి నెంచిచూచినను నేర్పడకుండు నహర్నిశాదులన్।
నవ్యయు నైన చిన్మయుని నన్యుఁడుగాఁ దలపోయకున్నచో।
దివ్యసుఖంబు గల్గు నిఁక దేహగుణంబులఁ జెంద వద్రిజా॥ 99

తా. ఓపార్వతీ ! వినుము. ఆపరమాత్ముఁడు ఎవ్వఁడోయని తలంపకుము. ఏప్రకారముగా పరిశీలనము చేసినప్పటికిని ఆపరమాత్మకును నీకును ఎంతమాత్రమును భేదములేదు. ఎల్లకాలములందును నాశములేక యుండునట్టి ఆ పరబ్రహ్మమును నీకంటె వేఱని యెంచక యుండినయెడల, మోక్షము కల్గును.మఱియు శరీరగుణంబు లేవియు నిన్నంటవని యెఱుంగుము.

క॥ అట్టిచిదాత్ముని భూజను।
లెట్టులు గనిరనుచు సంశయింపకు మిలలోఁ।
బట్టుగఁజేసెడికర్మలు।
గట్టెక్కించుననియెఱుఁగు క్రమముగ గౌరీ॥ 100

తా. ఓపార్వతీ ! వినుము. ఆపరమాత్ముని, జీవులు ఏప్రకారముచేత ఎఱిఁగినారని సందేహపడకుము. జీవులు చేసినకర్మములు క్రమముగా వారిని తరింపఁ జేయునని తెలిసికొనుము అనఁగా ముక్తినిఁ బొందునట్లు చేయును.

వి. ఈ విషయమును రాజయోగ సామ్రాజ్యమునందుఁ విశదముగాఁ గనందగును.

ప్రారబ్ధ లక్షణము.

క॥ ఓ విధుముఖి ప్రారబ్ధము।
స్థావరజంగమములకును సాక్షియు తానై।
నావిధినిఁ బుట్టజేయును।
వేవిధములఁ గర్మమనుభవింపగఁ జేయున్॥ 101

తా. ఓ చంద్రముఖివగుపార్వతీ ! వినుము. స్థిరముగ నుండు వృక్షములు పర్వతములు మొదలగువానికిని, చలించుచుండెడి పశుపక్ష్యాదులకును పరమాత్ముఁడు సాక్షిభూతుఁడై యున్నాఁడు.

అతఁడు ప్రాణులయొక్క పుణ్యపాపములకుఁ దగినట్లు ప్రారబ్ధ కర్మమును అనుభవింపఁ జేయుచున్నాఁడు.

క॥ కర్మముచే జనియించును।
　గర్మముచే స్థితియునొందు గర్మమున జెడున్।
　గర్మము జీవికిఁ బతియై।
　నిర్మలసుఖదుఃఖభీతి నెఱి నొందించున్॥　　102

తా. ఓపార్వతీ! వినుము. జీవుఁడు కర్మముచేతనే పుట్టును. కర్మముచేతనే నశించును. కర్మమే జీవునకు కర్తయై నిర్దోషమైన సుఖంబును, భయావహంబైన దుఃఖమును కలుగఁజేయును.

తే॥ కమలదళనేత్రి కర్మంబు గట్టిగాను।
　సంచితాగామిప్రారబ్ధసరణి యనఁగ।
　ననుభవము మూఁడువిధముల నమరఁజేయు।
　ముక్తి గనినంత రెండు విముక్తి యగును॥　　103

తా. ఓ కమలనేత్రివగు పార్వతీ! వినుము. కర్మము, సంచితము, ఆగామి, (ప్రారబ్ధము) అను మూఁడువిధములగు అనుభవములను కలుగఁజేయును. ముక్తికల్గినతర్వాత వీనిలో రెండుకర్మములు నశించును.

తే॥ ఆత్మమూలంబుగనిన పుణ్యాత్మునకును।
　సంచితాగాములందక సమసిపోవు।
　రెండు నశియించు టెట్లని యంటివేని।
　విశదముగఁ దెల్పెదను విను విమలనేత్రి॥　　104

తా. ఓ పార్వతీ! వినుము. పరమాత్మ తత్త్వము నెఱింగిన పుణ్యపురుషునకు, సంచిత కర్మమును, ఆగామి (క్రియమాణ) కర్మమును నశించును. ఈ రెండు కర్మములును ఏప్రకారముగా నశించునని యడిగితివేని చెప్పెదను వినుము.

మ॥ స్తుతియున్ నిందయు బాపపుణ్యవితతు ల్లోకంబు మోహంబు స।
　మ్మతిగా నెప్పుడు ద్వంద్వవృత్తులమరున్ మాయించుఁబో సంచితం।
　బతివిజ్ఞాన కృశానుచేత నహహా బంధత్వ బీజంబులన్।
　బ్రతివేగంబున వేఁచి నంతటభువిన్ పైజన్మముల్ బాయునే॥ 105

తా. ఓ పార్వతీ! వినుము దూషణ భూషణములు, పాప పుణ్యములు, శోకమోహములు, అనునీ మొదలగు ద్వంద్వములను సంచిత కర్మము నాశనముచేయును. ఎట్లన, విజ్ఞానమనెడి అగ్నిచేత బంధములనెడి బీజములన్నియును వేఁగును, పిదప జన్మాంకురము కాలిపోవును. ఇట్లు జన్మహేతువులగు విత్తనములు వేఁగి పోవుటవలన మరల జన్మములు కలుగవు.

క॥ పరిపూర్ణాత్మునియందును।
గురిగని నుతిచేసి యితర కోర్కులు విడువన్।
మరి మీఁదటి జన్మంబని।
యరయఁగ రాదండ్రు పెద్ద లలికుల వేణీ॥ 106

తా. ఓ పార్వతీ! వినుము. పరమాత్మయందు లక్ష్యముంచి ఇతర చింతలుమాని, ఆ పరబ్రహ్మమునే చింతించుచుండిన యెడల, తర్వాత రాఁబోవు జన్మము కలుగదని పెద్దలు చెప్పుదురు.

క॥ గతజన్మార్జిత మది సం।
చితమనఁగా బరఁగు మీఁద జీవికిఁ బునరో।
ద్ధత జననం బాగామని।
మతి కౌశలు లండ్రు సర్వ మంగళవినవే॥ 107

తా. ఓ పార్వతీ! వినుము. పోయిన జన్మమునందు సంపాదించినట్టి కర్మశేషము సంచితమనఁబడును. ఇదియే తర్వాత రాఁగల జన్మము నొసంగును దీనికే ఆగామి (క్రియమాణము) అని పేరు. ఇట్లని బుద్ధిమంతులు చెప్పుదురు.

సీ॥ తనచేయుకర్మాన దగిలి దేహంబెత్తు
టది వర్తమానమె యమరుచుండు।
గాన ప్రారబ్ధసంగతి యనుభవమది
దేహనాశముదాఁక తేజరిల్లు।
యతిశయ సుఖదుఃఖ మదిపొందుచుండును
తీఱును జీవికి తెలివిగల్గి।
యగణిత సుజ్ఞానమంది నిర్మలుఁడగు
నందాక కర్మంబు నవియఁబోదు॥

తే॥ ఏలపోదని మది సంశ యించితేని।
విసుము చెప్పెద ముక్తినిఁ గనుగొనుటకు।
మనసుచెందెడి వఱకుండు మరల నిన్ను।
పుణ్య పాపంబు లంటవు పువ్వుబోణి॥ 108

తా. ఓ పార్వతీ! జీవియైనవాఁడు చేసిన కర్మముచేతనే జన్మము కల్గుచున్నది అదియే వర్తమానజన్మము ఈ జన్మమునందు అనుభవించునట్టి కర్మము ప్రారబ్ధ మనఁబడును. ఇది శరీరనాశమగు పర్యంత ముండును ఈ జన్మమునందు సుఖదుఃఖములు కల్గుచుండును. ఇవి ఎప్పుడు పోవుననఁగా, జీవికి సుజ్ఞానముకల్గి దోషరహితుఁడయిన మీఁద. పోవును. ఇంతకులోపల ఏల పోదనియును, ఎంతవఱకుండుననియును, నీకు సంశయము కలిగినయెడల చెప్పెదను వినుము. మనస్సు ముక్తినొందుటకు తెలిసికొనునంతవఱకు (సుజ్ఞానమొందు నంతవఱకు) ఉండును, ఆతర్వాత పుణ్యపాపము లేవియు నిన్నంటవు.

వి.శ్లో॥ శ్రోత్రాదీనిన చేంద్రియాణి విషయాశ్శబ్దాదయోఽహమ్మనో।
వృత్తిర్నైవ సుఖాసుఖానిచ తథా మానావమానావపి।
శీతోష్ణామిత పుణ్యపాప సుమహా సంకల్పజాలాన్యహో।
నైవానేన సమాధినా సహ మనో లీనే పరబ్రహ్మణి॥

తా. సమాధివలన మనస్సు పరబ్రహ్మమునందు లీనమైనప్పుడు శ్రోత్రాదీంద్రియములును, శబ్దాది విషయలును, అహంకారమును, మనస్సును, వృత్తియును, సుఖదుఃఖములును, మానావమానము, శీతోష్ణములును, అమితమైన పుణ్యపాపములును, మితిలేని సంకల్పములును, లేనేలేదు.

సమాధి యనఁగా:—

శ్లో॥ యదా భవతిచైకత్వం జీవాత్మ పరమాత్మనోః।
తదా సమాధ్యవస్థాయాం గమిష్యంతి యమీశ్వరాః॥

తా. ఎప్పుడు జీవాత్మ పరమాత్మలయొక్క ఐక్యము కలుగుచున్నదో, అప్పుడు యోగీశ్వరులు సమాధిస్థితినిం బొందెదరు.

ఇట్లు శివయోగప్రదీపిక తృతీయపటలమునందు చెప్పఁబడి యున్నది.

శ్లో॥ నమేస్తి దేహేంద్రియబుద్ధియోగో।
నపుణ్యలేశోపి నపాపలేశః।
క్షుధా పిపాసాది షడూర్మిదూరః।
సదా విముక్తోస్మి చిదేవకేవలః॥

తా. నాకు దేహముయొక్కయు, ఇంద్రియములయొక్కయు, బుద్ధియొక్కయు, పుణ్యలేశముయొక్కయు, పాపలేశముయొక్కయు, ఆఁకలిదప్పులయొక్కయు, షడూర్ములయొక్కయు, ఇవి మొదలగునవి నాకు ఎప్పుడును లేదు; నేను కేవలము చిన్మాత్రుఁడనై యున్నాఁడను.

లేశము=రవంత. అనఁగా పుణ్యపాపము లెంతమాత్రమును లేదని భావము.

ఇట్లు సర్వవేదాంతసిద్ధాంతసంగ్రహమునందుఁ జెప్పఁబడి యున్నది.

షడూర్ములను గూర్చి ఈ గ్రంథమునందు 84-వ పుటయందును, సమాధిలక్షణమును 183-వ పుటయందును గనందగును.

శ్లో॥ దేవం మత్వా హర్షశోకౌ జహాత్యత్రైవ ధైర్యవాన్।
నైనం కృతాకృతేపుణ్యపాపే తాపయతః క్వచిత్॥

తా. వేదాంతవిద్య నెఱింగిన సాధనసంపన్నుఁడు పరమాత్మను తెలిసికొని, ఈ జన్మమునందే లాభాలాభాది సకల సుఖదుఃఖములు రెంటిని అనఁగా సకల ద్వంద్వములను విడుచుచున్నాఁడు. మఱియు, నిట్టిజ్ఞానిని చేయఁబడినట్టియు, చేయఁబడనట్టియు పుణ్యపాపములు రెండును తపింపఁ జేయునవి కావు.

ఇట్లు వేదాంతపంచదశియందుఁ జెప్పఁబడి యున్నది.

ఈ విషయమును గూర్చి శ్రుతులయందు నిట్లు చెప్పఁబడి యున్నది.

శ్లో॥ ప్రియేషుస్వేషుసుకృత మప్రియేషు చ దుష్కృతమ్
విసృజ్య ధ్యానయోగేన బ్రహ్మాభ్యేతి సనాతనమ్॥

తా. బ్రహ్మజ్ఞాని తనయొక్క పుణ్యమును మిత్రులయొద్దను, తనయొక్క పాపమును శత్రువులయొద్దను నుంచి, ధ్యానయోగము చేత శాశ్వత బ్రహ్మానందము నొందుచున్నాఁడు.

శ్రుతి॥ "అధ్యాత్మయోగాధిగమేనదేవం మత్వాధీరో హర్ష శోకౌ జహాతి॥"

తా. సాధనసంపన్నుఁడు పరమాత్మను ఎఱింగినవాఁడై ఈ జన్మమునందే లాభాలాభనిమిత్తక సుఖదుఃఖములను విడుచుచున్నాఁడు. అని కఠోపనిషత్తునందుఁ జెప్పఁబడి యున్నది.

శ్రుతి॥ "నైనం కృతాకృతే తపత ఇతి"॥

తా. చేయఁబడినవిగాని, చేయఁబడనవిగాని అగు పుణ్యపాపములు జ్ఞానిని తపింపఁజేయవు. అని యాజ్ఞవల్క్య బ్రాహ్మణమునందుఁ జెప్పఁబడి యున్నది.

శ్రుతి॥ "తస్య పుత్రాదాయ ముపయంతి సుహృదః సాధుకృత్యం, ద్విషంతః పాపకృత్యం" అనఁగా, జ్ఞానియొక్క ధనాది పదార్థములను వాని పుత్రులు గ్రహించెదరు. వాని పుణ్యకర్మమును వాని సేవచేయు సుహృదులును భక్తులును గైకొనెదరు. వాని పాపకర్మమును ద్వేషించునట్టి నిందక పురుషులు గ్రహించెదరు.

క॥ ఒనర శరీరాంభక ।
మనుచును శ్రుతిమూల మమరు నది దేహవినా ।
శనమగు పర్యంతరమును ।
ననుభవమునఁ గాని తీఱ దని యెఱుఁగు శివా॥ 109

తా. ఓపార్వతీ ! వినుము. (శరీరారంభకంకర్మం) అని వేదమునందుఁ జెప్పఁబడియున్నది. కాఁబట్టి జీవికి దేహము కల్గుచున్నది. ఇది దేహము నశించునంతదాఁక (శరీరము) ఉండును.ఇది ఎట్లు తీఱుననఁగా, అనుభవింపవలసిన కర్మములన్నియు ననుభవించునంతదాఁక పుట్టుచు గిట్టుచు నుండును. ఎప్పుడు కర్మనాశనమగునో (అనుభవింపవలసిన కర్మములన్నియు తీరిపోవునో) అపుడు శరీరము నశించి పునర్జన్మరహితమై మోక్షము నొందును.

చ॥ ఘనమగుజ్ఞానవాసనను గర్మముబోవు నటంచుఁ గట్టిగా ।
మునుపు నఖండచిన్మయుని మోదమునన్ గనుఁగొన్నధన్యులే ।
తనువుకు గల్గుకర్మమది తప్పునటంచును బల్కినారుగా ।
వనజదళాక్షి నీవిఁకను వంతదొఱఁగి సుఖింపు మద్రిజా ॥ 110

తా. ఓపార్వతీ ! వినుము. మేలైన జ్ఞానవాసనచేత కర్మము లన్నియు తీఱును. అని అఖండమైనపరబ్రహ్మమును గాంచిన పుణ్యాత్ము లందఱును వచించినారు. కాబట్టి, ఇపుడు నీకు జ్ఞానవాసనాబలముచేత సకలకర్మములును నాశనమయ్యెను. మఱియు నీవు పరబ్రహ్మమును దర్శించినదాన వగుటంబట్టి దుఃఖరహితవై మోక్షమును పొందుము.

క॥ ప్రారబ్ధ మనుభవింపక ।
తీరదు సుజ్ఞానమునను దీఱునటంచున్ ।
ధీరులు నాత్మానాత్మ వి ।
చారులు చెప్పంగవినవె శశినిభవదనా ॥ 111

తా. ఓ చంద్రముఖివగు పార్వతీ ! ప్రారబ్ధకర్మము అనుభవింపక గాని తీఱదనియును, అది సుజ్ఞానముచేతనే తీఱు ననియును, సుజ్ఞానవంతులును, ఆత్మానాత్మ విచారపరులును చెప్పుదురు. నీవు అట్టివారిబోధములను వినుము.

వ॥ మఱియును ॥ 112

తా. సులభము.

తే॥ భోగములు చెల్లినంతట బొందికేమి ।
యనుభవము లేదటంచు నీవాత్మ దెలిసి ।
నిత్యనిర్మలతత్త్వంబు నెపుడుమదిని ।
పాదుచేసియు భ్రమలను బాపుగౌరి ॥ 113

తా. ఓపార్వతీ ! వినుము. జన్మమెత్తి అనుభవింపవలసిన కర్మములన్నియును అనుభవించి నైన తర్వాత, శరీరమున కేవిధమైన కర్మమును లేదని నీవు తెలిసికొని, నిత్యనిర్మలమైన యెఱుకను సర్వకాల సర్వావస్థలయందును మనస్సునందు స్థాపించి మాయచేఁ గల్గిన భ్రమలనన్నిటిని తొలఁగించికొనుము.

క॥ నయమైన యెఱుక నీవని।
భయమొందక దలఁచి మదిని ప్రజ్ఞాన్వితవై।
అయమాత్మాబ్రహ్మం బను।
క్రియ గల శ్రుతి నమ్మి ముక్తి కేగుభవానీ॥ 114

తా. ఓ పార్వతీ! వినుము. వాస్తవమైన ఎఱుకయే నీవని నిర్భయురాలవై యెఱుంగుము. మఱియు వివేకవతివై "అయమాత్మాబ్రహ్మ" మని పల్కెడి శ్రుతిని నమ్మి ముక్తినిఁ బొందుము.

వి. "అయమాత్మాబ్రహ్మ" ఈ ఆత్మబ్రహ్మము. అను నీ మహావాక్యమును అథర్వవేదమునందలి మాండూక్యోపనిషత్తు మహావాక్యమునందును; బృహదారణ్యకోపనిషత్తు 25-19 వ మంత్రమందును జెప్పఁబడియున్నది.

క॥ స్థిరమైన యాత్మ నీవని।
నిరతము తలపోయ మాయ నిరసనమొందుఁ।
మరియు నహంబ్రహ్మంబని।
గురుతరముగ శ్రుతులుపల్కుఁ గుంజర గమనా॥ 115

తా. ఓ మదించిన యేనుఁగువంటి గమనముగల పార్వతీ! వినుము. శాశ్వతమైనట్టి పరబ్రహ్మము నీవు అని నిరంతరమును తలంచితివేని మాయ నశించును. మఱియు "అహంబ్రహ్మ" మని శ్రేష్ఠముగా వేదము ఘోషించు చుండును.

వి. "అహంబ్రహ్మాస్మి" నేను బ్రహ్మముగ నున్నాను. అని యజుర్వేద బృహదారణ్యకోపనిషత్తునందుఁ జెప్పఁబడి యున్నది.

క॥ సత్యాత్మరూప మీవని।
ప్రత్యహమును నెంచి బ్రహ్మ భావన గనుమీ।
తత్త్వమసి యనుచు శ్రుతి తగ।
కాత్యాయని పల్కుచుండు కమలదళాక్షీ॥ 116

తా. ఓ తామరదళములవంటి కన్నులుగల పార్వతీ! వినుము స్థిరమైన ఆత్మయే నీవని రేయింబవలును తలంచి యీ యభిప్రాయంబును దెలిసికొనుము. వేదమునందు "తత్త్వమసీ"యని చెప్పఁబడి యున్నది.

వి. "తత్త్వమసి" అది నీవుగా ఉన్నావు. అను మహావాక్య మును శుకరహస్యోపనిషత్తునందును, సామవేద ఛాందోగ్యోపని షత్తు ఆఱవ ప్రపాఠకమునందును జెప్పఁబడి యున్నది.

గీ॥ అగజ "పురుషఏ వేదం" బటంచుఁబురుష ।
సూక్తమునఁ బల్కు భావంబు సొరిదినమ్మి ।
సర్వమీవని తలపోసి సంశయములు ।
మాని నిర్మల నిత్యత్వ మమతనొందు॥ 117

తా. ఓ పార్వతీ! వినుము. "పురుష వేదగ్ంసర్వమ్" అని పురుషసూక్తమునందుఁ జెప్పఁబడి యుండునట్టి యభిప్రాయమును నమ్మి సర్వము నీవని యెఱింగి, సకల సంశయములుమాని, నిర్దోష మైన పరమాత్మ తత్త్వమును బొందుము.

వి. "పురుషఏవేదగ్ంసర్వమ్" సర్వమును ఆ పరబ్రహ్మమే అను పురుషసూక్తముయొక్క తాత్పర్యము నెఱింగి నీవును ఆ పరమాత్మను బొందుము.

## ఆత్మస్వరూప నిర్ణయము.

తే॥ ఆత్మఁడేరూపుఁ డెట్టివాఁ డంటివేని ।
యంతరిక్ష సమానుఁడై యలరు మఱియు ।
పరగ నాకాశవత్సూక్ష్మ బ్రహ్మమనుచు ।
శ్రుతులు ఘోషించుటనువిను సుందరాంగి॥ 118

తా. ఓ సుందరగాత్రివగు పార్వతీ! వినుము. పరబ్రహ్మము ఏస్వరూపముతో నుండును? ఎట్టివాఁడు? అని యడిగితివేని చెప్పె దను. ఆ పరబ్రహ్మము అంతరిక్షసమానుండును, ఆకాశమువలె సూక్ష్మరూపియై కనులకగపడనివాఁడును నై యుండును. ఇట్లు వేద ములు చాటుచుండును.

(వి) ఆపరమాత్మ "ఆకాశవత్సూక్ష్మ శరీరమాత్మా" పర మాత్మ ఆకాశమువలె సూక్ష్మశరీరుఁడై కనులకు గోచరింపనివాఁడై యుండును.

తే॥ సచ్చిదానంద సంసర్గ సాక్షీనీవు ।
గాను గురిగని శుద్ధాత్ముఁ గలయవలయు ।

నవల సత్యస్వరూప మనంతమనుచు ।
బల్కు శ్రుతిమూలమెఱిఁగి దుర్భ్రాంతిమాను ॥ 119

తా. ఓ పార్వతీ ! వినుము. సత్తు, చిత్తు, ఆనందము. అను లక్షణములతోఁగూడిన పరబ్రహ్మము యొక్క సాక్షిగా నీవు ప్రకాశించుచున్నావు. కావున, నీవు అట్టి లక్షణములుగల పరమాత్మ యొక్క స్వరూపమును దెలిసికొని, ఆ పరిశుద్ధాత్మునితో నైక్యము నొందవలయును. ఆతర్వాత సత్యస్వరూప మనంతమనెడి వేదరహస్యము నెఱింగి దుష్టములైన భ్రమలను వర్జింపుము.

వి. శ్లో॥ "సత్త్వంచిత్త్వం తథానందః స్వరూపం పరమాత్మనః ।
నిర్గుణస్య గుణాయోగా ద్గుణాస్తు నభవంతితే ॥"

తా. సత్తు, చిత్తు, ఆనందము, అను నివి పరమాత్మకు లక్షణములేగాని, వేఱేలక్షణములు లేవు. అతఁడు నిర్గుణుండుగాన ఇతర గుణములు సంభవింపవు.

ఇట్లు సర్వవేదాంత సంగ్రహమునందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ "సత్యంజ్ఞాన మనంతంచ బ్రహ్మలక్షణ ముచ్యతే ।
సత్యత్వాత్ జ్ఞానరూపత్వా దనంతత్వా త్త్వమేవహి ॥"

తా. ఆ పరబ్రహ్మము సత్యమును, జ్ఞానమును, అనంతమును, గలదని యెఱుంగుము. అది ఇట్టి లక్షణములు గలిగి యున్నందున ఆ పరబ్రహ్మము నీవని తెలిసికొనుము.

ఇట్లు శ్రీశంకరాచార్య కృత తత్త్వోపదేశమునందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ "నిత్యశుద్ధం బుద్ధముక్తం సత్యమానందమద్వయం ।
తురీయ మక్షరంబ్రహ్మ అహమస్మి పరంపదమ్॥"

తా. శాశ్వతముగను, నిర్మలముగను, జ్ఞానస్వరూపముగను, తురీయముగను, ఆనందముగను, రెండవది లేనిదిగను, నాశ మొందనిదిగను, నుండు పరబ్రహ్మమే నేనై యున్నాను అని తెలిసికొనుము. అదే పరమపదము, అనఁగా మోక్షము.

ఇట్లు స్మృతియందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ "సత్యం జ్ఞాన మనంతంచే త్యేవంబ్రహ్మ స్వలక్షణమ్ ॥"

తా. సత్యమును, చిద్రూపమును అనంతమును, పరబ్రహ్మముయొక్క లక్షణము.

క॥ ఆనంద మూర్తినీవని ।
మానసమున దలంచి భ్రమలు మానంగ వలెంబో ।
యానందో బ్రహ్మంబని ।
శ్రీనాయకి శ్రుతులయందుఁ జెప్పంగ వినవే ॥ 120

తా. ఓపార్వతీ ! వినుము నీవు ఆనందస్వరూపివని మనస్సునందు తలంచి భ్రమలను మానుము. మఱియు "ఆనందోబ్రహ్మ" మని శ్రుతులు ఘోషించుటను నీవు ఎఱింగియుందువుకదా ?

వి. "ఆనందోబ్రహ్మ" ఆనందమేబ్రహ్మము. అనియును, "ప్రజ్ఞానమానందంబ్రహ్మ" మహాజ్ఞానమేబ్రహ్మము, అని ఋగ్వేద ఐతరేయోపనిషత్తునందును జెప్పంబడియున్నది.

సీ॥ ఎన్నిరీతులబ్రహ్మ మెంచిచూచినగాని
నీకన్న లేదుగా నీరజాక్షి ।
యటుగాన నేఁజెప్పి నట్టిశ్రుత్యుక్తుల
భావంబుగని బుద్ధి పాదుకొల్పి ।
నిత్యుండై సత్యుండై నిగమాంతవేద్యుండై
యరయ సచ్చిద్రూపుఁ డెఱుకయనుచు ।
మదినమ్మి యన్యముల్ మఱచి సుఖానంద
పదవినొందుటకునై ప్రతిదినంబు ॥

తే॥ నీవు దలపోసిబంధముల్ నిరసనంబు ।
జేసి మానసమునయందు స్థిరముజేసి ।
యున్నమీఁదట కైవల్య మెన్నినట్లు ।
కల్లు నిక్కంబుగానీకు కంబుకంఠి ॥ 121

తా. ఓపార్వతీ ! వినుము. ఏప్రకారముగా విచారించి చూచినప్పటికిని నీకంటె పరబ్రహ్మము వేఱేలేదు. కాబట్టి నేను ఇదివఱకు నీకుఁ జెప్పినట్టి శ్రుతులయొక్క యభిప్రాయమును నీవెఱింగి బుద్ధియందు దానినే నిశ్చయించి శాశ్వతుఁడును, సత్యస్వరూపి

యును, వేదాంతములచే నెఱుఁగఁదగినవాఁడును, సచ్చిదానంద స్వరూపుఁడును అగు పరబ్రహ్మమే ఎఱుక యని నమ్మి, ఇతర విష యముల నంతయును మఱచి మోక్షానందసుఖము ననుభవించుట కొఱకు ప్రతిదినంబును నీవు చింతించి (ధ్యానించి) బంధములను తొలఁగించి మనస్సును స్థిరముచేసి యుండినయెడల, నీవు తలంచి నట్లు ముక్తి కల్గును.

చ॥ అనియిటు పల్కు శంకరు ముఖాబ్జముపార్వతిచూచి యిట్లనున్।
దనువునఁగల్గు కర్మములు తప్పదు వేఱు విధంబుచేతనం।
చనుటకు నాకు సంశయమునయ్యె మనంబున నేలయన్నచో ।
ఘనమగు తెల్వి గుర్తెఱిగి కాంచినమీఁదట బంధ మున్నదే॥

తా. అంత పార్వతీదేవి పరమశివునిఁజూచి యిట్లనియె. ఓ పరమేశ్వరా! జన్మమెత్తినందువలనఁ గల్గిన కర్మములు (అనుభ వింపఁదగిన కర్మములు) అనుభవింపక తప్పదని ఇదివఱకు చెప్పితిరి. ఈ విషయంబునందు నాకుసంశయముకల్గెను. అదేమనఁగా, ఘన మైన తెల్విని (జ్ఞానమనెడి ఎఱుకను) ఎఱింగినతర్వాత కూడబంధము కలదా ? ఇదియే నా సంశయము

క॥ హర బంధ మోక్షణములే ।
తెరువున సంభవమునొందు తెల్పుము నాకున్ ।
గురిగనుగొను పార్వతిగని ।
స్మరదహనుఁడు బంధమోక్ష మార్గము దెల్పెన్ ॥ 123

తా. ఓ పరమేశ్వరా! బంధమును, మోక్షమును, ఏప్రకార ముగాఁ గల్గును? ఈ విషయమును దెల్పుము. అని యడుగఁగా పరమశివుఁ డిట్లనియె, ఓపార్వతీ! బంధలక్షణమును, మోక్షలక్ష ణమును జెప్పెదను వినుము.

## బంధమోక్షముల వివరణము.

సీ॥ బంధమోక్షణముల భావమంతయుఁ దేట
పఱతు సంశయములు పాఱద్రోల ।
విను బంధమోక్షముల్ ఘనుఁడాత్మునకు నెప్డు
వెదకిచూచిన లేవు వివిధగతుల ।

నతిబంధమోక్షము లరయ మనోబుద్ధి
ధర్మము లాత్మకు ధర్మమనియు।
ననరా దదెట్లని యనిన సుజ్ఞానంబు
నొంది నిర్మలుఁడయ్యు నొక్కవేళ॥

తే॥ తాను బద్ధుఁడనని లేని మానసాభి।
మానమున పూర్ణ విజ్ఞాన హానిజెంది।
బద్ధునిగ జేయు నదిగాక పరగఁ దాను।
ముక్తుఁడనియెంచ బంధ విముక్తుఁ డగును॥ 124

తా. ఓపార్వతీ! వినుము. నీకుఁ గల్గిన సంశయములను పాఱఁద్రోలుటకై బంధమోక్షలక్షణములన్నియును తేటగాఁ దెలియ జేయఁగలను. ఈబంధమోక్షములు మహా మహిమ గలవాఁడగు పరముగ వెదకి చూచినను లేదు. మనస్సుయొక్కయు బుద్ధియొక్కయు నాత్మకు ఏవిధధర్మములన్నియు ఆత్మకు లేవు మనోబుద్ధి ధర్మము లాత్మకు గలవని చెప్పఁదగదు. ఎట్లనఁగా, సుజ్ఞానమునొంది నిర్మలుఁడై యుండినప్పటికిని ఒకానొక సమయమునందు తాను బద్ధుఁడని తనకు లేని మానసాభిమానమునొంది, తనయొక్క సంపూర్ణమైన సుజ్ఞానమునకు హానికల్గినయెడల బద్ధునిగాఁ జేయును. అట్లుగాక, నేను ముక్తుఁడనని తలంచినయెడల, బంధవిముక్తుఁడై మోక్షమును బొందును.

వి. శ్లో॥ "బంధాయ విషయాసక్తం ముక్త్యై ర్నిర్విషయంమనః॥"

తా. మనస్సు విషయవాసనలయం దాసక్తిగలిగి యుండుట బంధము కొఱకును, మనస్సునందు విషయవాసనలను పరిత్యజించి యుండుట మోక్షముకొఱకును అని తెలియవలయును.

శ్లో॥ "మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః॥"

తా. మనుష్యులకు మనస్సే బంధమోక్షములకు హేతువగును.

ఇట్లని పురాణములందుఁ జెప్పఁబడియున్నది.

తే॥ బద్ధుఁడగువాని కెప్పుడేని బంధమమరు।
ముక్తుడగువాని మెప్పుడును మోక్షమబ్బు।

గాన నేజెప్పినట్టి యీ ఘనవివేక ।
వాసనను బొంది మోక్షము దాసబొందు॥ 125

తా. ఓ పార్వతీ! వినుము. బద్ధుఁడగు పురుషునకు ఏకాలమునం దైనను (అనఁగా ఏజన్మమునం దైనప్పటికిని) బంధమే (సంసారమే) కలుగును ముక్తుఁడగువాని కెప్పుడైనను మోక్షమే సిద్ధించును. కాఁబట్టి నేను బోధించినట్టి యీ శ్రేష్ఠమైన వివేక వాసనను (సుజ్ఞానమును) బొంది మోక్షమును నొందవలయుననెడి అభిలాషగల దానవగుము.

వి. శ్లో॥ "అవిచార కృతోబంధో విచారేణ నివర్తతే॥"

తా. అవిచారమువలన (వేదాంతవిచారణ చేయనందువలన) బంధమును, తత్త్వవిచారణ చేయుటవలన బంధనివర్తియును, (మోక్షమును) కలుగును.

ఇట్లు వేదాంతపంచదశియందుఁ జెప్పఁబడి యున్నది.

గీ॥ మదిని నే బుద్ధి యేవాంఛ పొదలుచుండు ।
నదియు ముందట ప్రాప్తియౌ ననుచు నమ్ము ।
అతివ యయంవాపి యనుచుఁ బూర్వ ।
గీతలను ఖ్యాతిగనుబల్కుఁ గీరవాణి॥ 126

తా. ఓ పార్వతీ! వినుము. మనస్సునందు ఏకోరిక కలిగి యుండునో, అదే తర్వాత ప్రాప్తించునని నమ్ముము. ఈ యభిప్రాయము ననుసరించియే భగవద్గీతయందు "యయంవాపి స్మరన్ భావం" అని చెప్పఁబడి యున్నది.

వి. శ్లో॥ "ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్॥"

తా. తనను తనచేతనే ఉద్ధరించుకొనవలయును. తనను నశింపఁ జేసికొనరాదు.

ఇట్లు భగవద్గీత 6-వ అధ్యాయము 5-వ శ్లోకమునందును,

శ్లో॥ "యయంవాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్ ।
తంతమేవేతి కౌంతేయ సదా తద్భావభావితః॥"

తా. పురుషుఁడు మరణకాలమునందు ఏయేవిధముగా మనస్సునందు ఏయే దేవతలనుగాని, ఏయే విషయములనుగాని

తలంచుచు ప్రాణమును విడుచునో, అట్టి వాసనాబలముచే వాసిత మైన భావనాప్రకారముగ ఆయా భావమునే పొందును.

ఇట్లు భగవద్గీత 8-వ అధ్యాయము 6-వ శ్లోకమునందును చెప్పఁబడి యున్నది.

తే॥ మనసు నెందాక తత్త్వమం దనువుగాదొ।
బంధమగుటకు నదియె సంప్రాప్తకరమ।
టంచు మదినెంచి చిద్రూపు నంచితముగఁ।
గాంచి పరమాత్మ పద మొందు కంబుకంఠి॥ 127

తా. ఓ పార్వతీ! వినుము. మనస్సు ఎంతకాలముదాఁక పరబ్రహ్మతత్త్వమునందు చొరకయుండునో, అంతవఱకును బంధమే ప్రాప్తించును ఇట్లు తెలిసికొని పరమాత్మను దర్శించి మోక్షమును బొందుము.

సీ॥ బంధంబు దొలఁగు నుపాయంబు మది నెంచి
నిత్యమౌ పరమాత్మ నెఱయ నమ్ము।
మింతకన్నను నన్య మెద్దియు లేదని
యూహించి సత్యంబు పోహణముగ।
నమ్మువానికి నప మృత్యువు మఱి కాల
మృత్యువు దొలఁగి తా ముక్తినొందు।
మానసం బెచ్చోట మది లయ మొందునో
యచ్చోట బ్రహ్మైక్య మగు నిజముగ॥

తే॥ నిందు నీ మది సంశయ మొందవలదు।
ఆత్మ దశదిశలను పూర్ణుఁడై వెలుంగు।
గాన నెచ్చట లయమైన జ్ఞానికచట।
శుద్ధ బ్రహ్మైక్యపదసిద్ధి పొరిది గల్గు॥ 128

తా. ఓ పార్వతీ! వినుము. బంధము నివర్తియగుటకు ఉపాయంబును మనస్సులో నెంచి శాశ్వతుండగు పరబ్రహ్మమును చక్కఁగా నమ్ముము. ఇంతకంటెను వేఱేదియును లేదని తెలిసికొని, సత్యమైన పరమాత్మను నమ్మువానికి అపమృత్యువును, (మధ్యకాలమునందు గల మరణమును,) ఆయుస్సు తీఱినతర్వాత సంభ

వించు కాలమరణమును నివర్తియై ముక్తి కల్గును. ఎచ్చట మనస్సు లయించునో అచ్చట పరమాత్మైక్యము సిద్ధించును. ఈ విషయము నందు నీవు సంశయము నొందకుము. పరమాత్ముఁడు సకల స్థలములయందును ప్రకాశించును గాన, ఎఱుక నెఱిఁగిన సుజ్ఞాని యెచ్చట లయమొందినను అచ్చట నిశ్చయముగా నిర్మల పరబ్రహ్మైక్యపదసిద్ధిని పొందును.

తే॥ అమర నుత్తరగీతల గ్రమముగాను ।
  యత్రయత్రమృతోఽజ్ఞాని యనుచుబల్కు ।
  భావమాత్మను దలపోసి భ్రాంతిబాసి ।
  నిత్యసత్యస్వరూపివై నెగడుగౌరి॥     129

తా. ఓపార్వతీ! వినుము. ఉత్తరగీతయందు "యత్రయత్ర మృతోఽజ్ఞాని" అని చెప్పఁబడియున్నది. నీవు ఈ యభిప్రాయమును మనస్సునందెంచి, భ్రమలను బోఁగొట్టుకొన్నదానవై, నిత్యసత్య స్వరూప పరబ్రహ్మంబవై వెలుంగుము.

వి॥ శ్లో॥ "యత్ర యత్ర మృతో జ్ఞానీ యేనవా కేన మృత్యునా ।
  యథా సర్వ గతం వ్యోమం తత్రతత్ర లయం గతాః ।
  ఘటాకాశ మివాత్మానం విలయం వేత్తి తత్త్వతః॥"

తా. జ్ఞానియైనవాఁడు ఏయేస్థలములయందు ఏయేవిధముగా మృతి నొందినను, సర్వత్ర వ్యాపించి యుండు ఆకాశమువలె ఆ స్థలమునందే లయమొందుచున్నాఁడు. వాస్తవముగా ఘటాకాశము (మహాకాశమునందు కలిసిపోవునట్లు) ఆత్మ లయమొందునని తెలియఁదగినది.

శ్లో॥ "శుద్ధబ్రహ్మరతో యశ్చ సనాయా త్యేవ కుత్రచిత్ ।
  తస్య ప్రాణా విలీయంతే జలే సైంధవ పిండవత్॥"

తా. శుద్ధముగా బ్రహ్మోపాసనము చేయువాఁడు ఎచ్చటను పోవుటలేదు. ఆబ్రహ్మవేత్తయొక్క ప్రాణములు జలమునందు ఉప్పుగడ్డ కలిసిపోవునట్లు, పరమాత్మయందే లయ మొందుచున్నవి.

ఇట్లు వేదాంతసిద్ధాంతగ్రంథమునందును,

శ్లో॥ "యత్ర యత్ర మృతోజ్ఞానీ ఏకదా నేకమృత్యునా ।

యథాసర్వ గతంవ్యోమ తత్రతత్ర లయంగతః॥"

తా. జ్ఞానియైనవాఁడు, మృత్యువుచేతఁగాని, అపమృత్యువు చేతగాని, ఎచ్చటెచ్చట మరణము నొందినప్పటికిని, అచ్చటచ్చట సకల వస్తువులయందును వ్యాపించియుండు ఆకాశమువలె పరిపూర్ణ బ్రహ్మముతో నైక్యము నొందును.

ఇట్లు ఉత్తరగీతయందును చెప్పఁబడి యున్నది.

వ॥ అదియునుంగాక॥ 130

తా. సులభము.

గీ॥ యోగసామ్రాజ్యమెఱిఁగిన యోగులకును, వేగిరము తత్త్వసంసిద్ధి విశదమగును।
గాన నీవట్టిసిద్ధిని గంటివిఁకను, రాజరాజేశ్వరి యనంగ రహిఁవెలయుము॥ 131

తా. ఓపార్వతీ! వినుము. యోగసామ్రాజ్యమును దెలిసికొన్నట్టి(అనుభవమునకుఁ దెచ్చుకొనినయట్టి) రాజయోగులకు తత్త్వసిద్ధి(పరమాత్మబోధము) చక్కఁగా దెలియును. కావున నీవు ఇపుడు అట్టి ఆత్మయోగసిద్ధిని గాంచితివి (దర్శించితివి) ఆహేతువుచే నీవు ఇదిమొదలు భూమియందు రాజరాజేశ్వరి యను దివ్యనామముతో (రాజరాజేశ్వరి అను పేరుతో) ప్రకాశించుచుందువు.

వి.(శ్లో॥) "సచ్చిదానందఏవత్వం విస్మృత్యాత్మతయా పరం।
జీవభావ మనుప్రాప్తః సఏవాత్మాసి బోధతః।
అద్వయానంద చిన్మాత్రః శుద్ధ సామ్రాజ్యమాగతః॥"

తా. నీవే సచ్చిదానందస్వరూపివి, ఆత్మతత్త్వమును మఱచి ఆత్మయగు నీవు జ్ఞానముచేత అద్వైతానంద పరిశుద్ధ చిన్మాత్ర స్వరూపివై సామ్రాజ్యమునుపొంది (యోగసామ్రాజ్యమునుపొంది) ప్రకాశింపుము.

ఇట్లు తత్త్వోపదేశమునందుఁ జెప్పఁబడియున్నది.

---

☞ ఈ విషయమును దీనియొక్క విశేషార్థమును దెలియఁజేయునట్టిరాజయోగ సామ్రాజ్యమునందును; మఱియు ఈ గురుగీతాసారమునందు ఇదివఱకుచెప్పఁబడియుండు తాత్పర్య వివరణమునందును విశదముగాఁ గనఁదగును. కాఁబట్టి రాజయోగసామ్రాజ్యమును సవిస్తరముగను, సంపూర్ణముగను దెలిసికొనుటకు అభిలాష గలవారు గురుగీతాసారమును మొదటనుండి కడవఱకు అవశ్యముచదువవలయును. బ్రహ్మానందసుఖము (ఆత్మజ్యోతి) తప్పక కల్గును.

శ్రీ ర స్తు.

ఓం పరబ్రహ్మణే నమః.

# రాజయోగసామ్రాజ్యము.

శ్లో॥ శ్రీరాజయోగ సామ్రాజ్యం నిర్వికల్ప విరాజితమ్।
తస్యానుభవసిద్ధ్యర్థం గురుసేవాం కరోతియః ॥ ౧

తా. సమగ్రమైన ఐశ్వర్యము, ధర్మము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము, అను నీ యాఱు శ్రీలతోఁ గూడినట్టిదియును, యోగములకెల్ల అధికమైనదియునగు రాజయోగమునకు చక్రవర్తి యనందగు యోగసామ్రాజ్యము సంకల్పరహితంబై ప్రకాశించునట్టిది. అట్టి రాజయోగ సమ్రాట్టనఁబడు సకలయోగశ్రేష్ఠమైన యీ పరమోత్కృష్టమైన యోగము, ఎవ్వఁడు భక్తిశ్రద్ధలతోఁగూడ గురుసేవచేయునో, అట్టివానికిమాత్రమే అనుభవ సిద్ధమైనది. ఇది గురుసేవ చేయనివానికి బోధము కానేరదు.

వి. శ్లో॥ క్షమామండలే భూప భూపాలబృందైః।
సదాసేవితం యస్య పాదారవిందం।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం।
తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిం ॥ 1

తా. భూమండలమునందు రాజసమూహములచే (రాజయోగుల సమూహముచే) ఎవ్వని పాదారవిందము ఎప్పుడు సేవింపఁబడుచున్నదో, ఆతర్వాత యేమి? ఆమీఁద యేమి? పిదప ఏమున్నది? అనఁగా గురుసేవ చేసినవానికి ఆతర్వాత ఏ కొఱఁతయును లేదనిభావము.

శ్లో॥ ఆచార్యవాన్ పురుషోహి వేదేత్యేవం శ్రుతిర్జగౌ।
అనాదావిహసంసారే బోధకో గురురేవహి ॥ 2

తా. ఆచార్యునిగల పురుషుఁడే (శిష్యుఁడే) సత్తైన ఆత్మను తెలియఁగలఁడు. (ఎఱుఁగును.) అనాదియైన ఈ సంసారమునందు బోధకుఁడు (తెలియఁజేయువాఁడు) గురువే యగును. (ఇట్లు ఛాందోగ్యమునందుఁ జెప్పఁబడియున్నది.)

శ్లో॥ ప్రసన్నం పరమాచార్యం భక్తిముక్తి ప్రదర్శకం।
ప్రార్థయే దగ్రతశ్శిష్యః ప్రాంజలి ర్వినయాన్వితః ॥ 3

తా. ప్రసన్నుఁడును, (ప్రత్యక్షముగా కనఁబడువాఁడును.) భక్తిని, ముక్తిని, తెలియఁజేయువాఁడును, అగు పరమాచార్యునియెదుట వినయముతోఁ గూడిన శిష్యుఁడు బద్ధాంజలియై నిలువంబడి ప్రార్థింపవలయును.

శ్లో॥ అనుకాంక్షేత్ సదాశిష్యం గురు రౌరస పుత్రవత్ ।
విద్వాన్ సమాహితో భూత్వా గ్రాహయే దుపధింవినా ॥ 4

తా. ఆచార్యుఁడు శిష్యుని తన సొంతపుత్త్రునియందునుంబోలె, శిష్యుని యందును పుత్త్రవాత్సల్యముంచి రాజయోగసామ్రాజ్య రహస్యమును శిష్యునికి ఉపదేశింప వలయును.

శ్లో॥ రాత్రౌ వివిక్తదేశేన దీపం సంస్థాప్య యత్నతః ।
గురూపదిష్టమార్గేణ మనసాఽఽలోకయే న్మునిః ॥ ౨

తా. రాత్రికాలమునందు (౨ జాములకుమీఁదుగా) అనఁగా నాలుగు గంటల వేళయందు విజన (ఏకాంత) ప్రదేశమునందు, (శుచిర్భూతుఁడై సుఖాసనాసీనుఁడై) (ఉత్తమము నేయి, మధ్యమము ఇప్పనూనె, అధమము నువ్వులనూనె, అధమాధమము ఇతరతైలములు.) దీపమునుఉంచి, ఆచార్యుఁడు ఉపదేశించిన ప్రకారముగా మునియైనవాఁడు (మననశీలుఁడు, మౌనముద్రను దాల్చినవాఁడు, తాను తెలిసికొనదగిన లక్ష్యమును, అనఁగా జ్యోతిని) దర్శింపవలయును. దీపమును తూర్పుముఖముగా నుంచి శిష్యుఁడు అనఁగా చూచునట్టివాఁడు ఉత్తరముఖముగా కూర్చుండవలయును. మనస్సు (బుద్ధి) చేత చూడవలయుననుటకుఁ గారణ మేమనఁగా.—

వి. శ్లో॥ కింజ్యోతి స్తవ భానుమానహని రాత్రౌ కిం ప్రదీపాదికం ।
స్యాదేవం రవిదీపదర్శనవిధౌ కింజ్యోతి రాఖ్యాహి మే ।
చక్షు స్తస్య నిమీలనాదిసమయే కింజ్యోతి ధీదర్శనే।
కింరాత్రౌ హ మతో భవాన్ పరమకం జ్యోతి స్తద స్మిప్రభో॥

తా. గురుశిష్య ప్రశ్నోత్తరములు.

గు. ప్ర. నీకు జ్యోతి యెక్కడిది ?

శి. ఉ. పగటియందు సూర్యుఁడు, రాత్రియందు దీపము మొదలగునవి.

గు. ప్ర. సూర్యుని దీపమును జూచెడివిషయమునందు నీకు జ్యోతియేది ?

శి. ఉ. నేత్రము.

గు. ప్ర. నేత్రము మూయునపుడు నీకు జ్యోతియెక్కడిది?

శి. ఉ. బుద్ధి (లేక మనస్సు.)

గు. ప్ర. బుద్ధిని జూచునపుడు నీకు జ్యోతియేది ?

శి. ఉ. అపుడు నేను, తాము, అను నీ రెండు వ్యక్తులకును మేలైన పరబ్రహ్మము.

ఇట్లు సద్గురువరుండును ప్రభువరేణ్యుండును అగు ఆచార్యునకు శిష్యుఁడు ఉత్తరమిచ్చి కృతకృత్యుండాయెను.

ఇచ్చట ప్రత్యేకముగా ఆసనము చెప్పఁబడక పోయినప్పటికిని, విజనస్థలంబు నందు ఈ చెప్పఁబడిన ఆసనములలో నేదేని యొక ఆసనమును అవలంబింప వలయును.

శ్లో॥ సిద్ధాంబుజం స్వస్తిక ముక్తవీర।
భద్రాఽహిభుక్ సింహ గవాముఖాని।
సుఖాసనశ్చైవ సమంకితాని।
తతో దశైతాని వరాసనాని॥ 6

తా. సిద్ధము, పద్మము, స్వస్తికము, ముక్తము, వీరము, భద్రము, మయూరము, సింహము, గోముఖము, సుఖాసనము, అను నీ పది యాసనములు మిక్కిలి శ్రేష్ఠము లైనవి.

శ్లో॥ గృహీనా మంబుజంసిద్ధం గృహస్థాత్మక వర్మనాం।
సుఖాసనంచ సర్వేషా మిత్యేతా త్రివిధంపరం॥ 7

తా. గృహస్థులకు పద్మాసనమును, సన్న్యాసులకు సిద్ధాసనమును, సకలమైనవారికిని సుఖాసనమును, అను నీ మూడాసనములు శ్రేష్ఠములైనవి.

శ్లో॥ యానికాని ప్రశస్తాని హ్యాసనాని సమానిచ।
తేష్వభీష్టాసనాసీనో వివిక్త స్థానమాశ్రయేత్॥ 8

తా. శ్లాఘనీయమైనదియును, సమానమైనదియును, అగు ఆసనములలో తన కిష్టమైన ఆసనమునందుండి ఏకాంతప్రదేశమును ఆశ్రయింపవలయును.

శ్లో॥ ఏకాకీ చింతయేన్నిత్యం వివిక్తే హితమాత్మనః।
ఏకాకీ చింతయానోహి పరం శ్రేయోఽధిగచ్ఛతి॥ 9

తా. ఎల్లపుడును రహస్యప్రదేశమునందు వసియించి ఆత్మహితమును గూర్చి చింతింపవలయును. ఇట్లు ఒంటరియై ధ్యానముచేయు (చింతించునట్టి) పురుషుఁడు శ్రేష్ఠమైన మోక్షసుఖమును పొందును.

శ్లో॥ నిస్సంగతాముక్తిపదం యతీనాం।
సంగాదశేషాః ప్రభవంతి దోషాః।

ఆరూఢయోగోఽపి నిపాత్యతేఽధః।
సంగేనయోగీ కిముతాల్పసిద్ధిః॥ 10

తా. యోగమునందు ప్రయత్నము గలవారు రాగద్వేష రహితులై ఏకాంతముగ నుండిన ముక్తికల్గును. సంగముచే సకలదోషములు కల్గును. యోగారూఢుండు సంగముచేత భ్రష్టుఁడగును (సంగముచేత అరూఢులే భ్రష్టులగునపుడు అభ్యాసయోగులు భ్రష్టులగుటయందు సందేహమేమున్నది? అనఃగా సందేహము లేదని భావము.)

శ్లో॥ చక్షుర్మధ్యే స్థితంగుహ్యం అంగుష్ఠే పర్వమాత్రకమ్।
తదర్ధంచాపి పర్వార్ధ తస్యాగ్రే సూక్ష్మకంధ్రువమ్॥ 3

శ్లో॥ గుహ్యాద్గుహ్యతరంగుహ్యం చతుస్థానేషు తిష్ఠతి।
తన్మూర్తిర్లక్ష్యతేదృశ్యం ఆపాదతలమస్తకమ్॥ 4

తా. నేత్రమునందు అంగుష్ఠప్రమాణము అవకాశముకలదు. అదే పరమాత్మ యొక్క స్థానము. (ఆ స్థానమునందు) అంగుష్ఠప్రమాణములో సగభాగమును, దానియందర్ధభాగమును, దానియందు సగభాగమును, దానిమధ్య అణుప్రమాణము గల సూక్ష్మస్థానమును ఉన్నది.




1. అంగుష్ఠప్రమాణము.
2. అర్ధాంగుష్ఠప్రమాణము.
3. పాదాంగుష్ఠప్రమాణము.
4. సూక్ష్మస్థానము.

ఆ సూక్ష్మస్థానము రహస్యమునకంటె మిక్కిలి రహస్యము. దీనియందుండు సూక్ష్మస్థానమున వెలుఁగుచుండునట్టి జ్యోతిపురుషుని ఆపాదమస్తక పర్యంతమును (గురువుచే బోధింపఁబడిన లక్ష్యముతో) గుటిచేత దర్శింపవలయును. (చూడవలయును.)

శ్లో॥ అచలం నిర్మలం శాంతం శూన్యవ్యాపి నిరంజనమ్।
అమలం నిష్కలం దేవం కాయస్థం తేజ ఉచ్యతే॥ 5

తా. ఆ స్థానమునందు చలనము లేనిదియును, మలినము లేనిదియును, శాంతమైనదియును, ఈచోటు ఆచోటు అను భేదములేక ఏచోటను వ్యాపించియుండు

నదియును, గుర్తింపఁబడనిదియును, (త్రివిధమలములు లేనిదియును,) నిష్కలమైనది యును, విభాగింపఁబడనిదియును, విభువైనదియును (పరమాత్మయైనదియును,) శరీరమునందుండునదియును, (అనఁగా అధికారుల భేదములచేతను, మతభేదముల చేతను, ఆపరమాత్మ హృదయము, భ్రూమధ్యము, సుషుమ్నాంతర్గతము, చక్షుర్మధ్యము) అను నీ స్థానములయందు ప్రకాశించు నదియును నగు తేజస్సుకలదు. పరమాత్మ, శరీరమునందు తేజరిల్లుచుండుటంబట్టియు, ఆ పరమాత్మను దెలిసికొనటకై శరీరమును అవశ్యము రక్షింపవలయును. దీనికి ప్రమాణ మేమనఁగా.—

శ్లో॥ యోగాత్సం జాయతేజ్ఞానం జ్ఞానాద్యోగః ప్రవర్తతే।
ద్వయో స్సంసిద్ధయే భూమౌ శరీరం రక్షయేద్బుధైః॥ (11)

తా. యోగముచేత జ్ఞానము కల్గుచున్నది. జ్ఞానముచేత యోగము ప్రవర్తించుచున్నది. ఈ రెంటియొక్క సిద్ధి నిమిత్తము వివేకియగువాఁడు భూమియందు శరీరమును రక్షింపవలయును.

శ్లో॥ తజ్జ్యోతి విమలస్థానే జ్ఞేయం ప్రత్యక్షగోచరమ్।
పద్మగర్భంచ దృష్టంచ తత్సమో నాత్రసంశయః॥ ౬

తా. ఆజ్యోతిని నిర్మల (నిశ్చలమైన) స్థానంబునందుండి చూచినయెడల ప్రత్యక్షముగా కనఁబడును. అదే పద్మగర్భము. అదియేబ్రహ్మస్థానము. దీనితో సమానమైన దేదియును లేదు. దీనికి సంశయములేదు.

ఇచ్చట పద్మగర్భము అనునదియే మహారహస్యము. ఇది అందఱకును తెలియదు. యోగీశ్వరులలో కోటి కొక్కరికే తెలియును. సకల ప్రపంచమును లీనమై పరమాత్మయొక్కఁడే జలమునందు శయనించి యున్నకాలమునందు (మహాప్రళయ కాలమునందు) ఆతనిని తెలిసికొనుటకై బ్రహ్మదేవుఁడు అతని కుక్షిలో ప్రవేశించి యా మహాత్మునియందు సర్వమును అణఁగియుండుటను కనుఁగొని స్తుతించినాఁడు. ఈ మహాత్ముని ఒక్కరొక్కరును ఒక్కొక్కవిధముగాఁ జెప్పుదురు. అయినను సర్వమును ఆపరబ్రహ్మమేయగును. అదియేజ్యోతి. అదియే ఓంకారము. అనఁగా—

| | | | | |
|---|---|---|---|---|
| 1. జాగ్రత్ | అకారము | విశ్వుఁడు | అవిద్యాపాదము | బ్రహ్మవిత్ |
| 2. స్వప్నము | ఉకారము | తైజసుఁడు | విద్యాపాదము | బ్రహ్మవిద్వరుఁడు |
| 3. సుషుప్తి | మకారము | ప్రాజ్ఞుఁడు | ఆనందపాదము | బ్రహ్మవిద్వరీయుఁడు. |
| 4. తురీయము | అర్ధమాత్ర | తురీయుఁడు | తురీయపాదము | బ్రహ్మవిద్వరిష్ఠుఁడు |

శ్లో॥ ఏకఏవహిభూతాత్మా భూతే భూతే వ్యవస్థితః।
ఏకఏవాద్వయంబ్రహ్మ నేహనా నాస్తి కించన॥ 12

తా. భూతాత్మయైన పరమాత్ముఁడొక్కఁడే ఒక్కొక్క భూతమునం దున్నాఁడు. రెండవది లేని బ్రహ్మమొక్కటే యున్నది. ఇచ్చట వేఱే యేదియు కొంచెమేనియు లేదు.

శ్లో॥ ద్వైతాద్వైత సముద్భూతై ర్జగన్నిర్మాణలీలయా।
పరమాత్మమయీ శక్తి రద్వైతైవ విసృజ్యతే॥ 13

తా. పరమాత్మస్వరూపిగానుండు శక్తియొక్కతెయేప్రపంచమునుసృష్టించెడి లీలచే ఒక్కటిగాను అనేకములుగాను నుండు జగములుగా వృద్ధినొందుచున్నది.

శ్లో॥ ఉమేతి కేచిదాహుస్తాం శక్తిం లక్ష్మీతిచాపరే।
భారతీ త్యపరేచైనాం గిరిజేత్యంబికేతిచ॥ 14
దుర్గేతి భద్రకాళీతి చండీ మాహేశ్వరీతిచ।
కౌమారీ వైష్ణవీచేతి వారాహ్యైంద్రీతిచాపరే॥ 15
బ్రాహ్మీతి విద్యాఽవిద్యేతి మాయేతిచ తథాపరే।
ప్రకృతిశ్చ పరాచేతి వదంతి పరమర్షయః॥ 16
సేయం శక్తిః పరానిష్ఠో ర్జగత్సర్గాది కారిణీ।
వ్యక్తావ్యక్త స్వరూపేణ జగద్వ్యాప్య వ్యవస్థితా॥ 17
ప్రకృతిశ్చ పుమాంశ్చైవ కాలశ్చేతి త్రిధా స్థితా।
సృష్టి స్థితి వినాశానా మేకా కారణతాంగతా॥ 18

తా. ఆ విష్ణుశక్తిని ఉమ, లక్ష్మి, భారతి, గిరిజ, అంబిక, దుర్గ భద్రకాళి, చండి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఐంద్రి, బ్రాహ్మి, విద్య, అవిద్య మాయ,ప్రకృతి,అనిచెప్పెదరు.పరమఋషులు పరాయనెదరు.ఇట్టిపేర్లుగలఆశక్తియే జగత్సృష్టిస్థితిలయకార్యములు చేయునదిగను, కనఁబడునదిగను, కనఁబడనిదిగను అగురూపముతో జగత్తును వ్యాపించికొని యున్నది. ఇదే విష్ణువుయొక్క పరాశక్తి. అది ప్రకృతియనియును,పురుషుఁడనియును, కాలమనియును, మూఁడు విధములుగా నున్నది. అదియే సృష్టికిని, స్థితికిని, నాశమునకును కారణముగ నున్నది.

శ్లో॥ యోఽసౌ విష్ణుస్స స్వయం బ్రహ్మా యోబ్రహ్మాఽసౌ మహేశ్వరః।
వేదత్రయేచ యజ్ఞేస్మిన్ వదంతీత్యేవ నిశ్చయః॥ 19

తా. ఎవఁడు విష్ణువో అతఁడు బ్రహ్మదేవుఁడు. ఎవఁడు బ్రహ్మదేవుఁడో అతఁడు రుద్రుఁడు. అని మూఁడువేదములచేతను, యజ్ఞవిధులచేతను, వేదాంత వేత్తలచేతను, నిశ్చయింపఁబడి యున్నది.

శ్లో॥ హరిశంకరయోర్మధ్యే బ్రహ్మణశ్చాపి యోనరః ।
భేదకృన్నరకంభుంక్తే యావ దాచంద్రతారకమ్ ॥ 20
హరం హరిం విధాతారం యఃపశ్యే దేకరూపిణమ్ ।
సయాతి పరమానందం శాస్త్రాణామేష నిర్ణయః ॥ 21

తా. విష్ణువునకును శివునకును బ్రహ్మకును భేదము కలదని తలంచువాఁడు, చంద్రుఁడును నక్షత్రములును నుండునంత కాలము నరకము ననుభవించును. బ్రహ్మ విష్ణు రుద్రులను ఒక్కరూపమని తలంచువాఁడు బ్రహ్మానందమును పొందును. ఇదే సకల శాస్త్రములయొక్క నిశ్చయము.

శ్లో॥ సర్వచింతాం పరిత్యజ్య సావధానేన చక్షుషా ।
పరబ్రహ్మానుసంధేయో యోగసామ్రాజ్య మిచ్ఛతి ॥ 22

తా. యోగసామ్రాజ్యమును గోరిన పురుషుఁడు సకలమైన చింతనలను విడిచి పెట్టి సావధానమైన మనస్సుగలవాఁడై పరమాత్మను (నేత్రమునందు తేజరిల్లు పురుషుని) ధ్యానముచేయవలయును. (అనఁగా, ఆ నేత్రపురుషుని దర్శింపవలయును.)

ఈనేత్రపురుషుని, వివేకులు అధికారి భేదములచేతను, మతభేదములచేతను వేర్వేఱువిధములుగా ఉపాసించి స్వాత్మను దర్శించెదరు.

శ్రుతి॥ సగుణ బ్రహ్మోపాసకో గుణవాన్ భవతి ।
నిర్గుణ బ్రహ్మోపాసకస్తు బ్రహ్మైవ భవతి ॥
ఇట్లు కేనోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ రక్తం శ్వేతం తథాకృష్ణం నీలపీతాది శోభితమ్ ।
తన్మధ్యే దర్శనం యేన తజ్జ్యోతి బ్రహ్మకేవలమ్ ॥ 2

తా. ఆపద్మగర్భము ఎరుపు, తెలుపు, నలుపు, నీలము, పచ్చ లేక పసుపు మొదలగు వర్ణములనడుమ ప్రకాశించునట్టిజ్యోతి ఎవనిచేఁ జూడబడునో వాఁడే ముక్తుఁడు ఆజ్యోతియే పరబ్రహ్మము, అదియే ఏకమైనది. అనఁగా ఆజ్యోతియొక్కటియే కేవల పరబ్రహ్మము.

శ్లో॥ భ్రువోస్థానే అధఃపద్మం ద్విదళం తత్రశోభితమ్ ।
హంసం ద్వ్యక్షరసంయుక్తం వర్తతే వాయుమండలమ్ ॥ ు

తా. కనుబొమలకు దిగువ రెండు దళముల నేత్రపద్మము, అనఁగా నేత్రము (ఇదేరెండుకన్నులు) ప్రకాశించుచున్నవి. అది హంసం అనెడి రెండక్షరములతో గూడినది. అది వాయుమండలమునం దున్నది.

శ్లో॥ హకారాంత మిదంబీజం బహిర్యాతి సబిందుకం।
సవిసర్గం సకారాంతం తద్బీజం ప్రవిశత్యథః॥ 23

తా. బిందువుతోఁగూడిన హకారాంతమైన (హం) ఈబీజము బైటపోవుచున్నది. విసర్గముతోఁగూడిన సకారాంతమైన (సః) ఈబీజము దిగువనుండి (క్రిందుగా) పోవుచున్నది.

శ్లో॥ ఆహృదాయా ద్భ్రువోర్మధ్యం వాయుస్థానం ప్రకీర్తితం।
వాయవ్యం రసకోణంతు బిందుషట్క మథాఽసితమ్॥ 24

తా. హృదయము మొదలుభ్రూమధ్యమువఱకునువాయుస్థానమని చెప్పఁబడును.

శ్లో॥ ఆభ్రూమధ్యాదిహాంతే పవనమతిదృఢం
వ్యోమకేశే ప్రకుర్వన్।
సోమం సోమార్ధమౌళిం దశకరకమలం
పంచవక్త్రం త్రినేత్రం।
శ్రీకంఠం సాయుధం తంసమధికవరదం
సర్వతత్త్వాదితత్త్వం।
బిందుం వ్యోమ స్వరూపం శివ మభయయుతం
చింతయేద్యస్సముక్తః॥ 25

తా. భ్రూమధ్యము మొదలుశిరస్సుపర్యంతముగల ఆకాశస్థానమునందుహకారముతోఁగూడ వాయువునునిల్పి, పార్వతితోఁగూడిన చంద్రశేఖరుఁడును, పదికరకమలములును. పంచవక్త్రములును, త్రినేత్రములును, శ్రీకంఠమును, సకలాయుధములును ధరించినట్టివాఁడును, వరమిచ్చువాఁడును, సకల తత్త్వములకంటె ఆదితత్త్వుఁడును, బిందుస్వరూపుఁడును, ఆకాశస్వరూపుఁడును, అభయముకలవాఁడును, మంగళస్వరూపుఁడు నగు పరమేశ్వరుని ఎవఁడు ధ్యానించుచున్నాఁడో, వాఁడు మోక్షమునొందును. పైన చెప్పిన (హం సం) అను రెండక్షరములయొక్క విషయ వివరణము చెప్పఁబడుచున్నది. ఎట్లనఁగా:—

శ్లో॥ ఆత్మమంత్రస్య హంసస్య పరస్పర సమన్వయాత్।
యోగేన గతకామానాం భావనా బ్రహ్మచక్షతే॥ 26

తా. అజపామంత్రమునకును, అజపామంత్రమును జపించెడి జీవునకును అన్యోన్యప్రతిపాద్య ప్రతిపాదకభావ సంబంధము కల్గియుండుటవలన యోగము

చేత వ్యర్థమైన అభిలాషలు లేనివారియొక్క మనస్సునందు కల్గియుండునట్టి భావనయే (ధ్యానమే అనఁగా నేత్రపురుష దర్శనమే) పరబ్రహ్మస్వరూపమని చెప్పఁబడును.

ఆత్మమంత్రమే హంస యనఁబడును. సూర్యోదయము మొదలు మఱుదినము సూర్యోదయమువఱకు (21600)హంసలను సమర్పించుటయే ఆత్మమంత్రమనియును, అజపామంత్రమనియును జెప్పఁబడును.

హంస యనఁగా.—ఉచ్ఛ్వాసనిశ్వాసములు. ఇదే ప్రాణము.

హకారము శివబీజము, సకారము శక్తిబీజము. ఈరెంటియొక్క ఐక్యస్థానమే బిందురూపము.

హకారము శుక్లము. సకారము రక్తము ఈ రెంటియొక్క సంబంధమే బిందువు. ఇదియే సోహం అనఁబడును. ఇదియే ఓంకారము. ఎట్లన.—

శ్లో॥ సోహంభావాత్ ప్రకటిత పద మద్వైత ముఖ్యస్వభావం।
యద్వల్లోకే స్ఫురతి ఖలు తత్త్వ స్వరూప స్వభావం।
సమ్యగ్దృష్టి ర్గురుకరుణయా సర్వభూతేషు యాతి,
స్వాత్మారామస్య భవతి సఖే ధ్యాన మార్గైకనిష్ఠః॥ 27

తా. సోహంభావమువలన ప్రకటితమైన పదమును, అద్వైతముఖ్యస్వభావము నగునది ఏదేది లోకమునందు చక్కఁగాఁ గోచరించుచున్నదో, అది యంతయు నిశ్చయముగా పరమాత్మ (స్వరూప) స్వభావమే యగును. దానిని మంచిదృష్టికల వాఁడు గురుకరుణచేత సకల భూతములయందును (సర్వస్థలములయందును)పొందు చున్నాఁడు. అనఁగా చూచుచున్నాఁడు. ఓ స్నేహితుఁడా? ధ్యానమార్గమునందే నిలిచియున్నవాఁడు స్వాత్మారాముఁ డగుచున్నాఁడు.

సోహం, అనఁబడు సకారముమీఁదుగా నుండునట్టి స్వరము ఓంకారము. హకారము మీఁదుగా నుండు స్వరము పూర్ణానుస్వారము. ఈ రెండును చేరి ఓంకారము, అనఁగా ప్రణవము.

శ్లో॥ త్రయోదేవా స్త్రయోవేదా స్త్రయోలోకా స్త్రయోగుణాః।
ఓమిత్యేకాక్షరేమంత్రే పరేబ్రహ్మణిసంతివై॥ 28

తా. ఓ మనెడి ఏకాక్షరమంత్రమైన పరబ్రహ్మమునందు బ్రహ్మావిష్ణు మహేశ్వరులనెడి ముగ్గురు దేవతలును ఋగ్యజుస్సామము లనెడి మూఁడు వేదములును, సత్త్వరజస్తమము లనెడి మూఁడుగుణములును ఉన్నవి.

శ్లో॥ అతఏవ మహోశ్చర్యం చంద్రసూర్యాగ్ని సద్మని।
సద్ధ్యానం కురుతద్భక్త్యా ప్రణవధ్వనినా సహ॥ 29

తా. కాఁబట్టి చంద్రసూర్యాగ్ని మండలములందు క్రమముగా నిమీలనఉన్మీలనములచేత భక్తిగలవాఁడై, ప్రణవధ్వనితోడ ఆప్రణవమును ధ్యానింపవలయును.

శ్లో॥ తస్మధ్య మంతర్జ్యోతిస్యా ద్బిందురూపం విరాజతే।
నీలతో యద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా॥ ౯

తా. ఆపద్మగర్భమున కాధారమైన వాయుమండలమునడుమ నీలమేఘము (నీలమేఘాకాశము నడుమ) ప్రకాశించునట్టి అంతర్జ్యోతియందు బిందుస్వరూపము (అణుమాత్రముగా) తేజరిల్లును. అది మెఱుము తీఁగవలె కనులకు మిఱుమిట్లు గొనునట్టి మహాప్రకాశముగా నుండును.

శ్లో॥ యదా తజ్జ్యోతిరోంకారం బ్రహ్మవిష్ణు శివాత్మకం।
పశ్యంతి సూర్యయశ్శాంతం తద్విష్ణోః పరమంపదమ్॥ 30

తా. వివేకులు ఎప్పుడు బ్రహ్మ విష్ణు శివస్వరూపమగు ఓంకారమైన అంతర్జ్యోతిని చూచుచున్నారో, అప్పుడు అది శాంతమైన విష్ణువుయొక్క (పరబ్రహ్మముయొక్క) పరమపద (కైవల్య=మోక్ష) స్థాన మగును.

శ్లో॥ పూర్ణేందుబింబ ఇవ సన్మణిదీపికేవ।
మధ్యాహ్నసూర్య ఇవ వహ్ని శిఖేవ నిత్యం।
విద్యుత్ప్రభేవ పరమాత్మ అహో విచిత్రం।
లక్ష్యాంతరే జ్వలతి పశ్యతి చక్షురగ్రే॥ 31

తా. పూర్ణచంద్రబింబమువలెను, రత్నదీపమువలెను, మధ్యాహ్నసూర్యునివలెను, ఎల్లప్పుడును అగ్నిజ్వాలవలెను, మెఱుముకాంతివలెను, అహో! ఆ విచిత్రమైన ఆ పరబ్రహ్మము లక్ష్యాంతరమునందు ప్రకాశించుచున్నది. దానిని నేత్రముయొక్క అగ్రభాగమునందు (ముందట) చూచుచున్నారు.

శ్లో॥నిమేషోన్మీల దనిమీల దంబకో నిరవలంబ్యపదతత్త్వమవ్యయం।
ధ్యానతత్పరవిభిన్నమానసః రాజయోగపదభాక్ స ఏవహి॥

తా. ఎవఁడు కనులను సగము తెఱచిన దృష్టికలవాఁడై సంకల్పరహితమైన మనస్సుకలవాఁడై నిరాలంబపరతత్త్వమును. అవ్యయమును, అగు పరబ్రహ్మమును ధ్యానించుటయందే తత్పరుఁడైయుండువాఁడు రాజయోగపదమును పొందినవాఁ డగును.

శ్లో॥ నీవారశూకవత్తన్వీ పీతాభాస్వ త్యణూపమా।
తస్యాశ్శిఖాయా మధ్యేతు పరమాత్మా వ్యవస్థితః॥ ౧౦

తా. ఆపరమాత్మప్రకాశము నివర్వి ధ్యానము మల్లువలెను, (నివ్వరివడగింజ యొక్క తోఁకవలె సూక్ష్మముగను) అనఁగా మిగులసూక్ష్మముగను, బంగారు (పసిమి) వన్నెతో సమానమైనదిగను నుండు అణువువంటి ఆమహాప్రకాశమైన తేజస్సుయొక్క మధ్యభాగమునందు ఆపరబ్రహ్మము తేజరిల్లుచుండును.

శ్లో॥ సబ్రహ్మాస్సశివః సహరిస్సేంద్ర సూక్ష్మతః పరమస్స్వరాట్।
గురోర్ముఖేన జ్ఞాతవ్యం అన్యథానోప లభ్యతే॥ ౧౧

తా. ఆ తేజస్సుయొక్క మధ్యభాగమునందు ప్రకాశించువాఁడే బ్రహ్మ, అతఁడే శివుఁడు, అతఁడే విష్ణువు, అతఁడే ఇంద్రుఁడు, అతఁడే సూక్ష్మమైనకూటస్థ చిన్మాత్రుఁడు, అతఁడే పరముఁడు, ఆతఁడే త్రిమూర్తులకును నాథుఁడైన స్వరాట్టు ఈపరమరహస్యమును గురుముఖముగాఁ దెలిసికొనఁదగినదేగాని వేఱుమార్గములచేత దెలిసికొనుటకు ఎంతమాత్రమును సాధ్యము కానేరదు.

శ్లో॥ కోటిసూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్।
యథా వేదేన శాస్త్రేణ తథా పస్యంతి సూరయః॥ ౧౨

తా. ఆ స్వరాట్టు (పరమాత్మ) నేత్రమధ్యమునందుకోటిసూర్యులతో సమానమైన కాంతిగలవాఁడును, కోటిచంద్రులతో సమానమైన చల్లదనముగలవాఁడునై యున్నాఁడు. ఈవిషయమును వేదములందును శాస్త్రములయందును ఏప్రకారముగా చెప్పఁబడియున్నదో, ఆ ప్రకారముగానే పరమాత్మతత్త్వము నెఱింగిన పండితులును ఎఱింగిరి. అనఁగా ముముక్షులు స్వానుభవముచేతఁ దెలిసికొనియున్నారు. (కొందఱు ఆపరమాత్మను హృదయమునందును దర్శించెదరు.)

శ్లో॥ ఆత్మజ్యోతి ప్రభావేన సోమసూర్యాగ్ని భాసతే।
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యతే సకలంజగత్॥ ౧౩

తా. ఆ పరమాత్మయొక్క ప్రకాశము, స్వప్రభావముచేత, (తనయొక్క తేజస్సుచేత) సూర్యచంద్రాగ్నులవలె లోపలను వెలుపలను ఎల్లచోటులందును ప్రకాశించుచున్నది.

శ్లో॥ అహంజ్యోతి ర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః।
జ్యోతి ర్జ్యోతిః స్వయంజ్యోతిః ఆత్మజ్యోతిః శివోఽస్మ్యహమ్॥

తా. నేను అంతరజ్యోతి (లోపలజ్యోతి), బాహ్యజ్యోతి (బయటజ్యోతి), ప్రత్యగ్జ్యోతి (ప్రక్కలయందు ప్రకాశము), పరాత్పరము (మేలైనదానికంటె మేలైనది), జ్యోతికంటె జ్యోతి, స్వయంజ్యోతి, ఆత్మజ్యోతి, నేనే శివము. (అనఁగా పరబ్రహ్మము.)

శ్లో॥ యథోక్త ద్విదళాకారం చక్షుర్నామేతి కథ్యతే।
తన్మధ్యే సర్వసారంచ దర్శయిత్వా మహామునిః॥ ౧౪

తా. ఇదివఱకు చెప్పఁబడిన రెండురేకుల పద్మమే నేత్రమని చెప్పఁబడు చున్నది. ఆ నేత్ర మధ్యమునందు లేక భ్రూమధ్యమునందు సర్వశ్రేష్ఠమయినదానిని మునియైనవాఁడు (మననశీలుఁడు) పరబ్రహ్మమును దర్శించుచున్నాఁడు. (చూచుచున్నాఁడు.)

శ్లో॥ పశ్చాత్ప్రారబ్ధ భోగేషు నదేహాంత మవాప్నుయాత్ ।
సర్వేంద్రియ సమాయుక్తం సర్వదోష మవాప్నుయాత్ ॥ ౧౫

తా. దేహాంత్యమునందు జననమరణసంబంధమైన సుఖదుఃఖములను, అనఁగా ప్రారబ్ధభోగములయందలి సుఖదుఃఖములను, మఱియు దశేంద్రియముల సంబంధమైనట్టి సకలదోషములను పొందఁడు.

శ్లో॥ నిరస్తాతిశయానందం వైష్ణవం పరమంపదం ।
పునరావృత్తిరహితం కైవల్యం ప్రతిపద్యతే ॥ 34

తా. ప్రారబ్ధము నశించినమీఁద మితిలేని ఆనందమైనవైష్ణవ (వ్యాపకమైన) పరమపదమనఁబడునదియును, పునరావృత్తిరహితమైన (మరల జనన మొందనిదగు) కైవల్యమును (మోక్షమును) పొందుచున్నాఁడు.

శ్లో॥ చిదాత్మా సర్వదేహేషు వ్యాప్యతే జ్యోతిరూపకమ్ ।
తజ్జ్యోతి చక్షురగ్రేచ గురునేత్రేచ పశ్యతి । ౧౬

తా. చిదాత్మ, సకల శరీరములయందును వ్యాపించి (మనుష్యులు, మృగములు, పక్షులు, సరీసృపములు, కీటకాదులు, జలజంతువులు మొదలగు సకలదేహములయందును) జ్యోతిస్స్వరూపముగా తేజరిల్లుచున్నది ఆజ్యోతిస్సును చక్షురగ్రమునందు (భ్రూమధ్యమునందు) గురువు బోధించిన ప్రకారముగా ఎఱుంగవలయును. (చూడవలయును.)

శ్లో॥ సముక్తో సర్వలోకేషు వేదవేదాంత నిశ్చితమ్ ।
మథిత్వా త్సర్వశాస్త్రాణి సార్వత్ర్యాచ ప్రతిష్ఠితమ్ ॥ ౧౭

తా. ఇట్లు చతురస్రాగ్రమునందున్న పరబ్రహ్మజ్యోతిని దర్శించినవాఁడు సకల లోకములయందును (ఎచ్చోటను, ఎచ్చటనుండినను) ముక్తుఁడు. ఈప్రకారముగా సకలవేదములను, ఉపనిషత్తులను చక్కఁగా మథించి (తఱచి, అనఁగా పాలలోని వెన్నను చిలికి యెత్తినట్లుగా సకల వేదవేదాంతములను మథించి) పార్వతీదేవిచేత (పరమశివునిచేత పార్వతీదేవికి ఉపదేశింపఁబడిన ఈ పరమరహస్యతత్త్వము) ప్రతిష్ఠింపఁబడెను. అనఁగా సకల చేతనులును తరించి ముక్తి పొందవలయు ననెడి అభిప్రాయముచే లోకమునందు (పార్వతీదేవి) స్థాపించెను.

శ్లో॥ కాశీపుర నివాసస్థో విశ్వనాథో జగద్గురుః।
దేహాంతే చోపదిశ్యేతు తత్ క్షణే కర్ణసంపుటే॥ ౧౨

తా. (ఈ శ్రేష్ఠమయిన రాజరాజేశ్వరీ యోగమును) కాశీపురవాసుఁడును, జగద్గురువును, అగు విశ్వనాథస్వామి జీవులయొక్క మరణకాలమునందు (దీనిని) కుడిచెవియందు ఉపదేశము చేసెను. ఇప్పటికిని పరమేశ్వరుఁడు సకల జీవుల యొక్కయు, సకల జంతువులయొక్కయు, మరణసమయమునందు తారకమంత్రము నుపదేశించుచున్నాఁడు

కాశియందు మృతి నొందువారు ముక్తు లగుదురని సకల పురాణాది గ్రంథములయొక్క ప్రమాణము కలదు. "కాశ్యాంతు మరణాన్ముక్తిః" అనుదానిని స్మరించునది.

శ్లో॥ కాశి క్షేత్రం శరీరం త్రిభువనజననీ
వ్యాపినీ జ్ఞానగంగా।
భక్తిః శ్రద్ధా గయేయం నిజగురుచరణ
ధ్యానయోగః ప్రయాగః।
విశ్వేశోఽయం తురీయః సకల జన మన
స్సాక్షిభూతోఽంతరాత్మా।
దేహే సర్వం మదీయే యదివసతి పున
స్తీర్థ మన్యత్కిమస్తి॥ 35

తా. శరీరమే కాశీక్షేత్రము. త్రిలోకములయందును వ్యాపించి, త్రిభువనములకును తల్లియైనజ్ఞానమే భాగీరథీనది. భక్తిశ్రద్ధలేగయాక్షేత్రము.తనయొక్క గురువులను చింతించుట యనెడియోగమే ప్రయాగ. సకల జనుల మనస్సులయందు సాక్షిస్వరూపమైయుండు తురీయవస్తువే అంతరాత్మయైన విశ్వనాథస్వామి. ఇట్లు సమస్త

మును నాశరీరమునందు వసించియుండుట వలన ఇంక నాకు వేఱే కావలసినదేమున్నది? (అనఁగా ఇంక నాకేదియు నక్కఱలేదని భావము.)

శ్లో॥ రాజరాజేశ్వరీయోగం శ్రేష్ఠమార్గం ప్రశస్యతే।
యఃపఠేత్సతతం భక్త్యాః సముక్తోనాత్రసంశయః॥ ౧౯

తా. ఈశ్రేష్ఠమార్గమును (ఉత్తమయోగమును) ప్రశస్తమునైన రాజరాజేశ్వరీయోగమును ఎవ్వఁడు నిరంతరమును భక్తితోఁ పఠించునో, వాఁడు మోక్షమును పొందును. దీనికి సందేహములేదు.

ఇది యోగములకెల్ల రాజరాజుగానుండుటచేతను, పార్వతీదేవిచే గ్రహింపఁబడినదగుటచేతను రాజరాజేశ్వరీయోగ మనఁబడెను. మఱియును ఇది రాజయోగములకెల్ల చక్రవర్తిగా నుండుటంబట్టి రాజయోగసామ్రాజ్య మనియును, దీనినేకొందఱు అక్షియోగమనియును, కొందఱు చాక్షుష్మతీవిద్యయనియును జెప్పుదురు. ఈ విషయము ఛాందోగ్యము,తైత్తిరీయము మొదలగు ఉపనిషత్తులయందును చెప్పఁబడియున్నది.

శ్లో॥ అయంప్రపంచో మిథ్యైవ సత్యం బ్రహ్మాహ మవ్యయం।
అత్రప్రమాణో వేదానుభవోగురు వచస్తథా॥ 36

తా. ఈప్రపంచము మిథ్యయే. సత్యమును, హెచ్చుతక్కువలులేనిదియునగు పరబ్రహ్మము నేను. దీనికి ప్రమాణము వేదానుభవమును గురువాక్యమునై యున్నది.

శ్లో॥ బ్రహ్మైవాహం నసంసారీ ముక్తోహ మితిభావయేత్।
ఏకమాసం ధ్యానయోగాత్ బ్రహ్మహత్యాం వ్యపోహతి।
సంవత్సరకృతాభ్యాసః సిద్ధ్యష్టక మవాప్నుయాత్।
యావజ్జీవం సదాభ్యాసా జ్జీవన్ముక్తో నసంశయః॥ 37

తా. ఒక్కమాసము ధ్యానయోగమునందు నిరతుఁడైన వాఁడు (ధ్యానయోగము చేయువాఁడు) బ్రహ్మహత్యనుండి విముక్తుఁడగును, ఒక్కసంవత్సరము అభ్యాసము చేసినవాఁడు అష్టసిద్ధులను పొందును. జీవితకాలపర్యంతము ఎడతెగక అభ్యసించిన వాఁడు జీవన్ముక్తుఁడగును. ఈవిషయమునందు సంశయము లేదు.

ఈ పరమరహస్యమును నేత్రమునందుండు పాపమీఁద మనోనేత్ర మనోజ్ఞాననేత్రములచేత గురుభక్తిగల్గి రెప్పపాటులేక కనుపాపలోఁ ప్రకాశించుచుండు ఆత్మజ్యోతిని ఎఱుఁగవలయును. అదియే సర్వమును, సర్వ ప్రపంచమును, చూచు

వాఁడును, నీవును నేనును అయి యున్నామని తెలియవలయును. గీనిని చక్కఁగాఁ దెలిసికొని,ఎఱుకమఱపులులేక అఖండస్వయంప్రకాశమయిన ఆలోపలికళలోలీనము కావలయును ఇదే అమనస్కము.అజాడ్యనిద్ర ఉన్మని,నిశ్చలసమాధి, నిర్విషయము అనఁబడును.

ఇది ఆదినాథ దత్తాత్రేయ గురు విరచితంబైన సకలోపనిషత్సార
వాక్యనిర్ణయము నందు సనకసనందన సనత్కుమార సనత్సుజాత
దక్షిణామూర్తి దత్తాత్రేయసాంప్రదాయ రహస్యమునందు,
రాజయోగ సామ్రాజ్యము.

సంపూర్ణము.

---

వ॥ ఇట్లు పరమేశ్వరుఁడు పార్వతీదేవిని వ్యాజముగాఁగొని సకల దేవ మునిగణంబులును జ్ఞానభక్తివైరాగ్యశీలురును, ఎల్లరును తరింపవలయునని యెంచి మహారహస్యమైన రాజయోగసామ్రాజ్యమును ఉపదేశింపఁగా పార్వతీదేవి విని సంతసించి పరమ శివునిఁ జూచి యిట్లనియె. 132

శ్లో॥ ధన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మాన మంజసా వేద్మి।
ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానందో విభాతి మే స్పష్టం ॥

తా॥ ఎల్లప్పుడును నాస్వరూపమైన ప్రత్యగాత్మను సాక్షాత్తుగా ఏకారణమువలన ఎఱిఁగితినో, ఆకారణమువలన నేను కృతార్థత నొందితిని బ్రహ్మస్వరూపమగు ఆనందము నాకు స్పష్టముగా స్ఫురించుచున్నది అందువలన నేను ధన్యురాలను.

శ్లో॥ ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సాంసారికం నవీక్షే।
ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితం క్వాపి।

తా. ఇప్పుడు నేను సంసారసంబంధమైన దుఃఖమును నేను జూచుటలేదు. ఆకారణమువలన నేను ధన్యురాలను. నా అజ్ఞానము ఎచ్చటికో పాఱిపోయెను. ఆ కారణము వలన నేను కృతకృత్యురాలను.

శ్లో॥ ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే నవిద్యతే కించిత్।
ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నం ॥

తా. నాకు చేయఁదగినది కొంచెమేనియు లేదు ఆ కారణమువలన నేను ధన్యురాలను నేను పొందవలసిన సర్వమును పొందితిని. కాఁబట్టి నేను కృతార్థురాలను.

శ్లో॥ ధన్యోఽహం ధన్యోఽహం ప్రశమిత కరణస్సమాహితాత్మాహం।
ధన్యోఽహం ధన్యోఽహం సత్త్వంచిత్త్వ స్వరూపమాత్మాహం॥

తా. నేను సత్త్వమును చిత్త్వమును అయి యున్నాను, మఱియు నేను సకలేంద్రియ వృత్తులును లేనిదానను. కాఁబట్టి నేను కృతకృత్య స్వభావురాలనై యున్నాను.

శ్లో॥ ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మేకోపమా భవేల్లోకే।
ధన్యోఽహం ధన్యోఽహం ధన్యోధన్యః పునర్ధన్యః॥

తా. నేను మిక్కిలి సంతృప్తినొందితిని. ఇంక నాకేదియును అక్కఱలేదు. నాసంతృప్తికి (ఆనందమునకు) మితియేలేదు. నేనే ధన్యురాలను, కృతకృత్యురాలను. మాటిమాటికిని సంతుష్టురాలను.

వ॥ అని యివ్విధముగా స్తుతించినమీఁద పరమశివుఁడు తర్వాతి వృత్తాంతమును పార్వతిదేవికి పరమశివుఁడు ఎఱిఁగించినప్రకారముగా సూతమహాముని శౌనకాదులంజూచి యిట్లని చెప్పదొడంగె॥ 133

ఉ॥ జ్ఞానుల కెప్పుడైన భువి సంగము రోగము నేలగల్గు సం।
తానె గృహాశ్వ హస్తి రథ ద్రవ్యములందును బ్రీతియేది య।
జ్ఞానులు వీనినెల్ల సుఖసాధనమంచుఁ దలంత్రు సత్యమం।
దూనిన జ్ఞానికిఁ దనువున నొచ్చినఁ జచ్చిన భ్రాంతి యున్నదే॥

తా. ఓపార్వతీ! వినుము. పరమార్థజ్ఞానముగల వేదాంతులకు ఏకాలమునం దైనప్పటికిని భూమిలో సంగమును, రోగమును కలుగదు. మఱియు సంతానమును, గృహమును, గుఱ్ఱమును, ఏనుఁగును, రథమును, ధనమును, అగు వీని యందంతయు ప్రేమయుండదు. అజ్ఞానులు మాత్రము వీనియందంతయు ప్రేమయుంతురు సత్యమగు పరబ్రహ్మమునందు మనస్సునుంచి యుండు వివేకవంతునకు ఎప్పుడుగాని శరీరమునందు రోగము కల్గినను, మరణము సంభవించి

నను ఎంతమాత్రమును భ్రమనొంది దుఃఖము నొందఁడని యెఱుంగుము.

వి. శ్లో॥ "ఆనందరూపమాత్మాన మజ్ఞాత్వైవ పృథగ్జనః।
బహిస్సుఖాయ యతతే నతుకశ్చి ద్విదాం బుధః॥"

తా. తెలివిలేని అజ్ఞానియగు మూఢుఁడు తన్ను ఆనంద స్వరూపుఁడని యెఱుంగక, ఇతరములగు విషయ గృహభోగాదిసంపదలగు విషయ సుఖములకై ప్రయత్నించుచున్నాఁడు గాని, జ్ఞానవంతుఁడు ఎన్నటికిని గృహభోగాద్ధి సంపదలకు బ్రయత్నింపఁడు.

॥ "అజ్ఞాత్వైవహినిక్షేపం భిక్షామటతి దుర్మతిః।
స్వవేశ్మని నిధిం జ్ఞాత్వా కోనుభిక్షా మటేత్సుధీః॥"

తా. అవివేకియగువాఁడు మాత్రము తన యింటియందుండు నిక్షేపమును దెలిసికొనక భిక్షమెత్తితినుటకై తిరుగుచున్నాఁడు. తన యింటియందుండు నిక్షేపమును తెలిసికొన్న జ్ఞానవంతుఁడు సంచరింపఁడుకదా! అనఁగా తనశరీరమునందుండు పరమాత్మను తెలిసికొన్న వాఁడు పరమాత్మ వేఱేచోటయున్నదని వెదుకఁడని యభిప్రాయము. ఇట్లు సర్వవేదాంతసిద్ధాంత సంగ్రహమునందు చెప్పఁబడి యున్నది.

వి. శ్లో॥ "వాసో బహూనాం కలహో భవేద్వార్తా ద్వయోరపి॥"

తా. అనేకులతోఁజేరినచో కలహమును, ఇరువురతోఁజేరిన యెడల మాటలును కల్గును. కాఁబట్టి సంగముకూడదని యభిప్రాయము.

అయినను గురుశిష్యుల సంగముమాత్రము శాస్త్రసమ్మతము గాన, దానికి నిషేధము లేదు.

క॥ నిత్యంబాత్మను దేహ మ।
నిత్యంబనువానికెపుడు నెఱి యీజగతిన్।
మృత్యువు చేతన్ జచ్చియు।
సత్యాత్ముని బొంది మోక్షసాధన వడయున్॥ 135

తా. ఓపార్వతీ! వినుము. పరబ్రహ్మమే శాశ్వతముగా నుండు నదియనియును, శరీరము అనిత్యమనియును, భావించియుండునట్టి

తత్త్వజ్ఞుఁడు మరణమొందినప్పటికిని పరమాత్ముని జేరి ముక్తిసాధనము చెందును.

తే॥ అచ్యుతమైనట్టి పరమాత్ము ననవరతము।
నమ్మువానికి దేహ వినాశసమయ।
మునను నేరీతిచచ్చిన ముక్తికేమి।
హానిలేదని తలపోయు మంబుజాక్షి॥ 136

తా. ఓ కమలనేత్రివగు పార్వతీ! వినుము. నిర్మలపరబ్రహ్మము సర్వకాలమును నమ్మి యుండునట్టివానికి మరణ సమయము నందు ఏవిధముగా మృతినొందినప్పటికిని మోక్షసామ్రాజ్యసిద్ధికి హానిలేదని యెఱుంగుము.

వి. శ్లో॥ "తనుం త్యజతువా కాశ్యాం శ్వపచస్య గృహేఽథవా।
జ్ఞానసంప్రాప్తి సమయే ముక్తోసౌ విగతాశయః॥"

తా. బ్రహ్మజ్ఞానికి కాశియందుఁగాని, లేక కుక్కమాంసమును దినెడి మాలవానియింటియందుఁగాని, మరణము కలిగినను రెండును సమమే. ఇట్టిజ్ఞాని పుట్టినపుడే ముక్తిని బొందినవాఁడై యున్నాఁడు.

ఇట్లు వాసిష్ఠరామాయణమునందుఁ జెప్పఁబడియున్నది.

క॥ మృగ శస్త్రోరగ బాధల।
దగులక మఱి చచ్చెనేని ధన్యుఁడటంచుః।
నిగమాంతవేత్త లెన్నరు।
మృగపతిసమమధ్య వినవె మెచ్చొదవ మదిః॥ 137

తా. ఓ సింహమువంటి సన్నని నడుముగల పార్వతీ! వినుము. సింహ వ్యాఘ్రాది మృగములచేతను, ఆయుధములచేతను, సర్పముల చేతను, మృతినొందినవాఁడే పుణ్యాత్ముఁడని వేదాంతవిశారదులు తలంపరు. అనఁగా ఆత్మజ్ఞానియైనవాఁ డెట్లు మృతినొందినను ముక్తినొందునని యభిప్రాయము.

ఆ॥ తెలివిలేనివారు దేహమే కాదశి।
విడిచెనేని ముక్తి బడయునందు।
రాత్మగననివారు నమవసదేహంబు।
పాసెనేని వాని పాపియండ్రు॥ 138

తా. ఓ పార్వతీ! వినుము. అజ్ఞానులైనవారు, మనుష్యుఁడు ఏకాదశియందు మృతినొందిన యెడల మోక్షము బొందువాఁడని యును, అమావాస్యయందు మృతినొందిన యెడల పాపియై నర కమునఁ గూలువాఁడనియును జెప్పుదురు.

క॥ దేహమునకు క్షీణంబును।
దేహమునకు హానివృద్ధి తెలియక మదిలో।
నూహాపోహల చేతను।
ద్రోహియు నని పుణ్యుఁడనుచు దూరుదు రజ్ఞుల్॥ 139

తా. ఓ పార్వతీ! వినుము. అజ్ఞానులు శరీరమునకు క్షీణ మును, వృద్ధియును ఎఱుఁగక, ఊహాపోహలచేత, ఒకనిని పాపి యనియును, ఒకనిని పుణ్యవంతుఁడనియును జెప్పుచుందురు.

సీ॥ ఇది ముక్తిలక్షణ విధమని నమ్ముము
కర్మవిముక్తియా కడకుసుమ్ము।
హరిహరులకునైన నబ్జగర్భునకైన
ప్రారబ్ధ సుఖదుఃఖ ప్రాప్తమదియు।
ననుభవింపకతీఱ దాత్మ కటంచును
విబుధవరులచేత వినఁగఁబడితి।
గాన నీవు నఖండకర సత్యచిన్మాత్రు
గని మానసభ్రమ లన్నడకుద్రోసి॥
తే॥ కన్న దే ముక్తిపదమంచు నెన్నకుండ।
ఘటమునకు భువి సుఖదుఃఖ కారణములు।
సమముగావున నూరకే సమసిపోవు।
అనుభవము దీఱినంతనే యగునుముక్తి॥ 140

తా. ఓ పార్వతీ! వినుము. ఇప్పుడు చెప్పినదంతయును మోక్షలక్షణ మని నమ్ముము. అయినప్పటికిని, జీవికి కడపట కర్మము విముక్తి యగును. మఱియు ప్రారబ్ధ కర్మముచేఁ గలిగిన సుఖ దుఃఖములు హరిహరబ్రహ్మాదులైనను అనుభవింపికగాని తీఱదని వేదాంతవేత్తలు చెప్పఁగా వినియున్నాను, కాఁబట్టి నీవు అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమును దెలిసికొని, నీమనస్సునందలి సకల

భ్రమలను నిరసించి, చూచినదే ముక్తియని యెన్నక, శరీరమునకుఁ గల సుఖదుఃఖములకు హేతువులగునవి యన్నియు సమమని భావించియుండుము. ప్రాణియొక్క ప్రారబ్ధానుభవము లన్నియుఁ దీఱి పోయినమీఁద ముక్తికల్గునని యెఱుంగుము.

## మలిన వాసనా లక్షణము.

క॥ రోగము లేమియు లేకయె ।
బాగుగ నుండవలె ననెడి భ్రాంతిని దలఁపక ।
యోగులు తనువాసన యని
భోగములను బొందరైరి పూర్ణేందుముఖీ ॥ 141

తా. ఓ చంద్రవదనయగు పార్వతీ ! వినుము. ఆత్మజ్ఞానులు వ్యాధులేవియు లేక, ఆరోగ్యముతో నుండవలయునని కోరుటయే దేహవాసన యని యెఱింగినవారై భోగములను బొందనివారైరి.

తే॥ తనువు సుఖముగా నాపద తగులకుండ ।
నుండవలెనన్న యెన్నిక యువిద యదియె ।
యవనిఁ జార్వాకమతధర్మ మనుచు నార్య ।
లెన్నుచుందురు నీవది యెన్నఁదగదు ॥ 142

తా. ఓపార్వతీ! వినుము. శరీరము సుఖముగను, ఆపదనొందకుండ నుండవలయుననియును ఎంచుట యెదియో, అది చార్వాక (నాస్తిక) మతమని వివేకవంతులు తలంచెదరు. కాఁబట్టి నీవు అట్టి అవివేకమగు నాస్తికులయొక్క అభిప్రాయమును కోరకుండుము.

వి. ఈ విషయమును 105-వ పుటయందుఁజూచి తెలిసికొనవలయును.

క॥ కాయమున కేమి లేకయు ।
హాయిగ నుండవలెనన్న నది యజ్ఞానం ।
బేయెడ సుఖదుఃఖంబులు ।
ధీయుతునకు సమముగాదె తోయరుహాక్షీ ॥ 143

తా. ఓ కమలనేత్రివగు పార్వతీ ! వినుము. శరీరమున కేవిధమైన బాధయు లేక సుఖముగా నుండవలయునని కోరుట

అజ్ఞానమేగాని వేఱుగాదు. వివేకవంతునకు సుఖదుఃఖములు ఎన్నటికిని సమముగానే యుండునని యెఱుంగుము.

క॥ ఇటువంటి మార్గమెఱుగక।
కుటిలులునై లోకభ్రమలు కోరందగునే।
మటుమాయాకరమగు బహు।
నటనలచే ముక్తికలదె నళినదళాక్షీ॥ 144

తా. ఓ కమలాక్షివగు పార్వతీ! వినుము ఇప్పుడు చెప్పినట్టి పద్ధతిని తెలిసికొనక దుర్మార్గులై లోకమందు దాసక్తినుంచి మూఢులాచరించు పద్ధతులయందు మనస్సునుంచి వారి యభిప్రాయములు సాధుమార్గములని తలంచి వర్తింపరాదు మాయచేఁ గల్గిన వర్తనముచేత ముక్తి సిద్ధింపదు.

సీ॥ పుడమెల్లదిరిగిన బూడిదెపూసిన
　　జడలుధరించిన జపతియైన।
నిండాఱుశాస్త్రము ల్నేర్పుతోఁ జదివిన।
　　గుండకోలయుబట్టి మొండియైన।
బహువిదాధ్వరములు ప్రౌఢిమై చేసిన
　　మహిమలు చూపు సమర్థుఁడైన।
భుజతప్తముద్రలు పొసఁగధరించిన
　　విజనస్థలంబున వెలసియున్న॥

తే॥ క్రమముతోడుత లింగంబు గట్టుకొన్న।
నఖిల బహుమంత్ర సిద్ధుఁడై యలరియున్న।
గర్మసంసారహేతు వాకరముగాని।
నిర్మలంబైన పరమాత్మ నెలవుగాదు॥ 145

తా. ఓపార్వతీ! వినుము. భూమియంతయుఁ దిరిగినప్పటికిని, విభూతిధారణ మొనర్చినను, జడలు ధరించినను, జపము చేయుచుండినను, సకలశాస్త్రములు చక్కఁగాఁ జదివినను, యోగదండము ధరించి ఒక్కస్థలమునందే కూర్చుండియున్నను, వాజపేయాది వివిధములగు యజ్ఞములు చేసినను, ఆకాశగమనము మొదలగు అనేకమహిమలు చూపుటకు శక్తిగలవాఁడైనను, సమా

శ్రయణము చేసికొని భుజములందు శంఖచక్రములు ధరించిన వాఁడైనను, శైవదీక్షనొంది శాస్త్రప్రకారము లింగధారణము చేసికొన్న వాఁడైనను, సప్తకోటి మహామంత్రములను సాధించి అష్టమహాసిద్ధుల నొందినను, కర్మసంసారమునకు కారణమేగాని, పరిశుద్ధమైన పరబ్రహ్మమును బొందుటకుఁ దగిన పరమపదసిద్ధికి హేతువు కాదని యెఱుంగుము.

తే॥ కాశీరామేశ్వరము కంచి కాళహస్తి।
తిరుపతియుఁ బర్వతం బాదిదేశములను।
దిరిగినను ముక్తిపద మొందు తెఱఁగుగలదె।
భ్రాంతిఁగల్గును మఱిమఱి పద్మనేత్రి॥ 146

తా. ఓపార్వతీ! వినుము కాశి, రామసేతువు, కాంచీపురము, శ్రీకాళహస్తి, తిరుమల, శ్రీశైలము, మొదలగు దివ్యదేశములయందు పంచరించినప్పటికిని మోక్షమొందుటకు మార్గము కాదు. అయినను మరలమరల సంసారకారణమైన భ్రమయే వృద్ధియగుచుండునుగాని, వేఱెప్రయోజనము కలుగదు.

తే॥ గంగ యమునయు నర్మద తుంగభద్ర।
వేత్రవతియు సరస్వతి వేణితామ్ర।
పర్ణిగావేరి నదులలోపలను మునుఁగ।
దేహబాధయెగా కాత్మఁ దెలియఁబోదు॥ 147

తా. ఓ పార్వతీ! వినుము. భాగీరథి, యమున, నర్మద, తుంగభద్ర, వేత్రవతి, సరస్వతి,కృష్ణవేణి, తామ్రపర్ణి, కావేరి, అనునీ మొదలగు నదులలో స్నానమొనర్చినయెడల, శరీరబాధయేగాని పరమాత్మను దెలిసికొనుటకు సాధ్యముకాదని యెఱుంగుము.

వి.(శ్లో॥) "లోకాంతరేవాఽత్ర గుహాంతరేవా।
తీర్థాంతరే కర్మఃరంపరాంతరే।
శాస్త్రాంతరే నాస్త్యనుపశ్యతామిహ
స్వయంపరం బ్రహ్మ విచార్యమాణే॥"

తా. పరబ్రహ్మము ఇతర లోకమునందుఁగాని, ఈ లోకమునందుఁగాని, గుహలయందుఁగాని, తీర్థములయందుఁగాని, యజ్ఞ

యాగాది కర్మ విశేషములయందుగాని, శాస్త్రములయందుగాని లేదు. విచారించి చూచెడి వారలకు (ఇచ్చటనే) తనయందే తానేయై యున్నది.

ఇట్లు శ్రీ శంకరాచార్యులు వక్కాణించియున్నారు.

చ॥ మతవిషయంబులెల్లబహు మచ్చికతోఁ జదివింప నేర్చినన్ ।
శ్రుతులును శాస్త్రముల్ స్మృతులు శోధన చేసిన నేమి యోగమం।
చితముగ నేర్చి సద్గురుని సేవను తత్త్వ మెఱింగి మోక్ష స।
ద్గతికి సమంబె యీక్షితిని కల్మష చిత్తముమాని శాంభవీ॥ 148

తా. ఓ పార్వతీ! వినుము. భూమియందు సకల మతముల యొక్క ధర్మములనన్నిటిని శిష్యులకును, ఇతరజనులకును బోధించు నంతటి సామర్థ్యముగల గురువుగా నుండినప్పటికిని, చతుర్వేదములును, సకలశాస్త్రములును, స్మృతులును పరిశోధన చేసినప్పటికిని, ప్రయోజనములేదు. ముక్తికి సాధనమైన రాజయోగమును చక్కఁగా నెఱింగిన సద్గురువర్యునికి శుశ్రూష యొనర్చి నిశ్చయ తత్త్వమగు పరమాత్మను తెలిసికొని మోక్షమును బొందుటతో సమానముగాదు. కావున నీవు దీనిని కల్మషచిత్తముమాని యెఱుఁగుము.

చ॥ కలుషము లేనిచిన్మయుని గన్నమహాత్ముని పాదపద్మముల్ ।
తలఁపున నిల్పి యన్యములఁ దామదినెన్నక సద్గురూత్తముణ్ ।
దలఁపున నిల్పి బ్రహ్మమును తప్పక నెంచుకు కర్మకాండమం ।
దలవడకుందువేని భువియందున మోక్షము గల్గుశాంభవీ॥ 149

తా. ఓ పార్వతీ! వినుము. కల్మషములేని యట్టి పరమాత్ముని దర్శించిన సద్గురువర్యుని పాదపద్మములను మనస్సునందు నిలిపి ఇతర విషయములను మనస్సునందుంచక, సద్గురువర్యుని హృదయమునందుంచి పరబ్రహ్మమును భావించుచు, కర్మకాండమునందుఁ జెప్పఁబడియుండు తీర్థక్షేత్రయాత్రలు, వివిధములగు కర్మములు, మొదలగువానియందు అభిలాషచెందక యుండినయెడల ముక్తి కల్గును.

తే॥ స్థిరముగానట్టి యణిమాదిసిద్ధులెల్ల ।
సత్యమనినమ్మి జగమున సంచరించు ।

వారితోఁగూడి వర్తించు వాంఛలెల్ల।
బంధమేగాని పరమాత్మపదముకాదు॥ 150

తా. ఓ పార్వతీ! వినుము. శాశ్వతముకాని యట్టి అణిమాద్యష్టసిద్ధులను నిత్యమని నమ్మి ప్రపంచమునందు సంచరించెడి జనులతోఁగూడి సంచరింపవలయుననెడి తలంపెల్ల బంధమేగాని సంసారము (నొసంగునేకాని) మోక్షసాధనమగు పరమపదము కాదని యెఱుంగుము.

వి. అణిమాద్యష్టసిద్ధులనఁగా.—

1. అణిమ.—మిగుల చిన్నవియగు వస్తువుకంటెను తాను చిన్నవస్తువుగా నుండుట.

2. మహిమ.— మిక్కిలి చిన్నవియగు వస్తువుకంటె చాల పెద్దవస్తువుగా నగపడుట.

3. గరిమ.— తృణమువంటిదానిని మేరువువంటి భారము గల దానినిగా చేయుట.

4. లఘిమ — మేరువువంటి భారముగల వస్తువును తృణము వలె చేయుట.

5. ప్రాప్తి.—పాతాళమునం దుండువాఁడు బ్రహ్మలోకమునకును, బ్రహ్మలోకమం దుండువాఁడు పాతాళలోకమునకును బోవుట.

6. ప్రాకామ్యము.— పరకాయ ప్రవేశము, ఆకాశ గమనము, సకలభోగములు, ఇవి ఉన్నచోటనే సిద్ధించుట.

7 ఈశత్వము.—తన ఇచ్ఛాప్రకారమే సృష్టిస్థితి సంహారములు జరుగుట.

8 వశిత్వము.—సకల దేవ దానవ మనుష్య పశు పక్ష్యాదులు తన స్వాధీనమునందుండి సకలకార్యములును చేయుచుండుట.

ఈయెనిమిదియును, అష్టమహాసిద్ధులనియును, అష్టవిభూతులనియును జెప్పఁబడును.

శ్లో॥ "అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా॥
ప్రాప్తి ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టభూతయః॥"

సీ॥ తెలివిచాలక భ్రమ దిరుగుమాత్రమె కాని
ఫలమబ్బి పరమాత్మ గలయరాదు।
అవని బూదినిఁ్రేల్చు హవ్యంబుపోలిక
నంధునికద్దంబు నబ్బినట్లు।
బధిరుండు గానంబు పరగంగ వినురీతి
నడవిలో వెన్నెలవడుపు దలఁప।
బాడింటఁదీపంబు భాసిల్లు చందంబు
నయ్యు నిరర్థక మౌనుగాని॥
తే॥ ముక్తిపొందించు సామర్థ్య యుక్తినెఱిఁగి।
కర్మబంధంబు లెల్లను కడకుద్రోసి।
మున్ను చెప్పిన పరమాత్మ మూలమెల్ల।
నిజముగానెంచి బ్రహ్మమై నెగడు గౌరి॥ 151

తా. ఓ పార్వతీ! వినుము. అజ్ఞానముచేత భ్రమనొంది సంచరించుటయేగాని, అందువలన పరమాత్మైక్యమును జెందుటకు సాధ్యముకాదు. ఇట్లు భ్రమనొందుట యనునది భూమియందు బూడిదలో వ్రేల్చునట్టి ఆజ్యహోమముతోను, గ్రుడ్డివానికి అద్దము దొరకినట్లును, చెవిటివాఁడు సంగీతము వినునట్లును, అడివియందు వెన్నెల కాయునట్లును, పాడింటియందు దీపంబు వెలుఁగునట్లును, నిష్ఫలమేగాని ఎంతమాత్రమును ప్రయోజనములేదు. కావున, ముక్తినొందించెడి సామర్థ్యపద్ధతిని యెఱింగి సకల కర్మబంధములను తొలఁగించి, ఇదివఱకు చెప్పినట్టి పరబ్రహ్మముయొక్క మూలమునంతటిని సత్యమని తలంచి నీవును పరబ్రహ్మంబవై తేజరిల్లుము.

క॥ సతమైన బ్రహ్మపదవిని।
నతిశయముగ బొందితేని యఘములు బాయున్।
గృతకృత్యురాల వగుదువు।
సతి నీకిఁక గొదువ కలద సారసనేత్రీ॥ 152

తా. ఓ పార్వతీ! వినుము. శాశ్వతంబైన బ్రహ్మపదవిని నీవు పొందినయెడల సకలపాపములును పరిహారమగును. అపుడు నీవు

కృతకృత్యురాలవగుదువు తర్వాత నీకు ఏకొంతయును లేదు. అనఁగా నీవే ధన్యురాలవని యభిప్రాయము.

వి. శ్లో॥ యదానంద రూపం ప్రకాశస్వరూపం।
నిరస్తప్రపంచం పరిచ్ఛేద శూన్యం।
అహం బ్రహ్మవృత్త్యైకగమ్యం తురీయం।
పరబ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥

తా. ఆనందస్వరూపమును, ప్రకాశస్వరూపమును, ప్రపంచములేనిదియును, పరిచ్ఛేద శూన్యమును, నేనేబ్రహ్మమనెడి వృత్తియొకదానిచేతనే తెలియఁదగినదియును, తురీయమైనదియును, శాశ్వతమైనదియును, పరబ్రహ్మమైనదియును ఎదియో, అదియే నేను. (ఇట్లు తలంచితివేని ధన్యురాలవగుదువు) తురీయమనఁగా:— జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మూటికిని సాక్షియైయుండు నాలవ యవస్థయని భావము.

తే॥ తనువులో నాత్మఁగని శాంతి దనరి నిరత।
మరసిచూడుము సత్య చిదాత్మవగుము।
నీకు నన్యంబు లేదని నెఱయనమ్మి।
వెలుఁగునకునెల్ల వెలుఁగవై వెలయు గౌరి॥ 153

తా. ఓ పార్వతీ! నీవు శరీరములోపల హృదయగుహలో ప్రకాశించు పరమాత్మను దెలిసికొని మిగుల శాంతినొంది పరబ్రహ్మమును విచారించి తెలిసికొనుము నీకంటె వేఱైన వస్తువు లేదని చక్కఁగా నమ్మి ప్రకాశమునకంటె ప్రకాశమై అనఁగా మహాజ్యోతివై ప్రకాశింపుము.

వి. శ్లో॥ "అహంజ్యోతి ర్బహిర్జ్యోతిః।
ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః।
జ్యోతిర్జ్యోతిః స్వయంజ్యోతిః।
ఆత్మజ్యోతిః శివోఽస్మ్యహమ్॥"

తా. శరీరములోపల జ్యోతి, బయట జ్యోతి, ప్రత్యక్ష (ఇరుప్రక్కల)జ్యోతి, మేలైనదానికంటె మేలైనది, జ్యోతిస్సులకు జ్యోతి, స్వయంజ్యోతి, ఆత్మజ్యోతి, శివమే నేను.

ఇట్లని శ్రీశంకరాచార్యకృత బ్రహ్మనామావళియందుఁ జెప్పఁబడియున్నది.

తే॥ బ్రహ్మవిద్యారహస్య ప్రభావమంతఁ।
దెలియఁజెప్పితి నిదిలెస్స తెలిసితేని।
నీకు జన్మంబు నిఁకలేదు నిత్యమైన।
బ్రహ్మమాదువు సంశయపడకు గౌరి॥ 154

తా॰ ఓ పార్వతీ! వినుము. నీకు బ్రహ్మవిద్యయొక్క రహస్యమును, దాని మహిమయును దెలియఁజేసితిని. నీవు దీనినిచక్కఁగాఁ దెలిసికొన్నయెడల ఇఁక జన్మము కలుగదు శాశ్వతమైన బ్రహ్మమే యగుదువు ఈ విషయమునందు నీవు ఎంతమాత్రమును సంశయింపకుము.

క॥ పరమాత్ముఁడైన యీశుఁడు।
గిరిజాతకు నిట్లుదెల్పి కృతకర్మముచే।
మరిజన్మము రాబోదని।
గురుతరముగఁ దేటపఱచె గుటిలము పోయెన్॥ 155

తా. పరమాత్ముండైన పరమేశ్వరుఁడు పార్వతీదేవికి ఈ ప్రకారముగాఁ జెప్పి మఱియు నిట్లనియె. ఓ గౌరి వినుము. నీకు కర్మమువలనఁగలుగఁదగిన వేదియులేదుగాన, ఇఁక జన్మముకలుగదు. (ఎప్పుడు జన్మములేదో అప్పుడు మరణములేదని యభిప్రాయము) ఇట్లు చక్కఁగా దెలియఁజేసెను. పార్వతీదేవికిఁగల సకలసంశయములనెడు కుటిలము పోయెను అనఁగా నిర్మల పరమాత్మస్వరూపిణియై ప్రకాశించెనని భావము.

తే॥ యోగ సామ్రాజ్య మీరీతి బాగుమీఱ।
విశదముగఁదెల్పె నుపదేశ విధముగాను।
నాత్మబోధించి జీవభ్రాంతంతమాన్పి।
మఱపుతొలఁగించి యెఱుకను గఱపెనపుడు॥ 156

తా. ఇట్లు పరబ్రహ్మముయొక్కసారమైన యోగసామ్రాజ్య రహస్యమును బాగుగా పరమశివుఁడు పార్వతీదేవికి ఉపదేశక్రమముగను విశదముగను దెలియఁజేసి, ఆమెకుఁ గల సకలమైన జీవ

భ్రమలను బోఁగొట్టి, పరమాత్మ బోధమునకు వ్యతిరిక్తమైన మఱపును తొలఁగించి అనఁగా సర్వమునుపరబ్రహ్మమని బోధించి. ఎఱుకను (పరమాత్మను) లేక పరమాత్మజ్ఞానమును తెలియఁజేసెను.

శ్లో॥ "అతో బ్రహ్మాత్మవిజ్ఞాన ముపదిష్టం యథావిధి।
మయాచార్యేణ తే ధీర సమ్యక్ తత్రప్రయత్నవాన్॥"

తా. ఆచార్యుఁడగు నాచేత బ్రహ్మాత్మవిజ్ఞానము క్రమ ప్రకారముగా నీకు ఉపదేశింపఁబడినది ఈవిషయమునందు ప్రయత్నము గలిగియుండుము.

శ్లో॥ "భూత్వావిముక్తబంధస్త్వం ఛిన్నద్వైతాత్మసంశయః।
నిర్ద్వంద్వో నిస్పృహోభూత్వా విచరస్వ యథాసుఖమ్॥"

తా. నీవు బంధమునుండి విడివడితివి. ద్వైతాత్మసంశయము ఖండింపఁబడి నందున, ద్వంద్వమును ఆశయును లేనిదానవైతివి. కావున సుఖముగా సంచరింపుము.

తే॥ భ్రమరములు కీటమును దెచ్చి భ్రాంతిబాపి।
భ్రమరరూపంబు జేసిన ప్రజ్ఞవలెను।
మఱపుబొందిన జీవత్వ మతము మాన్పి।
గురుతరంబైన యెఱుకను గూడఁజేసె॥ 157

తా. భ్రమరములు కీటకమును దెచ్చి, ఆ పురుఁగు యొక్క భ్రమను తొలఁగించి తనవలెనే అనఁగా భ్రమరమువలెఁ గావించి నట్లు, పార్వతీదేవికి తాను పరమాత్మ యను జ్ఞానమును కలిగించి ఆమెకుఁ గల జీవత్వ భ్రాంతినిఁ బోఁగొట్టి, శ్రేష్ఠమైన ఎఱుక యందుఁ జేర్చెను. ఇట్లు కావించి,

"సచ్చిదానందఏవత్వం విస్మృత్యాత్మతయా పరం।
జీవభావ మనుప్రాప్తః సఏవాత్మాసిబోధతః।
అద్వైయానందచిన్మాత్రః శుద్ధః సామ్రాజ్యమాగతః॥"

తా. నీవే, సచ్చిదానందస్వరూపురాలవు. పరమాత్మవగు నీవు పరబ్రహ్మమును మఱచి జీవత్వమును బొందితివి. ఆత్మవగు నీవు సుజ్ఞానముచే అద్వైతానంద చిన్మాత్ర శుద్ధపరబ్రహ్మమవై సామ్రాజ్య పదవి నొందితివి.

ఇట్లు తత్త్వోపదేశమునందు శ్రీ శంకరాచార్యులు వక్కాణించియున్నారు.

తే॥ జన్మమిఁక లేదటంచు నీశ్వరిశిరంబు ।
అందుఁ గరముంచి భవము నీకంటదనుచు ।
నప్పుడీశుఁడు దయసేయ నగజ దీర్ఘ ।
దండములు పెట్టి పలుమారు తగ నుతించె ॥ 158

తా. అంత పరమశివుఁడు నీకు జన్మములేదు, అనిపల్కి పార్వతీదేవి శిరంబునందు హస్తమునుంచి ఇఁక నీకు పాపములేదు. పుట్టుకలేదు, అనఁగా పార్వతీదేవి పరమశివునకు సాష్టాంగనమస్కారములొనర్చి అనేక విధములుగా నుతియించెను.

## పార్వతీ స్తోత్రము.

సీ॥ జయనిత్యసద్భాష జయకృపాకరభూష
జయమోక్షలక్ష్మీశ జయమహేశ ।
జయదివ్యరూపాయ జయయవ్యయాత్మాయ
జయసచ్చిదానంద జయముకుంద ।
జయచరాచరమూర్తి జయవిశ్వపరిపాల
జయభక్తనుతపాత్ర జైత్రమిత్ర ।
జయమేరుగిరిచాప జయపంచముఖరూప
జయకామమదభంగ జయశుభాంగ ॥

తే॥ నిర్వికల్పాయ వేదాంత నిశ్చితాయ ।
అర్థిపోషాయ భక్తసంవర్ధితాయ ।
మాయహరణాయ తుభ్యం నమశ్శివాయ ।
యంచుఁ గరములు మోడ్చి నుతించె మఱియు ॥ 159

తా. నిత్యసద్భాష = శాశ్వతమైన సద్వాక్యములను పల్కునట్టివాఁడా ! నీకు జయము.

కృపాకరభూష = దయకు పాత్రులగు వారలచే భూషింపఁబడువాఁడా ! జయము.

మోక్షలక్ష్మీశ=ముక్తికాంతకు నాథుఁడైనవాఁడా ! జయము.
మహేశ = మహాదేవుఁడా ! జయము.

దివ్యరూపాయ = దివ్యస్వరూపునికొఱకు నమస్కారము.
(ఆయ = కొఱకు, తుభ్యం = నీకొఱకు, నమః = నమస్కారము.)

దివ్యస్వరూపా = దివ్యమైన స్వరూపముగలవాఁడా!
(తుభ్యం = నీకొఱకు, నమః = నమస్కారము, ఆయ = కొఱకు, ఒక్కొకనామము తుదియందును చతుర్థీ విభక్త్యంతమైన "ఆయ పదమును, ఇట్లే జయశబ్దమును జెర్చుకొనునది.)

అవ్యయా = నాశములేనివాఁడా!

ఆత్మా = పరమాత్మా!

సచ్చిదానందా = సత్, చిత్, ఆనందస్వరూపములే లక్షణముగాఁ గలవాఁడా!

ముకుందా = మోక్షమునిచ్చువాఁడా!

చరాచరమూర్తీ = స్థావరజంగమము. లన్నియును ఆకారముగాఁ గలవాఁడా!

విశ్వపరిపాలా = ప్రపంచమును రక్షించువాఁడా!

భక్తనుతపాత్రా = భక్తులచే వినుతింపఁబడువాఁడా!

జైత్రమిత్రా = ఇంద్రునకు స్నేహితుఁడా!

మేరుగిరిచాపా = మేరుపర్వతము విల్లుగాఁ గలవాఁడా!

పంచముఖరూపా = సద్యోజాత. అఘోర, తత్పురుష, ఈశాన, వామదేవా, అను నామములుగల పంచబ్రహ్మ స్వరూపులను ముఖములుగాఁ గలవాఁడా!

కామ మద భంగా = గర్వితుఁడైన మన్మథుని భంగమొనర్చినవాఁడా!

శుభాంగా = మంగళప్రదమైన శరీరముగలవాఁడా!

నిర్వికల్పా = వికల్పములు (దుష్టసంకల్పములు) లేనివాఁడా!

వేదాంతనిశ్చితా = ఉపనిషత్తులచేఁ దెలిసికొనఁదగినవాఁడా!

అర్థిపోషా = ఆశ్రితులను రక్షించువాఁడా!

భక్తిసంవర్ధితా = భక్తులను వృద్ధిచేయువాఁడా!

మాయహారణా = మాయను బోఁగొట్టువాఁడా!

శివా = శుభాకారా!

తుభ్యం = నీకొఱకు

నమః = నమస్కారము

అని యీప్రకారముగ స్తోత్రము జేసి మఱియు నిట్లనియె.

తే॥ ఆదిమధ్యాంతరహిత కల్యాణశీల।
మోహమమతలచేఁ జిక్కు మూఢులకును।
నీదయామృతవర్షంబు నిండిసురియ।
కున్న సంతాపదహనుండు కూలిపోనె॥ 160

తా. మొదలు నడుమ తుద అను నీ భేదములు లేనివాఁడా! మంగళప్రదమైన ఆచారములుగలవాఁడా! మోహమనెడి యహంకారమునఁ దగిలిన యజ్ఞానులయందు నీ దయ యనెడి అమృత వర్షము పూర్ణముగాఁ గురియని యెడల వారియొక్క సంతాపమనెడి యగ్ని నశింపదు అనఁగా సంతాపమనెడి మంట చల్లాఱదు.

వ॥ మఱియును॥ 161

తా. సులభము.

సీ॥ నీనామస్మరణమను భానుండుపుట్టక
పరఁగ క్రోధాంధంబు బాయుటెట్లు।
భవ నీదునిష్ఠయను పరశువు లేకున్న
నపకామవృక్షంబు నఱుకుటెట్లు।
మృడ నీదుజ్ఞానమను బడబాగ్ని పీల్చక
యిరవైన భవవార్ధి యింకుటెట్లు।
శివ నీమహత్త్వమను సింహముపుట్టక
యహమను గజతతి యడంగుటెట్లు॥
తే॥ నిరతమును నీదుపదభక్తి నెఱపకున్న।
బరమపదభోగ సంప్రాప్తి పరఁగుటెట్లు।
అగణితంబయిన నీకృప యమరకున్న।
మాయనెడబాసి నీతోడ మసలుటెట్లు॥ 162

తా. ఓ పరమేశ్వరా ! నీయొక్క దివ్యనామ స్మరణ యనెడి సూర్యుండు ఉదయించనియెడల క్రోధంబనెడి అంధకారము ఎట్లు నివర్తియగును ? ఓ పాపహరణా ! నీయొక్క నిష్ఠయనెడి పరశువు (గండ్రగొడ్డలి) లేకున్నయెడల అప్రయోజకమైన కామమనెడి వృక్షమును ఏప్రకారము నఱుకవచ్చును. ? ఓ మృడ ! నీయొక్క జ్ఞానమనెడి బడబానలము సంసార సాగరమును పీల్చనియెడల పలుతెఱంగులైన జన్మములెత్తుటయనెడి సముద్రము ఎట్లు ఇంకును? మంగళస్వరూపా! నీమహత్త్వమనెడి సింగము పుట్టనియెడల అహంకారమనెడి ఏనుఁగులు ఎట్లు అణఁగును ? ఎల్లప్పుడును నీయొక్క పాదకమలములయందు భక్తి నుంపకున్న యెడల పరమపదమనెడి మోక్షము ఎట్లు కల్గును. ? లెక్కింప నలవిగాని నీదయ సంపూర్ణముగా కలుగనియెడల మాయ నెడబాసి నీతోడ ఐక్యమును ఎట్లు పొందనగును ? అనఁగా కాదని యభిప్రాయము.

సీ॥ దశదిశలెల్ల శ్రోత్రములయి పరఁగిన
విన రాదు నీమహద్వినుతకీర్తి।
యరయ ద్వాదశసూర్యు లక్షులై వెలసిన
కనరాదు నీదు వికాసమహిమ।
పలుకులుభాషాధిపతి సమానంబైన
వర్ణింపరాదు నీ వైభవంబు।
అర్కద్యుతిసమాన హస్తముల్ దనరిన
పూజింపరాదు నీ స్ఫూర్తిదనర॥
తే॥ ఓన్నమో దేవదేవేశ పూర్ణభావ।
వరద యీవిశ్వ మెల్లప్డు వరలఁజేయ।
స్థితియు నొందింప విలయింప జేసి సాక్షి।
కరుఁడవై యుండు నినునెంచ గలనె యీశ ॥ 163

తా. ఓపరమశివా! అష్టదిక్కులును భూమ్యాకాశములును జేరి పదిదిక్కులగును. ఈ దశదిక్కులును చెవులుగానుండినప్పటి

కిని నీయొక్క శ్రేష్ఠమైన కీర్తిని వినుటకు సాధ్యముకాదు.సన్నిద్దఱు సూర్యులును ఏకకాలమునందు నేత్రములు తెఱచిచూచినప్పటికిని నీయొక్క దివ్యస్వరూపమును జూచుటకు సాధ్యముకాదు. సకల శబ్దములును బ్రహ్మతో సమానమైన చతుర్ముఖ స్వరూపము దాల్చినప్పటికిని నీవిభవమును వర్ణించుటకు సాధ్యముకాదు. సూర్యనికాంతితో సమానమైన వేయిహస్తములు కలిగినప్పటికిని నిన్నుపూజించుటకు సాధ్యముకాదు. ఓ ప్రణవస్వరూపా! దేవ దేవా! సంపూర్ణస్వభావా! వరద! (ఇచ్చువాఁడా!) ఓ ఈశా! ఈ జగమంతటిని కలుగఁజేయుటకును, రక్షించుటకును, ప్రళయ మొందించుటకును, సాక్షీభూతుఁడవై యుండు నిన్ను తలంపఁ గలనా?

వి. శ్లో॥ "మయ్యేవ సకలంజాతం మయిసర్వం ప్రతిష్ఠితం।
మయిసర్వం లయంయాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహమ్॥"

తా. నాయందే సమస్తమును పుట్టెను; నాయందే సర్వ మును నెలకొనియున్నది; నాయందే అన్నియును లయమొందు చున్నవి. కాఁబట్టి ఆ అద్వయపరబ్రహ్మము నేను.

ఇట్లు శ్రీశంకరాచార్యకృత మహావాక్య సిద్ధాంతస్తోత్రము నందుఁ జెప్పఁబడియున్నది.

క॥ నీకరుణామృతవర్షము।
ప్రాకటముగ నాదుపైని బరగఁగ గురియన్।
భ్రాకృత భ్రామిక లన్నియుఁ।
జీకాకై త్రెగియు గూలె చీదరబానెన్॥ 164

తా. ఓ ఈశ్వరుఁడా! నీయొక్క దయ యనెడి అమృత వర్షము నాపై చక్కఁగా వర్షించినందువలన, నాయొక్క పూర్వ జన్మమునందుఁ నేనొనర్చిన సకలభ్రమలును చెల్లాచెదరైనందున సమస్తమైన ఉపద్రవములును నివర్తియాయెను.

క॥ సందేహ మడఁగెఁ గూహక ।
బృందంబును బాసెఁ బాప పుణ్యము లడఁగెన్ ।
బంధములు త్రెగెను సత్పథ ।
మందునఁ జిత్తంబునిలిచె నలఁత తొలంగెన్॥ 165

తా. ఓ పరమశివా! నీయొక్క దివ్యోపదేశంబువలన నాయొక్క సకలసంశయములును నివర్తియాయెను. కపటము, మోసము మొదలగు దుష్టవృత్తులన్నియును మానెను. పాప పుణ్యము లణఁగెను. సకలపాశబంధములును త్రెగెను. నామనస్సు మంచి మార్గమునందు నిలిచెను. వివిధములైనశ్రమలు నివారణ మయ్యెను.

వి. ఇచ్చట పుణ్యముకూడ అణఁగె నను విషయము కొందఱకు విపరీతముగాఁ గనఁబడును. పాపపుణ్యములు మొదలుగాఁగల సకల బంధములును ఆత్మజ్ఞానికి లేదని యెఱుంగవలయును.

శ్లో॥ గంభీరధీరం నచభావశూన్య మసారసారం నచపాపపుణ్యాం।
వ్యక్తంనచావ్యక్తమనంతమంతంతస్మైనమోబ్రహ్మనిరంజనాయ॥

తా. లోఁతును లోఁతు లేనిదియును గాదు. ఉండుటయును లేనిదియును గాదు. అసారమును సారమును గాదు. పాపమును పుణ్యమునుగాదు. కనఁబడునదియు కనఁబడనిదియుగాదు. అనంత మును అంతమునుగాదు. ఇట్టి పరబ్రహ్మమైన నిరంజనునకు (పర మాత్మకు) నమస్కారము.

ఇట్లు శ్రీశంకరాచార్యకృత బ్రహ్మస్తోత్రమునందుఁ జెప్పఁ బడియున్నది.

శ్లో॥ "నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖం।
నమంత్రో నతీర్థం నవేదా నయజ్ఞః।
అహంభోజనం నైవభోజ్యం నభోక్తా।
చిదానందరూపః శివోఽహం శివోహమ్॥"

తా. పుణ్యము లేదు, పాపము లేదు, సౌఖ్యము లేదు, దుఃఖము లేదు, మంత్రము లేదు, తీర్థము లేదు, వేదము లేదు, యజ్ఞము లేదు, నేను భోజనమును గాను, భోజ్యమును గాను, భోక్తయును గాను, నేను చిదానందస్వరూపశివము (పరబ్రహ్మము,) శివము.

ఇట్లు శంకరాచార్యకృత నిర్వాణషట్కమునందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ "పుణ్యపాపరజస్సంగో మమ నాస్తీతిచింతనం।
పాద్యం సమర్పయేద్విద్వాన్ సర్వకర్మ వినాశనమ్॥"

తా. పుణ్యపాప రజస్సంగములు నాకు లేవనెడి చింతనమను సకలకర్మములను తొలఁగించునట్టి పాద్యమును వివేకి యగువాఁడు భగవంతునకు సమర్పింపవలయును.

ఇట్లు శ్రీశంకరాచార్యవిరచిత ఆత్మపూజయందుఁ జెప్పఁబడి యున్నది.

తే॥ అభవ యజ్ఞాన మను తమం బంతవాసె।
విరివి సుజ్ఞాన దీపంబు వెలిఁగి యవల।
జీవుఁడనుభ్రాంతి చని శుద్ధదైవమైన।
బ్రహ్మమేనని పరిపూర్ణ పదవిగంటి॥ 166

తా. ఓ పరమేశ్వరా! పుట్టుకలులేనివాఁడా! అజ్ఞానమనెడి చీకటియంతయును తొలఁగెను. సుజ్ఞానమనెడి దీపంబు ప్రకాశించెను. ఆతర్వాత జీవత్వభ్రమ నివారణంబై శుద్ధ దైవమైనట్టి పరబ్రహ్మము నేనే యనెడి పరిపూర్ణ సాయుజ్యమును బొందినవాడ నైతిని.

క॥ మృడ నీ కృపారసంబున।
గడ తేరితి నింకనాకుఁ గలుగదు జన్మం।
బెడ తెగని బ్రహ్మపదవిని।
దడయక నే బొందితి ప్రభు తత్త్వజ్ఞనిధీ॥ 167

తా. ఓ నిశ్చయతత్త్వమైన పరమాత్మ లక్షణము నెఱింగిన మృత్యుంజయా ! నీ దయామృతంబున నేను ముక్తిని బొందినదాన నైతిని. ఇఁక నాకు జన్మముకలుగదు. నేను శాశ్వతమైనట్టి పరమాత్మపదమును ప్రతిబంధము లేక పొందిన దాననైతిని.

ఆ॥ వీధిబాఱుజలము విమలమై నదిలోనఁ ।
గలిసి శుద్ధమైన గంగయయ్యె ।
నేను నిన్నుఁగలిసి నిష్పాపినై పర ।
బ్రహ్మమైతి నిత్య పదవిగంటి॥ 168

తా. ఓ శివా ! వీధియందు ప్రవహించుజలము మిగుల శుద్ధమై నదియందుఁ గలిసి పరిశుద్ధమైన గంగయయ్యెను. అట్లే నేను నిన్నుఁగలిసి (నీ సహవాసముచేత) పరిశుద్ధురాలనై పరబ్రహ్మంబైతిని మఱియు శాశ్వతమైన మోక్షపదమును గంటిని.

సీ॥ కఱకంఠ నీరూపు గానని కన్నులు
తరుకుడ్యజాల రంధ్రముల సమము ।
విశ్వేశ నీకీర్తి విననిశ్రోత్రంబులు
విరళమౌ గిరికంధరముల సమము ।
శర్వ నీపదపూజ సలుపని హస్తముల్
దారు నిర్మితమైన దర్విసమము ।
భూతేశ నిన్నెప్డు పొగడజాలని నోరు
ఢమఢమధ్వనిగల్గు ఢక్కసమము॥

తే॥ అరయ నీచింత లేనట్టి నరుని మేను ।
ధరణిలోఁజూడఁగా బుద్బుదంబు సమము ।
పరఁగ నీసేవకరుగని పాదయుగము ।
పాదపముల్రేళ్లకు సమంబు ప్రాణనాథ॥ 169

తా. నీలకంఠా ! నిన్నుఁ జూడనికన్నులు గోడలోని బొందలతో సమానములు. ఓ విశ్వనాయకా ! నీయశస్సును విననిచెవులు

తా॥ శ్రేష్ఠమైన పరబ్రహ్మతత్త్వము నెఱింగించుటకు కారణముగాఁగలవాఁడా! పాపములనెడి (లేక పుట్టుకలనెడి) కుత్సితవృక్షములను ఛేదించుటకు గొడ్డలివంటివాఁడా! ముష్కర గుణమును ఖండించువాఁడా! కలికాలమునందలి దుర్మార్గము మొదలుగాఁగల క్రూరకర్మములను పోఁగొట్టువాఁడా! వేదాంతములందు చెప్పఁబడిన పరబ్రహ్మవిచారమును చేయునట్టివాఁడా! సద్గుణములను నెలవైనవాఁడా! మేరుపర్వతముతో సమానమైన ధైర్యము గలవాఁడా! అనఁగా చలింపని నిశ్చలచిత్తముకలవాఁడా! అనేకములైన కపటకృత్యములను దూరమైనవాఁడా! అఖండ పరిపూర్ణమైన బ్రహ్మస్వరూపుఁడా! సద్గురువర్యుఁడగు రామబ్రహ్మనామముగలవాఁడా!

క॥ నిగమార్థ ప్రతిపాదక।
భగవత్సదృశావతార భవమోచన స।
త్యగరిష్ఠాంకిత పావన।
విగళిత సంసారరామ విశ్వాతీతా॥    174

తా. వేదాంతములందు ప్రతిపాదింపఁబడిన వాఁడా! భగవంతునితో సాటియగు స్వరూపముగలవాఁడా! పాపములను (జన్మములను) పోఁగొట్టువాఁడా! సత్యస్వరూపా! పుణ్యమూర్తీ! సంసారమును నిగ్రహించినవాఁడా! ప్రపంచమునకంటె విలక్షణమైనవాఁడా! సంసారమును పోఁగొట్టుకొన్నవాఁడా! రామబ్రహ్మేంద్రగురువర్యా! అనియిట్లు కృతికర్త తనయొక్క గురువర్యుని నుతించి యీగ్రంథంబును అంకితం బొనర్చెను.

గద్య॥ ఇది శ్రీరామబ్రహ్మేంద్ర గురువర ప్రసాదలబ్ధ కవితా విలాస నారపామాత్య ప్రణీతంబైన శ్రీగురుగీతాసారంబునందు శబలైక్యనిర్ణయంబును, లింగతను భంగంబును, జీవగుణ ప్రశంసయు, పరిపూర్ణాఖండ జ్ఞప్తివిచక్షణమును,

అవస్థాత్రయ వివరణమును, పరమాత్మవలన నైన ప్రపంచ భ్రాంతియు, జీవునకు హాని వృద్ధులు లేకపోవుటయు, ప్రారబ్ధత్రయ వివరణంబును, ఆత్మస్వరూప నిర్ణయమును, బంధమోక్ష నిరూపణంబును, లోకాచార క్రియానుసరణి యును, మలిన వాసనాలక్షణమును, పార్వతీదేవి పరమేశ్వరుని ప్రణుతించుటయను పార్వతీ స్తోత్యంబు నన్నది. తృతీయాశ్వాసము.

గురుగీతాసారము సర్వమును

సంపూర్ణము.



పరమేశ్వరార్పణమస్తు.

ఓం తత్సత్.



- శ్రీపాముడి లక్ష్మీనారాయణశతకం. 0-4-0
- మానసవైరాగ్యశతకము. 0-2-0
- కైవల్యనవనీతం.— రెండు భాగములు చేరిన గ్రంథము. 4-0-0
- మానసబోధశతకము పర్వములు గలవు. 0-4-0
- వీఁడేవాఁడు అను గ్రంథము. 0-2-0
- గుప్తపురాణబోధిని. 0- -0
- మారీమహామ్మారీవిలాసము. 0-2-0
- మృత్యుంజయ బోధిని. 0-2-0
- లింగదేహభంగబోధిని. 0-2-0
- నిష్ప్రతియోగిక బ్రహ్మబోధిని. 0-2-0
- అచలవిద్య. 0-2-0
- ఒక్కయుక్తిలో ముక్తిబోధిని. 0-2-0
- హేమతారకవిద్య. 0-2-0
- సద్యోముక్తిబోధిని. 0-5-0
- పునర్జన్మ సందేహ నివర్తిని. 0-4-0
- పరమ పురుషార్థ పంచ ప్రశ్నోత్తర రత్నములు. 0-4-0
- శుష్కవేదాంత సిద్ధాంతుల గర్వాపహారి. 0-3-0
- శ్రీశుద్ధనిర్గుణతత్త్వ కందార్థములు తాత్పర్య విశేషార్థసహితము. 0-12-0
- సామెతల బ్రహ్మజ్ఞాన రహస్యార్థ బోధిని. 0-5-0
- సహజాద్వైతానుభవప్రకాశిక. 0-2-0
- గగనవిద్య. బ్రహ్మజ్ఞాన గానామృతము. 0-3-0
- శ్రీవిద్యా విద్యాతీతబోధిని. 0-3-0
- రాజయోగసారము వచనము. 0-2-0
- తత్త్వార్థముక్తాకలాపము వచనము. 0-2-0
- దశవింశతితత్త్వకందార్థములు. 0-1-0
- శ్రీవేంకటాచల మాహాత్మ్యము.— వచన కావ్యము ప్రతిమలతోటి ముద్రింపంబడియున్నది ప24 పుటలుగలది. 1-0-0
- భ్రమభంజని. 0-2-0
- కాశీయాత్ర ప్రకాశిక. 0-6-0
- మణిత్రయతాత్పర్యసహితము. 0-4-0
- భగవద్గీత టీకాసహితము. 2-0-0
- భగవద్గీత శ్లోక తాత్పర్యము. 1-4-0
- వినోదకథామంజరి.—ఇందు 50 కథలు చమత్కారముగ నుండును. 0-4-0
- వేదరహస్య సిద్ధాంత గురుబోధామృతము. 0-6-0
- సుజ్ఞాన దీపము సుగుణగీతలు. టీకా. తాత్పర్యము. 1-4-0
- జడభరతోపాఖ్యానము వచనకావ్యము ప్రతిమలతో నున్నవి. 0-8-0
- సుజ్ఞాన రత్నావళియను వేదాంత కీర్తనలు. 0-6-0
- కృష్ణబోధామృతము. 0-12-0
- నిర్వచన స్వరదర్పణము. 0-8-0
- మాండూక్యోపనిషత్తు. 1-4-0
- దేవరహస్య తత్త్వ కందార్థములు. 0-2-0
- మోక్షమార్గ నిజస్వరూప సుబోధ. 0-4-0
- సుజ్ఞానతత్త్వ పూర్ణోదయంబను, బ్రహ్మగీతారహస్యము. 0-8-0
- అచలనిర్గుణతత్త్వ రత్నాకరము. ఇది తొల్లింటిపెద్దలచేత రచియింపంబడిన, ద్విపదార్థదరువులు, గీతపద్యములు, వేదాంతసంగ్రహ పద్యావళి, అచల నిర్గుణతత్త్వ కీర్తనలు గలవు. 0-12-0
- పరిపూర్ణతత్త్వప్రకాశిక. 0-5-0
- జ్ఞానవాసిష్ఠము— వచనకావ్యము. 5-0-0
- బ్రహ్మసూత్రములు, టీకాతాత్పర్య సహితము. 2-8-0
- దృగ్దృశ్యవివేకము తాత్పర్యము. 0-10-0
- దొంగవేదాంత భంగబోధిని. 0-2-0
- శ్రీమద్రామాయణగొబ్బిపాటలు. 0-2-0
- సదానందయోగిశతకము. 0-0-6

శ్రీ స్కాందపురాణ శంకరసంహిత శివ రహస్యఖండము.—టీకాతత్వప్రకాశిని యను వచనకావ్యము. ఇందు సంభవకాండ, అసురకాండ, వీరమహేంద్రకాండ, యుద్ధకాండ, దేవకాండ, దక్షకాండ, ఉపదేశకాండ అను సప్తకాండలు గలవు. 2-8-0

వేదాంతరత్నాకరము. ఇందు శ్రీశంకరాచార్యాష్టకము, చిదానందాష్టకము శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రము, పంచాక్షరస్తోత్రము, గోవిందాష్టకము, శ్రీరంగనాథాష్టకము, నిర్వాణషట్కము, పరమేశ్వరాష్టకము, ఆత్మానాత్మ వివేకము, ఈలోమ్మిదిగ్రంథములును శ్లో. తా. సహితముగా ముద్రింపంబడి యున్నది. 0-6-0

సీతారామాంజనేయసంవాదము.—టీకా తాత్పర్య సహితము. ఇందు ౨౨ యోగాసన పటములును చక్రములును గలవు. ఇదివరకుగల ప్రతులన్నిటి కన్న ఇందు విశేషాంశములతో వివరముగా ముద్రించియున్నది. గ్లేజు కాగితం కాలికోబైండు. ౩-8-0

సానందోపాఖ్యానము వచనకావ్యము.—ఇందు నరకకూపమునయుండు పాపులకు సానందమహాముని పంచాక్షరీ మహామంత్రమును వినిపించి మోక్షపదవి చెందునట్లు చేయించిరి 1-4-0

వేదాంతపంచదశి, టీకా తాత్పర్య సహితము. 5-0-0

మనోవ్యాధికిమందు అనుగ్రంథము. 0-2-0

నిర్గుణాత్మజ్ఞాన సంయోగ కందార్థరత్నావళియును, అచల ప్రబోధము. 0-6-0

సర్వమత రాహిత్యబోధిని. 0-2-0

పాపవిమోచని. 0-2-0

మహాతుర్యబోధిని. 0-2-0

నరకోద్ధారిని. 0-2-0

విగ్రహారాధనమీమాంస. 0-2-0

రాజయోగానందతత్త్వములు. 0-2-0

హేమతారకవిద్య. 0-2-0

మతత్రయ హాతహితబోధిని. 0-2-0

ప్రభులింగలీల పద్యకావ్యము.—చక్కని ప్రతి క్రొత్తమూర్పు. 0-6-0

పరాశక్తివిలాస గీతామృత సాగరము.—ఇందు పరాశక్తి షోడశోపచార పూజావిధాన వృత్తార్థములు, దేవీ ధ్యాన కీర్తనలు గలవు. 0-6-0

శ్రీరామబ్రహ్మానంద రత్నాకరము.—ఇందు వేదాంత తత్వార్థ స్వరూపమయిన రామకీర్తనలు గలవు. 0-6-0

శుష్క వేదాంత తమోభాస్కరము.—ఇందు ౯౨ విషయములకు శ్లోక తాత్పర్య సహితము ౪౪౦ పుటలు గలది. 1-4-0

ఆంధ్రనిఘంటుత్రయము. 0-12-0

అచలప్రబోధయను శుద్ధనిర్గుణతత్వ జంట కందార్థదరువులు. 0-6-0

అచలసూచన. 0-1-0

సుందరకాండము. శ్లో॥ తా॥ పారాయణ గ్రంథము గ్లేజుప్రతి కిత్తానుబైండు 2-0-0

డిటో రవ్ ప్రతి కిత్తానుబైండు 1-౮-0

వ్రతరత్నావళియను ౭౮ వ్రతకల్పములు తెనుగు కథాసహితము. 0-8-0

ఆరువ్రతములు. 0-2-0

కైవల్యామృతయోగానుభవ ప్రకాశిక. 0-5-0

శ్రీమదంబికా మహాదేవి శుభమహోత్సవ వర్ణన దండకము. 0-1-0

వారుణీఘటోదయ శంభులింగోపాఖ్యానము. 0-2-0